# అర్థశతాబ్దపు ఆంధ్రకవిత్వం



రచయిత :

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

సంపాదకులు :

అద్దేపల్లి రామమోహనరావు

సమీకర్త :

డా. కె. సంజీవరావు



తెలుగు విశ్వవిద్యాలయం

పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి

హైదరాబాదు - 500 004

Ardha Satabdapu Andhra Kavitvam
by Sripada Gopalakrishna Murthy

తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ సంఖ్య - 49

ప్రతులు - 2000
ప్రథమ ముద్రణ - 1994



*వెల : రు* **26**



*ప్రతులకు:*
రిజిస్ట్రార్
తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి
హైదరాబాదు - 500 004.

*ముద్రణ:*
**చార్‌మినార్ ఆర్ట్ ప్రింటర్స్**
4-4-57, గంజ్ బజార్
సికింద్రాబాద్ - 3.
Phone : 77978

# ముందుమాట

***ఆచార్య పేర్వారం జగన్నాథం***
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం.
హైదరాబాదు,

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రలో ముఖ్యంగా తెలుగు కవితా వికాస పరిణామ దిశలో ఈ శతాబ్ది ప్రథమ దశకం ఒక అపూర్వమైన నవ్యభావావేశాన్ని ఆవిష్కరింపచేసింది. ఇందుకు కారణం ఇంగ్లీషు సాహిత్య ప్రభావమూ జాతీయోద్యమ సంరంభమూ అని చెప్పలి. కిందటి శతాబ్ది ఉత్తరార్థంలోనే భారత దేశంలో ఇంగ్లీషు ప్రాధాన్యంగల విశ్వవిద్యాలయాలు స్థాపనం కావడం క్రమక్రమంగా ఇంగ్లీషు సారస్వతకాంతులు తెలుగునాట కవులకు కొత్త కవితాలోకాలను కనుల ముందు నిలపటమూ జరిగింది. గురజాడ అప్పారావు వంటి తెలుగు కవితా నవీనోద్యమ ప్రవర్తకుడు తన కవితా కృషిని ఇంగ్లీషు రచనతోనే ప్రారంభించడం గమనార్హం. తర్వాత అందులోని అసామంజస్యాన్ని ఆయన గుర్తించాడు. ఇంగ్లీషులో ప్రారంభించిన "సారంగధర" కథాకావ్యంలో ఆయన ముక్తచ్ఛందాన్ని ఆశ్రయిస్తే తెలుగులో కొత్త కవిత్వం ప్రారంభించేనాటికి ముత్యాలసరాన్ని రూపొందింపచేసుకున్నాడు. ఆధునిక తెలుగు కవిత్వం, ఆధునికతనెట్లా సంతరించుకున్నది అంటే ఛందం, వస్తువూ, అభివ్యక్తిద్వారా. ఆధునిక తెలుగు కవిత్వంలో ఈ మూడూ నవీనమే. ఈ నాణేనికి రెండు వైపులు గురజాడ, రాయప్రోలున్నూ. గురజాడపై మానవోద్యమ ప్రభావమూ, రాయప్రోలుపై 'రొమాంటిసిజ' మూ తాము సృష్టించిన నవ్యకవితారీతులలో ఎక్కువ ప్రభావం చూపాయి. రాయప్రోలుపై జాతీయోద్యమ ప్రభావం కూడా స్పష్టంగా ఉందంటారు డా||కట్టమంచి రామలింగా రెడ్డి. ఈ పరిణతి గురజాడ దేశభక్తి గీతంలోనూ, డామన్-పితియస్, కాసులు, లవణరాజుకల మొదలైన రచనలలోనూ కనపడుతుంది. గురజాడది మానవతా పూర్వకమైన సంఘ సంస్కార దృక్పథం కాగా రాయప్రోలుది జీవిత సౌందర్య తాత్విక కవితాదర్శనం. భావకవిత్వానికి తెలుగులో ఆద్యప్రవర్తకుడు రాయప్రోలు వారే.

కీ.శే. డా|| శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఇంగ్లండులోని విశ్వవిద్యాలయం నుండి ఫిజిక్సులో డి.ఎస్సి. సముపార్జించిన ప్రతిభాశాలి. అయినా వారికి ఆధునికాంధ్రకవిత్వంపట్ల ఉండే అభిమానం, అభిరుచి ప్రశంసాపాత్రం. వారు ఆధునిక తెలుగు సాహిత్యం గూర్చి ముఖ్యంగా నవ్యకవిత్వమూ, నాటక వికాసమూ విషయంలో పరమ ప్రామాణికులైన విమర్శకులని చెప్పాలి. తెలుగునాట జానపద సాహిత్య కృషీవలులులో కూడా ఆయనది అగ్రశ్రేణి.

అర్ధశతాబ్ది ఆంధ్ర కవిత్వరీతులను గురజాడ, రాయప్రోలు నుంచి శ్రీ.శ్రీ., పఠాభిలవరకు ఈ వ్యాసాలలో ఆధునిక కవిత్వ లక్షణాలను ప్రతిభావంతంగా సమీక్షించారు; సమన్వయించారు శ్రీపాద వారు. అబ్బూరి, నాయని, కవికొండల, వేదుల, తల్లావఝ్ఝుల, దేవులపల్లి, భావకవితారీతుల ప్రాశస్త్యాన్ని ప్రతిపాదిస్తునే నవ్యాధునికుల కవితా దార్శనికతను గూర్చి కూడా విశ్లేషించి చూపారు. ఈ గ్రంథంలో వారు. 1910 నుంచి 1960 వరకు ప్రవర్తిల్లిన ఆధునిక కవితారీతులన్నింటిని వస్తు, రూప, అభివ్యక్తి, శిల్ప, కవితావ్యంజనపరమైన వెలుగులను, సాహిత్య వ్యక్తిత్వాలను ఈ గ్రంథంలో ప్రతిభాసింపజేశారు. తెలుగు విశ్వవిద్యాలయం ఇటీవల అలబ్ధ, అముద్రిత గ్రంథప్రచురణల కార్యక్రమం చేపట్టింది. ఇదివరలో ప్రచురితమైన ప్రసిద్ధగ్రంథాలలో పుస్తక విపణిలో లభించని కొన్నిటిని అలబ్ధ ప్రచురణ వర్గంగానూ, కొత్తగా ప్రచురించబోయే మంచి పుస్తకాలను అముద్రిత గ్రంథప్రచురణ వర్గంగానూ, నిర్ణయించాము. అముద్రిత గ్రంథ ప్రచురణ ప్రణాళికలో ఇప్పుడీ గ్రంథం వెలువడుతున్నది.

ఈ విధంగా ఆధునిక తెలుగు సాహిత్యానికి సంబంధించిన ఒక ముఖ్యమైన సాహిత్యప్రక్రియ పరిణామ వికాస సమీక్ష చరిత్రను తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించి ఈ తరం తెలుగు పాఠకులకందిస్తున్నది. ఈ ప్రయత్నంలో వ్యాసాలను ఏర్చికూర్చినవారు మా విశ్వవిద్యాలయం సాహిత్యపీఠంలో అధ్యాపకులుగా ఉన్న డా|| కె.సంజీవరావుగారు. ఇక ఈ సంకలనానికి సంపాదకత్వం వహించిన వారు ఆధునిక తెలుగు కవితా స్వరూప సమ్యగవగాహన గల విమర్శకులు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు గారు. వారికి కృతజ్ఞతలు. మా ఈ ప్రయత్నాన్ని తెలుగుపాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

హైదరాబాదు
11-4-1994

పేర్వారం జగన్నాథం

# సంపాదకీయం

*అద్దేపల్లి రామమోహనరావు*

తెలుగు సాహిత్య విమర్శ విషయంలో 1960 దశాబ్దానికి ఒక విశిష్టత ఉంది. 60లకు పూర్వం సాహిత్యవిమర్శ, అందులోనూ కవిత్వవిమర్శ చాలా బలహీనమైన దశలోనే ఉంది. ఏ విమర్శ ధోరణికీ ఒక ప్రత్యేకమైన వ్యవస్థలేదు. లోతైన, పరిశీలనాత్మకమైన విశ్లేషణ లేదు. విమర్శ చేసేవారిలో కొన్ని భావాలకు సంబంధించిన నిబద్ధతలేదు. చెదురుమదురుగా కొన్ని మంచి వ్యాసాలు వచ్చేవిగాని, విస్తృతమైన, అవగాహన పూర్వకమైన సిద్ధాంతాలు కనిపించవు. అందులోనూ ఒక కవిమీదగాని, ఒక ధోరణిమీద గాని సమగ్ర పరిశీలనలు అసలే కనిపించవు. ఉన్నంతలో గురజాడపై శ్రీ శ్రీ రాసిన వ్యాసాలు మాత్రమే ఉండేవి. ఇదంతా ఆధునిక సాహిత్య విమర్శకి సంబంధించిన విషయం. ఇదొక ప్రవాహ దశ అనుకుంటే దాని ఘనీభవన దశ 1960 దశాబ్దపు మొదటి భాగంలో ప్రారంభమైందని చెప్పవచ్చు. 1963లోనే డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి`అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వం' భారతి మాసపత్రికలో ధారావాహికగా ప్రారంభమై 1964 దాకా కొనసాగింది. 1964లోనే ఆర్. ఎస్. సుదర్శనంగారి `సాహిత్యంలో దృక్పథాలు' భారతి మాసపత్రికలో ధారావాహికగా ప్రారంభమయింది. ఈ సంపాదక రచయిత రాసిన `శ్రీ శ్రీ, కృష్ణశాస్త్రి-లపై ధారావాహిక వ్యాసాలు 1964 ప్రాంతాల నుండే ఆంధ్రప్రభ ఆదివారం `కళాసాహిత్య విజ్ఞాన వేదిక'లో ప్రచురితమైనవి. గురజాడ నుండి శ్రీ శ్రీ దాకా ఒక అర్ధ శతాబ్దపు కవిత్వాన్ని, అంతకు ముందెవ్వరూ పరిశీలించని ధోరణిలో, ప్రత్యేకమైన అవగాహనతో, ప్రాచీనతనుండి ఒక తిరుగుబాటు అంతస్స్రవంతిగా, సమగ్రతా దృష్టితో, శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు రాసిన వ్యాసాలు ఆ రోజుల్లో ఒక తీవ్ర సంచలనాన్ని కలిగించినై. ఆయన దృక్పథాలమీద వాదోపవాదాలు జరిగినై.

ఆయన కేవలం వ్యాసకర్త మాత్రమే కాదు. గొప్ప ఉపన్యాసకుడు కూడా. అనర్గళంగా వందలాది కవితా పంక్తుల్ని ఆశువుగా ఉదాహరిస్తూ, మంద్ర మనోజ్ఞమైన కంఠస్వరంతో, తాను ఉదాహరిస్తున్న కవితల అనుభూతి శ్రోతలలో కలిగేటట్లు మాట్లాడేవారాయన. "ఇది నా పాపం కాదనె, ఎగిరి వచ్చి ఎంగిలాకు" అనే పంక్తులు చదివి వాటిని వివరించడం, "నేను మాత్రం, తలుపుతెరిచి, యిల్లు విడిచి, ఎక్కడికో దూరంగా, కొండదాటి, కోనదాటి వెన్నెల మైదానంలో వెళ్లి నిలుచున్నాను." అనే తిలక్ పంక్తులు ఆ అనుభూతి కలిగేటట్లు ఆయన చదవడం ఇప్పటికీ నా మనస్సులో నిత్య నూతనంగా ఉన్నాయి.

గురజాడ నుండి శ్రీ శ్రీ దాకా ఆధునిక కవులుగా శ్రీ శ్రీ ఆధునిక కవులలో నవ్యుడుగా, తరువాత కుందుర్తి, తిలక్, దాకా నవ్యాధునికులుగా విశ్లేషిస్తారు డాక్టర్ శ్రీపాద. ఈ వ్యాస సంపుటిలో **19** వ్యాసాలుంటే, వాటిల్లో 13 వ్యాసాలు భావకవిత్వశాఖకు చెందిన కవులమీదనే ఉన్నై. ఇలా ఉండడమనేది ఆయన విమర్శక వ్యక్తిత్వాన్ని పట్టిఇస్తుంది.

ప్రత్యేకత కలిగిన విమర్శకులలో, ఒక్కొక్కరికీ ఒక్కొక్క మౌలికాంశం వారి పరిశీలనకి ఆధారమై ఉంటుంది. అలా శ్రీపాదవారి వ్యాసాల్లోని మౌలికాంశం`అనుభూతి' అని చెప్పవచ్చు. ఇది ఈనాటి `అనుభూతివాదం' అనే దానికి సంబంధించిన `అనుభూతి' కాదు. ఒక రచనని చదివినప్పుడు, మనలో ఏ భావాన్ని కలిగించడానికి రచయిత రాశాడో, ఆ భావానికి సంబంధించిన ప్రతి సూక్ష్మస్పందననీ ధారాప్రాయంగా పాఠకుడు అనుభవించినప్పుడు అది రచనా సంబంధమైన`అనుభూతి' ఔతుంది. ఈ అనుభూతి సమగ్రంగా రూపొందినా, విమర్శలో విశ్లేషణ దగ్గరికి వచ్చేటప్పటి వేరే అంశాల్ని ప్రాతిపదికగా తీసుకోవడం వేరు; కేవలం `అనుభూతి'నే ప్రాతిపదికగా తీసుకోవడం వేరు. డాక్టర్ శ్రీపాద విమర్శ ఈ రెండో కోవకి చెందుతుంది. భావకవిత్వం పాఠకునిలో ఆశించే ప్రధాన లక్షణం ఈ`అనుభూతి'యే. అదే శ్రీపాదవారి విమర్శలో ప్రధాన స్థానం పొందింది.

`అనుభూతి'కి అడ్డంవచ్చే, ఆలోచనల్ని, ఛందస్సుని, పాండిత్యాన్ని, అలంకారాల్ని - అన్నిటనీ శ్రీపాదవారు నిరసిస్తారు. ఆయన వ్యాసాల్లో మధ్య మధ్య వచ్చే ఉద్ఘాటనల్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టంగా తెలుస్తుంది.

"కవిత్వము చదువరికి ఇంద్రియ గోచరము కావాలి. అప్పుడు కవి వర్ణించిన ప్రకృతి చదువరికి గోచరించడమూ, తద్వారా చదువరికి అనుభవము కలగడమూ జరుగుతుంది. కవి, భావాల్నే వెలిబుచ్చినప్పుడు ఆ భావాలు మహా పండితుడైన కవికేగాని సామాన్య చదువరిని జల్లుమనిపించేవి కాకపోతే కవిమానాన్న కవి రచించుకుంటూ పోవడమే మిగుల్తుంది గాని చదువరిని అంటదు'

"భావాల్ని నిశ్శ్రేణిగా అమర్చి, చదువరికి కూడా ఆ భావాలు కలగడానికి చేసే భావ కావ్య రచనలో కవి గారి భావలహరి నిరంతరాయంగా భావౌన్నత్యాన్ని సాధిస్తూనే పోవాలిగాని పేలవపు టాలోచనలు ప్రవేశించరాదు."

" - ఎంత చిన్నదైతేనేం? భావ సమాధిలోకి విసరాలి. జీవితానుభవ ప్రవంతిలో తానున్న రేవును దాటి కావ్యనౌకలో ప్రయాణము చేసిన చదువరి మేల్కొని ప్రకృతిలో పడేసరికి అతని హృదయవీణకి కొత్తతీగె మొలవాలి. అంతేగాని ఈ పద్యం బాగుంది, ఈ సమాసము బాగుంది అని కవిగారి రచనాశక్తికి వ్యాఖ్యానాలు తెచ్చే రచనలు

కవిగారి `యశసేఽర్థకృతే వ్యవహారవిదే' లో గాని, చదువరికి "సద్యః పర నిర్వృత యే కాంతాసమ్మితతయోపదేశ యుజే"లు కానేరవు.

పై వాక్యాలు శ్రీపాదవారి విమర్శలోని ప్రధానాంశాన్ని స్పష్టం చేస్తై. అందువల్లనే కవులలోని అనుభూతి ప్రత్యేకతను గూర్చిన వివరణ ఆయన విమర్శలో విశిష్టంగా ఉంటుంది. బసవరాజు అప్పారావు రచనల్ని గురించి చెప్తూ యిలా అంటారు.

"కొన్ని వింత రచనలు- వీరే ప్రారంభించారనాలి వాటిని - గాజుల వరుసలాగా ఒకే రకపు భావాలతో సాగిపోయి నప్పటికీ ఆఖరి చరణములు అద్దుకమ్మీల్లాగ వీటిని అతికి మొత్తపురచనకు కావ్యత్వసిద్ధినిస్తున్నవి.... నాలుగు ముఖాలా జరిగే నాలుగు అనుభవాల్ని వర్ణించి, చదువరికి అభిప్రాయాలు కలిగించి, ఆఖరి చరణమనే నిట్టూర్పుతో ఆ అభిప్రాయాన్ని భావస్థాయికి మీటడము ఖండ కావ్యనిర్మాణములో చక్కని తంత్రము. బసవరాజు అప్పారావుగారే ఈ తంత్రాన్ని తొలుదొల్త చక్కబరచినారని నాకనిపిస్తుంది"

యిలాటి అనుభూతి వివరణలు శ్రీపాద వారి వ్యాసాల్లో అడుగడుగునా కనిపిస్తై. అసలాయన్ని అనుభూతినిచ్చే పదాలే పరవశింపజేస్తై. అందుకే ఏ కవిలో నించైనా అనుభూతి కలిగించే పదాల్నీ, వాక్యాల్నీ కుండపోతగా కుమ్మరిస్తూ ఉంటారు. పఠాభి `ఫిడేలు రాగాల డజన్' గూర్చి చెప్తూ యిలా అంటారు.

"వీరి కవిత్వములోని పోలికలు నగరవాసుల అనుభవములోనివి. చూచే ఎరుగని రాజహంసలూ, అప్సరోరమణులూ వంటి ఊహా సామగ్రికాక, అనుభవములో ఉన్న బాదంఫీరూ, డీలక్సు కుషన్‌సోఫా, అమృతాంజనపు పూతా, కన్నిమారాలో టీపార్టీ వంటి సామగ్రినే వాడినారీయన. కామాక్షి స్పర్శవల్ల పఠాభికి కలిగేది గగుర్పాటు కాదు" అపూర్వంబగు మజా". మైమరపు కలుగదు`నోరూరుతుంది'. లీల్ అధరాలలో సుధారసము కాదు ఆయనకు గోచరించేది,`జహంగీరు తీపి'. బ్రహ్మానందము కాదు ఆయనకు కలిగేది `బలేసరదా, బలే గమ్మత్తు'. నయనోత్సవమూ, పులకరింతలూ కామాక్షి కోకకి ఆరోపించారాయన. నగరవాసులకు "తగిలింపబడియున్నది జాబిల్లి, చైనా బజారు గగనంలో పైన అనవసరంగా" అనిపిస్తుంది. హంసయానల్నీ, గజగమనల్నీ కాదు వారు చూచేది"హయిహీనుయానల్ని". వారికి వసంతము ఎప్పుడూ?" అదుగో చూడుము చెల్లారామ్సు షాపు ముందు వసంత కాలంపుటఖండ అమ్మకా"లని "ఖరీదులు ఫలానా పలానా" అని ఎలా ఉడ్వర్టయిజు చేయబడి యుందో!". యిలా ఏ కవిని గురించి చెప్పినా, ఆ కవిరచనలో అనుభూతి కలిగించే పదాల్నీ, వాక్యాల్నీ వేగంగా, వరసగా చెప్పుకుపోవడం కనిపిస్తుంది. డాక్టర్ శ్రీపాదని `అనుభూతి విమర్శకుడు' అనవచ్చు. (`అనుభూతివాద విమర్శకులు' వేరు)

ఈ అనుభూతిని ప్రధానాంశంగా పెట్టుకోవడంలో ఆయన ఏకాగ్రతగానీ, నిజాయితీగాని ఎంతో ప్రశంసనీయంగా ఉంటాయి. ఎందుకంటే లోకం దృష్టిలో ఎంత గొప్ప కవినైనా అనుభూతి సమగ్రతలేని కవిత రాస్తే, దాన్ని స్పష్టంగా లోపంగా చూపించి విమర్శిస్తారు. అక్కడ కవికుండే కీర్తిగాని, తనకున్న గౌరవంగానీ ఏవీ అడ్డం రావు. గుణాన్ని ఎంతబాగా ప్రశంసిస్తారో, లోపాన్ని అంత తీవ్రంగానూ నిరసిస్తారు. ఉదాహరణకి విశ్వనాథ వారి `కిన్నెరసాని పాటలు ' అందరికీ గొప్ప అనుభూతి నిచ్చిన రచన. కిన్నెరసాని పాటలు - గూర్చి శ్రీపాద వారి అభిప్రాయం చూస్తే, తన భావాన్ని చెప్పడంలో ఆయనకున్న నిజాయితీ, నిర్భీకతా ఆశ్చర్యం కలిగిస్తై. ఆయన యిలా అంటారు-

"కిన్నెరసాని పాటలను విశ్వనాథవారు "ఇదుగో చూడండి నా రచన" అని మనమీద విసిరినారా అనిపిస్తుంది. అట్లాటి దానిలో మనకు ఇంపు గూర్చే మెరుగు తక్కువగానే ఉంటుంది. ఆశ్చర్యమేమిటీ?"

అనుభూతికి అడ్డం వచ్చే అతి సూక్ష్మాంశాల్ని కూడా పట్టుకారుతో తీసి యివతల పెట్టినట్లుగా, భావధారలో నుంచి వేరుచేసి చెప్పగలరు శ్రీపాదవారు రాయప్రోలువారి ఉన్నత కవితా స్పందనను గూర్చి వివరిస్తూనే ఒక విమర్శచేశారు.

"అయితే ఈయన భావాలు కూడా తెరమరుగుకు `నెచ్చటికో అదృశ్యమై'పోవడము కద్దు. కమల ఒడ్డాణము బచ్చలితీగకు తగిలి వేలాడుతున్నది. దానికి ఆమె కవి తప్ప `ఒరులెంచన్ రానిచేతః స్పృహ'గాంచినదట! ఆ వెంటనే కవిగారేదో భావప్రపంచములో పడి `మొగలిపూవుల తీవెల.....' అని భావసమాధిలో పడిపోతారు. నాటక ప్రదర్శనలో నటుడు రసానుభావములో పడితే జరిగేదే జరుగుతుంది, కవి కథ చెబుతూ, పాఠకులను విస్మరించి, తనదారిని తాను ఏవేవో భావాలు పట్టుకుని ఎక్కిపోతే. ఇక్కడి పద్యాలు రెండు తీసేస్తేగాని, కథదారిలో పడదనిపిస్తుంది నాకు"

అనుభూతిని మాత్రమే ప్రధానంగా తీసుకుని, మిగలిన అంశాల్ని ఎక్కువగా ఆలోచించక పోవడంచేత కొన్నిచోట్ల ఆయన విమర్శ మనకి ఆశ్చర్యంకూడా కలిగిస్తుంది. శ్రీ శ్రీ `మహా ప్రస్థానం' గేయాన్ని గూర్చి రాస్తూ ఇలా అంటారు.

"వినబడలేదా మరో ప్రపంచపు జలపాతం -నీవు వినిపించిన దెప్పుడూ? కనబడలేదా మరో ప్రపంచపు అగ్ని కిరీటపు ధగధగలు - నీవు చూపించిన దెప్పుడూ? నీ మనసులో మెరిసిన మరోప్రపంచానికి నన్ను లాగడానికి నీ తొందర తప్ప మరేమిటుందంటావూ?"

తన మాటలు ఎంత విచిత్రంగా కనబడ్డా, తన మార్గాన తాను విమర్శిస్తూపోవడమే ఆయన విశిష్టత. మొహమాటం కోసమో, ప్రేమకోసమో, భయంకోసమో, `గ్రూపిజం'

కోసమో తన అభిప్రాయాల్ని దాచుకున్నవారు కాదాయన. విమర్శకుని స్వేచ్ఛకీ, చిత్తశుద్ధికీ ఆయన వ్యాసాలన్నీ నిదర్శనాలే!

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు కవిత్వంలో ఆధునికత, స్వేచ్ఛల తరఫున వకాల్తా తీసుకున్న న్యాయవాది వంటివారు. ఆధునికతపై ఆయనకున్న అభిమానానికి పరాకాష్ఠ ఈ కింది మాటలు:

"గురజాడ కవి కవితాసామగ్రి, ఛందస్సూ, వర్ణనపద్ధతీ, భాషావేషమూ మార్చి ఆదీ మధ్యమూ అంతమూ గల ఖండకావ్యాలూ, ముత్యాలసరాలూ, కన్యక, డామన్ పిథియసూ, పూర్ణమ్మా, లంగరెత్తుము, రచించారు. ఇవి సద్యఃపరనిర్వృతి కలిగించే కావ్యాలు. కవిత్రయము వారి ప్రబంధమండలి వ్యాసునిది. తెలుగువారు `మా జాతి సృష్టి' అని చెప్పుకో వీలైనది కాదు. అది పేద్ద సత్రము లాటి భవనము, మన సొంతము కాదు. గురజాడవారు నిర్మించిన పర్ణశాలలు మనవి."

కవితానుభవానికి అడ్డంగా నిలిచే కృత్రిమమైన అంశాలన్నిటినీ శ్రీపాదవారు తీవ్రంగా వ్యతిరేకిస్తారు. `అనిబద్ధ కవిత్వం' కావాలంటారు. ఆ రోజులు వచన కవిత్వం బాగా స్థిరపడుతున్న రోజులు. శ్రీపాదవారు దీన్ని అనిబద్ధ కవిత్వంగా పేర్కొన్నారు. ప్రబంధకాలపు కృత్రిమ రచనా పద్ధతులన్నింటినీ తన వ్యాసాలలో ఎన్నో చోట్ల ఆయన విమర్శించారు. సహజమైన అనుభవం కవిత్వం నుండి సూటిగా రావాలనేదే ఆయన ఉద్దేశ్యం. ఈ క్రింది పంక్తులు ఆయన అభిప్రాయాల్ని స్పష్టంగా వివరిస్తై.

"ఐతే కవిత్వానికి ఛందస్సుతో పనిలేదా? అంటారేమో పాఠకులు. పనిలేదు. ఛందస్సువల్ల కవిత్వానికి అందం రాదా? ఛందస్సు వల్ల విశిష్టమైన నడక వస్తుంది. ఆ నడక ఒకచోట కవి చేసిన వర్ణనకు అనుకూలంగా ఉండవచ్చును. అంతటా ఉండదు. రచన కనుకూలముకాని కట్టుబాటు ఏల? కవిత్వానికి అలంకారములతో పనిలేదా? లేదు. శక్తివంతంగా అందంగా చెప్పడము సాగకపోతేనే అలంకారము. అలంకార కవిత్వము రెండోరకమే.... కవిత్వానికి ఛందస్సుతో, అలంకారంతో, శ్లేషతో, ప్రాసతో, సమాసంతో పని లేదు. తెచ్చి పెట్టుకున్న ఇనుప నగలు కవిత్వానికి ఇవి అన్నీ.... అయితే ఏ నియమాలూ లేకుండా వ్రాస్తే కవిత్వమా అని అడుగుతారేమో! నియమాలన్నీ పాలించి వ్రాస్తే కవిత్వమౌతుందా? అప్పుడు ఏది ఉంటే కవిత ఔతుందో,నియమాల్లేకుండా వ్రాసినప్పుడు, అది ఉంటేనే కవిత్వమౌతుంది. గద్యలో కూడా కవిత్వం ఉండవచ్చునని ఉపదేశాలు చేసేవారు, వచన పద్యాలు వ్రాసేవారిని చూచి మూతివిరుస్తున్నారు. వారి మూతులట్లే ఉంచనివ్వండి. వారు రిపేరుకు కూడా పనికిరారు. మీరు సాగిపొండి.."

వచన కవిత్వం బాగా స్థిరపడిపోయిన ఈనాడుమనకు పైమాటలు చెప్పడం సులభమేగాని, 1963, 64 లలో యింకా పాత కొత్తల ఘర్షణలు జరుగుతున్న కాలంలో పైవిధంగా చెప్పడానికి ఎంతో ధైర్యం కావాలి.

అందరు విమర్శకులకి ఒక ప్రత్యేకతగల శైలి ఉండదు. కట్టమంచి, రాళ్ళపల్లి, రా.రా.మొదలైన విమర్శకులకి వారివారి విశిష్టమైన శైలులున్నై. శ్రీపాదవారికి కూడా ఒక ప్రత్యేకమైన శైలి ఉంది. రెండు వాక్యాలు వినగానే ఇది శ్రీపాదవారి శైలి అని చెప్పవచ్చును. ముఖ్యమైన లక్షణం ఆయన శైలిలో ఉన్న వేగం. ఒక ఉపన్యాసకుడు ఆవేశంతో మాట్లాడుతున్నట్లే ఆయన శైలి ఉంటుంది. పుస్తకాలు చూస్తూ, ఉదాహరణలుచెప్తూ, విషయాన్ని ముందుగానే ఒక ప్రణాళిక ప్రకారం విభజించుకుంటూ, ఆలోచించుకుంటూ రాసినట్లుండదు ఆయన ధోరణి. అందుకే మధ్యమధ్యలో వాదోపవాదాలతో కూడా నడుస్తుంది.

"పద్యం కవిత్వానికి అడ్డా? ఆహా అడ్డే! అయితే తిక్క నాదులెందుకు రాశారూ?" "ఆ అడ్డుతో రాయడంగొప్ప అనుకునీ". నిర్వచనోత్తర రామాయణం రాశారుగదా ఆయన? మళ్ళీ పాతపద్ధతికి ఎందుకు దిగేరూ? వ్యర్థపదాలూ, అక్కరలేని విశేషణాలూ వాడకుండా ఏ తెలుగు కవైనా వ్రాశాడూ? సంస్కృతకవులు వ్రాశారు వాల్మీకాదులు. మరి సంస్కృతంలోలేని వ్యర్థపదాలూ, పద్యమంతా ఆక్రమించే సమాసాలు, యతి ప్రాసల సంకెళ్ళూ, గణఛందస్సులూ తెలుగునెత్తిమీదికి ఎందుకు తెచ్చిపెట్టారూ?"

శ్రీపాద వారి శైలిలో వ్యంగ్యాన్ని గూర్చి ప్రత్యేకంగా చెప్పకోవాలి. తనకు నచ్చని విషయాన్ని చెప్పేటప్పుడు ఆయన చేసే అవహేళనా, ధ్వనివిశేషమూ, సరిగ్గా అతికేపోలికలూ చదువరికి గిలిగింతలు పెడతాయి. రెండు దాహరణలు చూడండి.

"పద్యము అల్లగలవారంతా, అల్లినవారంతా కవులుగానే జమ అయితే నష్టమేమిటీ అంటారా? వ్రాయకపోతే నష్టమేమిటీ అని. ఆధునిక కాలంలో ఎందరో వ్రాస్తున్నారని తాముకూడా వ్రాసేవాళ్ళూ, లేని ప్రేయసిని సౌందర్యాభిలాషనీ వేదననీ తెచ్చిపెట్టుకునేవారు ఎందరో ఉన్నారు. వీరందరివల్లా భూభారం మాట అట్లాఉంచి-వాఙ్మయము భారమౌతోంది".

"జీవుల చైతన్యపుభాష అయిన సంగీతానికి మానవుల ఆలోచన భాష అయిన మాటల భాష కాళ్ళలో కర్ర. మాటల భాషకి సంగీతాన్ని చేర్చియివ్వడం ఎద్దుకి హంసను జోడుగా పూన్చడమే. ఆ బండిగాని ఎగిరిందంటే హంసది గొప్ప. పాటలను అమోఘంగా పాడేసి "నా కవిత్వము ఎంత బాగుందో" అంటే "నీ కవిత్వము కాదయ్యా భాగువ్నది, నీ పాట బాగుంది" అనాలి మనము

శ్రీపాద వారు కవిత్వంలో నిసర్గమైన అనుభూతిని ప్రధానం చేసుకున్న వారని మొదటనే చెప్పబడింది. అందుకే ఆయన సమీక్షల్లో సామాజికనేపథ్యమూ, సిద్ధాంతాల ప్రాతిపదికా, ఎక్కువకనిపించవు. ఏ విమర్శకుణ్ణైనా, ఏ రచయితనైనా, అంచనా వేసేప్పుడు, అతని కాలమూ, సామాజిక వాతావరణమూ,సాహిత్యవాతావరణమూ కూడా దృష్టిలో పెట్టుకోవాలి. అవేవీ చూడకుండా, మన కాలంలో పెంపొందిన భావజాలాల ద్వారా, మరో కాలంలోని రచయితను పొగడడంగాని, తెగడడం గానీ, ఈమధ్యకాలంలోనే ఎక్కువగా కనిపిస్తోంది. ఆ కాలంలోని రచనలు ఈ కాలానికి కలిగించే ప్రయోజనంగూర్చి ఆలోచించినప్పుడు మన నిర్ణయాలు వేరుగా ఉండవచ్చు. కాని మౌలికంగా ఒక రచనలోని ప్రభావాన్నీ, మంచి చెడ్డల్నీ అంచనా వేసేటప్పుడు కాలాన్ని తప్పక ఒక అంశంగా తీసుకోవాలి. ఆ దృష్టితో చూచినప్పుడు 1960 లలో, ఆధునికత్వాన్ని గూర్చి ఒక నిర్దిష్టమైన, స్పష్టమైన అభిప్రాయాల్ని వెలువరించిన వారు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. అది గూడా ఒక సంఘర్షణధోరణిలో చెప్పడం, ఆధునికులకు గొప్పదన్నునిచ్చినట్లయింది.

ఆధునిక విమర్శ పరిణామాన్ని గురించి పరిశోధన చేసే వారెవరూ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిని విస్మరింపలేరు.

ఆయన వ్యాసాలను ఒక చోట చేర్చి తెలుగు యూనివర్శిటీ వారు యిప్పుడు "అర్థ శతాబ్దపు ఆంధ్ర కవిత్వము" అనే పేర ఒక పుస్తకంగా ప్రచురించడం చదువరులకూ, పరిశోధకులకూ ఎంతో ప్రయోజనకరం. యిలాటి పుస్తక ప్రచురణలవల్ల గతవారసత్వాన్ని ప్రస్తుత పాఠకులకు తెలియజెయ్యడం అభినందనీయం.

***

# నా మాట

నేను పఠాభి కవిత్వంపై పరిశోధన చేస్తున్నప్పుడు బంగోరె ఎడిట్ చేసిన ఫిడేలు రాగాల డజన్ ద్వితీయ ముద్రణలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు పఠాభి కవిత్వం గురించి రాసిన వ్యాస భాగాన్ని చూడటం జరిగింది. ఈ వ్యాసం మొదట కిన్నెర పత్రికలో 1948 నవంబరులో అచ్చయింది.

ఆవ్యాసం చూసాక శ్రీపాదవారి ఇతరవ్యాసల కోసం అన్వేషించడం మొదలు పెట్టాను. ఆన్వేషణ ఫలితమే ఈ అర్థశతాబ్దపు ఆధునికాంధ్ర కవిత్వ గ్రంథం. ఈ వ్యాసాలు "అర్థశతాబ్దపు ఆంధ్ర కవిత్వము" శీర్షిక క్రింద 1962 నవంబరు నుండి 1964 జనవరి వరకు భారతి సాహిత్య పత్రికలో ధారావాహికంగా అచ్చయ్యాయి. ఒకటి రెండు వ్యాసాలు కిన్నెర ఆంధ్ర పత్రికలలో వచ్చినవి. గురజాడ నుండి పఠాభివరకు గల ఈవ్యాసాలు అర్ధశతాబ్దపు ఆధునికాంధ్ర కవిత్వ చరిత్ర. ఆధునిక కవిత్వాన్ని క్రమపద్ధతిలో అధ్యయనం చేయదలచుకున్నవారికి ఈ గ్రంథం కరదీపిక వంటిది. శ్రీపాద వారు ఆధునిక కవిత్వం గురించే కాక, దేశి సాహిత్యం గురించీ, నాటక సాహిత్యం గురించీ ప్రామాణికమైన వ్యాసాలు వెలువరించారు. భవిష్యత్తులో వాటిని కూడా తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించవల్సిందిగా కోరుతున్నాను.

ఈ వ్యాసాల సేకరణ విషయంలో నాకు ఎంతగానో సహకరించిన శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారి కుమార్తె శ్రీమతి గాయత్రీ రామారావు గారికి ఈ సందర్భంగా కృతజ్ఞతలు. ఈ వ్యాసాలను ప్రచురించ వలసిందిగా కోరగానే ఆమోదం తెలిపిన అప్పటి ఉపాధ్యక్షులు డా. సి. నారాయణరెడ్డి గారికి, ప్రస్తుత ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి కృతజ్ఞతలు.

డా. కె. సంజీవరావు

సంకలన కర్త

## అర్ధశతాబ్ది ఆధునికాంధ్రకవిత్వము

# విషయసూచిక

# 1. గురజాడ; రాయప్రోలు

నవ్యకవిత్వమన్నది ఒక్కచోట ఒక్కనాడు ఒక్కవ్యక్తి సృజించినదాన్ని అనుసరించి వర్తిల్లలేదు. వర్షము పడినప్పుడు సెలయేళ్లు కలిసి నది యైనట్లు, వ్యక్తులూ, ఉద్యమాలూ, పరిస్థితులూ కలసిరావడము వల్ల నవ్యకవిత్వము నాలుగు చోట్ల, పుట్టి పెరిగింది. వ్యక్తులు, గురజాడా, రాయప్రోలూ-ఉద్యమాలు, వందేమాతరోద్యమమూ, సంఘ సంస్కారోద్యమమూ- పరిస్థితులు, ఆంగ్ల విద్యా, పత్రికా ప్రచారమూ, ప్రపంచ యుద్ధమూనూ. వందేమాతరోద్యమము 1908 ప్రాంతాన్ని తెలుగుదేశంలో కలవరము కలిగించింది. పైకి తేలకపోయినా విద్యాధికుల అంతరాంతరాలు ఈ దేశ భక్త్యుద్యమానికి జల్లుమన్నాయి. రాజకీయ రంగములో వ్యక్తము కాలేని స్వాతంత్ర్యపిపాస అముద్రితాంధ్ర గ్రంథ ప్రకటనముల్లోనూ, పత్రికా ప్రచారములోనూ కనిపించింది. సంస్కరణోద్యమము వంగ దేశము నుంచి జడుస్తూ జడుస్తూ తెలుగు జాతి, తెలుగు నాట ప్రవేశించింది. బరంపురంలో 1910లో జరిగిన సర్వజాతి సహపంక్తి భోజనం దేశంలో దుమారం లేపింది. వితంతు వివాహాలు నైసర్గిక ప్రవృత్తులను, దయాదాక్షిణ్యములను కొట్టి లేపేయి. ఆంగ్లవిద్య, వ్యాసమునూ (ఇంగ్లీషు), ఖండకావ్యములనూ, విమర్శలనూ పత్రికల ద్వారా ప్రచారము చేసింది. పలువురు కవులు ఇంగ్లీషు కవుల ఖండకావ్యాల్ని తెలిగించారు. ఇంగ్లీషులో ఉన్న రచనా వైవిధ్యము తెలుగులో లేదని విద్యాధికులు గుర్తించారు. సంప్రదాయ సిద్ధముగా తెలుగూ, సంస్కృతమూ నేర్చిన పండితులు ఆశుకవిత్వాలు అవధానాలు చేసి ప్రజాస్వామ్యానికి పద్యము మీద ఆసక్తి పుట్టించారు. మూగగొంతులెన్నో పలకడము ఆరంభించాయి గాని ఆ పలుకులు, అవధాన పంచాననుల పొగడ్తలూ వారి ప్రతిపక్షుల తృణీకారాలే అయినాయి గానీ కొత్త దారుల్లో సాగలేదు. మార్గదర్శి కావలసి వచ్చాడు నవ రచనకు. ఆ సమయంలో నోరు విప్పేడు గురజాడ అప్పారావు గారు.

గురజాడ అప్పారావు గారు మహామేధావి. ప్రపంచ చరిత్ర, లిపిశాస్త్రమూ, ద్రావిడభాషా పరిణామ శాస్త్రమూ, సంస్కృత వాఙ్మయమూ, ఆంగ్ల కవిత్వమూ

ఆయనకు కరతలామలకాలు. పూజ్య శ్రీ ఆనందమహారాజులుంగారి సాహచర్యమువల్ల అలవడిన నిర్భయముతో కూడిన కొండంత సౌజన్యము. ఆయన లేఖినికి నైశిత్యముతో పాటు హృదయంగమమైన హాస్యధోరణి నలవర్చినది. అయితే వింత ఏమిటంటే ఇంత గొప్ప సంస్కృతీ మహోదయులైనప్పటికినీ ఆయన చేపట్టిన ఉద్యమాలన్నీ స్వపాండితీప్రదర్శకాలు కావు, ప్రజాహితాకాంక్షాచోదితములే. సాంఘిక నాటకాలూ, కళింగదేశ చరిత్రా, వ్యవహారిక భాషా ప్రచారితమూ, వ్యాసాలు, చిన్న కథలూ, కవిత్వమూ అన్నీ ప్రజాహితకాంక్షతోనే రచించారాయన. ఆయన మేధాశక్తి ఆయన చేసిన సృష్టికంతటికీ చైతన్యపు వెలుగును పూత పెట్టినది కాని ఆయన నైసర్గిక శక్తి ఏ శాఖలో ఉన్నదో తెలియలేదనే అంటాను నేను. పట్టిన పలుశాఖలను దిద్దితీర్చడములోనే ఆయన ఆయువు కర్చైపోయినది. ఆ రీతిగా తీర్చిన ఒక శాఖే ఆయన కవిత్వమూను అంటాను నేను. అప్పారావు గారు భాష మీద సంపూర్ణాధికారముగల మహాకవి కారు. ఆయన కొద్ది రచనల్లోనూ, పుస్తకాలలోగాని, వ్యవహారంలోగాని లేని మాటలూ, నడక కుంటుపడేచోట్లూ, మాటలు చాలకవచ్చే చోట్లూ, మాటలు ఎక్కువై పాటలవరకును పెంచేసిన చోట్లు, భాష చితికిన చోట్లూ పెక్కులు ఉన్నాయి. అయితే బలరాముని హలముతో యమున వలె అప్పారావు గారి మేధాశక్తి నవ్యకవితాధోరణి చైతన్య సరస్వతియై మళ్ళి ప్రవహించింది.

"గుత్తునా ముత్యాలసరములు కూర్చుకొని తేటైన మాటల"నని ఆయనే చెప్పినట్లుగా ముత్యాలసరములనే మిశ్రగతి ఆవృతాల ఛందస్సును ఆయన స్వీకరించారు. భారత రచన ప్రారంభించినపుడు నన్నయ గారు తెలుగు కవిత్వానికి నైసర్గిక ఛందస్సులైన తరువోజా, సీసమూ, రగడా వంటి మాత్రా ఛందస్సులకు ఇతర మాత్రాఛందస్సులను కాక సంస్కృత కవిత్వములోని వృత్తాల్ని ఎక్కువగా చేర్చి తెలుగు కవిత్వాన్ని సంస్కృత సంప్రదాయానుసారినిగా దిద్దినారు. ఆయన తరువాతి వారున్నూ ఆయన పద్ధతినే అవలంబించి తెలుగు రచనను సంస్కృత సమాసాలంకార భూయిష్టము చేశారు. సంస్కృత కావ్యపఠనము తెలుగు రచనకు రాచబాట అయిందీ - సంస్కృత సమాస ప్రయోగము తెలుగు కవిత్వానికి `మేలి' ముసుగు అయింది. ముసుగేగాని మోము అందముగా ఉన్నదా లేదా అన్న ప్రశ్న లోపించిపోయింది. పాల్కురికి వంటి కవులు "ఉరుతరగద్య పద్యోక్తులకంటే సరసమై `పరగు జాను తెనుంగు' `సర్వసామాన్యమ'ని ఘోషించినా, పదకవితల నీసడించిన `ప్రౌఢ' కవుల పలుకుబడియే జయించి నిన్నమొన్నటి వరకూ, తెలుగు కవిత్వాన్ని నెట్టుకొని వచ్చింది. "కవిత్వమంటే పద్యాలు రచించడము మాత్రమే కాదు" అంటూనే పద్య రచనా మాత్రాన్నే కవిబిరుదులు ధరించి ఊరేగువారే అయినారు కవులు. కావ్యాలు చైతన్యము పోయి కొయ్యబొమ్మలై పోయాయి. గురజాడ అప్పారావు గారు మేలు కొలుపుల వరుసను తమ రచనకు ఛందస్సుగా గ్రహించారు.

దీన, మూడు పాదాలు రెండేసి అక్షరాల ఆవృతాలై ఉంటాయి, ఆఖరి నాలుగోపాదము ఒక ఆవృతమూ మూడక్షరాలూతో అంతమవుతుంది. మూడు పాదాలు పధ్నాలుగు మాత్రకాలం నడుస్తాయి, నాలుగోది పన్నెండు అక్షరాల్నిపలికి రెండు అక్షరాల కాలమును దీర్ఘరూపంగా లాగి పూర్తి అవుతుంది. ఈ (మాత్రా)చ్ఛందస్సులో పాదాంతమందు విరతి ఉంటుంది, సమాసంలోలాగా మాటలు ఒకదానికొకటి అంటుకోక విడివిడిగా ఉంటాయి కవికల్పనకీ, చదువరి పఠనానికీ అవకాశం బాగా ఉంటుంది. ఎక్కువ రచనలు ఈ వరసలోనే చేసినా,`పూర్ణమ్మ' అనే కథను చతురశ్రగతి ఏకతాళములోనూ `నీలగిరిపాటలను' పాటలుగానూ ఈయన (1910)లో రచించడాన్ని బట్టి ఆలోచిస్తే మాత్రాచ్ఛందస్సులన్నీ- అనగా పాటల వరసలన్నీ కవితారచనకు పనికి వచ్చేవే అని ఈయన నమ్మినట్లు గోచరిస్తుంది. గణఛందస్సులు వదిలేయమని ఈయన సూచన కావచ్చును. (సుభద్ర అనే చిన్న కావ్యమును పద్యఛందస్సులోనే ఈయన ప్రారంభించినా `ప్రాతక్రోవల కవిత నడుపగ ప్రజ్ఞ కలదని' చూపుటకే ఆ రచన చేసినట్టు చెప్పుకున్నారు కనక అది వీరి కభిమాన పాత్రమైన పద్ధతి కాదు.)

సమాసములూ కఠినపదములూ విసర్జించి తేటమాటలతో రచించడము ఈయన రెండో పూనిక. కవిత్వపు బరువును దాని క్లిష్టతను బట్టి ఉంటుందనే నమ్మకము నాటి మాటకేమి నేడు కూడా ఉన్నది . "నా రచన వాడికర్థమై ఏడ్చిందా?" అనే కవులు చాలామంది ఉన్నారు ఇప్పటికీ. సులువుగా అర్థము కాని కవిత్వము ప్రౌఢ కవిత్వము అనినమ్మే విమర్శకులూ ఉన్నారు. అలాంటి వారికందరికీ కవిత్వమంటే హాయి కూర్చే రచన సాగించారు. వ్యాకరణము కట్టినకట్లతో చైతన్యము తగ్గిన భాషలో కాకుండా వ్యవహారములో ఉన్న జాతీయాల్నీ, పలుకుబళ్ళనూ ఇముడ్చుకున్న భాష నుండి కోమలత్వము కూర్చారు కవిత్వానికి. వ్యవహారానికి దూరమైన భాష హృదయాలకు కూడా దూరమే కాదా? కవిత్వపు గురి హృదయానికేకాని (ఆలోచించే) మెదడుకు కాదు. కవిత్వములో చెప్పవలసిన భావాలు; అభిప్రాయాలు ఆలోచనలూ కావు. భావాలు; చెప్పవలసిన భాష తేలికగా మృదువుగా జీవించి ఉన్న జాతీయాలతోనూ పలుకుబళ్ళతోనూ నిండి హృదయంగమంగా ఉండాలి కాని గండాశ్మములతో దుర్గమమూ కష్టమూఅయితే ఎలాగ? ఈ సత్యమే "చెవుల కమృతంబు ప్రాకృతకవనము శ్రద్ధవంగ వినగ"నని హాలమహారాజు పదహారు వందల సంవత్సరాల క్రితమే చెప్పినాడు. ప్రాకృతము గ్రంథభాష కాదు, జీవద్భాష - ప్రాకృతుల భాష - కనుకనే సర్వమానవ హృదయంగమమైన శృంగారము ప్రాకృతభాషలోనే ఎక్కువ రంజకంగా ఉంటుందని ఆయన ఆశయము. అప్పారావు

గారు కోమలమైన జీవద్భాషలో తమ ఖండకావ్యాలు వ్రాయడము కవిత్వాన్ని పాండిత్య భేషజాల నుంచి తప్పించి చూపుదామనే ఉద్దేశ్యంతోనే. `ఎక్కడనో ఒక చెట్టుమాటున పలికే `కోయిలనీ', చెట్లుచామలు కోటి చెవులను గ్రోలి యలరిన `పాటనీ, `తాటివనమున ఆగి చెవియొగ్గిన' చంద్రుణ్ణీ వర్ణించి శ్రవణేంద్రియాన్ని మెప్పించారు. కన్నులు విచ్చి చూసిన విరులనూ, పౌజుపౌజుల బారెడు పక్షులనూ, తూర్పుకొండను గొడుగులెత్తిన తాటివనాల్ని, తాటివనమును వెడలి ఫక్కుమని నవ్విన చంద్రుణ్ణీ, పండుగెడ్డముతో నిండి కన్నుల శాంత రసంబు నిండిన కన్నియ తండ్రినీ, మింటిని ముట్టియాడే మంటనీ, ఆమని రాగా దుర్గకొలనులో కలకలనవ్విన తామరల్ని చూపించి కన్నుల నలరించారు. ఉండి ఉడిగియు ఆకులాడగ కొసరెనోయన వీచేగాలీ, అలలుగ సాగి పూలను జల్లుజల్లున రాల్చిన చల్లగాలీ విసిరేరు. అనుభవము కలిగించాలంటే వర్ణనలు ఇంద్రియ గోచరము: కావాలి. అప్పారావు గారి వర్ణనలకా శక్తి ఉన్నది.

పూర్వకవులు సృష్టించిన అలంకారాల్నీ, విధిగా చేపట్టిన అష్టాదశ వర్ణనల్నీ వదలి పెట్టి తనచూపుకి కట్టిన సౌందర్యాన్ని చదువరులకు అందించారు అప్పారావు గారు. ప్రబంధ కవిత్వములోనూ తరువాతి క్షీణయుగ కవిత్వములోనూ అందపువస్తువుకు కంటే వర్ణనా చమత్కారానికే ఎక్కువజాగా. సంస్కృత కవులూ తొలినాళ్ళ ఆంధ్రకవులూ చేసిన కల్పనల పులగాలూ వాటికి భిన్నమైన కల్పనలూ తరువాతి వారున్నూ, ప్రబంధ రత్నావళులు పరికిస్తే ఒక పేకదస్తాతోనే గారడివాడు ఎన్నో తమాషాలు చూపించినట్లు సంస్కృత కావ్యవస్తువునే రకరకాలుగా కలుపుతూ తద్వారా సమకూడిన కొత్తదనానికే దేవుళ్ళాడిన కవుల అవస్థలు గోచరిస్తాయి. గురజాడవారి రచనలలో ప్రబంధకవుల రచనలలో నలిగిన సరిద్రాజ హంసములూ, శుకీకేళి పంజరాలూ, కలాపినీ ప్రావృడంబుదాలూ, ముఖ-, కర- పాద-, పద్మాలూ గోచరించవు. తన చైతన్యమే కన్నుగా ప్రతిభయే దారి చూపే జ్యోతగా ఆయన హృద్యమైన రచనచేశారు. ఆ రచనలో అలంకారాల పూతమెరుగులూ అభూతకల్పనల బెడంగులూ కానరావు. అందాలన్నీ కథనముతో మేళవించి ప్రవహిస్తాయి. "తదియ చందురుడబ్ధి సోకెను చదల విడబడి యిరులు బ్రాకెను, అదును కాంచిన రిక్కమూకలు అంతటను ప్రబలెన్", "ఆటపాటలు అణిగెనంతట మాటుమణిగెను భవనరాజము చాటుమాటున బారజొచ్చిరి సఖులు చుట్టములున్" "దారిపోయే వారి కొక్కటి కారవాసర కల్పనాయెను దారికాదదీ దరియటంచును తలచుటాకవింత." "నీడ వెలువడి నిలిచె ముందర వేడ్కమోమున వెల్లివిరియగ "వీడె దమనుం"డంచు నందురు విస్మయము చెందన్. "బలబల కన్నుల కన్నీర రాలికెను పుత్తడిబొమ్మకు

పూర్ణమకు కన్నులుతుడుచుకు కలకల నవ్వెను పుత్తడి బొమ్మా పూర్ణమ్మా." చెప్పే వస్తువూ చెప్పే పద్ధతీ వేరుగా కనబడవు. కవిత్వానికి ఉత్తమ లక్షణమిది. వస్తువు వర్ణన కందనంత గొప్పగా తోచినట్లయితే కవివాక్కు కుంటినట్లు, కవివాక్కు గొప్పగా కనబడితే వస్తువులో అందము చాలనట్లు, ఉత్తమ కవిత్వములో రెండూ పాలూపంచదార వలె కలిసిపోయి ఉంటాయి.

కావ్యరచన వల్ల కవికి యశస్సూ, సొమ్మూ, వ్యవహార జ్ఞానమూ, శివేతర క్షయమూ కలుగుతాయి. చదువరికి సద్యఃపర నిర్వృతీ కాంతాసమ్మితోపదేశమూ కలుగుతాయి. పాశ్చాత్యకవులు చాలా మంది కావ్యరచనాదర్శము ఆనందోద్దీపన మన్నారు. పెద్దన్న, మాదయగారి మల్లన, అడిదము సూరకవీ, చేతము చల్లజేయవలెననీ, రసములు చిప్పిలవలెననీ, "అలతి తొలపడ్డ చంద్రమండలమునుండి జలజలనురాలు నమృతంపు జాలులీల రసము తులకింపవలె"నని ఆనందవాదాన్నే బలపరిచారు. తన తపనీయ సులోచనాలకు అందివచ్చే సౌందర్యాన్ని కవి పూల రేకుల వంటి భాషలో పొదిగి చదువరుల కందించి వారిని సౌందర్యముగ్ధులను చెయ్యడము పునీతకార్యము. అయితే నిర్మల కథానిమిష కల్లోలినీ తరంగములచే చదువరుల కల్మషక్షాళనము చెయ్యడమూ కాంతా సమ్మితంగా బృహత్తర సంఘానికి ఉపదేశము చెయ్యడమూ అన్నవి దానికి పైమెట్లు. కవితాశక్తికి బిరుదైన పనులు అవీ. వాల్మీకీ వ్యాసుడూ శుకుడూ సాధించిన మహత్తరాదర్శములవీ. గురజాడ వారి శక్తి పైవారి శక్తి కంటే తక్కువే కాని గుణము తక్కువ కాదు. ఆకులందున అణిగిమణిగి కవిత కోకిల పలికితే దేశీయుల `యందభిమానములు మొలకెత్తవలె'నట. వారి ఖండకావ్యములలో `యెల్ల లోకము ఒక్క యిల్లై, వర్ణభేదము లెల్లకల్లై వేల నెరుగని ప్రేమబంధము వేడుకల కురియవలె'నని ముత్యాల సరములలోనూ, `మాయ మర్మములేని నేస్తము మగువలకు మగవారి కొక్కటె బ్రతుకు సుకముకు రాజమార్గమని' కాసులు (1911)లోనూ `పుస్తకంబులలోని మాటలు, విస్తరించుచు ననుభవమ్ముల తత్వమెరుగక శుకములగుదురు ఒట్టి శాస్త్రజ్ఞుల'ని లవణరాజుకల లోనూ, పద్యంపట్టి నిలుచును కీర్తులపకీర్తుల్ అని కన్యకలోనూ, బోధించారు; అయితే కాంతా సమ్మితంగా కాదు, సుహృత్సమ్మితంగా చేశారు బోధ. ఏమీ అంటే నాకొక సమాధానం తట్టుతోంది. తన కాలము వారిని ప్రబోధించడమే అప్పారావు గారి కావ్యరచనాదర్శము. ఆ ప్రబోధమును ధ్వని రూపంగా చేస్తే తన ఆశయము సఫలమవుతుందో లేదో అని ఆయనకు జంకు కలిగి కథల లోనే ఏదో పాత్ర చేత చెప్పించేశారు. దేశభక్తి అనే ఖండకావ్యము నిండా ప్రబోధములే. ఆయన మనస్సులోని ఊహలన్నీ నేనంటే నేనని ఆ ఖండములో వచ్చాయి. కవిత్వం ఏమయి పోయినా సరే ఈ అభిప్రాయాలు వెదజల్లితే చాలనుకున్నారు.

అందుకే అన్నాను ఆయన మహామేధావి అని. కవిత్వము ఆయన సాధనలలో ఒకటి, పరమ సాధ్యము కానేకాదు. ఇన్ని నవ్యరీతుల్లో ఆయన రచన నడిపినా ఆయన తరువాతి కవులు ఆయన అడుగుజాడల్లో నడవలేదు. కనుక ఆయన యుగపురుషుడన్న మాట అతిశయోక్తి. ఆయన "కొత్తపాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా" ముత్యాలసరాలు కూరుస్తామన్నారు. ఈ కొత్తపాతలేవి? అని జిజ్ఞాస చేసుకోడము అవసరము. ఆయన కొత్తగా చేపట్టినవి 1. మాత్రాచ్ఛందస్సు 2. తేటైన భాష 3. వ్యవహారములో ఉన్న జాతీయము 4. తన అనుభవములోని కథావస్తువు - భావవస్తువు 5. ఎంతకి అంతటిలోనే కథామూలకమైన ఉపదేశమూను. ఇక ఆయన వదలిపెట్టిన "పాత" ఏది ? ఉదయ-, సంధ్యా-, నిశి-, కన్యకా-, వసంత-, వర్ణనలూ (బ్రతికి ఉన్న జాతీయమును ప్రవేశ పెట్టిన) వ్యాకరణయుక్తమైన భాష; మోము చందురుడు, కాముబాణము, తొగలకాంతులు, పరచుకన్నులు, అంచనడలు, మరునివాడి, స్వర్గశోభ, నాకపతి, రాజుల అధికారము వంటి పూర్వకావ్యసంప్రదాయాలూ; యతి ప్రాసలూను. ఈ రెంటినీ ఆయన చక్కగా కలిపేరు. ఆంగ్ల కవితా రచనా సంప్రదాయాలు కథను నేరుగా ప్రారంభించేయడమూ, ప్రకృతినీ వేదాంత వ్యాక్యాల్నీ కథకు వెలిగా - ద్రష్టగానూ అర్థాంతరన్యాసమునూ కాక కథలోని భాగముగానూ పాత్రల భావాలుగానూ రచించుటా, కులకము (Poem)లలోని పద్యాలను గంపలోని పళ్ళవలె కాకుండా- చదువరిని భావావేశమునకు ఎత్తుకుపోయే నిచ్చెన మెట్లవలె రచించి వాటిని ఖండకావ్యములనుగా నిర్మించుటా, గురజాడ అప్పారావు గారు చక్కగా నిర్వహించారు. తెలుగులో అప్పారావుగారికి ముందు ఖండకావ్యము లేదనుకుంటాను. శ్రీనాథుని చాటువులూ, భృంగపంచకమూ, గంగాభవాని పద్యాలూ, పైన చెప్పిన పళ్ళగంపల వంటివి. ఒక పద్యము చేర్చినా ఒకటి తీసివేసినా చెడిపోయే ఐక్యగుణమేదీ వాటికి లేదు. ఖండకావ్యాలు నిచ్చెనలు. ఒకమెట్టు తీయరాదూ, భావావేశము సమకూడినపిమ్మట ఒక పద్యము కలపనూరాదు. అప్పారావు గారి రచనలో ఆంగ్ల ఖండకావ్యాలలోని సంభాషణాక్రమము - మన సంప్రదాయానికి చెందనిది కూడా కానవస్తుంది.

"కంటివే" నేనంటి, "మింటను కాముబాణంబమరి యున్నది", "కాని పండువునందు కొండొక కలక కననయ్యెన్", "డమన బతుకుము బతుకుమనె", "రేడ"నిరి పలువురటన్", వంటి వైవిధ్యాలు చేర్చి వారు వింత అందము తెచ్చారు. ముఖ్యముగా "పెరిగితి విరిగితి ..." నన్న ఖండకావ్యములో కథావస్తువును కాక భావవస్తువును ఖండ కావ్యరచనకు సామాగ్రిగా గ్రహించి చదువరికి సద్యః పరనిర్వృతి కలిగించే భావకవిత్వానికి ప్రారంభము చేశారు.

అయితే వారి తర్వాతి తెలుగు కవులు వారి అడుగుజాడల్లో పోనేలేదు. రాయప్రోలు వారూ అబ్బూరి వారూ వ్యాకరణబద్ధ భాషలోనే పద్యరచనలు చేశారు. అబ్బూరి వారి మాత్రాచ్ఛందో రచనలలోని గతి - పద్యాలలోని మహాప్రగ్గరల ఛందస్సులాగా - క్లిష్టమై ఇతరుల నెవ్వరినీ అటు ఆకర్షించలేదు. బసవరాజు అప్పారావుగారు పలకడమే నేర్పారు కాని దిద్దితీర్చడము నేర్పనేలేదు. కవికొండల, బాపిరాజులు ఆంగ్ల కవిత్వములోని గోపకావ్యాల్ని విని నోరువిప్పిన వారు. నండూరి సుబ్బారావుగారు ఒక్కరు అప్పారావు గారు నీలగిరి పాటలనువలె-యెంకి పాటల్ని మాత్రాచ్ఛందో రచనలలో ఇమిడ్చినా, చివరి చివరికి భావకవుల ప్రేమయోగ సాధనలను తమ పాటలుగా రచించారు. గురజాడ వారిది ప్రేమ కవిత్వము కాదు. ఆయన ఒరవడి ఎవరూ పట్టి వృద్ధికాలేదనే అంటాను నేను. ఆయన వేగుచుక్కలాగా నవకవిత్వ సూర్యోదయానికి ముందుగా ఉదయమైనారు. ఇప్పుడు వెనక్కి చూసుకొని ఆయనను `వేగుచుక్క' అనడము సంతోషకరమైతే కావచ్చును కాని సత్యము మాత్రము కాదు.

రాయప్రోలు సుబ్బారావు గారు కూడా సొంతముగా కవితలో క్రొత్తదారులు తొక్కినవారే. అయితే వారిని తాకినది ఆంగ్లకవితా ప్రభావము. వారు మన పండితులు తీర్చిన దారులలో సంస్కృతాంధ్ర భాషలలో ప్రావీణ్యము సంపాదించిన వారు. ఆశుకవిత్వము విజృంభించిన రోజులలోని యువకులూ - అవధానాలు ఆశుకవిత్వాలూ చేస్తూ ప్రవేశించారు తెలుగు వాఙ్మయంలో. అయితే ఇంగ్లీషు చదువులో వీరు పఠించిన (వలపును దాటుకొని పోయిన) ప్రేమగాథలు కొన్ని వీరిని గాఢముగా ఆకర్షించినాయి. వ్యుత్పత్తి బలమువల్ల మృదువై శ్రవణ సుఖాపాదకమైన శైలి ఈయన ప్రత్యేకశక్తి.. హెర్మిట్టు, డోరా అనే రెండు ఆంగ్ల ఖండకావ్యాల్ని విస్తరించి తెలుగులో రచించారు మునుముందు. ఆ మొదటి కావ్యము విస్తరించినదే `లలిత'. అందులో వీరు ప్రకృతి అంతటికీ ప్రవచించిన ప్రేమ తెలుగు చదువరుల్ని బాగా ఆకర్షించింది. లాలసనే కావ్యాల్లో చూడడము అలవాటైపోయిన తెలుగువారి చెవులకు శరీరకాంక్షకు దాటిన ప్రేమ కథనము అమృతప్రాయమైంది. ఆ రచనకు వచ్చిన ప్రశంసలవల్ల ఉత్సాహులై `తృణకంకణము' రచించినారు సుబ్బారావుగారు. దీని ఇతివృత్తము కల్పితము : "పొరుపెరుంగక యొక కంచమున భుజించి, సరసములైన వావివరుసల్ గలుగంగ నభేద రాగముల్ తిరముగ బాదుకో బ్రణయలీనులైన యువతీ యువకులు `దైవపుం బరుసముచే' నెడబాటు పొందవలసి వచ్చెను. ఆమె `అడుగులు బొబ్బలెత్త వదనాంచల మందుల చిన్కు చెమ్మటన్ మడగులు గట్టి, కసుమాలపు టెండలో' పురోప కంఠంబు నొఱసి నడుచుదారిలో, పడమటజాము ప్రొద్దు కనుపట్టు `వరకూ' ఇసుక దిగబడు నడుగులు నీడ్చికొనుచు `నడిచి ఒక చక్కని వనము

చేరింది! ఆయన గారు అటునుంచి ఆ వనమే ప్రవేశిస్తూ, `రుచిరవేణు నాళోదయ శ్రుతుల కంఠ స్వరము కలిపి, కాలాన్నీ, హృదయాన్నీ, తన బాధనీ మోహాన్నీ, భావాన్నీ తలుచుకుంటూ ఆమెను చూచాడు, ఆమె `ఆ జనసానురక్తినే లీల కృశింపజేసితి చెలీ' అని అడుగుతుంది. ఆయన `బాలా యేటికి మాటలెత్తినను నొవ్వంజేసెదు' అని ప్రారంభించి, కాలాన్ని ఎత్తిపోసి, `సరససాంగత్య సుఖవిలాసములకన్న దుస్సహ వియోగభరమె మధురము' అనీ `నష్టమైనట్టి ప్రేమ ఖండములకొక్క సుకవి యక్షర జీవగీతికయచాలు' ననీ యుద్ఘాటిస్తాడు. ఆమె గారు (పదియునాల్గు వసంతములే వలనట్టి వయసుది!) అస్ఖలిత ప్రణయానురక్తిని గురించీ, బొంది నటించు ప్రాణి హేయరక్తిం దగులూని ప్రేమరుచికి వెలియవుటను గురించీ, పడుచుదనముతో నుదయించి వలపులెల్ల జరా క్రాంతదశల కృశించుటను గురించీ, విశ్వమంతా వ్యాపించిన ప్రేమను గురించీ, ఉపన్యసిస్తుంది. ఆయన పాణిందెమల్చి, నెమ్మిగదుర స్పృశించి కొండొక వడినొక తృణకంకణము హస్తమున తొడిగి `మన ప్రేమ మధురలాంఛనం బిదియె' అంటాడు. ఆమె `వ్రేలివలపు టుంగరమును .... ప్రియసఖునికేల....' నలంకరిస్తుంది. `ఒండొరుల చూచుకొనుచు వారు తమయిండ్లు సేరనేగిరి."

ఈ కథలో వారి `పవిత్ర రాగము' కసుమాలపు కాలముకాక ప్రేమ భగవద్గీతలుపదేశింపను నుద్యుక్తుడైన కవికుమారుని తరుణలేఖినియే త్రెంపి పెట్టినదని ఈ నాడు నాకనిపిస్తున్నది. ప్రేయసులను సమావేశపరచి, యౌవన హస్తచాలనములతో `వాచామ గోచరంబున వారి ప్రేమ యొక్క బహిరంతర వ్యవస్థను సూచించి, సరళ సుందరమైన తృణ కంకణ ధారణము జరిపించి నీడలట్టుల వారినైక్యము చేసి, కనబడని దేవత జల్లిన అమృతాక్షతలవంటి పూలు జలజల రాల్చినారు కవిగారు ఆ జంట మీద. `ఒండరుల జూచుకొనుచు వారు తమ యిండ్ల సేరనరిగిరి; సమావేశ విప్రలంభాలు రెండూ ఉన్నాయి ఈ కథలో. ఈ కథ ఆనాడు నవఘే కాదు అభినవము!

కావ్యవస్తువేకాక రచనా పద్ధతి కూడా క్రొత్తదే అనిపించారు , యప్రోలు వారు. పురోపకంఠము, ఆనందరసము, లలితకురంగి, తరుచ్ఛాయ, స్కందకూలంకషము వంటి సంస్కృతపు మాటలు తెలుగుతో ధారాళంగా కలిపి పెట్టుతారాయన. బాధా శోకము, నిర్వేద తృష్ణాశోష, దురవస్థాలోకము, బాష్పజ్ఞాన విద్యార్థి, విగత కాలుష్యముదితము వంటి చిరుసమాసాలలో కావ్యభాషకు వారు కట్టే సంస్కృతపు గంటల మ్రోత స్ఫుటంగా వినబడవచ్చును గాని, అందెలరవళిక, కఠోర కంటకంపు పనులు, ఆనందరసము, ప్రాగభిముఖసరణి, మృదుల రవములు, లోలపవనాకుల

లతావలోకనము, చారుకుమార మృణాలకోమల స్ఫుటము, అనుక్షణ భిన్న భిన్న మృదువుల, అనురూప గుణ ప్రచుర, నవనీత శిరీష ప్రణయమృదుల హృదయ, చిరతరోత్కంఠ, వంటి ప్రయోగాలలో చక్కగా కలిసి పోయి శ్రవణ సుఖాపాదక మవుతుంది సంస్కృతము. సంస్కృత సమాస భూయిష్ట ప్రబంధ వాఙ్మయము వినివిని తెలుగువారు కవిలోని వ్యర్థ సంస్కృత జ్ఞానమును చక్కగా కూడా తీసుకొని లలిత, మోహన , ముగ్ధ, మధు, మృదుల, చారు, నవనీత, ప్రణయ, సుందర, మధుర పదములను తమ కవిత్వములో కూర్చి అభినవాంధ్ర కవిత్వమునకొక జిలుగుతెర నల్లి ఇచ్చినారు రాయప్రోలువారు. "హృదయ మోహనంబు ప్రేమ మృదులమైన, తావకీన లీలా సుధాదళ పుటంబు, మామకీన ప్రణయభంగ మధుకణాళి విడిచెడు, విరక్తి బాష్పముల్ విడుచుపోల్కి, వంటి పద్యములలో ఆ తెర జిలుగు చక్కగా తెలుస్తుంది. వీరి ఇతర కావ్యాలలో కూడా సంస్కృతపద నినాదమును చాతక కుమారి, సదమల దయాక్షీర మధురాత్మ, ఆ క్రాంత శోకదూష్యమాన మానసులు, సంధ్యాకుమారీమణీ మతల్లి, కుమారికామణీ వదనము, శుల్కాదివ్యాప్సరస, నవనీత భస్మము, నిశ్చల స్వర్గసంగీత నిలయము, రాజరాజకుమారి కా రత్నములు, నవనవానంద భావసుందర లతాంతములు, లసదభిజ్ఞానతరువులు, ఉదార కళా మోహనుడు, నవీన మధుర సుస్వప్నములు, చూపిస్తాయి.

వీరు గీతపద్యాలు ఎక్కువగా రచించారు. సీసములు చాలా కొంచెము. తర్వాతి కవులీపద్ధతిని చాలా పాటించారు. అవకాశము దొరికితే సంస్కృత పదమును ప్రయోగించడము అనే వీరి అలవాటుకూడా ఆకర్షవంతమే అయింది. తెలుగు పడి కట్టురాయికంటే సంస్కృతపు జిలుగుతెర లాభకారి అనే విశ్వసించారు కవులు. అయితే ఈయన భావాలు కూడా తెరమరుగుకు "నెచ్చటికో అదృశ్యమై" పోవడముకద్దు. కమల ఒడ్డాణము బచ్చలితీవకు తగిలి వేలాడుతున్నది. దానిని తాకి ఆమె కవి తప్ప `ఒరులెంచన్ రాని' చేతః స్పృహకాంచినదట! ఆ వెంటనే కవిగారేదో భావనా ప్రపంచంలోపడి" మొగలి పూవులు దేనెలన్ మొలవబోవు, కర్ణికారమునకు లేదు కమ్మదనము, శశినిశీథినీ ప్రియుడు, శోషకరుండు తరణి, యొకొక్క కళకొక్కస్థాయి కలదు" అని భావసమాధిలో పడిపోతారు. నాటక ప్రదర్శనములో నటుడు రసానుభవములో పడితే జరిగేదే జరుగుతుంది అని కవి కథ చెబుతూ పాఠకులను విస్మరించి తన దారిని తాను ఏవేవో భావాలు పట్టుకొని ఎక్కిపోతే. ఇక్కడి పద్యాలు రెండు తీసేస్తేగాని కథ దారిలో పడదనిపిస్తుంది నాకు. అయితే ఒక హెచ్చరిక చేయాలి నేను. రాయప్రోలు ఉపదేశించ నెంచినది ప్రేమ భగవద్గీతలను. ఈయన కావ్యాల కథలు- స్నేహలతాదేవి తప్ప- అన్నీ కల్పితాలు. లలిత, అనుమతి (డోరా) వ్రాయడములో ఈయన ప్రారంభించిన ప్రేమ శాఖలు, తృణ కంకణములో అప్రాప్త

ప్రేమ, `కష్టకమల'లో వికసించని ప్రేమ, `స్నేహలత'లో కుటుంబ ప్రేమగా విస్తరించాయి. ఈయన వ్రాసే నాటికి కన్యలకు పదియునాలుగు వసంతములు నిండకుండానే వివాహమయ్యేది. మరి ప్రౌఢ ప్రేమ వికాసమెట్లు జరుగగలదూ. కావ్యాలలో ఎలా ప్రవేశించ గలదు? కనుక వీరు వీలైనంత కల్పన చేసి పోగలిగినంత దూరం భావపథాలలో పోయినారు. అయితే కర్పూర ధూమరేఖలవలె కవుల భావాలు ఎట్లెటో సాగినట్లైతే వారికలలు మన అనుభవాలకు చేరువగా వచ్చినప్పుడు మాత్రమే మనకు కొంత అనుభవము కలుగగలదు. కానప్పుడు స్వప్నకుమారములో కవి చేసిన అన్వేషణమే మనమూ చేయవలసి వస్తుంది.

తృణకంకణము సమకాలిక పాఠకులలో చాలా అలజడి కలిగించిందట. దీనికి దోహదము చేసిన ఉద్యమము వీరేశలింగం పంతులుగారు తలపెట్టిన శృంగార కావ్యనిషేధము. శృంగార కావ్యములు అవినీతిని ప్రచారము చేస్తున్నవని గవర్నమెంటు వారితో వాదించి నాటి పండితులుకొన్ని కావ్యాల్ని నిషేధింపచేశారు కూడాను. గురజాడ అప్పారావు గారి వంటి మేధావులు గంటి సూర్యనారాయణ శాస్త్రిగారి వంటి అభిమానులూ ఈ పావిత్ర్య నటనకు అడ్డుతగిలినా శృంగారము ఉపాదేయమే అని నిరూపించగల రచనలేవీ చేయలేదు. సృష్టిలో `వలపుల పూలసంకెలలు బందములేయగ గువ్వజంట, నిర్మలమగు వత్సలత్వ మెదరాగిల నావుల తల్లిబిడ్డ, లే కలుషములేని సత్తణయ కాంక్షలు మేళన జేయ మిత్రముల్ "మెలిగేది ప్రేమవల్లనే అని ఉపన్యసిస్తూ జరగడానికి వీలుగా గోచరించే గాథలను కల్పించి, స్త్రీల అంగాంగ సౌందర్యమును కాక మొత్తపుటందాన్ని వర్ణిస్తూ, దీర్ఘసమాసములు కాక శ్రవణ పేయములైన సంస్కృత పదాల్ని ధారాళంగా ప్రయోగిస్తూ `మోహము వదలి' `ప్రణయమనీ' `లాలస'ను బహిష్కరించి `ప్రేమ'ను ప్రతిష్ఠించీ రూపొందిన వీరి కావ్యాలు మహాదరము పొందడము సహజము. ఆ ప్రోత్సాహ ఫలితముగానే "అభినవ కవితామండలి" స్థాపనము జరిగింది. జరగడానికి వీలుగా ఉన్నకథ, శరీరాలతో సంబంధములేని ప్రేమఉన్న ఇతివృత్తమూ , గ్రహించి ప్రబంధాలలోని ఒక్క ఆశ్వాసమంత ప్రమాణముగల చిన్న కావ్యములు అల్లడము ప్రారంభించారు కవులు. అభినవాంధ్ర సరస్వతీ ప్రారంభము అయింది. ఈ చిన్న కావ్యాలు ఒక శాఖా, కులకము (Poem)లనే పద్యమంజరులే ఉన్నది ఇంకొక శాఖాను. రాయప్రోలు వారిని తరువాతి కాలపు తెలుగుకవులు చాలా అనుసరించారు. అబ్బూరి వారి మల్లికాంబ, పూర్వప్రేమ, దువ్వూరి రామిరెడ్డిగారి వనకుమారి, చిన్న కావ్యాలు. వీరందరికంటే ముందుగానే కట్టమంచి రామలింగారెడ్డిగారు `ముసలమ్మ మరణము' అన్న చిన్నవిషాదాంత కావ్యము వ్రాసి ఉండినారు. రాయప్రోలు వారి రచనలు ఈ చిన్నకావ్యాల్ని మరింత ముందుకు తోసినవి. ఆ ఉదుటులో వచ్చాయి మరికొన్ని.

అయితే ఈ ప్రక్రియ వేరుతన్ని స్థిరపడలేదు. రవీంద్రుని ఖండకావ్యాలు సరస్సులో పద్మాలులాగా వికసించి సౌరభాన్ని విరజిమ్మడముతో తెలుగుకవుల ఉత్సాహము ఖండకావ్య రచనవైపుకు మళ్ళినది. అయితే గురజాడ వారి తేటమాటల రచనవైపు కాక రాయప్రోలు వారి అర్ధ సంస్కృత రచనా పాటవమే కవులను ఎక్కువగా ఆకర్షించినది. పూర్వ కాలము నుంచీ వస్తూండిన అలవాటూ, వ్యావహారిక భాషాభిమాన రాహిత్యమూ కారణాలై యుండవచ్చును ఈ మోజుకు.

భారతి, నవంబరు 1963.

# 2. విషాదాంత కావ్యాలూ - అబ్బూరి రామకృష్ణరావు గారు

ఆంధ్రం మీద ఆంగ్ల వాఙ్మయ పరిచయ ప్రభావము కట్టమంచివారి'ముసలమ్మ మరణం'తో ప్రారంభమైనదనిపిస్తుంది నాకు. ఆంగ్ల వాఙ్మయములోని కావ్యములను రామలింగారెడ్డి గారు అనుకరించారని కాదు. విషాదాంత కావ్యములు తెలుగులోనూ, సంస్కృతములోనూ ఎక్కువగా లేవు. ధర్మ విజయము చిత్రించడములో రచయిత చదువరులలో ఆదర్శాభిమానాన్ని పెంచుతాడూ, త్యాగాన్నీ బలిదానాన్నీ చిత్రించడములో కల్మషక్షాళనము చేస్తాడు. ఇవి రెండూ రచయితకు రెండు కళ్ళు. రెండో విధపురచనలు మనకెన్నోలేవని గుర్తించి రామలింగారెడ్డిగారు 1899వ సంవత్సరములోనే"ముసలమ్మ మరణము" అన్న చిన్న కావ్యమును రచించినారు. బుక్కరాయ సముద్రమనేపల్లెలో ఒకప్పుడు ఆకాశము తూటు పడిందా అన్నట్టుగా వానలు వచ్చినవి. ఆ యూరి చేరువనున్న సరస్సు కట్టతెంచుకొని ఊరిని కబళించునేమోయని జడిసి, ఊరివారు పోలేరమ్మకు పొంగళ్ళు పెట్టి ప్రార్థించారు. ఆకాశవాణి `బసిరెడ్డి కడకోడలు ముసలమ్మ బలిగా పోయినచో మీకు కష్టము కలుగదని' చెప్పినది. ఈ వార్తను తెలుసుకొని పాప మాబాల భర్తతోనూ, అత్తమామలతోనూ చెప్పి బిడ్డను భర్తకప్పగించి ప్రజలను దయచూడమని శుభమూర్తి శివునకు మ్రొక్కి చెరువునీట ప్రవేశించెనట. నాకేమో రెడ్డిగారి వంటి ఉపజ్ఞావంతులు పారంపర్యముగా మరొక రూపముతో వచ్చిన కథను ఈ రూపముతో రచించడము నచ్చలేదు. నిండిన చెరువును చూడవచ్చినవారిలో ఒకరికి పూనకమువచ్చి `గర్భిణీ స్త్రీని బలిఇచ్చిననే గండిని పూడ్చుటకు - గండిపడినదనే కథ - సాధ్యమౌనని చెప్పినట్లునూ, ఆ వార్తను విని ముసలమ్మ పేరిట చిన్నది తానే బలి కావడానికి సిద్ధమైనదనీ, ఆమెపోయి గండిలో కూర్చోగానే ఊరివారందరూ రాయీ బెడ్డామట్టీ విసరి గండిని పూడ్చిపెట్టినారనీ నేను విన్నకథ. రెడ్డిగారి కథవింటే `ఆకాశవాణికి బసిరెడ్డి కోడలుపైన అనుగ్రహము ఎందుకు కలిగినది?' అన్న ప్రశ్నా, దాని వెనువెంటనే`పాపము ముసలమ్మ బ్రదుకుతోపాటు ఆమె చేసిన ఘనత్యాగము కూడా బుక్కరాయ సముద్రము నీటిపాలై పోయినదే" అన్న విషాదమూ ఆవరించాయి నాకు.

రెడ్డి కోడలు ఘనత్యాగాన్ని రెడ్డిగారు పల్చన చేశారేమో అనిపించింది. నిజమేదయినప్పటికీ, కట్టలో అసాధారణపు వంపు ముసలమ్మ కట్ట-తో అనంతపురపు చెరువుకట్ట నేటికీ ముసలమ్మ త్యాగాన్ని చూపిస్తోంది.

రెడ్డిగారు సంస్కృత సమాస జటిలమైన శైలితో, ఉత్ప్రేక్షలతో, సీస పద్యాల వర్ణనలతో, వచనాలతో `దేవా యవధరింపవలయు' వంటి పురాణపు హెచ్చరికలతో, పాత పద్ధతిలోనే రచించినప్పటికీ, వర్ణనలు నడిపే ఉత్సాహముతో కథన చైతన్యమును జార్చి వేయక, బిగుతైన మాటలతో కథా ప్రకారమునకు వెలిగాని భావములతో రచించినారీ కావ్యమును. అయితే, వ్యక్తుల భావదౌర్బల్యమును తత్వ దర్శనముతో వెలిగించగల మేధావసుపు ఆయన. కనుక పిచ్చి నమ్మకాల గుండెలను చీల్చే సన్నివేశము ఈ కథలో లభించినా ఆయన ఆ సన్నివేశాన్ని, ఆ ఉద్దేశ్యముతో సానబట్టక చిరునవ్వుతో దాటుకుపోయినారు. వారి పలుకులన్నీ మానస పుత్రికలేఅయి హృదయాన్ని స్పృశించయత్నించలేదు. ముసలమ్మ బిడ్డను ముద్దాడునపుడు మాత్రము జాలి వేస్తుంది. `అయ్యో పాపము' అని. `ముసలమ్మ మరణము' ఈ పేరు అనాకర్షకమౌటవల్లనో, ఇది ఇటీవలి ప్రబంధములో ఒక ఆశ్వాసమువలె కానవచ్చుటచేతనో, నవ్యత ఎంతో మెరవక పోవుటవల్లనో, ఎక్కువగా ప్రచారము కాలేదు. దుఃఖాంతమౌట వల్ల కాదనుకుంటాను. ఆశు కవిత్వ ప్రచారము కొంత కారణమై యుండవచ్చును.

అయితే రెడ్డిగారి శుభ ప్రారంభము విషాదాంతగాథ, కావ్య రచనలో రాయప్రోలు వారి డోరా, కష్టకమల, తృణకంకణము, స్నేహలతా దేవి; అబ్బూరి వారి మల్లికాంబ, నదీసుందరి: రామిరెడ్డి నలజారమ్మ వంటి కావ్యములుగా రూపొంది అందగించినది.

గురజాడ వారి పూర్ణమ్మా, కన్యకా విషాద సౌందర్యాన్ని కాక, సందేశాలను వహించి సాగినట్టివి. పై కావ్యాలలో సందేశము చాలా చాలా గౌణము. రాయప్రోల వారి స్నేహలతా దేవి విషాద సౌందర్యసాధనకే ఎక్కువగా రూపుదిద్దుకొన్నదంటాను. అందుకే కావ్యార్థ సూచిగా `నిత్య సాంధ్యకుమారీ మణిమతల్లి కట్టుచీర చెరంగులు కాలుపోల్కి' అని ప్రారంభించింది.

అబ్బూరి రామకృష్ణారావుగారికి రామలింగారెడ్డిగారి సాంగత్యము మైసూరులో సమకూడినది. `ముసలమ్మ మరణము'లోని అన్యాయమును బట్టి స్ఫురించిన వేరొక అన్యాయమును చూపుటకని వారు `మల్లికాంబ'ను రచించినారు. రెడ్డిగారు బ్రౌనుదొర ప్రచురించిన `అనంతపుర చరిత్ర'లో నుంచి ముసలమ్మకథ గ్రహిస్తే ఆంగ్లపత్రిక నుండి రామకృష్ణారావుగారు `మల్లికాంబ'కథను గ్రహించారు. అసలు

కథను ఈయన మార్చినట్లున్నది. మల్లికాంబ, కమల స్నేహితులు. కమల తన ప్రియుడు వ్రాసిన ఉత్తరాలను `కోరికలు చెడునేమో యని మల్లికాంబకు దాచనిచ్చెను. మల్లిక "నాదు భర్తకును కూడా దొరకని రహః ప్రదేశమందు "దాచి యుంచెదనని ఆమె కభయమిచ్చెను. ఇక్కడ భర్త చూచినచో? అన్న కావ్యార్థ సూచియగు అనుమానము మనకు మెరపు కొట్టుతుంది.`మల్లికాంబ కమల ఉత్తరములను `ఒక మోహనంపు పేటికన్ బరులెరుగని విధమున డాచెంగాని గ్రహించెనది మల్లికాంబ భర్త! అతడా జాబులను చూచుటా, బాధపడుటా, కత్తితో భార్యను చంపనేగి భార్య సమీపమున విలపించుటా, అతని ఉద్యమము గ్రహించి మల్లికాంబ `అసువులు బాయుట' కొన్నాళ్ళకు కమల తన జాబుల కొరకు వచ్చుటా, అతడు నిర్విణ్ణుడై `ఎక్కడికో' పోవుట ఇదీ కథ. రెడ్డిగారి కథలోని విషాదమును ఆయన గారి నిశితమైన ఆలోచనలు పరిహరించెనంటిని. ఈ కథలోని విషాదమును, ఈయన మెత్తని రచన చక్కగా కప్పి పెట్టినది. కథలోని వారందరూ ఈ లోకపు వ్యక్తులు కారు. మరి కవితాలోకపు వ్యక్తులు. నా దృష్టికిది `కవిత్వపు ఓపెరా' అనిపించింది. ఓపెరాలో కథాగమనానికంటే నృత్యగానాదుల కెక్కువ స్థానము. దీనిలో కవి ఊహ పావురపు రెక్కల చప్పుడుకొక ఉదాహరణము `పాడి పాడి కోయిల తన గూడు కట్టించింది ఈయన భావనా సైరంధ్రి! ఇంకొక ఉదాహరణము : ఉత్తరాల కోసము వచ్చిన కమల "వచించునొక్క విషయమ్మునకు ఎన్నియో వింత యర్థముల్"తోచినవట మల్లికాంబ భర్తకు! కవితావ్యక్తి మరి! పగిలేగుండెని చేతితో పట్టుకొని కవి చెప్పినట్లు వింత అర్థాలు తోపించుకోవలసినదే, కవిత్వాలూ రాయవలసిందే! రాశాడు లేఖలో! ప్రబంధ కవులు ఉత్ప్రేక్షలూ, భ్రాంతిమంతాలూ, అతిశయోక్తులూనింపి రచిస్తే ఈయన అర్థాంతరన్యాసాలు సమాసోక్తులూ విరజిమ్మి రచించారు. కథయొక్క జాలి పలకరింపుల కంటే రచనా కోలాహలము లావై పోయింది.

దువ్వూరి రామిరెడ్డి గారి `నలజారమ్మ అగ్ని ప్రవేశము' కూడా ఈ విషాదాంత కావ్యములలోనిదే. రామ లింగారెడ్డిగారి `ముసలమ్మ మరణము'లో రెడ్డిపడుచు చేసిన ప్రాణ త్యాగము రామి రెడ్డిగారి చేత అలాంటిదే అయిన ఈ కథ చెప్పించింది. అయితే ముసలమ్మ మరణము కంటే నలజారమ్మ భర్త మరణము చాలా విడ్డూరముగా ఉన్నది. పక్కపొలములో జొన్న కంకులు కోసుకున్నందుకు`తురుష్క భూపతులు మాట లతిక్రమణంబు సేయగా జనదని'న్నీ, ఒక మానిసి చౌర్యముసల్ప గొర్తయే దవిలిన శిక్షయయనిన్నీ నిశ్చయిస్తే నలజారమ్మ భర్త ఆత్మహత్య చేసుకోడానికి వెళ్ళిపోతాడూ, ఆమె గుండానబడుతుంది! ఈ కావ్యములో రామిరెడ్డిగారు ప్రబంధ పద్ధతిని మురాంతక, విఘ్నపతి, నల్వారాణి, స్తుతులూ, సత్కవిస్తుతీ, కుకవి నిరసనమూ, గోపుర సమాశ్రితపుర - భూసురోత్తమ, వైశ్య, హాలిక - వర్ణనలూ

చేస్తూనే ప్రారంభించినా, రామలింగారెడ్డిగారి వర్ణనా పద్ధతులు నచ్చడము వల్ల కాబోలు స్వాభావిక వర్ణనలు కూడా చేశారు. గాంధి మహాత్ముడు రాకముందే రాట్నము త్రిప్పించారు ఈనాటి హాలికుల కాంతలచేత. ప్రకృతి వర్ణన పట్ల ప్రబంధరీతులవైపే వీరి మొగ్గు; ఉత్ప్రేక్షల కోలాహలము ఎక్కువవైపోయినది.

రాయప్రోలువారి కావ్యాలతో అభినవ కవితామండలి స్థాపన అయింది. పత్రికలలో జి.వి. కృష్ణారావు గారు, చెన్నా ప్రగడ భానుమూర్తిగారు, ఇతరులూ ఆంగ్ల కవుల ఖండ కావ్యాల్ని తెలుగు చేయడము ప్రారంభించారు. గురజాడ వారి తేటతెలుగు భాషనుగానీ, మాత్రచ్ఛందములను గాని, సహజ వర్ణనలు గాని సందేశ గర్భిత కథానకములను గాని వారి తరువాతి వారనుకరించినట్లు కానరాదు. రాయప్రోలు వారి పద్య ప్రవాహ మాధుర్యమూ, హ్రస్వ సంస్కృత సమాస వైవిధ్యమూ, ప్రేమ గీతోపదేశమూ, విషాదగాథాకథనమూ, కొత్త కవులను ఆకర్షించి, వారి దారిలోనికి మళ్ళించినవి. రచనలు కూడా రాయప్రోలు వారి పద్ధతిలోనే పెరిగినవి కథా కావ్యాలూ, ఖండకావ్యాలున్నూ.

అబ్బూరి రామకృష్ణారావు గారి `పూర్వ ప్రేమ - ఊహాగానము' అన్న రచనలు ఈ నిజానికి మొదటి ఉదాహరణలు. వీరి అధ్యయనము కలకత్తా- మైసూరులలో ప్రవాసములో జరిగినది. ఈ కాలములో తెలుగునాట `నవ్య గీతా శుభాధ్యయనమ్ముజేయు సోదర కుమారకుల' ఉత్సాహమునందుకొని వీరూ కావ్య రచన చేశారు. ఊహాగానము అన్న పద్యమంజరుల సంపుటియే వీరి తొలి యత్నమని పీఠికను బట్టి అనిపిస్తోంది. దీనిలోని శీర్షికలు గురజాడ వారి ఖండ కావ్యాల కంటే వైవిధ్యము హెచ్చుగా గలిగినవే కాని, వాటికున్న కావ్యత్వసిద్ధి వీటి కన్నిటికి లేదు.

కావ్యము యొక్క ప్రమాణము ఎంతది అయినా, దానిలోని కథకుగాని, భావానికి గాని అవిరతి ఉండాలి. చదువరి పఠనము ప్రారంభించినప్పటినుంచీ ఆ కావ్యము ఆపేక్ష కల్పిస్తూ,తనకు జీవమయిన భావము చదువరికి కలిగేదాకా లాగుకుపోయి ఆ భావావేశములో వదలాలి చదువరిని. గురజాడ వారి ముత్యాల సరములు, లవణరాజుకల, కన్యక, డామను పిథియసు, పూర్ణమ్మా, లంగరెత్తుము, అలాంటి కావ్యాలు. వాటిలో ఒక్క పద్యము తగ్గించినా చదువరి భావ శ్రేణిలో ఒక మెట్టు తగ్గినట్టే అవుతుంది. వాటిలో సూత్రములాగా సాగిపోయే భావమునకు విరతీ విచ్ఛేదమూ ఉండదు. కనుక చదువరి కూడా ఆ భావ స్రవంతిలో ప్రయాణించి చివ్వర తన్మయుడై సద్యఃపర నిర్వృతి చెందగలుగుతాడు. ఆంగ్ల కవులు కీట్సు, బైరను, వర్డ్సు వర్తు రచించిన ఖండ కావ్యాలు కూడా ఈ జీవము గలట్టివే. మన శతకాలలోని పద్యములకు ముఖ్యముగా కాళహస్తీశ్వర శతకములోని చాలా పద్యాలకు

దేనికి దానికి చదువరికి భావము కలిగించే గుణముంటుందికాని- జెండా పరుగుపందెపు వేగమువలె - ఒక భావానికి దానికంటే పై మెట్టు కూర్చే భావమూ, దానికి అంతకన్న పై అంతస్థుకు లాగే భావమూ చేర్చుకుంటూ చదువరికి ఏకాగ్రతా, తన్మయతా కలిగిస్తూ తీసుకుపోయి, అతనిని భావనా ప్రపంచములో విసరగల కావ్యత్వసిద్ధి ఆ పద్యాలకు ఉండదు. చాటూక్తులకూ అంతే. వాటిలో భావాలుంటాయియీ, ఆ భావాలకు మన హృదయాలు జల్లుమంటాయి. అయితే అవి పూల గంపలు, హారములు కావు. స్వరజతులు, రాగములు కావు. స్కెచ్చిలు, సమావేశ చిత్రాలు కావు. పద్యమంజరులకూ, స్వరావళులకూ రంజకత్వము ఉండవచ్చును కాని, కళాసిద్ధిలేదు. రచయిత భావావేశాన్ని చదువరికి సంక్రమింపజేయగల వరుసతోనూ, శక్తితోనూ వెలువడు భావాలుగల రచనయే ఖండ కావ్యమౌతుందిగాని , ఖండకావ్యాలు కూర్చిపెట్టిన పద్య సమూహము కావ్యము కాజాలదు. చిన్నదైనప్పటికీ ద్రాక్షాపండు ఫలమే. మేటెడైనా మామిడి పండ్ల ముక్కలు పండ్లు కావు. పద్యమంజరులు, ఖండకావ్యముగా కూడిననే వాటిచేరికకు కావ్యత్వసిద్ధి చేకూరుతుంది. లేకుంటే వాటి చేరిక సార్థకము కాదు. అవి నాలుగైనా, అయిదైనా, వంద అయినా అవి పద్యాలే అవుతాయి. కావ్యములు కాలేవు. కులకములన్నవి గుప్పెడు పద్యాలూ, దోసెడు పద్యాలూ, బుట్టెడు పద్యాలూ, తట్టెడు పద్యాలూ కావడంలో శోభలేదు. చిన్నదండా, పెద్దమాలా, వనమాలా కావాలి కులకములు. అప్పుడు వాటికి కావ్యత్వసిద్ధీ, నిత్యత్వమూ సిద్ధిస్తుంది. ఎవరు ఎప్పుడు చదివినా అవి సద్యఃపరనిర్వృతి కలిగిస్తాయి.

అబ్బూరి రామకృష్ణారావుగారి `కాపుపాట', `సోదరస్మృతి' (మూడోపద్యములేని) బాల్యస్మృతి' ఖండకావ్యములనిపించాయి నాకు. సాధుగీతి "Where is thy market my song, where is thy market" అన్న రవీంద్రుని ఖండకావ్యములో రెండు భావాల్ని వేర్పరచి ఇచ్చినట్లున్నది. ' భవతి ! భిక్షాందేహి!'లో మొదటి పద్యము లేకపోతే, రెండోది జన్మ భూమికి తిరిగివచ్చే తమకమును చక్కగా చూపిస్తుంది. మొదటి దానితో చేరితే దానిలోని నిస్పృహతో చేరిన రెండో పద్యము కాందిశీకుని తత్వము చూపిస్తోంది నాకు. `తిక్కన సోమయాజి' నాలుగు పూలపూజ. `అరవిందఘోషు' మూడు పూల పూజ. `అప్రాప్త మనోహరి'కి అని శీర్షికను కూడా కావ్యవస్తువుతో ముడిపెట్టక ఆ `అప్రాప్త్యము' ఎట్లు వచ్చినదో కొద్దిగా ముందు సూచించి, ఈ పద్యాలకు దారితీసే భావాలు కొద్దిగా వినిపించి ఈ భావాలు వినిపిస్తే ఇది ఖండ కావ్యము అయిఉండును. ఇప్పుడిది అలాంటి ఖండకావ్యపు కొసాఖండము అనిపిస్తోంది నాకు. `మహాకవి తిక్కన'లోని రెండో పద్యము మూడోపద్యమూ, ఆరోపద్యములోని ప్రశ్నలు మొదటి పద్యపు `విసుగు'ను భావశయ్యలో ప్రవహించనీయక

గట్టుకొట్టేస్తున్నాయి. ఏడో పద్యములోని ఆత్మ పరీక్ష లేకపోతే నష్టమేమీ లేదు సరిగదా- తిక్కనను గురించిన భావాలు ముందుకు ప్రవహించడానికి ఇప్పుడున్న అడ్డంకి తప్పుకుంటుంది. `పుస్తక సాంగత్యము' మూడు పద్యములు దాటి తెగింది. తరువాత నాలుగు పద్యాలదీ ఇంకొక దారి.

అయితే, ఆ కాలానికి తెనుగులో పద్యాల ఉపజ్ఞానిర్మితములగు ఖండకావ్యములు రాలేదు. ఇలాటివే తొలి ఖండ కావ్యములు. రామకృష్ణ రావుగారు "స్ఫురించు తలంపులనెల్ల జెప్పనోపని తమి" వల్ల తన నుడులు ఉండవలసినట్లు లేవని అనుమానించారు. నాకు చూడగా`చెప్పనో పని తమి' వల్ల కాదేమో, దిద్దితీర్చని ప్రాలుమాలిక వల్లనేమోననిపిస్తుంది. తమియుండినదేమో నిజము. `స్వాదు కృష్ణానదీ జల స్నానములను పులక లొలయగ వినయాంజలుల ఘటించి, నవ్యగీతా శుభాధ్యయనమ్ము జేయు సోదర కుమారకు లెదురు చూచుచుందు"రని ఈయన మరలివచ్చినారు. ఆర్ద్ర హైందవ రీతులను భావపుష్పిత నవ్య శయ్యారీతులలో పాడ నుద్యమించినారు. అధ్యయన కాలములో నీయన గీర్వాణాంగనా జైత్ర నిధ్వానములనాసక్తితో ఆలకించినారు. అయితే మహా కవి తిక్కన మహనీయగాన రమణీయతను వీనుల గ్రోలియుంటచే వీరిలో సంస్కృత సమాసపు లౌల్యముకాక, భావబంధుర రచనాసక్తి మించినది. రాయప్రోలు వారి సంస్కృత సమాసపుబుటాల జిలుగు తెరనుగానీ, గురజాడ వారి తేటమాటల శైలిగానీ వీరు అవలంబించక తెలుగుపదముల మందగమనముతో శ్రోణీభారాదలస గమనయైన పలుకుబడిని అలవరుచుకొన్నారు. కళ్ళెములను సడలించక తనకు కావలసిన దారిలో నడిపేరు పద్యపు గుర్రాల్ని. నాటికీ, నేటికీ సౌరుమాయక ధవళ గోవ్రాతపు గృహగమన సౌందర్యాన్ని నింపుకున్నవీరి శైలి నవకవుల పంక్తిలో వీరికి పీట వేసినది. ప్రవాసములో నుండి పుట్టినింటి ప్రేమను తలుచుకుని కలలుగన్న కారణముచేత కాబోలు కన్నులకూ, వీనులకూ అందిరాని సౌందర్యాన్ని భావనా సువర్ణ వాగురులచే పట్టి లాగడము వీరికి అలవాటయింది. గంభీర గంగానదీ శీతగర్భమున నడంగిన గానమూ, గాలినడగిన కోయిల కూతా, పూయని పూవులం దణగు పుప్పొడి సుగంధమూ, నడియెండల బారిపారి సోలెడు హరిణాంగనను కవుగిలించెడు నీడల చల్లదనమూ, మాతృశౌదముల క్రేవన్ నల్లనై పోయి కానుపింపని రెల్లుపూల ధావళ్యమూ, పలుకలేని పూవులమౌనమూ, సందె చీకటుల్ మూయని వేళ శ్యామల నభోమణి యందలి కానరాని తారాయువదీప్తులూ వీరి భావనాబలమువల్ల నవ కవిత్వములో నిక్షిప్తములైనవి. తన దృష్టికందిన కొత్త అందాలు విడివడు టోర్వజాలని నవీనమనః ప్రణయాలూ, నర్మదా శుభ్ర వీచీకణమ్ములందు నిండిన ఋషుల స్వమాతృస్తవములూ, గుమ్మడి పూవు తేనియల మాధురులూ, హిమవదుపాంతపుం

బొడుపుటేళ్ళ సితాంబువులం గదల్చు హంసములూ, ఆరిపోయిన బయళ్ళ నొకప్పుడు ప్రవహించిన ప్రవంతీజలమూ, ఈయన మనకు చూపించారు. విశేషించి మన దృష్టికి తగలని "తెల్లగ"నల్లగా నల్లిన ఆనందవస్త్రాలూ, కవి ప్రేమ పుష్పింపగాజేయు కృష్ణా ప్రవంతీ తరంగాంతరంగమూ, రాగారుణమైన చింతా ఝురుల్ వారునాత్మా, కనబడని భావముల సువాసనలూ, కోరికల జిక్కువడిన మూర్ఛల మనమ్ములలచు నార్తుల సందేశములూ, గుర్తించి చెప్పినారు. కాబట్టి "స్ఫురించుతలంపులనెల్ల" ఈయన చెప్పనోపరన్నది నమ్మడము కష్టము. "అయితే వీరి పద్యమంజరులకు నిండు సౌందర్యమేల సమకూడలేదూ?"అన్న ప్రశ్నకు "నవ్యరీతుల"లో యత్నించి పాడనుంకించిన తమకము యొక్క ప్రాలుమాలికవల్ల" ననిపిస్తున్నది నాకు.

'ఊహాగానము' 1918వ సంవత్సరములో వచ్చినది. అప్పటికే అందులోని పద్యములు చాలా వరకూ రెండు సంవత్సరముల ప్రాయముగలవి. రాయప్రోలు వారి తృణకంకణమూ, గ్రంథాలయ సర్వస్వములో దేశభక్తి పద్యాలు, ఆంధ్ర భారతిలోని ఖండకావ్యాలూ వచ్చాయి. "పూచియు పూవకున్న సుమముల్ సుడిగాడ్పుల విచ్చుపోల్కి, స్వేచ్ఛా చలనమ్ములందు నవశమ్మగు లేత మనమ్ముతోడ, చెల్లాచెదరైన సాధనములన్ దమకమ్మున చక్కబెట్టుకోజూచి" నారు కవి కుమారులు చాలామంది. వారిలో అబ్బూరి రామకృష్ణరావుగారొకరు.

వీరి వర్ణనా పద్ధతి అటు సంస్కృత పద్ధతినీ, ఇటు ఇంగ్లీషు పద్ధతినీ తెచ్చుకుని తెలుగుతో పేనుకొన్నట్టిది. సంస్కృత కవిత్వములో అన్వయమునకు కర్త కర్మ క్రియ వరుస అంటూ విధించే నియమము లేదు.`ఇవమానదండ:' చివ్వరికి తోసినా ఆక్షేపణలేదు సంస్కృతములో. రామకృష్ణరావుగారు "మిన్నుల బాడగోకిలల్ గాలినడగిన కోకిల గానమట్లు" కేళీలోలవై యుండగన్' `నయవేత్తల్ `భారత మహాహవమందలి జీవగీతులన్' అన్న తునకలను పద్యాల చివరకునెట్టి సంస్కృతాన్వయమును తెలుగులోకి దింపినారు. పావనరాగము, హృదయపదము, పలుకరానిగీతికి, పొడుచువెన్నలతేట, (కవితా) మాధురి, పూనవ్వు, కోకిల పాట, వాహినుల పాట, కవుల పాట, రాగములు పుష్పింపంగ, గానముల్వెదజల్లు, లేతమనమ్ము, వెన్నెలలు రాలు (ట), ధోరణులు చిమ్మెడు మాధురులు, వికసించిన వెన్నెల, బాధామలినమ్ములు, వంటి ఆంగ్లకవితా సంప్రదాయాన్ని ప్రవేశపెట్టి కావ్యభాషను అటూ పెంచారు

అయితే సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర సంప్రదాయాల్ని కలిపి నవ్యరీతులలో పోతపోసే తమకములో ఖండకావ్యాలలోని భావము సహజంగా నిర్విరామంగా సద్యః పరనిర్వృతి కలిగించేటట్లు సాగిపోతోందా లేదా అని చూసుకునే చిన్న మెలకువ జారిపోయిందనుకుంటున్నాను. లేకుంటే సాధుగీతి రెండు పద్యాలతో ఆఖరవదు.

ప్రణయ శాంతి ' తెలిసిన తలపులతో తెలయుని భావము వైపు వేలు చూపించుతూ ఉండడు. `భవతి భిక్షాందేహి' తొడిమలెడసేయగా రాలిపడిన పూలవలపులేవి?' అని భావాన్ని మబ్బుల వెనక్కి విసరక, `తొడిమలెడయైన పూలెట్లు యెడదవలపు పడయనౌను భిక్షాందేహి భవతిభవతి ' అనో ఇంతకంటే ఇంపైన విధంగానో రెండో భాగముతో మేళవించి యుండును. కాపుపాటలోని రెండో పద్యము "వ్రాలిన సంజలన్ మరలి వచ్చెడు గోవుల పాలు తీయగా తోలెడుదాక, త్రాడులను దుత్తలు నావలబెట్టి, సిగ్గులన్ సోలెడు చిన్నదాన, యెటుచూచిన నెవ్వరులేని చోట యుయ్యాల నెక్కియూగ మనసయ్యెడు నీవును నేను వేడుకన్" అన్నది ఇప్పటివలె "వ్రాలిన సంజలన్" అని ప్రారంభిస్తూ అన్ని సంజలనూ పేర్కొని, "ప్రేయసి లేచి రమ్ము ' అని ఆహ్వానించిన కుమారకర్షకుని తమకమును అనవసరంగా సంజలన్నింటికీ పరచి పల్చనచేయక వ్రాలెడు సంజలో' అని నడిచి ఆనాటి కాలవిరామాన్ని మట్టుకు పేర్కొని, మూడో పద్యములోని ఊహకు దారిచేసియుండును. `అరవిందఘోషు'లోని మూడో పద్యము ఊరూ పేరు లేని రాయచూరును కాక ఏ ఇంద్ర ప్రస్థమునో పేర్కొని యుండును. "మహాకవి తిక్కన" మొదటి, మూడో, ఆరో, ఏడో, పద్యాలు విడిచిపెట్టేసి ఇప్పటి అనవసర సంచారమును మాని తిక్కనమీదనే దృష్టిని నిలిపియుండును. `బాల్యస్మృతి రెండో, మూడో, పద్యాలు పడవేసి రూపుతీరి నిలబడియుండును. `మాతృప్రేమ', ప్రశ్నలను మోసినదెవరు ? అనే ప్రశ్నకు"శీర్షికనైన నేను" అని అనడానికి మాత్రమే కాకుండా కావ్యరూపములోనే తలాతోకా కనబడేటట్టు ప్రవేశించి యుండును. క్రొత్తదనము సాధించే తమకములో 'రచనా జాగరూకత సడలినట్టు `తొడిమ లెడసేయగా రాలిపడిన పూలవలపులేవి?' అన్వయమైత్రి అందుకోసే `ధవళగోవ్రాతము, నవనవనీతము, ఒక్క `మావి రేడు'కు `నీవు నేనును ' అని ఇద్దరిని పోల్చడమూ "సంపాదివై.... నా యెద కానందము గూర్చు లక్ష్మి విడిపోయెన్" అనడమూ కూడా తెలుపుతున్నాయి.

రాయప్రోలు వారి `ప్రేమ' ప్రచారము వీరినీ లోగొన్నది. నాలుగు పద్యాలు వ్రాసి వీరు "అప్రాప్తమనోహారికి"చ్చి తరువాతి కవుల అప్రాప్తమనోహారికి మూలవిరాట్టును సృష్టించారు. మృత ప్రేమ, క్షణిక ప్రేమ, పూర్వ ప్రేమ, అన్నవి ప్రేమ వృక్షమునకు వీరు చేర్చిన కొత్త శాఖలు. రాయప్రోలు వారి"హేయరక్తిం దగులూని ప్రేమ రుచికి వెలి" కాకూడదనే సందేశము వీరి "మోమున మోముజేర్చి నిను ముద్దిడు కోరికలేదు, నీదు వక్షోమృదుశయ్యపైని శిరసున్ గెడవాలిచి, వ్రేలు మల్లికాదామ సువాసనామధురతల్పరికింపగ గాంక్షలేదు, నా ప్రేమకు దారిజూపగ వరించితి నాయలరించు నెచ్చెలీ"లో చిత్రమైన దారి తొక్కింది. ఏమీ అక్కర లేకపోయినా అన్నీ ఉన్నచోట చూచుకొని వరించినా డీయన సృజించిన ప్రేయసుడు! అన్నాడు గదా యుగంధరుడు అందుచేతే పాడు పొట్టకు అన్నమే వేతామురా' అని?

రాయప్రోలు వారి `నిండారబారు' పద్యాలు వీరికి గట్టిగా తాకినవి. అందులో గోదావరీ, తుంగభద్రా ఉన్నవి. • వీరు కృష్ణా ప్రవంతీ తరంగాంతరంగము, కృష్ణవేణీస్తవము, స్వాదు కృష్ణానదీ జలము, కృష్ణవేణీ తరంగిణీనున్న ఝరి, పాడుబడిన కొండల (పి. డబ్ల్యు.డి. వారు కంకరకోసము కొట్టిస్తే పాడుపడిన కొండలై యుంటాయి ఇవి. ఈనాడున్నాయి ఇవి విజయవాడలో.) సమీపమున బారు కృష్ణవేణి విషాద సంగీతగతులు వినిపించి వినిపించి కృష్ణామల తోయమందలి ప్రశాంతపు `రాగము' (!) లు కవితా మృదూక్తుల నాప్యాయము చేయుటలో తిక్కనగారి మహనీయ గాన రమణీయతతో సరిపోలునని సూచించినారు. రాయప్రోలు వారి `పాడైన పెనుకోట గోడలు' కాకతి ప్రాభవమ్మునకు శయ్యలైతే వీరికి `రాయచూరు విభవమ్ముల నిల్చిన జీర్ణ భిత్తికలు, ఉదాత్త పూర్వ కథాగాయకులైనాయి. రాయప్రోలు వారి `వృద్ధ వృక్షము' హరిణిపుత్రి, హిమకుమారుడు వంటి ఆంగ్ల కవితా సంప్రదాయపు ప్రయోగము లీయనకు నచ్చినవి. సోదర కుమారకులు, బాల వెన్నెలలు, యువదీప్తులు, గీతాకుమారులు వంటి ప్రయోగములు చేసినారు. రాయప్రోలు వారి అప్రాప్త ప్రేమ' అసంపూర్ణ ప్రేమ'లకు వీరు పూర్వ ప్రేమలో ఈ జన్మానికి సంబంధించని పూర్వజన్మము నాటి ప్రేమను కలిపారు.

`పూర్వప్రేమ' అన్నది ఒక కావ్యఖండము. దీనిలో పూర్వ కథా అనంతర కథా విడువబడినవి. లక్ష్మీంద్రుని వేహుళ వివాహమాడి, అతనిని తొలిసారి కలుసుకున్న రాత్రిలోనే అతడు మనసాదేవి శాపమువల్ల సర్పదష్టుడై మరణించినాడు. ఆమె సావిత్రిని మించిన సాధ్వీశీలముతో అతనిని పునర్జీవితుని చేయ నుద్యమించి, ఈ కష్టమునకు కారణమైన మనసాదేవిని స్తుతించినది. ఇదీ కథ. దీనిని వేహుళ యొక్క పూర్వ ప్రేమను చూపే ఉద్దేశ్యముతోనే ఖండముగా రచించారనిపిస్తుంది. లక్ష్మీంద్రుని తండ్రి కులక్రమానుగతమైన మనసాదేవ్యారాధనమునుమాని ఎన్ని బాధలు పెట్టినా మారకపోవడమువల్ల మనసాదేవి లక్ష్మీంద్ర కుమారుడు శోభనవేళ రాత్రి సర్పదష్టుడై మరణించునని శపించిన కథా, శాపమును తప్పించుటకని లక్ష్మీంద్రునికి ఇనుపమేడ నిర్మించుటా, మనసాదేవి దానిలో ఒక రంధ్రమును కల్పించుటా కవిగారు `పూర్వకథగా చెప్పెశానన్నారుకాని, కావ్యములో చెప్పలేదు. వేహుళ మనస్తాపమును ప్రారంభించినట్లు చూపినారుకాని అనంతర గాథను చెప్పలేదు. కనుక కేవలము వేహుళ పూర్వప్రేమను చూపడమే ఆయన ఉద్దేశ్యమని తెల్లము.

ఈ కథారచనలో ఆపేక్షను పోషిస్తూ, చక్కగా తీసుకుపోతారీయన చదువరిని. రాయప్రోలు కథనములో ఆయన అభిప్రాయాలు అడపా దడపా ప్రవేశించి కథా సాంద్రతను పలచన చేస్తాయి. రామలింగారెడ్డి గారి కథనములో పాత్రలు ఆయన గారి మేధాశక్తిని సూచించే మాటలు- తమ నైజమును దాటి సుదూరము దాటిపోయినట్టివి - పలికి, రచయితని జ్ఞాపకము చేస్తాయి. పూర్వ ప్రేమలో వీరి

కథనము సూటిగా సాగిపోతుంది. పూర్వ కథను కావ్యరూపంగా చెప్పకపోవడము వల్ల కానలేము కాని, తన శాపాన్ని తప్పించడానికి కట్టిన ఇనుపమేడ గదికి మనసాదేవి ఒక రంధ్రము కల్పించెననే సంగతి "రంధ్రము నొకదాని నుండి కిరణమ్మొకడా గదిలోని నేలపై తెమలుచునుండె" నన్న సూచనా వాక్యమునుబట్టి మనకి స్ఫురించి బాధ పెట్టుతుంది. `పాండువయి తెల్లని సర్పము ప్రాకుపోలికన్" అన్న తరువాతి వాక్యము ఆ రంధ్రము నుండి సర్పము ప్రవేశించగలదని సూచించి విధి బలీయతను ధ్వనిస్తుంది.

(గురజాడ కన్యక కథలో `నాడు గుడిలో మండె గుండం మంట మింటిని ముట్టియాడగ'నన్న వాక్యంతో జరగబోయే ఘోరత్యాగాన్ని సూచిస్తారు. రాయప్రోలు వారు స్నేహలతాదేవిలో "నిత్య సాంధ్యకుమారి కట్టుచీర చెరంగు కాలుపోల్కి" వల్ల ముందే ఇదేదో `విషాద కథనము' అని సూచించారు. అంతకన్న ఇక్కడలాగా కథలో నిమిడ్చిననే కావ్యార్థసూచి ఉత్కంఠను పోషించగలదు. రాయప్రోలు `కష్టకమల'లో ఒడ్డాణము ఉరిత్రాడులాగా కనబడిందన్న వాక్యానికి హఠాత్సంభవమైన కమల జడ ఉరికి సూచన కాగలిగిన శక్తి లేదు) రాత్రి ఒక జాము గడవగానే వేహుళ లక్ష్మీంద్రుని విదాహశమనము చెయ్యడానికి పానకము వండితెస్తూ, ఆ కిరణము మాయము కావడము గుర్తించి, పైకి చూచి,"మే నొదిగి యొదింగివచ్చు మలినోరగముం'గ నెనట. `మలినోరగము' గొప్ప వ్యంజనశక్తిగల పదము జరగబోయే విపరీతమును గురించిన కవిభావమూ, మన తిరుగుబాటు కూడా "మలిన" అన్న పదములో - విత్తనములో చెట్టులాగా గింజుకుంటాయి. ఆ `మలినోరగము'ను గని ! విషోరగమును కాదు. పానకము నానెడువేళ వేహుళ గుడ్డ పేలికలు పేనిన తాట కరాళదర్వీకర కంఠగోళమును బిగించినదట! గొంతుక్కాయ బిగించేశింది. దేనిగొంతుకాయనూ? పాము గొంతు క్కాయను! ఇక్కడ కవి యుత్కంఠనూ, మన యుత్కంఠనూ చక్కగా పోషిస్తోంది.`కంఠగోళమన్న'మాట. కంఠనాళము అనవచ్చును గదా? `గోళము' అనడములో భావోద్వేగ రచనాశక్తి ద్యోతకమౌతున్నది. వీరు వృత్తాలను అమోఘముగా నడపగలరు గాని, వీరి రచనా చైతన్యానికి వృత్తము కాక, ద్విపదయే అనుకూలమేమోనని వేహుళ గంగాప్రయాణ ఘట్టము చదివితే నా కనిపించింది. వారు ఆ కథను ద్విపదలోనే పూర్తి చేయలేదేమని నేను బాధపడ్డాను. వారలాగ పూర్తి చేసిఉంటే కలకాలమూ నిలిచే కావ్యమొకటి తెలుగునాటి కావ్యాలకు చేరియుండేది. ఇప్పటి భాగమేనా. వజ్రపు తునుక, రామకృష్ణరావు గారి రచనలకు జయపతాక.

**భారతి, డిసెంబరు 1963.**

# 3. దువ్వూరి - పాటలూ- బసవరాజూ

దువ్వూరి రామిరెడ్డిగారు కవికోకిల. ఆయన పద్యశైలి `బాలురు సైత మొక్కరిని పద్యగతార్థము వేడ' నక్కర కల్పించని శ్రుతి సుఖమైన సుధామయోక్తి. ఆయన రచన చదువరికి మది భారముతోచనీని ప్రసంగము. వారి తొలికృతులు రసిక జనానందము, అహల్యానురాగము, కృష్ణుని రాయబారము అన్నవి పూర్వప్రబంధముల వలెనే అతిశయోక్తులూ శబ్దాలంకారములూ కూర్చుకున్న ప్రబంధములు. అక్కడక్కడ ఆధునిక పరిస్థితులూ ఊహలూ హెచ్చరిస్తాయి చదువరిని. ఋతుసంహారమూ, పుష్పబాణ విలాసమూ, ఆంధ్రీకరణములు. బంభర శుకకీట సంవాదమూ, జలజమూ, సంక్రాంత్రి పండుగ, సింహ ప్రబోధము అనేవి పంచరత్నాలూ నవరత్నాలు వంటి ప్రకీర్ణక పద్యమంజరులు. `విమర్శకుడు', ఏదైనా కావ్యము వచ్చునా దానిని ముక్కలుగా కొట్టినామన్న కీర్తిని పొందుదామా అని చూచే పండితవ్యాధుని నిరసనము- మాతృశతకము భారతదేశ పూర్వస్థితీ ప్రస్తుత స్థితి పోల్చి కవిపొందే దైన్యము- వీటన్నిటిలోనూ రచనా పద్ధతిదే పెత్తనము. వీటి సామాగ్రి కవిగారి ఇష్టానిష్టములూ మెప్పూ దిగదీతానూ పరిసరములకు కవిపైన ఏ ప్రభావమూ ఉండదు. కవియే ప్రబంధ కవులవలె ఆ అందము ఇట్లున్నది, ఈ చందము అట్లున్నది అని చమత్కారమునే సాధనముగా నడుపుకుపోతాడు చివరదాకా. వీరి శైలి ప్రవాహ శీలి, నాతికఠినమేకాదు మృదువు కూడాను.

వెనకటి కొకమారు రాథాకృష్ణ పండితులడిగిరట కొంపెల్ల జనార్దనరావును "నవ్యకవిత్వమని దేనినంటున్నారూ?" అని. జనార్థనరావుగారు నన్నూ అడిగేరు ఆ ప్రశ్ననే. "వర్ణ్యవస్తు సౌందర్యాన్ని చదువరికి స్ఫురింపజేసే రచన నవ్యము, వర్ణనా చమత్కారాన్ని స్ఫురింపజేసేది ప్రాచీనము" అంటిని. ఇప్పటికీ ఆ అభిప్రాయముతోనే ఉన్నాను. రామిరెడ్డిగారి "ప్రథమ కవిత్వము" (1916-1918) ప్రాచీన పద్ధతిలో వర్ణనా చమత్కారము మీద ఆధారపడి సాగినట్టిదే. పై వాటిలోనన్నిటా ప్రకృతి సౌందర్యము కవిభావనాసుందరిని మోచి తిరిగినది.`వనకుమారిలో' ప్రకృతి సౌందర్యము

కవిభావనను వదిలి నిలిచినది. కనుక ఈ కావ్యముతోనే (1918)రామిరెడ్డిగారు నవ్య కవిత్వములోనికి అడుగు పెట్టినారంటాను. విజయరామ గజపతి మహారాజు `ఎవ్వరేమన్న నీ కృతి మవ్వమైన యభినవాశయ సంపత్తి నలరుచుండు'నన్నారట. చల్లనిమాట! `రసప్రవాహ బాంధవ పదజాల బద్ధ కవితా నవభావ మనోహరత్వము' ఈ కావ్యములో నిక్షిప్తమైనదని కవిగారి విశ్వాసము. ఇది - గురజాడా రాయప్రోలూ అబ్బూరీ కవుల కావ్యాల వలెనే - ఉపోద్ఘాతాలతో కాక కథతో ప్రారంభిస్తుంది. మొదలు పెట్టగానే చదువరి ఆపేక్షను పట్టడానికి కథ సిద్ధమవుతుంది.(రామిరెడ్డిగారి యితఃపూర్వ కావ్యాలు మురాంతక విఘ్నేశ సరస్వత్యాది పౌరాణిక దేవతల ప్రార్థనతో ప్రారంభించాయి.) దీని ఇతివృత్తము పై కావ్యములకు వలెనే సిరిమంతుల విలాసము కాక వనములలో పెరిగి వనకుమారిగా తిరుగుతూండిన కన్య చరిత్ర, కనుక కొత్తదనము కలిగినట్టిది. (షేక్స్పియరు `టెంపెస్టు' నాటకములోని మిరాండాను వెలికిదీసి చూపుతూన్నది ఈ కావ్యము) ఈమె కథను చెపుతూ కవిగారు ప్రకృతి సౌందర్యాన్ని విరివిగా వర్ణించారు. ప్రబంధాలలోని ప్రకృతి యొక్క భావనా బలానికి వాహనమై ఆ భావన ఎటు నడిపితే అటు నడిచింది. ఈ నవ్య కావ్యాలలోని ప్రకృతి సౌందర్య సైరంధ్రియై కవికి సౌందర్యాన్ని చూపిస్తుంది. కవి భావన ఈ నవ కావ్యాలలో సౌందర్య చిత్రణమే చేస్తుంది. భావనారంగవల్లులు తీర్చదు. ప్రబంధ కవి సంస్కృత పండితుడు. సంస్కృత కావ్యాలలోని పురాణ దృశ్యాలు - అతని అనుభవములోనివి కాకపోవుటవల్ల ఓజో గుణాన్ని పెంచుకొని - మేఘ మండలానికి పైన విలసిల్లుతూన్నట్లు అతని ఊహకు గోచరించాయి. అశేష ఫణి ఫణారత్నరుచుల వంటి అతిలోక దృశ్యాల్ని దింపి తెచ్చుకుని ప్రకృతి దృశ్యాలతో జోడించి వర్ణించాడు ప్రబంధకవి.

పెద్దన్నగారి వెన్నెల వచనము, తిమ్మనగారి వెన్నెల 'బువ్వపు బంతి' పింగళి సూరన్నగారి 'ప్రభావతి తిలకము 'ధూర్జటి'ఉదయగ్రావపు పానవట్టము' ఇలాంటి ప్రకృష్ట సాధనలే. ప్రబంధాలలోని ప్రకృతి కవియొక్క భావనా భాండారము లోని ఒక పార్శ్వము. అవసరమైనప్పుడు దానిని మలచుకొని ఉపయోగించాడు ఆ కవి. కవి సమయాలు ఈ రచనా శిల్పములో కవికి ధారాళంగా ఉపయోగించాయి. నవకవికి మానవుని అనుభవముతోపాటు ప్రకృతి సౌందర్యము కూడా దర్శనీయము, ఉపాదేయమూను. అతని తూకములో చిన్ని మానవుని అభిమానాలు , ఆశయాలు కంటే బృహత్ప్రకృతి సౌందర్య సంపద బరువు హెచ్చు. అతనికి సర్వ ప్రకృతీ ప్రసన్నముఖియైన తల్లి. తల్లి చేష్టలన్నీ బిడ్డకు ఆనందదాయకములే. మానవుని కథలూ, భావాలూ సుఖదుఃఖాలు నవకవికి ఆకర్షణములైతే కావచ్చునుగాక , సృష్టి సౌందర్య మొక్కటే దొరికినా అతనికి కించలేదు. ప్రబంధకవి రచనకు మానవుడే

కేంద్రము, రాజో, భక్తుడో ఎవరో. అతని చరిత్రలో సౌందర్యము లేక పోవచ్చును, ఫరవాలేదు. తన కల్పనలను గుప్పి మొత్తపు రచనను-కథను కాదు-ఆకర్షణవంతంగా చేసుకుంటాడు ప్రబంధ కవి. కేవలము ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించి ఆనందింప జేస్తాడు నవకవి. కావ్యము చదవడము పూర్తి చేసేసరికి ప్రబంధమువల్ల కలిగేది కవి సామర్థ్యానికి మెప్పు, నవకవిత్వమువల్ల కలిగేది ప్రకృతి సౌందర్యానుభవమువల్ల-ఏ కొంత అయితేనేం-కలిగే ఆనందము.

రామిరెడ్డిగారు వనకుమారి కథను వనసౌందర్యము నగ్గించుటకే స్వీకరించినారు. 'లలిత రసార్ద్ర వేణురవ లాలితలైన కురంగకాంతలుజ్వల కిసలయంబుల న్మేసవసాగక వీనులు నిక్కబెట్టుటనూ' 'లలితపు సంజ కెంజిగ విలాసములెల్ల శమింప జీకటుల్, బలసిక్రమక్రమంగా నిలం గబళించెడి'రీతినీ;కొండ నెత్తమ్ముల గోరాడు మబ్బుల గమన సౌందర్యా'న్నీ 'కిలకిల కావుకావు కిలకిచని' నీడ సీమలన్ జలిబిలి కమ్మగానములు సేయు పక్షులనూ, 'దొనికి బండల జారి తుంపర ముత్యాలు వెదజల్లు సెలయేటి రొద'లనూ,'జలదము జీల్చికొంచు' 'చంచదుదారకాంతి దిక్తటముల వ్రేలు సంతమస కాండములందొలగించు' 'చంచలనూ వర్ణిస్తూ ప్రకృతి సౌందార్యాన్ని ఉన్న దున్నట్టుగా వర్ణించినా వ్యుత్పత్తి బలమువల్ల ఈయన రచనకు ఉత్ప్రేక్షాలంకార భారములు తప్పలేదు. మొగ్గు మాత్రము అనుభవమును వర్ణించి చదువరి అనుభవము కలిగించే నైసర్గిక భావ సంపూర్ణమైన పద్ధతివైపే."కలరవ కోమలంబగు వికస్వర సుస్వర మెత్తి నీ హృదింగల సరసానురాగ మెసకమ్మగ బాడెద విట్టి విద్య నెందుల మును నభ్యసించితివి"అని ఆరంభించిన వనకుమారి పరిదేవన భాగము చక్కని భావ కవిత్వము : ప్రకృతిని తన భావనకు చేటిని చేసే రాజసమును కాక ప్రకృతి సౌందర్యానికి ముగ్ధురాలయే చైతన్యమును చూపిస్తున్నది రచన, నూటికి నూరుపాళ్లూ నవ్యకవిత:

ఈయనదే కృషీవలుడు ఇంకొక మార్గము తొక్కినది. 'వనకుమారి'లో రామిరెడ్డిగారు పట్టినది పల్లెసీమను. కాళిదాసు ఋతుసంహార కావ్యసరళి దీనిలో లీలగా కనబడుతున్నది. కవి పల్లెసీమలో తిరుగుతూ, సూర్యోదయావసరము నుండి గ్రామములో వినబడు కలకలమూ, పాలుదీయు వేళల కదలికలూ, పొలములకేగు సంరంభమూ, సోమరి యువకుల బద్ధకమూ, గనిమ (పొలముగట్టు)ల పొడూగునా పలకరించే అందాలూ, ఇంటిలో కష్టించే కాపుపడుచు శ్రమా, జొన్నచేల పిట్టల దోలబోయెడి బాలిక చెయ్దములూ, మిట్టమధ్యాహ్నపు విశ్రాంతీ, దుత్తకూటి భోజనమూ, కృషి ప్రాముఖ్యమూ, సస్య సౌందర్యమూ, వానకారు శోభ, కర్షకుని కడగండ్లు, సాయంశోభ, గృహోపగమనమూ, విశ్రాంతీ, వర్ణించినట్లుగా ఉన్నది

కావ్యము. చిరకాలగత కావ్య నియమాల ననుసరించక సామాన్యకర్షకుని ఏకాహానుభవములను వర్ణించినందుకు ప్రాచీన సంప్రదాయాభిమానులైన విమర్శకు లేమైనా అందురని కాబోలుకాల మనంతము'ఇల విశాలము'అన్న భవభూతి శాపాన్ని విసరినారీయన. ఈ కావ్యము పల్లెపట్టును తలచినప్పుడు కవికి కలిగే భావాలనూ, ఆలోచనలనూ కలిపి పేనినట్టిది. ఒక నాటిసూర్యోదయము నుండి మర్నాటిఉదయము వరకూ పల్లెల్లో కానవచ్చే దృశ్యములను కూర్చిన కారణముచేత కవి ఆలోచనలకు కథకు సమకూడే ఐక్యగుణము సమకూడుచున్నది. దానివలన ఈకావ్యమును 'గ్రామలక్ష్మి దినచర్య'అని వర్ణించవచ్చును. ఇందులోని భావాలు ఆయాసన్నివేశాలలో కవికి కలిగినభావాలు.వీటిని దండ గుచ్చేది గ్రామలక్ష్మి దినచర్య'అయినను కవిగారి సానుభూతీ, ఉపాలంభమూ, ప్రభోధమూ భావమయకోశాన్ని దాటి విజ్ఞానమయకోశములోనికి ప్రయాణించి ఆయన వ్యాఖ్యానాల్నీ ఆయన్నీ చూపిస్తూ భావైక్యతను అక్కడక్కడతెంపినవనిపిస్తున్నది నాకు. వీరి వ్యాఖ్యానములు రేపిన ఆలోచనలవల్లనే కట్టమంచి రామలింగారెడ్డిగారు పట్టణవాసులను వెనుక వేసుకొని సమర్థిస్తూ పీఠికలో నాలుగు వాక్యాలుగా వ్రాశారు చూడమంటున్నాను. కనుక ఐక్యత తగ్గటముతో ఈ'కృషీవలుడు'ను పల్లెపట్టును వర్ణించేకావ్య మవుతుంది. రాజూ అతని వేటా,అతని వివాహమూ ప్రబంధకవులూ, సంపన్నరసికుడూ, అతని విలాసవిహారము, దక్షిణాంధ్రకవులు వేశ్యాలోలుపత్వము, పతనమూ సంధియుగ కవులూ చిత్రిస్తే,గ్రామసీమ సౌందర్యమును సామగ్రిగా గ్రహించిన ఈకావ్యము ఆ గుణములో కొత్తదే. ఇందుగల ప్రకృతి కవి భావనా సైరంధ్రికైసేతతో చెలికత్తెఅలంకరించిన సుగాత్రివంటిది కాదు. సహజసుందరియే. ఉత్ప్రేక్షల గొణగొణలు మాత్రము తప్పలేదు.

వీరి 'జలదాంగన' చిత్రకావ్యము. "తత్వవేత్తకు నేది సత్యముగ దోచునదియె సౌందర్యరూపమై యలరుగవికి"అన్నారు. జనమంచి వెంకట్రామయ్యాగారు.'జలదాంగన సొగసు గుర్తించుకోవాలంటే `కొండనెత్తముల గోరాడు మబ్బుల గమన సౌందర్యము' ద్వారా మేగాల పుట్టుపూర్వోత్తరాల ఆలోచనలోకి వెళ్లారాయన. వైజ్ఞానిక వస్తువు కవిత్వానికి వైచిత్రి సాధించడానికి పనికివస్తుందేమో కాని సౌందర్యము సాధించడానికీ, ఆనంద మివ్వడానికీ పనికిరాదు. వీరి `యువక స్వప్నము' మృత్యువున కవ్వలి దేశ దృశ్యము. మళ్ళీ"కడపటి వీడుకోలు'లోనే వీరు కవితా రచనకు మరలివచ్చుట.. ఈ కావ్యములో - రాయప్రోలువారి `కష్టకమల'లో వలె - కడపటి వీడుకోలు పొందే యువతీ యువకులు హఠాత్తుగా నీటబడి ఇద్దరూ కూడా -అనుకోని - బలవన్మరణము నందినారు. కవిగారి ఆశయము దురవగాహము. కథలో వారినిద్దరినీ విడదీసి ఎక్కడనో చంపుట కంటె, ఇద్దరినీ స్రవంతిలో పడేసి `ఎంత పుణ్యాంబు

చేసెనో ఈ ప్రవంతి ప్రేమవాంఛల రెంటి జీర్ణించుకొన్నది" అని ముగించారు. "గౌతముని ప్రకృతి ప్రేమనూ ఋషికన్య మోహమునూ ప్రకృతియే జీర్ణించుకొన్నది" అని ప్రకృతినే ప్రేమవాహినీ గమ్యముగా సూచించడము ఆయన అభిలాష కాబోలు. నాకు మాత్రము నాయకీ నాయకులు పడుపాటుతో ఈ ఊహ ఛిన్నాభిన్న మయిందేమో ననిపిస్తున్నది.

రామిరెడ్డిగారి రచనలలో ప్రకృతియొక్క సహజ సౌందర్య వర్ణనా, శ్రమజీవి జీవితసౌందర్యమూ కొత్తలు. వారి ఖండకావ్యాలలో `కవి మనోరథము' జలధరార్భకుని `సాంధ్యకిమ్మీరవర్ణ వస్త్రముల'నూ `గిరితట విహార శృంగారకేళి'నీ ఆనందించడముతో ప్రారంభించి, చుక్కపూవుల పందిరినీ, మంచు తుంపరలతోడ విచ్చు పన్నీటి పూవునూ, జిలిబిలి కమ్మగానములు చెసెడి సెలయేరునూ చూసి మన హృదయాలను జల్లుమనిపిస్తున్నది. ఇది నవకవిత్వము. కవి భావములే కావ్య సామగ్రిగా వెలసిన కవనమిది. ఆ భావములు తాకి చదువరి హృదయము కూడా రంజితమగును. ఈ కవిత్వము చదివినప్పుడు మనకు కలిగేది కవి రచన యెడ మెప్పుకాదు. మరి అతని భావములే మనకు కలుగుటవల్ల జనించే ఆనందము. కవితాకళ కలిగించవలసినదిదీ.

రామిరెడ్డిగారు కాకలు తీరిన వేదాంతి కాదు. వీరి తాత్త్విక చింతనలో నిరంజనత్వము కంటె వేదనయే ఎక్కువ. వీరి స్వభావము కుసుమకోమలమైనా, అనుభవము కష్టకంటకితమైనది. జీవితాసవము ఈయనకు తృప్తితీరునట్లు అందలేదు. ఉమర్ ఖయ్యాము వలెనే రామిరెడ్డిగారు విజ్ఞానమందున్నూ, సౌందర్యమునందున్నూ మమత గలవారు. ఉమర్ ఖయ్యాము సుందర భావములు అతని మేధాతర్కమువల్ల వాడివై చదువరుల హృదయాలకు చుర్రుమని తాకుతాయి. జీవిత చక్రపు పలుగాటులు ఖయ్యామును వలెనే రామిరెడ్డిగారిని హింసపెట్టినవి. ఆయన గొంతు కోయిల గొంతు. పారసి కన్న శ్రావ్యమయి పల్లవకోమలమై సుధారసం బూరెడు తెనుంగు నుడిలో ఖయ్యాము భావములను ఏరి పానశాలగా కూర్చినారు. ఎందరేనా వ్రాశారు రుబాయీలను తెలుగులో. రామిరెడ్డిగారి రచనా మాధుర్యము మాత్రము తక్కిన రచనలలో లేదు. కారణము రామిరెడ్డిగారు స్వంతముగా పలికినట్లే వ్రాయడమూ, వారి కవితా కన్య నిసర్గ గానములో అలంకారాల నినాదాలు పొడవై వినబడక పోవడమూను. రామి రెడ్డిగారి ప్రకృతి సౌందర్యదాహమునకు ఖయ్యాము రసవాహిని సంపూర్ణ సంజీవని యైనది. వారి పానశాల తెలుగు రసికుల పానశాల.

పాటలు ఆధునికాంధ్ర కవిత్వములో భూకంపమువలె ప్రవేశించినవి. నండూరి వంటి కవులు కావ్యభాషా సంప్రదాయాన్ని ముక్కలుగా కొట్టి కసితో జానపదుల వాడుక భాషను పాటలకు వాడేటంతవరకూ ఆంధ్ర పాఠకుల దృష్టి పాటలమీద

పడలేదు. వాస్తవానికి పాటలు చిరకాలమునుంచీ ఉన్నాయి, తెలుగు కవులు నన్నెచోడుడూ పాల్కురికీ పాటలను పేర్కొన్నారు. గార్లపాటి లక్ష్మయ్య వందలాదిగానూ, అన్నమాచార్యులు వేలాదిగానూ రచించారు పదాలు. ఈ పదాలలో సంగీతానికి కంటె సాహిత్యానికే ప్రాధాన్యము. కనుకనే అన్నమయ్యను పదకవితా పితామహు డన్నారు. పాటలది మాత్రాచ్ఛందస్సు, పాటలలోని అడుగులు సమకాలాల్లో పడతాయి. పద్యాలది గణ ఛందస్సూ, గణాలన్నీ ఒకే పొడుగువి కావు. పొడుగూ, పొట్టీ చేరి ఉంటాయి. పాటలలోని ఆవృత్తాలు పాటల్ని సమలయలో నడుపుతాయి. పద్యాలలోని గణాలు పొడవు మారుతూ పాదాలలోని అక్షరాలను ప్రత్యేకపు వరుసలో బిగిస్తాయి. సమకాల లయతో సా. ·యే పాటలలో అక్షరముల లయలోని వైవిధ్యము ఎక్కువగా ఉండడానికి వీలులేదూ, ఒకే ఆవృత్తములో ఉన్న కొద్ది భేదమూ ఆవృతము యొక్క పొడవుని సమము చేసి తాను లోపించిపోతుంది. గణములు పొడవులు మారుతూండడము చేతనూ, గణములలోని అక్షరముల వరుస నిర్ణీతమై పోయి ఉండడము వల్లనూ ప్రతీ పద్య పాదానికీ నడకలో వైలక్షణ్యత స్ఫురిస్తూనే ఉంటుంది. ఈ ఆధిక్యాన్ని పెద్దచేసి, కవులు పాటలను రచించడము కంటె పద్యాల్ని రచించడమే శ్రేష్ఠమైన పనినిగా పరిగణించి పదకవితలను ఈసడించారు. అన్నమయ్య వేలాదిగా పదములు రచించినా ఆయనకు కూడా ఏ కొద్దో అవహేళన జరిగినదేమోనని - ఆయన కుమారుడు పదములనే కాక పద్య ఛందస్సులోని కంద, వృత్త సీస పద్యములలోనూ, చివరికి వచనములో కూడాను రచించడమును గుర్తిస్తే - నా కనిపిస్తుంది. అయితే అన్నమయ్య రచనా సౌందర్యాన్ని అందుకోగలిగినవారు, వందలాదిగా ఉన్న పద్యకవులలో ఎంతమందీ? పాటల రచనలో కట్లు తక్కువ కనుక కవిభావాలు చైతన్యవంతంగా రావడానికి అడ్డంకులు తక్కువ. ఈ సౌకర్యానికి వ్యాకరణ నియమాల్ని సడలించిన భాషను ఉపయోగించి కూడా పదకవులు సౌలభ్యాన్నీ, శక్తినీ కలుపుకున్నారు. అయినప్పటికీ పలుకుబడిలోని నేర్పునే కవిత్వ పీఠముమీద ప్రతిష్టించి అర్చించుకున్న మధ్యయుగాల రసికులు పాటలను పరిగణించుకోనే లేదు! క్షేత్రయ్య చేతిలో పదములు సంగీతమును పెంచుకొని, కవిత్వముతోనే పెరిగిన సమస్యాపూరణ ప్రక్రియలతోపాటు సంగీతకళలో చేరిపోయినవి. చిన తిరుమలయ్య తన `నా మొరాలింపవే' అన్న పదానికి నిర్మించిన ధాతువు(స్వరరచన) ఈ సత్యాన్ని చక్కగా నిరూపిస్తుంది. అప్పటి నుంచి పదమునూ, ఆటనూ సాహిత్య రచనగా పరిగణించడము మానుకున్నారు తెలుగువారు . నాటికి నేడు మళ్లీ గురజాడవారు పాటలనూ, పాటల వంటి రచనలనూ వెలయించేవరకూ పాటలలోని భావాల కొరకు గాని, పలుకుబడి నేర్పు కొరకు గాని ఎవరూ ఆశించినట్లు కానరాదు.

గురజాడ అప్పారావుగారు త్రిశ్ర, చతురశ్ర, `ఖండ'గతులలో నీలగిరి పాటలు, రచించారూ. పాటకూ, పద్యానికీ నడిమి రచనగా ముత్యాల సరాలూ, చతురశ్రగతి రచన `పూర్ణమ్మ' రచించారు. "గ్రాంథిక భాషకీ, మాట్లాడే భాషకీ మధ్యగా ఉండే సులభమైన భాషను సృష్టించుకొండి" అన్న ఆయనగారి సందేశాన్ని ఛందస్సు మీదికి చాచితే " పద్య ఛందస్సుకీ వచనానికి నడిమిగా ఉండే మాత్రా చ్ఛందస్సుని నిర్మించుకొండి" అని వారి సందేశమేమో ననిపిస్తుంది. వారి రచనలు అలాటి ఛందస్సులోనివే. అయితే వారి వ్యావహారిక వాదమును వలెనే వారి ఛందో సంస్కారమును కూడా ఎవరూ అనుసరించినట్లు కనబడదు. అబ్బూరి రామకృష్ణారావుగారు వంగ కవిత్వములోనివో, స్వంతములేనో కొన్ని కొత్త మాత్రాచ్ఛందాలు ప్రవేశ పెట్టారు. అవి కూడా రచయితలకు ఆకర్షకములు కాలేదు. అధికార్ల సూర్యనారాయణరావుగారు "ఉత్తుత్తీ పండు ఉత్తరేణిపండు దానిమ్మాపండు దబ్బాపండు" వంటివి కొన్ని వ్రాశారు. అయితే ఈ పాటలోని"సొగసుసీతానీదు చెల్వుపేరేమె" అన్న చివరి ప్రశ్నకు జవాబుగా వచ్చిన"పాలసంద్రమ్మీది బాలకృష్ణుండు" అన్నంతపాటి అద్భుతమైన భావాలు తక్కినవాటిలో లేకపోడముచేతనో కాబోలు వారి రచనలు రసికుల మనస్సు కెక్కలేదూ, వారి పద్ధతిలో ఇతరులు రచించనూ లేదు.

బసవరాజు అప్పారావు గారు పాటలు చాలా వ్రాశారు. అయితే వారు తమ పాటలను గొప్పగా పాడే వినిపించేవారట, కృష్ణశాస్త్రిగారు పలుచోట్ల వ్రాశారు. పాడితేనే గాని రంజించని పాట కవితారాజ్యములోనిది కాజాలదు. కవిత్వము మాటల రచనయే కాని స్వరాల రచన కాదు. మాటల రచనకు భావాలూ ఆలోచనలూ ఇవీ అని అందరికీ తెలుస్తాయి. స్వరాల రచన అనగా రాగము మాటలకు అందని మాటలతో సంబంధము లేని - వ్యక్తీకరణము. రాగానికి ఇదీ అర్థము అని ఎవరూ నమ్మకంగా చెప్ప లేరు. మాటల రచన మానవులకు నైసర్గికములైన రసానుభవమును ఉత్పాదిస్తుంది. స్వరాల రచన సముద్రమంత విశాలము, దానిని తొమ్మిది - లేదా పది- రసాలకు పరిమితము చేయడము తప్పు. స్వరాలు మానవుల ఆలోచనలకీ, భావాలకీ కాదు. జీవుల చైతన్యానికి చిహ్నములు (వాటిని "పశు వెరుగును పామెరుగును శిశువెరుగును). జీవుల చైతన్యపు భాష అయిన సంగీతానికి మానవుల ఆలోచనల భాష అయిన మాటల భాష కాళ్ళల్లో కర్ర. మాటల భాషకి సంగీతాన్ని చేర్చి ఇవ్వడము ఎద్దుకి హంసను జోడుగా ఉంచడమే. ఆ బండిగాని ఎగిరిందంటే హంసది గొప్ప. పాటలను అమోఘముగా పాడేసి "నా కవిత్వము ఎంత బాగుందో!" అంటే, `నీ కవిత్వము కాదయ్యా బాగున్నదీ, నీ పాట బాగుంది' అనాలి మనము. "పద్యాల్ని మాత్రము కవులు పాడటము లేదా?" అని అడిగితే, "ఆ కవిత్వాలకు ఆపాతమధురమైన సంగీతాన్ని కూడా అదనంగా కలిపి ఇస్తేనేగాని అవి

రంజించవన్న జంకుచేత వాటిని కవులు తాము పాడియో, ఇతరులచేత పాడించియో సంగీతపు మాధుర్యాన్ని కూడా కావ్య సౌందర్యానికి చేర్చి, మొత్తపు సౌందర్యాన్ని కవిత్వానికే హాయిగా జమ కట్టుకుంటున్నారు" అని జవాబు. పాట ఏమీ రాని కవులు, చక్కని కవిత్వము వ్రాసేవారు చాలా మంది ఉన్నారు. కవిత్వపు వాసనే లేనివారు-పుట్టంధులు - చక్కగా పాడగలవారూ ఉన్నారు. కవిత్వమూ సంగీతమూ అసహాయ కళలు. కాబట్టి పాటల సాహిత్యపు విలువను గుర్తించుకొనేటప్పుడు వాటి సంగీతాన్ని విస్మరించియే తర్కించుకోవలెను.

బసవరాజు అప్పారావు గారి గీతాల సంపుటానికి ముందు మాటలు వ్రాస్తూ కృష్ణశాస్త్రిగారు "ఊరికే మాట్లాడే వాడు Words Worth అనీ Watrsduntonఅనీ, పండితరాయలనీ, భవభూతి అనీ, తిక్కన అనీ, పోతన్న అనీ!.... అతని కావ్యాల్లో కంటే అతని జీవితంలోనే కవిత్వం ఎక్కువ దొరుకుతుందనీ మరికొందరంటారు ...... అతనికి అనుభూతి రావడమేమిటి, పాటలోనో, పద్యంలోనో అనెయ్యడమేమిటి? .... అంత నగ్నంగానూ .... విసిరి వేసినపుడు కల్పనకు అవకాశముండదు ... అతని పాటదే పై చెయ్యి. దాని బలం ఎక్కువైపొయ్యేదేమో కూడా ..... అందుకనే అతనెప్పుడో గాని మామూలు శబ్దాలను దాటి వెళ్ళలేదు... దీనివల్ల ఒకొక్కప్పుడు .....పేలవమైన మాటలూ కాళ్ళూ చాపేసి చతికిలపడే పంక్తులూ రావచ్చు. అయినా జీవద్భాషకు ఇంత దగ్గిరగా కావ్యభాషను తీసుకువచ్చే ప్రయత్నం గొప్పది కదూ?" అని. బసవరాజు వారికి ఆవేశం లావు. ఆ ఆవేశంలో వారు చెప్పిన పాటలు వారి కళ్ళెములనే తెంపుకు పోయాయి.

గురజాడ వారి కావ్యరచనోద్యమములోని మాత్రాచ్ఛందో రచనా, జీవద్భాషా ప్రయోగమూ, ఖండకావ్య నిర్మాణమూ బసవరాజు వారవలంబించినట్లు కానవస్తుంది. గురజాడ వారు త్రిపుట, చతురశ్ర వరుసలనే కావ్యరచన కుపయోగించగా వీరు త్రిశ్ర, చతురశ్ర , ఖండ, మిశ్రజాతి వరుసలలో తమ గేయాల్ని రచించారూ, వాటిని పాడి వినిపించారు. ఈ గేయాల్ని రేడియో వారు లలితసంగీత కార్యక్రమాలలో చక్కగా పాడించి వినిపిస్తున్నారు, యుక్తమే. వీటిలో `వాయింపు మా మురళి', `రాబోకు రాబోకు', `నల్లవాడే గొల్ల పిల్లవాడే' మొదలైన వాటిలో సంగీతానిదే పైచేయి.

బసవరాజువారి గేయాలు ప్రేమ తత్త్వమూ, భక్తీ, ప్రకృతిచిత్రములూ, చరిత్రా, కవిజీవిత చర్యా అన్న అయిదు విభాగాలుగా కన్పిస్తాయి. రాయప్రోలు పూరించిన ప్రేమ శంఖారావము ఈయనకు అందడములో వింత లేదు. అయితే ఈయన వర్ణించినది లౌకిక ప్రేమనే. `వలపెరుంగక బ్రతికి కులికి మురిసేకన్న వలచి విఫలమ్మొంది విలపింప మేలురా' అన్నారీయన. యశోధర, లైల, గోపిక, వియోగి

చేసే ప్రేమాలాపాలకు ఈయన స్వంత పరిదేవము కూడా వెర్రిపిల్ల, పలవరింతలు, వరుసవావి వంటి పాటలలో వినిపించారు. తానే గోపికయై పోయినట్టుగా `ఒంటిగా ఉయ్యాలలూగితివా ముద్దు కృష్ణా జంటగా నను బిల్వదగదోయీ!' అని వ్రాసిన పాట రెండే చరణాలైనా సద్యఃపర నిర్వృతి కలిగించే గేయము. "కంటికంతా జలమయమ్మై, మింటిదాకా యేకరాశై, జంటదొరకని మహా ప్రళయపు టింటిలో వటపత్ర డోలిక నొంటిగా యుయ్యాల లూగితివా " అని చదవగానే మనము చదువరుల మన్నమాట మరచిపోతాము. సముద్రయానము చేయని వారికి కూడా కంటికంతా జలమయమ్మైన మహా ప్రళయపుటిల్లు కన్నులకు కట్టుతుంది. అలాంటి సముద్రము మీద మఱ్ఱి ఆకుమీద తేలినాడట ప్రభువు. జగములన్నీ కాలయోనిలో మొగము లెరుగక నిదురబోవగ'నగు మొగముతో తనలో తానే జోలలు పాడుకుంటున్నాడట ప్రభువు. అప్పారావుగారి తపనీయ సులోచనా లెంత ఎత్తుకైనా చూశాయి. ఈ గేయ దృశ్యమును మన కందించడానికి, వీరి భక్తి గేయాల్లో శక్తివంతములైన భావాలు మెరపుల్లాగా తళుక్కుమంటూ ఉంటాయి. `సోగ కన్నుల ప్రేమరాగ మొలుకంగ నీ లోకమును మరపించు'నట కృష్ణుడు. `రావాలంటే త్రోవే..... లేదా దేవదేవుడా నాథునకు?' `తలపై నీ పాదధూళి తాల్చుటకైనను తగనా', నట్టనడి సంద్రాన నావలో నున్నాను', `వాడిన పూవున కేటికి మరలను పరిమళ మొసగెదు దేవా', `వేదాద్రి శిఖరాన వెలిగేటి జ్యోతి' ఉదాత్తమైన భావాలు, పట్టి జవజవ లాడిస్తాయి చదువరుల్ని.

బసవరాజు వారు చూపే ప్రకృతి దృశ్యాలు కొన్ని మనము చూచినవే. మనము వాటి నిసర్గ సౌందర్యాన్ని దాటిపోతామూ, ఆయన గుర్తించి చెప్పేరు.

`ఈ మావిపై నుంచి ఈవు కూకూ అంచు, నామావిపై నుండి ఆపె కూకూ యంచు ఏమి బాసల జేతురే' అని అడుగుతారీయన. కోయిల కూతలలో బాస లుండునని నాకు స్ఫురించలేదు! `వార్ధి నుండి ప్రచండవాయువు' వస్తుందట. నిజమే! కాని వార్ధి నుంచి వస్తుందని ఎంత మందిమి గుర్తించామూ? "పగలెల్లను ధాత్రీరమ పచ్చని పుట్టమ్ము గట్టి" ఉంటుందట. రాత్రి పచ్చదనము తెలియదుకదా మరి? `కడలి శాంతముగ నన్ను యప్పుడే కడు భయమిడు'నట. ఎంత సత్యము! నిప్పురవ్వయందున ప్రళయేశ్వరుని నిటలాగ్ని అణగి యుండినట్లు, నిశ్చల భక్తుల హృదయ పీఠములలో స్వామి అధివసించి యుండునట ఎండచొరని నికుంజ గృహములనుండుట సుఖమట" నికుంజ సుఖము ఎండ చొరకుండుటే కదా! మెరుపుదీగె మొగిలుతోడ మేలమాడు'తుందట! ఇంకెవ్వరితో మేలమాడ గలదూ? `జల జలని బారు సేలయేటి చెంత నిభృత నికుంజములో నిశ్శబ్ద' ముండునట. `అడవిమల్లె చెట్టు మిన్ను చీల్చుకు' పోతుందట.

ఈయన చారిత్రక గాథలు `తాజ్‌మహల్', `యశోధరా విలాపము' , `లైలామజ్నూ',`జేబున్నీసా' అన్నీ ప్రేమ విహ్వాలుల గాథలే .... కవి జీవిత చర్యలు జరిగినవి జరిగినట్టుగా - నగ్నంగా- వ్రా సినట్టు కానవస్తాయి. బిడ్డ మరణించిన దుఃఖాన్ని "కత్తిబెట్టీ పొడిచినావోయ్ దేవా! గాయమింకా మానలేదోయి దేవా! నిలువూన యిల్లు దోచేశావ్"అనీ, "వెనక జన్మలో యేమి పెట్టి పుట్టితిమో? బంగారు పండంటి పసిబాల కలిగె! పెట్టి యెవరిని యేమి తిట్టుకున్నామో? ఇచ్చిన దైవమూ మర్చిపోడాయె"నని చెప్పుకున్నారు. ఈ పరివేదన ప్రకృతిలో చేరిపోతుంది. ఇది కళ కాదు, ప్రకృతే. ఇవి అనుభవాలు, అనుభవము కలిగించడానికి వ్రాసిన భావాలు కావు. సహజ ప్రకృతికి ప్రతికృతి చెయ్యడము విద్య అవునేమో గాని కళ కాదు. బిడ్డలు పోయిన జననీ జనకుల దుఃఖము ప్రకృతే, కళకాదు. బిచ్చగాళ్ళ అరపులూ మేకపిల్లల నృత్యమూ సూర్యాస్తమయపు రంగుల ఫోటో, కోయిల కూతా, తేనెటీగల గూటి శిల్పమూ, బంగారు పిచికల గృహనిర్మాణమూ నూటికి నూరుపాళ్ళూ ప్రకృతే కళ కాదు."కవితలో నైసర్గిక భావాల్నే ఇస్తే మాత్రమేమి, నీ అనుభవ దృష్టిలో ఏది ప్రకృతో ఏది కళో తెలియ రాకుండా ఉన్నపుడు నేను ఏది ఇస్తే మట్టుకు నీకేమి?" అని కవి తిరుగబడి ప్రశ్నించ వచ్చును. నాటకంలోని పాత్రధారి ఏడువవలసి వచ్చినపుడు, మరణించిన ప్రేయసిని తలుచుకుని ఏడ్చితేమట్టు కేమి? అన్న ప్రశ్న వంటిదే పై ప్రశ్న. ఏడుపు నటన కాక నీ స్వంతమే అయితే దానితోపాటు నీ స్వంత గుణాలు - నీవు ధరించిన పాత్ర స్వభావంతో సంబంధములేనివి- కొన్ని బయట పడుతాయి. ఆ చోట నీ `నటన' బయట పడిపోతుంది. అట్లే కవితలోని నైసర్గిక భావాలున్నూ. "కత్తిబెట్టీ పొడిచినావోయి దేవా " అన్నది నాకు సమంజసముగా కానరాదు. భగవంతుడే పొడిచినాడని ఎందుకనాలి? నీ కర్మ ఫలము ఎందుకు కాగూడదూ? కాబట్టి ప్రకృతి సిద్ధ భావాలను కవితలో ఉన్నవి ఉన్నట్లు ఇచ్చేయడము- నేర్పుకాదు అన్న సంగతిని అలాగ ఉంచి - కర్తవ్యము కూడా కాదు.

గురజాడ వారి "విరిగి పెరిగితి" వంటి ఖండ కావ్యాలు మొదటి నుంచీ చివరిదాకా చదువరి ఆపేక్షని లాగి చివరికి చదువరిని భావావేశములోనికి విసరి తన్మయత కలిగించే ఖండ కావ్యాలు కొన్ని- నాగుల చవితి, ప్రళయాగ్ని, వటపత్రశాయి, నాట్యసుందరి వంటివి- బసవరాజు వారు రచించారు. కొన్నిట్లో వీరి స్వంత ఘోషలు "ఈ మహాగహనాంతర సీమలోన నీవు శ్రీగిరి భ్రమరాంబ నేను మల్లిఖార్జునుడ", "నీవే నెగ్గింపుమీ యాత్ర .... పైన లేదే", "నీకే వదలితి దేవా" "నన్నెవ్వరాపలేరీవేళా", "ప్రళయాబ్ధిలో బడే పిల్లకాలువను నా ప్రేమలెఖ్ఖ, జమా", "చిట్టి నీ జ్ఞాపకం చెయ్యబోకే" వంటివి ప్రవేశించి కావ్యము కలిగించే ఏ మార్పును చెడగొట్టుతున్నాయి. కొన్నివింత రచనలు - వీరే ప్రారంభించినా రనాలి వాటిని

గాడుల వరుసలాగా ఒకేరకపు భావాలతో సాగిపోయినప్పటికీ ఆఖరి చరణములు అడ్డుకమ్మిల్లాగ వీటిని అతికి మొత్తపు రచనకు కావ్యత్వసిద్ధి నిస్తున్నవి. దొంగ కృష్ణుడు, కాంచలేను, వీరుడు, గొంతెమ కోరికలు, నిరాశ, అధోగతి అన్న కావ్యాల లాటివి. నాలుగు చరణాలూ నాలుగు దళాలులాగా వికసిస్తే ఆఖరి చరణము ఈ దళాల్ని అతికే పూపీఠమవుతుంది. ఈ రకపు ఖండకావ్యము తెలుగులో ఈయన నిర్మాణమే ననిపిస్తున్నది. భావాలు మాత్రమే చదువరిని పట్టి వూపగలవనుకో నక్కరలేదు. నాలుగు ముఖాలా జరిగే నాలుగు అనుభవాల్ని వర్ణించి, చదువరికి అభిప్రాయాలు కలిగించి, ఆఖరి చరణమనే నిట్టూర్పుతో ఆ అభిప్రాయాల్ని భావస్థాయికి మీటడము ఖండకావ్య నిర్మాణములో చక్కని తంత్రము. బసవరాజు అప్పారావుగారే ఈ తంత్రాన్ని తొలదొల్త చక్కబరచినారని నా కనిపిస్తుంది.

కావ్యభాషను వాడుక భాషకు చేరువగా తెచ్చినది బసవరాజు కాదు, గురజాడ అంటాను నేను. "యెక్కడనో వొక చెట్టు మాటున ఒక్క కోకిల పలుకసాగెను","పట్టమేలే రాజు వయితే పట్టు నన్నిపుడు", `విద్యలందలి మాయ మర్మం దిద్ది చెప్పిం దబల యొక్కతె', `నలుగురు కూచుని నవ్వే వేళల నాపే రొకపరి తలవండి' అన్నమాటలోని అందచందాలు, ఆవేశంలాగానే అనేసే బసవరాజు భాషకు లేవు. ఎంతో కొంత గురజాడ అడుగుజాడలు బసవరాజులోనే కానవస్తాయి. "ఆకసమంట నాలుకలు చాపే జ్వాలలూ, పాటలాధరపు పాటలూ, ఉసురులకు విసికించే జగతీ" గురజాడను అనుసరించి ఈయన చేసినట్టివే. అయితే గురజాడది చక్కని తీర్పు. బసవరాజు భావావేశము నైసర్గిక నిర్ఝరమువలె రావడము. ఆయన శక్తి వల్లనా, తీర్చిదిద్దలేని మైమరపు వల్లనా? అని ప్రశ్నవేస్తే రెండు జవాబులూ వస్తాయి. రెండోది ఆయనకు గౌరవాపాదకము కాదు.

భారతి, జనవరి 1963.

# 4. కవుకొండలా, అడవీ; పింగళీ కాటూరీ; నాయనీ, కవులు

ఆధునికాంధ్ర కవులలో వెంకటరావు గారిదీ అడవి బాపిరాజుగారిదీ కొత్తగొంతు. వీరిరువురూ కూల్డ్రే పండితుని శిష్యులు. తన శిష్యులలో ఆవిర్భవించే రచనా చైతన్యానికి దోహదము చేసి పెంచడమూ సహోపాధ్యాయుల నేర్పును గుర్తించి గౌరవించడమూ కూల్డ్రేదొర శీలమునకు రెండు కళ్ళు. ఆ చల్లని గురువు ప్రబోధమును అందుకొని కవితారచన సాగించిన వారు కవుకొండల వారు. కూల్డ్రేదొర వసతిగృహావరణలో వారము వారమూ జరిగే కళాగోష్టిలో వీరు తమ రచనలను వినిపిస్తుండినపుడు వీరిని కూల్డ్రేదొర "కవీ" అని సంబోధించేవారట. అప్పుడే వీరు "కవికొండల" వారుగా మారినారని నా ఊహ. కవుకొండల గ్రామనామము, "కవికొండల" కాదు.

ఆంగ్లకవితా ప్రభావమూ, రవీంద్ర కీర్తి జ్యోతి వీరిని కవితా రచనోన్ముఖులు గావించినవని నా కనిపిస్తుంది. వర్డ్సువర్తు కవీ, బర్న్సుకవీ రచించినట్టుగా పల్లెపట్టు సౌందర్యాన్నీ సరళ స్వభావ సౌందర్యాన్నీ ఆంధ్రకవులు ధారాళంగా వర్ణించక పోవడమూ, భారతీయ కవికి ప్రపంచము జోహారు లర్పించడమూ గుర్తించి ఉత్సాహితులై కావ్యరచన కుపక్రమించిన వారిలో కవి కొండల వారొకరంటాను. 1916వ సంవత్సరములో వీరి వివిధ కుసుమావళి (Flower gathering) వచ్చింది. ఈ పేరు రవీంద్రుని (Fruit gathering)ని జ్ఞాపకము చేస్తుంది. వీరి `ప్రకృతి వచనము' `కలరుతము' ~శేషఫణితి' (విశేషించి) `నెలబాలుడు' రవీంద్రుని కావ్యమాలల పేర్లను స్ఫురింపచేసేవే. రవీంద్రుని వలెనే వీరూ తమ రచనలకు అంకెలనే శీర్షికలుగా ఇచ్చినారు కాని చివరి పుటల్లో పేర్లుకూడా ఇచ్చినారు. `నెలబాలుడు' వీరికి కుమారుడు కలిగిన ప్రమోదాన్నేకాక రవీంద్రుని నెల బాలుని ప్రభావానికి కూడా భావంలోనూ ఖండ కావ్యాలలోనూ, పుణికి పుచ్చుకొని రూపొందింది. వీరి "ద్విపద లాక్ష" `రవీంద్రుని (Staray birds)ని జ్ఞప్తికి తెస్తుంది. రాగ రంజితములైన సూర్యాస్తమయాలూ, దారిపక్కల కన్నువిచ్చే శాద్వలసుమాలూ రవీంద్రుని రచనలలో

వలె వీరి రచనలలోనూ తరచూ గోచరిస్తుంటాయి. రవీంద్రుని వలెనే వీరు నాటకాలూ, నవలలూ, చిన్న కథలూ చాలా రచించారు. అయితే వర్డ్స్‌వర్త్ కవికివలె వీరికినీ పల్లెపట్టులోనూ జానపదులలోనూ గోచరించే సరళ సౌందర్యము మీదనే మొగ్గు. చిన్న అందము స్ఫురిస్తే చాలు దాన్ని ఒక కులకముగా రచిస్తారీయన. `ఎర్రచిగిర్చిన రావిచెట్టూ, వరదలో కొట్టుకుపోయే అరటి చెట్టూ, పచ్చిక బీడుమీది ఆరుద్రపురుగు, ఎగిరేతూనీగ, విహారానికి పోయి కూర్చునే చోటు చుట్టూ కానవచ్చే దృశ్యాలూ, ఒకే ఊరివారు ఇంకొక ఊరిలో కలుసుకున్నపుడు తోచే చిరునవ్వూ, కలలు మరచిపోవడమూ, గొడ్ల గిట్టలు రేపేధూళిని కడుక్కునే గొల్ల పిల్లవాడూ, వృద్ధదాసి బ్రతుకు తలపోతలూ, తాత యౌవనపు స్మృతులూ, తింటూనే ముష్టికి తిరిగే మధూకర భిక్షకుడూ, యదాలాభముగా విన్న గీతములోని వింతమాటా, దుస్తులు బురద చేసుకునే పిల్లవాడు, పిల్లలు పరిగెత్తితే కన్నములో దాగుకునే యర్రపీతభీతీ, వృద్ధుని జీవితాభిమానమూ, రెండెడ్ల తిరుగుబండిమీద వచ్చే వెలగపండ్లమ్మే చిన్నదానినవ్వు, చెరువు నీళ్ళల్లో నిలువునా కంపించే ఎర్రకలువ పూవూ, పొడుపుటేటి తొకతొకరుతీ, నదీతీరపు రెల్లుపూత సయ్యాటమూ గురించి రచిస్తారీయన. నాదమూ వర్ణమూ చలనమూ లలితమైన అందముతో కనిపిస్తాయి వీరి రచనలలో. వీరి మాటలలో 'జీవము సన్నజాజి మొగ్గ', దినదినమూ జ్ఞానమనెడు తెలిరేకులు విడుచునట; `జీవనము చిట్టి మేఘము' చిరునగవను ఇంద్ర ధనస్సు సింగారమిస్తుందట; జీవము తెరచాపను బోవుచిన్ననావ', `మృధు మధురము దానితేనె, సదమలంబు దాని చినుకు', వదలకుండు దానిగాలి, స్వచ్ఛందము జీవనంబు సౌఖ్యదంబ జీవనంబు' అని ఈయన సందేశము.

`ప్రాణికోటి బ్రతుకుసందడి' ఈయన రచనాసామాగ్రి. ఈ రీతిగా వీరికవిత నవ్యమే. మానవేతర ప్రకృతి సౌందర్యమేకాక మానవ ప్రకృతి సౌందర్యముకూడ వీరికవిత్వపు తెరమీద గోచరిస్తుంది. నిర్మలమైన వాన దడిసి వింతచెలువముదాల్చు ఆకుమడీ, పొడుగు చెట్ల నిల్చినట్టులె నిల్చి కోమలత బాయు నీరెండ, తుమ్మచెట్ల నిల్చినట్టులె నిల్చి కోమలత బాయునీరెండ, తుమ్మచెట్ల వెనుక దొగరు ప్రొద్దొరగు, దూరాన్న సన్నబడే తోయ సుదీర్ఘపు వీథి, దారంట గడ్డి నిరుక్కుని చూసే గడ్డి పూవులూ, రాళ్ళల్లో పరవళ్ళు తొక్కే నల్లనీళ్ళ కృష్ణవేణీ, ఏటేటా చిగురు పట్టి ఏటేటా పూతపూసి కోటివత్సరాల ప్రేమకూడ బెట్టే చెట్ల వాత్సల్యమూ, దోచుకొని పోయినట్లు కనబడే వట్టి పంటకళ్ళమూ, అసురసంజలో అపరదిక్సతి తిలకమనిపించే చుక్కా, ఒకవైపున వర్ణిస్తూ ఇంకొకవైపున ఆవ నుండి జీవనదిగ జాలువారు ఊటనీట తాటిపట్టె వంతెనకడ రేవులోన బచ్చుగడ్డి తడుపుతూ పకపకనవ్వే మాలెతల్లీ, తన పాట పెద్ద వారి చెవిన బడిందన్న బిడియంతో అలాఅలా కొబ్బరి మ్రాకుల చాటుననే

నడబాటకు పడిదాటుచు తన వారలలో దబ్బున కలుసుకునే కూలిపడుచూ, మూపులను పెనుమోకులూనుచూ బరువులాగుతూ పాలిండ్ల పగడవు గుండ్ల పేరునెంచే కూలియన్నల కుతుకమూ చిత్రిస్తారు వీరు.

మద్దాలి సూర్యప్రకాశ రావుగా రన్నట్టుగా ఈయన `మనకవి'. తెలుగునాటి సౌందర్యమూ, తెలుగు జానపదుల సరళ శీల సౌందర్యమూ వర్ణించారు ఈయన. గోదావరీ ప్రవాహమూ, వశిష్ట సాగరసంగమమూ, కాపవరపు చెరువులో ప్రతిఫలించే కోరుకొండ లక్ష్మీనరసింహస్వామి ఆలయపు తెలుపూ, ఆ చెరువు గట్టునున్న వటవృక్షమూ, రాజమహేంద్రవరపు పొలిమేరలనున్న ప్రకృతి ప్రశాంత సౌందర్యమూ వర్ణించారీయన. ఇది మన చుట్టూ కనబడే సౌందర్యము. ఈయన మనకవి.

ఈయన రచనలు అసంఖ్యాకములు. గీతములూ, గీతికలూ వందలలోనే లెక్క. శివరాత్రి ప్రభ, రాళ్ళపడవ, కూలియన్నల కుతుకము, కోతపాట, ఎర్రకలువ పూవు, నాగస్వరము, ఏలపాట వంటివి పదిపంద్రెడు ఖండకావ్యాలు వీరిరచనలలో మాణిక్యాల్లాగా మెరుస్తాయి. తక్కినవి ఎన్నో తగలకుండానే దాటుకుపోతాయి. కవి అన్నవాడికి ఊహలూ ఉద్దేశాలు తట్టుతూనే ఉంటాయి. వాటినాతడు గుర్తుగా వ్రాసుకుని ఎప్పుడో సంతోష ఘడియలో తీసి చక్కగా అల్లి ఖండ కావ్యంగా తయారుచేస్తాడు. వెంకటరావుగారి అసంఖ్యాక రచనలు వారి కవిత్వపు డైరీనుంచి నేరుగా అచ్చుకెక్కిపోయినవా అనిపిస్తాయి. లేకుంటే గ్రాంథికములోనూ కాక వ్యావహారికంలోనూ కాక `మా ఇష్టం వచ్చినట్లుంటాము అన్నట్లు ఎందుకుంటాయీ గీతికలూ? దీనిని చూడండి, `గోదావరి వడినొక్కటేదో పక్షియీకె యీదరికి గొట్టుకొంచేగుదేర, జేసాచి యొక గుర్రతీసి దాని తుడిచి వాసిమై బరికించే వ్రాయుటకో"? `ఓసీ కనుమనుండొ త్ర్యంబక వాసంబు నుండియోవచ్చి" తనుచు'. యీదరి అని నొక్కి చెప్పడంలో వ్యంజకశక్తి ఏదీ కానరాలేదునాకు. వాసిమై వ్యర్థపదము, ఖండము వేలెడులేదు, దానవ్యర్థ పదాలుకూడాను! వ్రాయుటకో? సందేహమే! సందేహమువల్ల ప్రయోజనము లేదు: చదువరి దృష్టిని బలవంతాన ఎటో మళ్ళించడముతప్ప. "ఓసి (పాపి) కనుమనుండొ నాసికాత్ర్యంబక వాసంబు నుండియో వచ్చితనుచు", "నీవు వచ్చినది చేరువనున్న కనుమనుంచేనా నాసిక నుంచా" అని, దూరస్ఫురణవల్ల చిన్న వస్తువుల నలముకొనే ప్రాముఖ్యమును చదువరికి స్ఫురింప జేయవలెనని యత్నము. ఈ భావానికి ముందు గల రచన ప్రవాహమువలె దీనినే తాకేటట్టు ఉండాలి. రచనమీద చదువరి దృష్టి నిలవరాదు. వాసిమై?, వాసంబు అన్న పదాలు చదువరి దృష్టిని రచయిత తడబాటు వైపు - లేదా అశ్రద్ధవైపు - మళ్ళిస్తున్నాయంటాను. ఇలాటి రచనలెన్నైనా ఉన్నాయి.

పద్యఛందస్సూ - గేయఛందస్సూ ఈయనకు బాగా స్వాధీనమైనట్లు కాన రాదు. లయ అక్షరాలను బట్టి నిలవదు. గ్రాంథికమూ వ్యావహారికమూ కాని పదాలు వాటి ఇష్టము వచ్చినట్లు యిష్టమువచ్చిన చోట్ల ప్రవేశిస్తాయి, వాటికి ఈయన అదుపున్నట్లు గోచరించదు. వీరు డైరీలలో వ్రాసుకున్న కవిత్వపు తునకలు - గనిలో నుంచి వచ్చే ముడి పదార్థం వలె - వీరి ప్రచురణలోనికి అలాగే దిగి పోయినవా అనిపిస్తాయి. " నా మొదలియూహ యెల్లప్పుడు నలువ సృజన నయన యుగళి గనుగొని యాక్రమ రూపముల నూరక యర్చించుచుటె" అన్నారు ఈయన. "నా పిదప యూహ యీ క్రియనిటు పాటపాడి చాటుటమహి" అన్నారు. ప్రతీకవీ కవిత్వపు నోట్సు వ్రాసుకుంటాడూ, తరవాత తరిమెణపట్టి ఖండకావ్యముగా తయారుచేస్తాడు. అది హృదయాన్ని జల్లు మనిపిస్తుందా అని చూసుకుని బాగులేకుంటే తీసిపారేస్తాడు. వీరి దగ్గర అట్లా మానుకునే న్యూనత లేదు. వ్రాసినవన్నీ అలాగే ఇచ్చేస్తారు మెరుగుపెట్టకుండా. కనుకనే ఎన్నో గీతికలు చదువరులను పలకరించకుండా వాటి దారిని అవి వెళ్ళిపోతాయి.

శ్రీశ్రీ అన్నట్టుగా కవికొండలవారికి అత్యవసరము ఒక ఎడిటరు. వారు మాత్రము ససేమిరా వల్లకాదు అంటారని నా కనిపిస్తుంది. లేకుంటే తోచిందంతా వ్రాయడమూ వ్రాసిందంతా ప్రచురించడమూ ఎవరు చేస్తారూ?

ప్రచురణలో ఎంపిక లేనట్లే మాటలను ఏరుకోవడములో కూడా వీరికి ఎంపిక లేనట్లే గోచరిస్తుంది. సృష్టిలోని ప్రతిజీవి పవిత్రమైనదేనని పరిశీలించి కావ్యగీతము చేసినట్లే, ప్రతీమాటా శక్తివంతమేనని ఉపయోగిస్తారు కాబోలు. కనుకనే చిన్నయసూరి ఉవాచ పక్కనే యెంకి పలుకులు చేరి వినబడతాయి వీరి రచనల్లో. అలాగే కొండయేటి చాలుల్లోలాగూ లోతులూ ఇసుక తిన్నెలూ చేరి కనబడతాయి భావాల్లో. మాటల పోహళింపుని సర్దుకోనట్టే భావాల గమనాన్నీ సర్దుకోరువీరు. అందువల్ల వీరి రచన ప్రకృతి దృశ్యం వలె ఇక్కడ అందంగా ఆకర్షంగానూ అక్కడ అతి సామాన్యంగా పేలవంగానూ ఉన్నట్టు అనిపిస్తుంది.

అడవి బాపిరాజుగారు కూడా జానపద నిసర్గ సౌందర్యాన్ని చూచి ఆనందించి ఆ సౌందర్యాన్ని చిత్రించ యత్నించినవారే. కవికొండలవారిని ఆకర్షించినది గ్రామీణ ప్రకృతి సౌందర్యము. ఆ సౌందర్యపు పాయలుగానే వారికి కూలిపడుచులూ పడవ కళాసీలు గోచరించారు. బాపిరాజుగారిని ఆకర్షించినది జానపదుల(నైసర్గికసరళ) స్వభావ సౌందర్యము. వానకోసము మనవి పాటలు పాడే బిచ్చగాళ్ళూ, వెళ్ళే పిల్ల సొగసుమీద పదాలు అల్లే [illegible]వ సరంగూ, అంధయాచక దంపతులూ, వృద్ధ కైవర్తుడూ, గంగెద్దుదాసూ, ఆయా వృత్తుల బిడ్డలూ, ఆ వృత్తుల చైతన్యానికి

ప్రతీకలూను. బాపిరాజుగారు పై వృత్తులను చిత్రించడములో ఈ దృష్టియే మొలకనుంచి వృక్షము వరకూ వారిలో పెరిగిందనిపిస్తుంది నాకు.

తొలకరి'లోని తొలిపలుకులు వ్యాకరణాన్ని వదలలేని గ్రాంథికభాషలో వ్రాశారు బాపిరాజుగారు. వాతావరణము జనపదాలదేకాని భాషా, ఊహలూ మాత్రము విద్వజ్జనులవి అయినవి. వేడి నీలాకాశము, మండు ఎర్ర ఇసుక, దాదాపు ఎండమావి, కోపంపు సూర్యుడు, వంటి పండిత సమయాలూ, వరుస పోగొట్టె పాదాలూ వారి తొలిరచనలను బలహీనము చేసేశాయి. అప్పటికి మాత్రాచ్ఛందస్సు వారికి సరిగా స్వాధీనముకాక `కంచెవయినా శిల్పచాతుర్యంబు కలమెవర్ణింప' వంటి విపరీత ప్రయోగాలూ ప్రవేశించాయి. ఏదో చెప్పవలెననే సరదాయేగాని అందముగా చెప్పే యత్నము అనాడు వారిలో తక్కువ. దీనిని గుర్తించుకునే కాబోలు చిన్నపిల్లవానివలె - చిట్టి కుర్రవాని బోలి నిముషమ్మున కొక్కమాట- నేను చెప్పగోరుచుంటి, వీసమంత జంకులేదు- కాసంతయు సిగ్గురాదు, కనంబడిన వారికెల్ల, వినిపింతును వెర్రిముక్క" అన్నారాయన. ప్రకృతి సౌందర్యము ఈయన కన్నులవరకే చేరినది కాని హృదయతంత్రులను కదలించినట్లు కానరాదు.

`గోధూళి'లో పల్లెజనుల నిసర్గ సారళ్యము ఈయన హృదయానికి చక్కగా తాకినట్లు కానవస్తుంది. `తొలకరి'లో గంగిరెద్దు వరకే చేరి దాన్ని చిత్రించిన దృష్టి,`గోధూళి'లో గొల్లసెల్లాయి కూతుర్నీ, పాపికొండల అడవుల నీడలలో పరుగులెత్తే కోయపడుచునీ, దేముడిచ్చిన పాపతో బయల్దేరిన ముష్టిదాన్నీ, అడవిచెట్లను జడలలో తురిమిన గోదావరినీ చిత్రించింది. వ్యాకరణము కల్పించిన రాళ్ళల్లో సాగలేని వీరి తొలకరి రచనల వాగు గోధూళిలో జనపదుల భాషను బట్టి సరస్వతియై ప్రహించింది. గేయాలవరుస తెంపుళ్ళు పడకుండా రూపక, త్రిశ్ర, ఖండ, చతురశ్ర, మిశ్రగతులలో సాగింది. గేయాలు రెండు మూడు చరణాలపాటైనా చక్కగా ప్రవహించాయి. పైన చెప్పిన పాటలూ శశికళలోని`మన చెలిమి', రసవాహినులు. చివరి వరకూ చైతన్యాన్ని చూపించాయి.

తొలకరిలో సౌందర్యం కోసము వెతుక్కుంటూ తిరిగిన వీరి దృష్టి `గోధూళి' కాలానికీ వేణుగానము దూరము నుంచి వినబడే సొగసునీ, యెన్నెల యెలుగుల్లోన యేటి నురగల్లోన తెల్లని తెరసాపెత్తి తియ్యని గొంతుకెక్కిన సిన్నవాణ్ణీ, `ఇది పైడిరేకా ఇది యెండిరాకా యెండి నీరాజంట పైడి నీవమ్మా' అని హెచ్చవేసే సోదె అక్కనీ, సోగమీసాలూ సొంపు తలపాగా ఊగే వొళ్ళు రాగాల గొంతుతో గూడెత్తి నీరుపోసే లచ్చుమామనీ, గోపికనీ, తోటమాలి కూతుర్నీ, గొల్ల సెల్లాయి కూతుర్నీ, కోయపడుచునీ, గట్టి గుండెల బిచ్చకత్తెనీ, ఒంటెద్దు బండివాణ్ణీ వట్టి జాతి

సుఖజీవనానికి చిహ్నాలయిన చైతన్యాల సౌందర్యాన్ని చిత్రించినది. అయితే బాపిరాజుగారు వేయియిళ్ళ పురోహితుడూ, వేయి గుళ్ళ పూజారీని. కవులలో చిత్రకారులు, చిత్రకారులలో కవీని. వీరిద్దరీ సమావేశాల్లో గాయకులూ, కులపతీ! అన్ని కళలలోనూ ఈయన చేయి పెట్టినా, ఏ ఒక్క కళా ఈయన శ్రద్ధకు నోచుకోలేదు. కన కనే గొప్ప చిత్రాలు రానట్టే గొప్ప గేయాలూ రాలేదు ఈయన నుంచి. ఆనాటి సముద్రగుప్తుని చేతులలో ఈనాటి వీణ పెట్టినా రీయన. మళ్ళీ శిల్పాలు ఎరగరా అంటే అన్నీ చూచినవారే. సముద్రగుప్తుని నాణెముల మీది బొమ్మ చూచినా తెలిసి యుండును ఆనాటి వీణ రూపము. వీరి చిత్రాలలోలాగే గేయాల్లో కూడా ఊహారేఖలై తీగలు సాగుతుంది గాని చక్కగా అల్లుకోదు. వారి చిత్రాలల్లోని వ్యక్తుల వెనకాల ఏవో ఉన్నాయిలే అనిపించే తెరలేగాని ప్రకృతి ఉన్నట్టు తోచలేదు నాకు. అలాగే వారి గేయాల్లో కూడా `లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా' వంటి పల్లవులు లాగినంతగా తక్కిన చరణాలు లాగవనిపిస్తుంది. కారణము అశ్రద్ధ కాక ఇంకేమి కాగలదు? కథలలో చేసినంత కుంచె పని గేయాల్లో చెయ్యరు బాపిరాజుగారు."పట్టెడన్నం పెట్టమంటూ" గుండె పిండిన ముష్టి దాని పలుకులు, సానబెట్టి సానబెట్టి రసిక హృదయము మీద విసరక, ఆ పలుకులు విని తామే కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ తెల్లబోతారు! ఏటిలోయ నుంచి "ఉబికే వాగుల్లోకి ఉయ్యేల లూగుతూ పోయి, వీపు వెనకాల ఎక్కడో సందరాన పుడుతూన్న సెందురూని సేరుకో" నెంచుతారు! (వాగులు ఏట్లో కలుస్తాయి గాని ఏట్లోంచి వాగులు పుట్టవుకదా! ఏట్లోంచి వాగుల్లోకి పోయేవారు వెనకవైపు సందరాన పుడుతూన్న సెందురుని చేరుకోవడ మెలాగ?) `తులను తూగు' , మేక గొర్రె మందలు, వంకరలను బారు వాహినుల ధవుడు, నిగనిగంబను చందన వగలకత్తె , అందాలకాడా అన్న ప్రయోగాలు చదువరుల దృష్టిని తమ మీదికి మళ్ళిస్తాయని చూసుకోరు. "వీసమంత జంకులేదు", జంకడము కర్మమేమి?

`శశికళ' బాపిరాజుగారిలో వింత మెరుగు. వారి తొలి గేయ రచనలో శశికళ గోచరించదు. కథలలో మాత్రము శిల్పసుందరి నెవతెనో ఆయన వెతికినట్లు కనిపిస్తుంది. `శశికళ'ను ఆయన `నా ఆశయమూర్తి, నా ఆత్మపూజా పీఠస్థశిల్పకళాలక్ష్మి' అన్నారు.. ఈయన కవితాశిల్పానికీ చిత్రకళా శిల్పానికేగాని రూప శిల్ప నిర్మాణానికని యత్నించినట్లు నే నెరుగను.`ఆశగానే నిల్చిపోయిన శిల్పకళాలక్ష్మియే ఈయన శశికళ అయిఉండునా?" అన్న అనుమానము కలిగింది నాకు. కాని గేయము లన్నిటినీ చూచిన తర్వాత శశికళ అనగా `తప్పటడుగుల కులికి తలుపుదాటిన వయసు' నించీ ఈయన అన్వేషించిన సౌందర్యమేనని తెలిసింది. తన జీవిత కాలములో నొక దశలో, తానే నిర్మించుకున్న తంత్ర మంత్రములతో నీయన శశికళాదేవతా ప్రత్యక్షము

కోసము కన్యా పూజను కూడా చేసినట్లు వింటాము. కనుక బాపిరాజుగారు యోగి కూడాను. `బ్రతుకే ఒక యోగ'మయ్యేనని చెపుతున్నారు ఈయన.

అయితే ఈ యోగానికి లక్ష్యమేమిటో తొలుదొల్తనీయన నిర్ణయించుకున్నట్టు లేదు. కనుకనే `వేచియుంటి ఎవరికొరకో, కాచియుంటి ఏ ఘటనకో' అంటారు. ఎవరివో `కల స్వనములు ' వినబడ్డవి. తరువాత `ఎవరో ఒక దివ్యరూప'మిరమిట్లయి మెరసిందట. ఆమె ఎవరో కాదు. ఆమెయే "శశికళాఖ్య". ఆమె `చంద్రలోకం తూర్పుదెసలో, సూర్యలోకం పశ్చిమంలో ఉన్న చిన్నలోకాన్ని ఏలే కన్నెరాణియట. ఈ రీతిగా బిడ్డను లాలించే ప్రేమంపుతల్లి ఊహాగానాలన్నీ బాపిరాజుగారు శశికళకు అంకితము చేయుట చూడగా శశికళ అన్నది కేవలమొక సంకేత నామమే ననిపిస్తున్నది. సార్థక నామమేమీ కాదు. ఆమె `సూర్యసుత', `చంద్రబాల' బాపిరాజుగారి `తపస్సిద్ధి'. ఈమె నుద్దేశించి కవిగారు చాలా గేయము లల్లినారు. అయినా ఈ గేయాలు ఆయన గారి శశికళామూర్తి ప్రలోభాన్ని బింబించినంతగా ఆమె సౌందర్య ప్రకాశమును చేయడము లేదు. మన దృష్టిలో బాపిరాజుగారు శశికళను వర్ణించే కవిగా కాక ఆమె నన్వేషించే కళామజ్ఞాగా నిల్చియుంటారు. ఏమంటారా? ఆయన తన యోగానికి ప్రతిఫలమైన శశికళ సాహచర్యముతోనే తన్మయులై సర్వమూ శశికళే అంటారు! అయినప్పటికీ ఆమెను నగ్న బాలగా, ప్రేమసఖిగా, రాణిగా, బాలికగా, దేవిగా, టక్కులాడిగా, ప్రాణప్రియగా ఊహించుకోవడమే ఈయన వ్రతము. అందువల్ల జగన్మోహన సౌందర్య వేషముతో దాటుకుపోయే శశికళను వెంటాడుతూన్న బాపిరాజుగారు "ఇటు తిరగ"మని అరిచేసరికి ఆమె ఇట్లు తిరిగి ఆయన గారి ఆరాధ్య ప్రేయసిగా మనకు దర్శన మిస్తుంది, "హితు లందరికీ వారి ఇష్ట దేవులు యెంకి, హృదయేశ్వరి, కిన్నెరసాని, ఊర్వశి కలరు నా బ్రతుకు శ్రుతి కలిపి వలపించు సతి యీమె"అని తమ కవితాసృష్టికి కారణమైన ఆ మోహినిని మనకు పరిచయము చేస్తారు బాపిరాజుగారు. నృత్య సంగీత అలంకారశాస్త్ర పారిభాషికా పదసుమములతో `దేశిక' అని ఆ `ఖేచరీ గంధర్వ' `బాల' `నాట్యము'ను పట్టుదలతో అర్చిస్తారు. అయితే ఆమె ప్రచ్ఛన్న మేమీ కాదు; వారు ఊహలతో నిర్మించుకుని అర్చించిన స్త్రీ మూర్తి . ఈయనను రంజించడము కోసము ఆమె `పూర్ణ నగ్నయై, చూర్ణకుంత లాగ' ఎదుట నిలుస్తుంది. `ఒక కౌగిలి ఒదిగిస్తుందీ', `ఒక ముద్దును కికురిస్తుంది' `చతుర గీతాలు పాడుతుంది'. అయితే ఈ భౌతికానందాలు పొంది కూడా తన ఈ రమణిని కవిగారు `మధుర మందానిల పరిమళము, మధుమత్త శారదాత్మిక సుషమ',`కాదంబినీ వక్షనటశంప, హిమజ యమునా గమన గానము' అంటారు. ఈ మాటలు నమ్మడానికి మనమంతా గట్టి యత్నము చేద్దాము. శశికళ చేతిలో కవిగారుంచిన డమరుకపు ధ్యానములో కన్నులు కానని రూపాలూ,

ప్రత్యూష చాలా ధరారుణిమలూ, బ్రతుకంతా నిరీక్షణమూ మతి యంతయు వీక్షణమైన నిలువరములూ, తీపి బరువుల గీతములూ, వేసవిని పుట్టిల్లు వెడలిరా నలసించు వాహినులూ, అదృశ్యములై నిలబడిపోయినవి. బాపిరాజుగారు ధీర లలితులు, సౌందర్యాధి దేవత ఖండిత నాయిక, మరి వారిరువురికీ సయ్యోధ్య ఎట్లు?

అయితే ఈయన మొండి ప్రేయసుడు. `శశికళ' ఈయన యెడ జూపిన కూరిమి ఎంతపాటిది అయినా ఈయన తపస్సు మాత్రము గొప్పది. జీవితమంతా కాలికి బలపమ్ము కట్టుకొని ఆమె వెంట తిరిగినారీయన. వీరు అక్షర నిక్షేపము చేయగలిగిన సౌందర్యము కంటె అందిపుచ్చుకున్నట్టానందించుకున్న సౌందర్యరాశి పెద్దదే కావాలి, వీరిని ముందుకు నడింపించినది. ఓపికా సంయమనమూ సుందర కావ్య రచనకు వలసినంత లేవు. కనుక ఈయన గేయాలు కొండవాగులవలె ఒకచోట జలపాతాన్ని భోరుమని వినిపించి జారుకుంటాయి. వీరి పెద్ద కథలు మాత్రము పొడూగునా తీర్చిదిద్దిన రాధారివలె సాగిపోతాయి. ఆవేశ సమయాల్లో ఈయనను కికురించి దాటుకుపోయే `శశికళ' కథానికా రచన కాలంలో ఈయన సహచారిణి. వీరి శైలబాల, తిరువతి కొండమెట్టు, నాగలి విశ్వసాహిత్యపంక్తిలో పీట వేయవలసిన కథలు.

## పింగళీ కాటూరీ కవులు

`కవితాసామాగ్రి' అనే ఖండకావ్య రచనతో నవకవుల పంక్తిలో పీట వేసుకున్నారు. వీరు తిరుపతి వేంకటేశ్వరకవుల శిష్యులు. జంట గూడుటలో గురువుల ననుకరించినారు. రామిరెడ్డి, అబ్బూరి, రాయప్రోలు కవులకు ఉండినంత మాత్రపు సంస్కృతపద వ్యామోహమునూ వీరు చూపలేదు. వీలైనంతగా తెలుగు మాటలను వాడే యత్నమే చేశారు. `తొలకరి' అనే ఖండకావ్య సంపుట రచనలో. వీరి గొంతు పల్లెటూరి కాలిబాటవలె సరళసుందరము. వీరి `కవితా సామాగ్రి'ని నవకవులు తమ కావ్య పఠనాలలో పాడి వినిపించడము ద్వారా ఏ ఒక్క ఖండకావ్యానికీ లేనంత ప్రఖ్యాతిని తెచ్చారు. అసలే చక్కని ఖండకావ్యము, దానికి తోడు సభాపఠన సౌకర్యము బంగారానికి మెరుగు! బందరు పేటలలో పికాంగనా గాన నిస్వనము, కుందనపు తళ్కు, కలువరేకుల మెత్తందనమ్ము, మలయ పర్వతపు కమ్మ తెమ్మెరలు, వెన్నెల తేటనిగ్గు, పచ్చకప్పురపుతావి, పటీర జలము, పూవుదేనే, అమ్మజూపుతాడు కవితా సామాగ్రిగా బేహారి. కావ్యకృన్నామసాధన చింతాపరు డొక్కడు వీధికి వచ్చి ఆ కవిత్వపు సామాగ్రిని విచ్చి `ఇవేటి వస్తువులు వర్తకుడా' అని నవ్వుతాడూ, కవిత్వమంటే ఎరుగనివాడవని హేళన చేస్తాడు. తక్కిన వారు ప్రౌఢ సమాసకల్పనమూ, శ్లేష కవిత్వ మంజూష ఆశుకవిత్వ మంత్రములూ,

ఫారసీమట్లు వ్రాయబనికివచ్చు వస్తువు ఉంటే బయట బెట్టుమని ఎగబడతారు. సెట్టి అంగడిని సర్దుకొని `మందు మాకు లీ యంగడి యందు లేవు, సుకవి, భోజ్యమ్ముౢలీ వస్తువులు వీని కలచివైచి నలిపివేయకు'డని వెళ్ళిపోతాడు. అమ్మకపు కేకతో చదువరుల్నీ శ్రోతల్నీ ఆకర్షించి, తిక్కయజ్వ, పింగళి సూరన్న, చేమకూర వెంకన్న, తిరుపతి కవులూ ఈ సరకే వాడినారన్న వింత వార్త వినిపించి, కావ్యకృన్నామ సాధన పరులకు రుచిని బయటపెట్టి, అదనపు సామాగ్రిని ఉటంకించి గుత్తమైన నిర్మాణము చేసినారు కవులు ఈ ఖండ కావ్యంలో. ఇది వినబడేవరకూ, తెలుగు రసికులను ఉన్నచోటులోనే చెయ్యిపట్టి కావ్యసంచార మార్గంలోనికి తీసుకుపోయి మెప్పిస్తూ ఆశ్చర్యములోనికి విసిరే ఖండకావ్యము - కథనము చేసేది పద్యాలలో ఉన్నదీ - మరియొకటి వినబడి యుండలేదు (గురజాడ కన్యక, పూర్ణమ్మా, ముత్యాలసరాలూ పద్యాలలో లేవు) కనుక ఈ ఖండకావ్యము ఆపాతమధురమై తెలుగు వారి నలరించింది. దీనిలో ప్రస్ఫుటముగా కనిపించే ప్రకృత్యభిమానము నవకవితాభిమానులకు ఆదరపాత్రమై ఈ కావ్యాన్ని వారి మేనిఫెస్టోగా మార్చింది.

అయితే ఇలాటి చక్కని కథాకల్పన వీరి తొలకరిలోని తక్కిన రచనల్లో కానరాదు. వాటిని చదివితే రామిరెడ్డిగారి `కృషీవలుడు'లోని సంచార పద్ధతి జ్ఞాపకానికి వస్తుంది. తొలకరి ప్రచురించేసరికి కృషీవలుడు వచ్చిందీ, నవకవితాభిమానుల్ని ఆకర్షించింది కూడాను. `తొలకరి'లోని కవి శిశువు, కోకిల, సంక్రాంతి, `ఎత్తిన తలవంచకయె వియత్తలమున దృష్టి నిలిపిన కవిని కాక సంచారము చేసే కవిని చూపిస్తాయి. `కోకిల లోని శైలి తిన్నగా వచన పద్ధతిలో సాగిపోతూ పింగళి లక్ష్మీకాంతము గారి వచన రచనను జ్ఞప్తికి తెస్తూన్నది. సంక్రాంతిలో ఆ పండుగకు కనబడే సుందర సామాగ్రి ఉన్నది గాని రచన సుందరముగా లేదనిపిస్తోంది. "జొన్నచేను"లో చిన్న వానికీ చిన్నదానికీ జరిగిన సంభాషణలో చిన్నవాని మాటలు ఎక్కువగా సాగిపోయి చిన్నదాని చేష్టలను మరుగుపరచినవా అనిపిస్తున్నది. లేకుంటే "సెనగపూరైక దొడిగిన చిన్నదాన!" అని జొన్నచేనిపై నుంచి అర్రెత్తి చూచు చిన్నవాడు మనకింకా సానుభూతిపాత్రుడై యుండును. ఇది అందమైన ఖండకావ్యము.

చివ్వరి పది పంక్తులూ చిన్నవాని ఆపేక్షను చక్కగా చూపిస్తున్నాయి మనకి, కాని కొన్ని మాటలూ వాక్యాలూ సంస్కారమూ కోరుతున్నాయి. `ఎడబాటు'లో భావసూత్రము నిరంతరాయముగా సాగిపోలేదు. `జరియింప రట్టి నీ పెంటినిబాసి' ఎట్టి పెంటిని? `ప్రయత్నింపడుగా ..... బరీక్షింపడుగా.... నాసింపదుగా' అన్నచోట్ల రచనా సామరస్యము సాధించే తమకము రచనా సౌందర్యాన్ని తోసివేస్తున్నది. `తెలికన్నుల', `తెలినులిరెక్కల' చెల్వము బాగా నచ్చినందువల్లనే కాబోలు నీరు

కూడా ఎనిమిదో పద్యములో `తెలినీరు' అయింది. ఈ కావ్యాన్ని (రెండో పద్యములో) చక్రవాక సంబోధనతో ప్రారంభము చేసి నడిపేరు ఏడో పద్యందాకా. ఎనిమిదోపద్యంలో సంబోధనమార్చి `రామలు నీకూ ఉన్నారురా నిశాచరా!' అన్నారు. ఆ పిమ్మట సంబోధనము చదువరులవైపు త్రిప్పి `అకటా! మనజక్కవ పెంటి ..... ఏడనున్నదో' అన్నారు. కొసాకిమళ్ళీ `కోకమ తెల్లవార దనుకోకుమ' అన్నారు. ఒక్క ఖండములో ఇంత కృతకమా? కవులు ఇద్దరు కనుక ఇద్దరమూ కలిసితిరుగుతూ వ్రాశామని మనకు స్ఫురింప జెయ్యడానికే కాబోలు `పోయివచ్చెదము, చూతుము' అన్నారు ఈ కావ్యంలో. `రసాలము' లో ఏకవచన ప్రయోగము చేశారు. ఇద్దరికి భావైక్యత కుదరదు. `అజ్ఞాన కృతము' అపురూపకల్పన! పూలతీవ-, పూవుగవ-, చల్లగాలి-, భృంగ కుమారుడూ-, మీది ప్రేమ మామూలు శ్రుతిని మించి ఉచ్చస్థాయిలోకి వెళ్ళిపోయింది. జంటపూవులలో ఒకదానిని కోసిన వెంగలిపుత్రుని కటికితనముచూచి కవికి భయమైనదట. `కన్నుల నీరిడకమ్మ(!)తీవముత్తైదువ! పెద్దదానవుగదా కలకాలము నీకు మేలగున్' అంటున్నారు దేశికులు. రాయప్రోలు వారి `తీవచెల్లెండ్రు' ముదిరి ఇక్కడ ముత్తైదువలైనారు! యుక్తమే కదా? `రసాలము' మామిడి చెట్టును చూచి చెప్పిన పద్యాలు. వీటిలో రసాలమును చూచినందువల్ల కలిగిన భావాల కంటే అల్లిన ఊహలే ఎక్కువ కనబడుతున్నాయి. కాలవశము చేత జిగిదూలిన యెలమావి ఆ కాలవశమ్ముచేతనే వికసించెనట, తేనె దొన్నెలట మామిడికి! `లతాంత రజమ్మను కుంకుమమట' ఈ ఊహలు ప్రబంధకాలమునాటివి. మామిడిని చూచిన వాటివి కావు. ఇది నవకవిత్వము కాదు. `కాకపోతే ఏమి మునిగినదీ' అంటే నాకేమీ అభ్యంతరము లేదు. కాదని మాత్రమే ఇక్కడ చెప్పబోయినది. తక్కిన రచనలలోని `క్షీరసాగరవీచికా కపోలమున (!) శీతకరు తొలిముద్దు (!) వలన వెల్లివిరిసిన యెలసిగ్గు', `ద్విజకుల వనితలారా, ?లుకు జవరాలి వీణతో గలిపి యొక్క మంగళము పాడరమ్మ' అన్న కల్పనలు ?వులు దర్శించిన సౌందర్యమునుకాక కలలుగన్న సౌందర్యమునే చూపుతున్నాయి. ?వి దర్శించి వర్ణించిన సౌందర్యము చదువరుల సౌందర్యచైతన్యాన్ని పెంచుతుంది. ఉత్ప్రేక్షలతో కవి నిర్మించిన సౌందర్యము కవి చేసి రంగులు వేసిన కొయ్యబొమ్మవలె ఎదట నిలబడుతుంది. దాని నిర్మాణాన్ని మెచ్చుకుంటాము కాని, అది అనుభవము కాకపోవడము వల్ల జల్లుమనము. `ఎవరు నీవు' రాయప్రోలు స్వప్నకుమారము వంటిది. పొడుపుకథలను జ్ఞాపకము చేస్తోంది నాకు. `బోనులోని సింగము' ఇది వరకు చెప్పిన వచనాలకు తోడు మరియొక వచనము. దీనినిండా పురాణాలు చెప్పేకబురులు, సింహ దర్శనము లేపే భావాలు కావు. `కాంతారమునకు సార్వభౌముడవై (మృగరాజు కాంతార సార్వభౌముడయ్యాడు!). `మత్తహస్తి మస్తిష్క

మారగించి' సమశిలా సింహపీఠి' మీద కూర్చున్నదట సింహము. సింహపీఠి అంటే ఇటూ అటూ సింహాలు తీర్చియున్నపీఠి. ఇక్కడి సింహపీఠి ఏది? సింహము కూర్చున్న పీఠిని సింహపీఠియనవద్దా అంటే మరి జవాబులేదు. ఇంకావినండి `మనుజ మర్కటమా! నీకు మంచికాదు సింగపున్ స్వేచ్ఛ హరియింప.' విడిచిపుచ్చుము సింగము విడిచిపుచ్చు మనుజుడా'. ఉపాధ్యాయుడు బెత్తము పట్టి చెపుతూన్నట్టు వినపడుతోంది నాకు. `రక్త తిలకము'లోని `ఏటికీ గతిని గిరాత బాణహతిగారియ పాల్గొనరించినాడనే', నీకు నా మీద దయగలుగదె?' `దీనికి గడవులేదే?', గట్టెలగొట్ట జేసితే', `కాంతారమ్ము పాల్పడితే?' అన్నపలుకులు పద్యము పద్యానికీ చివ్వరకవి వాక్యాల్లాగా చేరుతూ భావానికి ప్రవాహగతి రాకుండా అడ్డుపడుతున్నాయి. `ఆజిద్రేళ్ళుచు'! (ఎంతసేపుంటారు ఆజిద్రేళ్ళే స్థితిలో?' `మజ్జనకు నాజ్ఞ' (సంబోధన మారింది. ఎవరితో అంటున్నట్టూ ఈ మాటలూ? స్వగతంలో `మజ్జకు నాజ్ఞ' అంటున్నాడు!) వంటివి అల్లడానికి యత్నించే వేళ్ళను చూపిస్తున్నాయి అడుగడుక్కీ. "అక్కడ యేటి కింత" నాటకంలో స్వగతం పద్యాలలోని అల్లరి అంతా దీనిలో ఉన్నది. అక్కడ సీను, పూసలకోటు, పౌడరుపూత, కొంత ఏమారుస్తాయి గాని ఇక్కడో?

ఈ కావ్యము పేరు `తొలకరి'. నవకవులు ఎంచుకునే పేరుల్లాంటిది. దీనిలో అనుభవాల నవ్యత, హృదయాల్ని కదిలించేది నా కంతగా కానరాలేదు. జల్లు జల్లు మనిపించే మానవత్వము కాక, మానసత్వమే నిండియున్నట్టు తోస్తున్నది నాకు. ఆధునిక కవిత్వములోని నవ్యత వీరి కంతగా పట్టలేదనే నా నమ్మకము అందుకే చిరకాలము వీరు మళ్ళీ కావ్యరచన చేయలేదు. వీరిద్దరి స్వభావాల వలెనే రచనారీతులు భేదమైనవే. నేనెరిగినంత వరకు లక్ష్మీకాంతముగారికి ఆధునిక కవిత్వమన్న గిట్టదు, దానివైపు వారు జూడరు; వారి శిష్యులు కొందరు చేరి వారధ్యక్షులుగా ఆధునిక కవిత్వము ఆంధ్రకవిత్వమునకు వేరుపురుగని - ఈనాడు కాదు- 1934లోనే వాల్తేరులో తీర్మానించారు. వెంకటేశ్వరరావుగారికి అందముగా ఉన్న కవిత్వ మేదైనా నచ్చుతుంది. కాబట్టి వారికి ఆధునికుల సాహచర్యము తప్పలేదు. ఈ యిద్దరు కవుల వైయక్తిక రచనల పరిశీలమునకు ఈ పరిచయము చాలుననుకుంటాను.

పింగళివారిది ముఖ్యముగా విమర్శనాదృష్టి. విమర్శకున్నూ కవితా రచనకున్నూ అంతగా పొత్తు కుదరదనుకుంటాను నేను. విమర్శకు మానవత్వము - ఆలోచన- ఎక్కువ అవసరము. కవిత్వ రచనకు మానవత్వము- అనుభవించగల శక్తి - ఎక్కువ అవసరము. ఆలోచనలకు వైయక్తిక ముద్ర బలంగా ఉంటుంది. చదవగానే

చదువరిలో విమర్శనాదృష్టి మేలుకుంటుంది. భావాలకు మానవ సామాన్యమైన హృదయముద్ర ఉంటుంది, తక్కిన వాటికి హృదయాలను జల్లు మనిపించే శక్తి ఉంటుంది. `నీ బండచెవికి శూలములవలె నాటినచో మరొక్క యెడకు బోరాదె?' దిక్కులేనట్టి వారికి దిక్కు దేవుడనెడి వాక్యము సత్యమే యైనయెడల `బరభృంతబది నీచేత బడకమున్నె భూత నిర్మాణ కర్తయే ప్రోచుదాని' అన్నవి ఆలోచనలే, భావాలు కావు. `అన్ని పండువులందు ముఖ్యమిది గాన నత్తవారింటికేగుమో కొత్త పెండ్లి కొమరుడా' అన్నది తర్కము.`పెద్దదానవు గదా ?' (సింహముతో) `సత్యమునకు గట్టుపడి యిటులుంటివే కాని నిన్ను గట్టివేయగ నెవనికి గలదు శక్తి?' అన్నవి వైయక్తికములైన ఆలోచనలు. విమర్శను మేలుకొలుపుతాయి, అనుభవాన్ని కాదు.

కాటూరి వేంకటేశ్వరరావుగారిది ఆర్ద్రహృదయం. అక్కడి నుంచి ఏది వచ్చినా కోమలంగా వస్తుంది. కోలవెన్నువారు బందరు జాతీయ కళాశాలను విడిచిపోయేనాటి వీడ్కోలు పద్యము వినండి : "ఈ యెలమావి నీడ వసియింపక వేసవి మండుటెండకున్, చేయొకటడ్డు జేసికొని చెమ్మట లోడగ ముండ్ల బాటలన్, పోయెడు బాటసారి రసపూరము నీ మది లేత వెన్నెలల్ గాయునో, నీ యపాంగమున గాపురమున్న వియో వసంతముల్." వీడ్కోలు పద్యం ఇంతకన్నా హార్దికంగా ఉండగలదా? `ఆంధ్ర గీర్వాణ కవిరాజు లాంగ్ల సుకవులల రవీంద్రుడు సలుపు గావ్య సుమ మాలలు తలదాల్చుకొనెడు పాటి సరసత ఘటిల్లె. జాలు నీ జన్మమునకు ' అని హాయిగా మెదలకుండా జీవితము గడిపే తత్వము వారిది. అయితే. అప్పుడప్పుడు `చేసి యెరుంగ దేవతల సేవలు, తీర్థములాడ , క్షేత్ర సంవాస మొనర్ప, విపుల సపర్య లొనర్పను.... దానము ధర్మ మెరుంగ...' నంటూ కళవళపడే ఘడియల తర్వాత, ఏ `ఇంద్ర కీలాద్రి కందరాకృతవాస, శేఖరీకృత శీతమయూఖరేఖ, కృష్ణ వేణ్యాపగా క్షాళితాంఘ్రి కమల'నో, `అరుణగిరి కందరావృత...స్వామి'నో స్మరించి కీర్తించి నిలద్రొక్కుకుంటూ ఉంటారు. ఆ పద్యాలు నీలాకాశంలో ప్రసరించే బలాకా రేఖల్లాగా మనకి హాయి గొల్పుతాయి. నిండుమనస్సు నవ్య నవనీతమూ పల్కు ఇక్షురస ఖండమూను మరి హాయికి లోటేమిటి? `కాలు పెట్టినట్టి నేల నెల్లనం గడ్డ జేయ నేర్తు'రట కమ్మవారు. హల ముఖాన పల్లియ నొసంట భాగ్యరేఖ దిద్దినారట. `కష్ట సుఖములందు గలిమి లేముల యందు బంచి కుడుచునాట పల్లె బ్రదుకు కనుమొరుగె'నట. `ఎద మెదిలెడి బాధ వెలికి నిటు లుబ్బిన'దట. అగ్రజునకు ఈయన తుదకిచ్చినది`నిష్ఠురాగ్ని సంస్కార'మట! మెత్తని మాటలతో చలనశీలములైన వృత్తములతో వెంకటేశ్వరరావు గారు పౌలస్త్య హృదయము, గుడి గంటలు రచించినారు. మొత్తముమీద వీరి కవిత్వానికి చెప్పే పద్ధతే జీవము, వస్తు నవ్యత కాదనిపిస్తుంది నాకు. ఊహలవల్ల నలరించు యత్నమే గాని భావములతో తాకి జల్లు

జల్లు మనిపించే యత్నము కాదేమో వీరిది? పరిశీలించండంటున్నాను. వీరిది ప్రాచీన కవుల సాంప్రదాయమే, వీరి బలము పురాణ గాథా సర్వస్వమే, వీరి స్వామి మాణిక్య కిరీట కాంతి నిచయాంధీ భూత సప్తాశ్వుడే, ఆయన చరణములు అబ్ధిజామృదుల పాణి సరోరుహ సేవితమ్ములే.

# నాయని సుబ్బారావుగారు

తన అనుభవాన్నే ప్రపంచించి సౌభద్రుని ప్రణయయాత్రా, మాతృగీతాలూ వ్రాశారంటారు తెలిసినవారు. నవ్యకవిత్వ ప్రాదుర్భావదశలో శరీరాల స్పృహవల్ల కలుషితము కాని ప్రేమను రాయప్రోలు కీర్తిస్తే నవ్య కవిత్వపు టుచ్ఛదశలో నాయని సుబ్బారావుగారు ఆ ప్రేమకి కారణమైన ప్రేయసిని విహాయస పథాలకెత్తి(పరుల కర్థమ్ముకాని) భావ గీతాలలో అర్చించారు. వత్సల ప్రేమానిల హృదయమునకు జలజబాంధవు నిదుర మేల్కొలుపు బులుగులూ, గీతమ్ము లొలుకు పికమూ, కాల మేఘము నంటియే క్రాలు కలికి మించు చందమామను చేరు రోహిణితార, ప్రేమనే చిలుకుతున్నట్లు తోచుతుంది. కవి దృష్టిలో ఆమె తలపులన్నీ `వలపులే'. అయినప్పటికీ ఆ తలపులలోనూ, సౌభద్రుని నిర్వేద`గీతము'ల లోనూ వాటిలో వాటిని పేర్చి పట్టే భావసూత్రము లేదని నా అనుమానము. ఒక పద్యము తీసినా, (అలాంటిదే) ఇంకొక పద్యము వేసినా మార్పు రాదు. ఇవి ప్రేమ గీతలు. వీటికి మొత్తపు కావ్యము మేలుకొలుపవలసిన భావఝురిపై మమత లేదు. వర్ణనా సౌందర్యము మీదనే వీటి మొగ్గు.

"అది నడచు వేళల నేల జీరాడు కుచ్చె, రేపు దుమ్మున నొక త్రసరేణువునయి, దాని తనువున బుట్టు స్వేదమున గలిసి కరిగిపోదును రూప మేర్పరుపరాక' అన్నపుడు వాచ్యార్థము బలంగా స్ఫురించి చిరునవ్వు గొల్పినా, వ్యంగ్యార్థము - ఆమె మీద ప్రేయసుని మమత - వల్లనే ఈ వర్ణన నిలద్రొక్కుకోవాలి. వాచ్యార్థము ఇంకా బలమై "అది యుషస్స్నాన మొనరించి యంత గట్టుకొనిన పచ్చని పట్టు దుకూలమందు నార్ద్రమగు లే జరీయంచునై తదీయ దేహమున గగుర్పాటులు దిద్దుకొందు"నన్న పంక్తులలో వలె వ్యంగ్యార్థాన్ని జరీ మెరుగులలో ముంచేస్తే ఈ వాచ్యార్థాన్నే చూచి, చదువరి, ఈ వింత ప్రేయసుని కుతుకమునకు అక్కజపడతాడు. వాచ్యార్థమును ఇంకా పెంచి పఠాభివలె 'రవికందున గుచ్చబడి స్వర్గద్వయంబు మధ్య నూగాడుచున్న పార్కర్ కలంబుగా నున్న నేను, నా రక్తాన్నే సిరాగా పోస్తాను' అని వ్రాస్తే ఆ ప్రేయసుని కుతుకమే పైకి తేలిపోయి నవ్వించేస్తుంది చదువరిని.

ఉత్ప్రేక్షాలంకారమును వాడడములో ఈ చిక్కు చదువరికి స్ఫురించవలసిన వస్తు సౌందర్యము కంటె, వర్ణనా వైశిష్ట్యము సాధించడానికి కవి పడే తంటాలే పైకుబికి కనబడడము - చక్కగా తెలుస్తుంది. ప్రబంధకవుల ఉత్ప్రేక్షలు ముప్పాతిక మూడుపాళ్ళు ఇలాటివే. నాయని వారి ఉత్ప్రేక్షలు వర్ణించే వస్తువు యొక్క సౌందర్యాన్ని విడిచి ఆయన చేసే కల్పనలను సూచించేటంత దూరంగా వచ్చేస్తున్నాయనిపిస్తోంది నాకు. వత్సల `ప్రియుడొసంగిన వలపుల విరి సరమ్ము చిత్తపేటిక దాచి రేకొత్తకుండ రాగ రసమున' ప్రతిదినమూ తడిపెద ననుకొన్నదట. ఇంకొకచోట `హృదయ పుస్తకమందదికింపబడిన ప్రేమగీతాల పుట జింపివేయు టెట్లు? చినుగు వెంబడి పైకెగజిమ్ము రక్తమున గలసి ప్రాణముల్లేచి పోవకుండ' నంటారు. అసలు జరిగిన సంఘటన కంటె ఆలంకారికపు టూహయే సత్యమంటున్నారా అనిపిస్తుంది. " ముడుచుకొని యున్న హృదయంపు మొగ్గ విరియ వలపు దేనియ "యిదె" జాలువారుచుండె" నని ఏదో వొలికిపోతున్నట్టు ఇంకొక చోట. ప్రళయరుద్రుని కేళికారామమైన ఈ భయావహశూన్యమందు' అని ఆకాశాంతరాళాన్నీ, `పులకరించినది గట్టులు పొర్లు సెలయేటి కౌగిలింతలకు కంకర పొలమ్ము' అని పొలాన్నీ వర్ణిస్తే సరేగానీ,`ప్రణయినీ! స్వప్న వారధిపైని లేచు నీ వియోగ కథా వీచికా విలోల పంక్తులావలి దరి నుండి వచ్చి వచ్చి నా హృదయతీరమున యందు నాట్యమాడు 'ననీ,`దృఢాలింగ నాసవాస్వాదమత్తతను యుగమ్ము సమ్మోహనో "దధినిలోల వీచికాడోల నూగుచో"అనీ, దృఢాలింగన సుఖాన్నీ అంతకంటే అపరిచితమైన ఆసవపానంతో పోల్చి అనుభవాల వర్ణనకు ఉపత్ప్రేక్షాలంకారాన్ని దింపడాన్నీ చూస్తే ఈ నవ్య సౌభద్రుడు "వలపు"కీ" పూర్తిగా నీయబడిన" ప్రేమ అలారము గడియారమూ అనిపిస్తుందీ, అభిమన్యుడిలాంటి ప్రేయసుణ్ణి "ప్రేయసీ, అనురాగహాలికునిచేత చక్కగా దున్నబడిన నా స్వాంత భూమి నీ వలపు వాన చినుకులు త్రావి, త్రావి, అవ్యయావ్యక్త భావ సస్యము లీను'ననిపిస్తే, ఎవరో ఉత్ప్రేక్ష జీవితకారుడు అభిమన్యుడి వేషము వేసుకొచ్చినట్లనిపిస్తుంది.

అయితే, చిత్రమంతా ఎక్కడున్నదంటే, నాయని సుబ్బారావుగారికి ఇదంతా తెలుసునా అన్న అనుమానంలో, ఆలంకారిక వాతావరణాన్ని క్రమక్రమంగా పెంచినారు, చివ్వరికి ఆలంకారిక ప్రపంచాన్నే నిలిపి మేడలు కట్టినారు. ఈ ఎంపికను గుర్తిస్తే వారు ఆలంకారిక సామాగ్రితో వింత ప్రపంచాన్ని నిర్మించ యత్నించినారా అన్న అనుమానము తట్టుతుంది. `పడవ పగిలిన' అన్న ఖండము వినండి: `ఇది పగిలిపోవునను భయమ్మింతవరకు, ఈ తలంపున ఆనందమిపుడు పొంగు, పగిలిపోయిన చెక్కల పట్టు విడువ, కీవు పాథో నిధానము నీదెద వని!' పడవ అనగా ఈయన యత్నాలు కావాలి. ఆ యత్నాలు పగిలిపోతే ఆ చెక్కలతో ఆమె పాథోరాశి

నీదుటేమి? ఇది సౌభద్రుని ప్రణయయాత్ర కదా? ఆయన పడవలో యాత్ర చేసి ఆమెను చేరవలెను. పడవ అనగా జీవితమే కావచ్చును. జీవితమే శిథిలమైపోతే, ఆ జీవితపు తునకలు, తనకు ప్రేమపాత్రములు కనుక ఆ స్మృతులతోనే పాథోధి వంటి జీవిత శేషాన్ని ఆమె తరిస్తుందా? ఇదే కవి ఉద్దేశ్యమైతే "తునిగిపోయిన చెక్కలతో పయోధి గర్భమున రత్నరథ మీవు కట్టెద"వన్న ఊహ ఏమి? ఆమెకు తన ప్రణయ యాత్ర కథ చక్కగా తెలిసినదనీ, తాను ఇక యేమయిపోయినా ఫరవాలేదనీనా? అయితే `విరిగిపోయిన చెక్కల దరికి జేర్చి నీ చితికి కాష్ఠములుగ మన్నించెదవని' అనగా ఏమిటీ? తన ప్రేమ యత్నాల స్మృతిలోనే ఆమె కూడా అంతమవుతుందనా? వాచ్యార్థము `చెక్కలు' `కాష్ఠములు' అన్న మాటలతో యెబ్బెట్టుగా ఉన్నట్టు కనిపిస్తూ ఆమె తన ప్రేమను గుర్తించినదన్న భావము కన్న, తన ప్రయత్నపు పడవ చెక్కలతో యీదుననీ, వాటితో రత్నరథము కట్టుననీ, వాటిని కాష్ఠములుగ మన్నించుననీ, అన్న ఊహాలే కవికి ఎక్కువ ఇష్టము కాబోలు అనిపిస్తాయి. `తూర్పిడి' అన్న ఖలకములో వ్యంగ్యార్థము ఇంకా కప్పబడిపోతూన్నది. "తావకామృత స్నిగ్ధ మధుర హృదయమున నికరమ్ము (అయినదేదీ అని) ఊహించు నాస నేను ఇన్ని క్రంతల జల్లెడ చేత బూనితి" నంటాడు సౌభద్రుడు. చేటతో తూర్పారబట్టి, జల్లెడతో ధాన్యాన్ని వేరుచేస్తారు. ఈయన`అమృతస్నిగ్ధ మధుర హృదయము' ను ఎందుకు తూర్పారబట్టవలసి వచ్చినదీ అన్న ప్రశ్న అలాగ మిగిలిపోతుంది. ఇక `పొల్లునందు ధూళి ధూసరితగాత్రుడను ' `జల్లెడయును గళితమ్మయనుము' `ఇక కొంత గాలి యించుకంత యనుకూలమైన' అన్న ఆలంకారిక భాషలకు వ్యంగ్యార్థమేమి? అని వెతుక్కోవలసి వస్తుంది. వాటిని వెతకకుండా తూర్పారబట్టి ప్రతికూల పవనము ఉగ్రముగా వీచినను, చేత జల్లెడ జారిపోయినను, నికరమైన హృది చూచే ప్రయత్నములో క్రంతల జల్లెడ పట్టిన యువక ప్రేమికుని చూచి ఆనందించుకోవడమే మేలు. కల్పనా ప్రపంచాన్ని బలం చేసి, వ్యంగ్యార్థాన్ని అచ్ఛాదించే యత్నము కాదా మరి ఈయనది? `నిత్య క్రీడ' యట ఇది ఒక్కటి వినండి నా యత్నాన్ని చక్కగా చూపిస్తుంది: "ఉదయ సంధ్యానవాంశువులదుమ దద్దరిల్లి ఆశాంతములనుండి మెల్ల మెల్ల కుంచు కొనిపోవు నీ నీడ కొనలవెంట చేరుకొందును నీ పదాంభోరుహములు. ప్రబల మధ్యాహ్న తీక్ష్ణాతపమున కలగి అలసిపోయిన నీ నీడ గలసిపోయి ప్రణయ భావాలె మధుర విశ్రాంతి కొరకు నీ శరీరాంచలములంటి నిలిచియుందు. అపర సంధ్యార్ద్రరోచుల నమృతరాగ మంజు రంజితమై సాగి మరల దెసలు క్రమ్ముకొనిపోవు నీ నీడ గలసి వెడలి ఆయనంత దిగంతము లావరింతు." ఇదంతా కల్పనా ప్రపంచమే. వాస్తవ ప్రపంచములో దీని

అర్థమేమో తెలుసుకోవడము అసాధ్యము. ఇదేదో స్వప్నలోకపు దృశ్యము. ఈ రకపు దృశ్య నిర్మాణము కోసము ఉత్ప్రేక్షను కరిగించి కరిగించి యత్నము చేశారా చూడండి అంటాను.

నాయని వారి పద్య రచనాధార నిరాఘాటమైనదీ మెత్తనిదీను. వచనరీతి తల చూపనే చూపదు ఎక్కడా. "కడలి వరకు వాకలు కట్టి `పారు' గిరి కుమారుని ప్రేమ గీతాల పొంగు"వలె వీరి పద్యాలు ప్రవహిస్తాయి. వీరి మాతృ గీతాలు ఆనాటి ప్రేయసీ గీతాల నడుమ సర్వ జనాదరణము పొందినవి. తల్లి అందరికీ అభిమానపాత్రురాలే కదా? `పోయినది పార్వతీ దేవి' అన్నారుట మరణించిన ఈయన తల్లిని కనుటకు వచ్చిన జనము. ఈయన అంటారు "మరల నీ వచ్చుటెన్నడో మంట మండు నా కడుపులోన కుడుము లుండ్రాళ్ళు పడియు చలువ లూరించు టెన్నడో తెలియబడదు, జగతి నింక వినాయకచవితి లేదొ" అని. పరుగెత్తె భావన చివరి ఊర్పులో సువాసనలు నింపే ఈ గుణము సౌభద్రుని ప్రణయయాత్ర `కృష్ణ యొడ్డున'లో కూడా కానవస్తుంది.

ప్రేమ తరంగ గామియైన సౌభద్రుని ప్రణయయాత్రలో వినవచ్చే అలంకార ఘంటా నినాదము మాతృగీతముల నైసర్గిక నిర్వేద నిశ్శబ్దములో వినరాదు. రెండు గ్రంథములూ, ఇంచుమించు ఒకే కాలపు రచనలన్నారు విశ్వనాథ వారు పరిచయవాక్యాలలో.

**భారతి, ఫిబ్రవరి 1963**

# 5. యెంకి పాటలు - కిన్నెరసాని పాటలు

పాటలు బయలుదేరిన కాలంలో అధికార్ల సూర్యనారాయణరావు గారు `జానకి' అన్న ప్రేయసికీ, ఆమె ప్రియునికీ గల అమల ప్రేమను గురించిన ఖండకావ్యాలు 1917 నాటికే రచించి, నండూరి సుబ్బారావు గారికి వినిపించారు. ఆనాటి తెలుగునాటి సాంఘిక పరిస్థితులలో ప్రౌఢ ప్రేయసులు భార్యా భర్తలుకాక, వేరొక జంట ఉండగల అవకాశములు లేవు. కనుక శరీరాకర్షణను అతిక్రమించిన ప్రేమను వర్ణించ యత్నించిన అధికార్ల వారు జానకినీ, ఆమె భర్తనూ ఎంచుకొని, గీతాలు రచించారు. వీటిలో దాంపత్య ప్రేమ ముగ్ధ మనోహరంగా గోచరిస్తుంది. జానకి చక్కనిది. అయినా నల్లని వరుని పెండ్లాడింది. ఇరుగు పొరుగు అమ్మలక్కలు అడిగితే `వలపు నిలిపిన వాడు నలుపైననేమె, నా బాలకృష్ణుండు నలుపైననేమె' అంటుంది. ప్రాణ విభుడెప్పుడో కొంచెము తన ప్రణయాన్ని అలతిచేస్తే, "అణువు కంటెను అణువుగా నగపడిననూ, మహితమా వానికంటెను మహితమిద్ది" అంటుందీమె. అతడు `మర్రి నీడలందు ప్రకృతి పరచిన పచ్చికపట్ల మీద విశ్రమింతము జానకీ వెడలి రమ్మం'టాడూ, వియోగ వేళలలో `మనసు నీ వద్దనే యుండు, తనువె పోవుచుండె'నంటాడూ, `పక్షులెల్ల కులాయముల్ వట్టిపోయి' చల్లగా చందమామ వచ్చినప్పుడు "ఏమి చేయుచునుండునో యింటిలోన నాదు జానకి నా రతనాల బొమ్మ' అనుకుంటాడు. సుందరాంగుల నెందర చూచినా, జానకి ముఖమే అతని మనస్సులో నిలుస్తుంది. `నా నాతి వాక్యంబు గానామృతంబు, నా లేమ రాగంబు నా వైభవంబు, నా సీత ప్రణయంబె నాదు ప్రాణంబు' అనుకుంటూ, తిరిగి వస్తాడూ, `చిరవియోగానలంబున చిత్త మెరియ కనక కనక జానకి నాథుగాంచినపుడు, కనుగొనల బాష్పకణములు గారుచుండ తొగరు పెదవుల చిరునవ్వుతోచు' సతికి. తెలియని ప్రేమయే పావనమని జానకి మనసులో చల్లగా పాడుతుంది. చింత మరచిన ఈ దంపతులను అధికార్లవారే కాకుండా మనమంతా ఆశీర్వదిస్తాము. రాయప్రోలు, అబ్బూరి కవుల చేతులలో

ప్రేమ స్థిరాశ్రయము లేనట్టుగా కొంత కళవళపడి అధికార్ల చేతిలో స్నిగ్ధమై, దాంపత్య ప్రేమగా నిలిచింది. నండూరి వారు అధికార్లకడనే ప్రేమ కవితకు ఓనమాలు నేర్పినారు.

ప్రేమ కవిత్వము చిరకాలంగా పాటలలోనే మెలగినది. హాలుడు ప్రేమపట్ల ప్రాకృతానికిచ్చిన గౌరవాన్ని పాటకు కూడా పంచవచ్చును. తెలుగు గేయాలు నిన్న మొన్నటివరకూ భక్తికో, ప్రేమకో అంకితాలని మన మందరమూ ఎరుగుదుము. నండూరి సుబ్బారావు గారు తమ ప్రేమ కవితలకు పాటను ఎంచుకోవడము ఇందువల్లనే. విశేషించి జంపెలనే - నాలుగు అయిదక్షరాల ఆవృతాల పాదాల - రచనలు ఎక్కువగా వాడడము వల్ల కూడా వారు సంప్రదాయపు ప్రేమ గీతాల దారినే అనుసరించారని చూపిస్తుంది.

గురజాడవారు ముందుకు తెచ్చిన వ్యావహారిక భాషను తెలుగు వారు గ్రహించలేక పోయినారు. బసవరాజువారు ఒక్కరు - పద్యాన్ని మించిన ఆవేశాన్ని భరించగలవు కనుక - పాటలు స్వీకరించారూ, గురజాడ వారి పాటి నియమ పాలనము చేయక `లోకానికుత్తుత్త దీపావళి', `నట్టనడి సంద్రాన నావలో ఉన్నాను' అంటూ మాట్లాడే భాషలో వ్రాశారు. గురజాడవారు స్వగతాలలో `పంజరంబున నున్న కట్లను పగులదన్నగలేక స్రుక్కితి' నని విచారించినా, బోధనలో మాత్రము `పండితుల కష్టభాషకూ, మాట్లాడుకునే (జీవత్) భాషకూ నడిమి భాషను నిర్మించుకోమనే చెప్పేరుగాని అచ్చంగా మాట్లాడుకునే భాషనే వాడలేదు. వారు సంస్కారులు మాత్రమే. విప్లవకారులు కారు. వారి వ్రాతలలోనూ, వ్యాసాలలోనూ లేని విప్లవాన్ని వారికి నవీనులు అంటగట్టడము స్వార్థము వల్లనే, నిష్పాక్షిక అవలోకనము వల్ల కాదంటున్నాను. ఈ విప్లవమన్నది గిడుగువారి వాదాలతోనూ, స్వాతంత్ర్యోద్యమంతోనూ వచ్చింది. గురజాడ వారూ, ఏ బ్రహ్మయ్య శాస్త్రులుగారి వంటి పదిమందికో వ్యాకరణయుక్త భాష వచ్చునన్నారు కాని, గిడుగు వారు ఈ పాటికీ ఒప్పుకోలేదు. గురజాడవారు సులభ భాష కోసము వాదించారూ, తామూ సులభభాష ఇదీ అని వ్రాసి చూపించారు అనేక సాహిత్య శాఖలలో. గిడుగువారు సారస్వత రచయితలు కారు. మరి భాషా విప్లవకారులుగనే తీరినారు. `వారి తప్పు లివి. వీరి తప్పులివి', అని మహాసభలలో నిరూపిస్తూ, అందరూ తప్పులు వ్రాశారన్న భావమే వారు నిలిపేరు. అటు రాజకీయరంగంలో `తెగదెంచండయ్యా సంకెళ్ళను అవియేమైతేనేమి', అన్న ప్రచారము విజృంభించింది. తెలుగు రచయితలు వ్యాకరణ శృంఖలాలు తెంచేశారు. సహాయ నిరాకరణోద్యమముతో `మా కొద్దీ తెల్ల దొరతనము' వంటి పాటలు వాడుక భాషలో కుప్పలు తెప్పలుగా వచ్చాయి. పాటలకు మాట్లాడే భాష

స్థిరపడిపోయింది. సాహిత్యంలో విప్లవానికి అవి మొన అనేటట్లుగా యెంకిపాటలు కర్షకుల పచ్చి భాషలో వచ్చాయి.

బసవరాజువారు `ఉదాహరణలతో ఖండకావ్యాన్ని నిర్మించే తంత్రాన్ని' దొంగకృష్ణుడు, వీరుడు, నిరాశ, అధోగతి అన్న ఖండకావ్యాల్లో సాధించారన్నాను. ఒకటీ, రెండూ మూడు భావాలు పూల రేకులవలె వేరై చుట్టూ అమరితే నాలుగో భావము పూపీఠమై వీటికన్నిటికీ చేరికా భావసుగంధమూ కూర్చి, చదువరికి సద్యః పరనిర్వృతి కలిగిస్తుంది. ఈ తంత్రాన్ని నండూరి సుబ్బారావు గారు కూడా ఉపయోగించారు.

చిరంతనమైన పద రచనా పద్ధతీ, ఖండ కావ్య నిర్మాణ తంత్రమూ, దాంపత్య ప్రేమా, కర్షకుల భాషా చేరి నండూరి వారి యెంకిపాటలుగా రూపొందినవి. ఈ పాటల భాష అధికార్ల వారిది కాదు, బసవరాజుదీ కాదు. బసవరాజు వారన్నారట యెంకి పాటల భాషను వినీ, "నీవు నిత్యం వాడే భాష కాదది. ఈ భాష సాయమున(నీవు) సత్యాన్వేషణ చేయలేవు"అని, కనుక యెంకి పాటల భాష నండూరి సుబ్బారావుగారి స్వంత ఎంపికే. భాష అనగానే మాటలు మాత్రమే కాదుకదా, కర్షకుల వాతావరణము వచ్చిపడింది ఎంకిపాటల్లో. అది కవిగారి కల్పన. యెంకి పాటలు యెంకి నాయుడు బావల ప్రణయలీలలు. జగత్తును నడిపే జ్యోతి-వలపూ, ప్రేమా-ఈ పాటల్ని నడిపింది. యెంకి కికురింపూ, చేలో రాత్రి ఈ దంపతులూ, యెంకి ముచ్చట్లూ, యెంకితో తిరపతీ, ఎంకి మనోరథమూ, నాయుని విరహమూ, యెంకి స్మృతులూ, నాయుని ప్రణయకోపమూ, యెంకి విరహమూ, నాయుని పరిదేవనమూ, భద్రాద్రియాత్రా, నాయుని ఊహాగానము, కలలు, ఎంకి వేదనా, తాపమూ, తీరమూ ఎంకి కోపమూ యెంకి విభూతి యెంకి నాయుడు బావల శృంగారమూ, ఇవే, ఇలాటివే యెంకిపాటల వస్తువు. చక్కని(దాంపత్య) ప్రణయాన్ని నిర్దేశించడానికి రచించారీ పాటల్ని. ఈ పాటలు ప్రచురించబడిన కాలానికి వ్యావహారిక భాషను గురించిన వాదోపవాదాలు జోరుగా జరుగుతూండినవి. ఈ పాటలు ఆ భాషలకు లక్ష్యప్రాయములని వాదించి గ్రాంథికవాదులు సాహిత్య పరిషత్పత్రికలో `అనర్థక వాఙ్మయము' అని పేరిచ్చి సంతోషించుకున్నారు. ఈ పాటలు గ్రాంథికాంధ్రమున వెక్కిరించుటకే అన్నట్లు చాలా మంది జానపదుల భాషలో తక్కిన పాటలెన్నో వ్రాశారు. రసికాలంకారికులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులు గారు వీటిని `పండిత పామర సాధారణముగా జన సామాన్యము తనిసి" తనియింపజేయగల గేయములని ప్రశంసించి పండితుల విమర్శ కెదురొడ్డి నిలిచినారు.

జయదేవుని గీతగోవిందము వంటి దాంపత్య శృంగార జీవన గర్భిత కావ్యములు తెలుగులో లేవు. ప్రబంధాలు పెండ్లిండ్లతోనూ, వధూవరుల సంధానముతోనూ సరి. జీవిత మన్నదానికా తర్వాతనే ఆరంభమాయెను, ప్రేయసీ ప్రియుల సహజీవన మాధుర్యాన్ని బింబించే కావ్యాలు మనకులేవు. అధికార్ల సూర్యనారాయణరావుగారి ఖండకావ్యాల అందము దంపతుల ప్రేమే. దాంపత్య జీవనము శారీరక సుఖమాత్రమేకాదనీ, దంపతుల పరస్పరాభిమానము-గృహ జీవనానికి జ్యోతి-శారీరకానందమును దాటిపొయ్యేటిది అని సూర్యనారాయణ రావుగారు చూపించారు. వారు యథాలాపముగా వ్రాస్తూండిన వారుగాని యత్నపూర్వకంగా దాంపత్యజీవనాన్ని అల్లలేదు. బసవరాజువారు `చిట్టి' ప్రశంసలో పై మాధుర్యాన్ని చూపేరుగాని వారి రచనమూ ప్రయత్నపూర్వకము కాదు. నండూరివారు అటుయెంకి భావాలూ, చేష్టలూ, యిటు నాయని చేష్టలూ, భావాలూ, వారి విరహాలూ, ప్రణయకోపాలూ, అనురాగమూ, సహజీవనమూ, యాత్రలూ, కలలూ చిత్రించి, దాంపత్యప్రేమకు దేవళాన్ని నిర్మించారు. అప్రాప్త మనోహరుల పరిదేవనమూ, ప్రేమ తపస్సుల గీతాబోధనలూ, దూరానికి నెట్టిన ప్రకృతిసిద్ధమైన దాంపత్య ప్రేమ యెంకిపాటల రూపాన్న విరుచుకు పడింది తెలుగువారిమీద. నండూరి వారివరకూ వరుసగా వచ్చిన రాయప్రోలు, అబ్బూరి, రామిరెడ్డి, పింగళికాటూరులూ, కృష్ణశాస్త్రి విశ్వనాథలూ నిసర్గసుందరమైన ఈ అందాన్ని స్పృశించి యుండలేదు. మీదు మిక్కిలి "ప్రేమ నీతోడ నైక్యంబు నొందుకంటె నధిక మధురిమ గల దెడబాటునందు" అని ఎడబాటుని కీర్తించ ప్రారంభించినారు కవులు ! పృధ్వీని పాలించే విష్ణుదేవుని ఊపిరి దాంపత్య ప్రేమ, నండూరివారు దానిని పట్టి సానపట్టినారు. దేశమంతటా వ్యాపించాయి యెంకిపాటలు.

యెంకిపాటల వ్యాప్తికదీ కారణము, వాటి భాషలో వింతలేమీ లేవు. మొదట అచ్చు వేసిన ముప్ఫయి అయిదు పాటలలోనూ, "కూసింత, పల్లకుందాము, పద్దాక, ఓలెవోపాలి, సూసేతలికి" అన్న ఏ కొద్ది మాటలో మాత్రమేగాని పాటక జనము వాడే జాతీయాలు ఈ పాటల్లో లేవు. భాష మొత్తము మీద నాగరికుల భాషను మార్చి వ్రాసినట్లే ఉన్నది. `వొనలచ్చిమి, యీశ్వరుడు, సత్తెముగ, కనకాభిసేకాలు, అందాల బరిణె, యీశుడికి, వొన్నెసిన్నెలు, యెంకిపదము, అగపడవ, ఈ దినమె' అన్న మాటలే అందుకు ఉదాహరణము, `దైభము, ఆయింత ' అన్న మాటలు మారిపోయిన గ్రాంథికానికి కొండ గుర్తులు. గ్రాంథికము కాకపోవడము వల్ల, పండితులూ వ్యాకరణాభిమానులూ వీటిమీద తిరగబడ్డారుగాని ఈ పాటలలో పాటకజనము భాష ఉద్ధరించబడిందనికాదు.

పండితులు `అనర్థక వాఙ్మయము ' అని పేరుపెట్టి ఈ పాటల భాషను దుయ్యబట్టినా, సభలలో వీటి ప్రచారము ఆగలేదు. యెంకి కులపాలిక కాదు స్వైరిణి అని వాదించినా ఆగలేదు. "యెంకీ నాయుడు బావలకు పెండ్లి అయిందా? ఆ ప్రశంస యెక్కడా రాలేదేమి? తగువోళ్ళలో (వారు దంపతులే అయితే) తలవంపులేలా? యెంకి జాములేతిరి యేళ వెళ్ళడమేమీ చేలోకీ? నీతోటె ఉంటాను' అంటుందా భార్య అయితే?" అంటూ పరిశోధనలు సాగేయి. యెంకి పాటలను సమర్థించినవారు `వారికి గుళ్ళో పెళ్ళయి ఉండవచ్చున'నీ `పెండ్లి మాట లేకుంటేనేమీ' అని వాదించారు. యెంకి వివాహిత కాదు, నాయుడికి ఇంకో భార్యలేదు. పాటలలో క్రమంగా వారు దంపతులని తేలిపోతోంది. కనుక యెంకి కులపాలికా? కాదా? అన్నది ప్రధాన సమస్యకాదు. యెంకి నాయుళ్ళ నిసర్గ ప్రణయమే ముఖ్యము. ఆ ప్రణయమే పట్టింది రసిక హృదయాల్ని.

యెంకి పాటలు వచ్చేవరకూ ప్రణయాన్ని ధ్వనించే రచనలు తెలుగు చదువరులెరుగరు. యెంకి జగన్మోహిని శిష్యురాలు. `నా కాసి సూస్తాది నవ్వీనవ్వేస్తాది,' యెల్లి మాటాడిస్తే యిసిరికొడతాది' `కన్ను గిలికిస్తాది నన్ను బులిపిస్తాది' దగ్గిరిస కూర్చుంటే అగ్గి సూస్తాది' `యెంకి రాలేదాని యేటో సూత్తాఉంటే యెనకాలగా వచ్చి `యెవరు' వోరంటాది. నాయుడి మనసు తెలిసి`నీతోటే ఉంటాను నాయుడుబావా, నీ మాటె వింటాను నాయుడుబావా' అంటుంది. నాయుడు వూరువిడిచి వెళ్ళిన రోజుల్లో నీళ్ళుతేబోతూంటే ఆమెకు`వెనక యెవరో' నడిచినట్టుంటుంది. అద్దము చూస్తుంటే ఆమె వెనక ఎవరో నవ్వినట్టుంటుంది. ఆమె కళ్ళెత్తితేసాలు కనకాభిసేకాలే! ఆమె సెక్కిట సిన్నిమచ్చ, సెపితే సాలదు లచ్చ. ఒక్క నవ్వే యేలు వొజ్జిర వైడూర్యాలు! పదిమందిలో నాయుడు యెంకిపాట పాడితే గోడసాటున యెంకి గుటకలేస్తుంది.`కంటెదర నా కాడ కనిపాపలో నీడ సూసుకొంటా నొసట సుక్కెట్టుకుంటుంది' నాయుడు వస్తానన్న వేళకు ఇంటికి రాకపోతే చుక్కని చూస్తుందీ, కొండమలుపు చూస్తుందీ, తోట వెలుపటి గలగల ఆవు మెడ మువ్వలు మ్రోతావిని ఉలికిపడుతుంది. యెంకి తనవైపు చూసి నవ్వగానే నాయుడి గుండె గొంతుకలోన కొట్లాడుతుంది. `రేతిరి పగటేల రెప్పెయ్య కెంకిని సల్లంగ సూడమంటు' సామితో చెప్తాడు నాయుడు. యెంకి దూరాన ఉన్నపుడు యెంకి `తళకు గేపకాన'నాయుడి తలతిరుగుతుంది. `నా దుమ్ము నా గుండె నమిలి మింగిన పిల్ల' అని యెంకిని తలుచుకుని విచారిస్తాడు. `పచ్చి నై నే నెటో కొట్లాడుతుంటే, యిరుగమ్మలక్కలతో నీవా, నా యెంకి చుక్కానిపట్టగా తాను గెడవేసి భద్రాద్రి వెళ్ళుతాడు. `యెంకి కోపాలొచ్చి యే దేశమో పోయి, కల్లోనా కాపడితే కళ్ళు తెలిసే తలికి తళుకుమని యెంకి నా దరికి రావాలి! నిదరకాబోసంటు

నిందలాడాలి!' అని వెర్రి సరదాలు పడతాడు. `పొరుగమ్మలతో నేను పొరసలాడే యేళ, పొలమెల్లి నే పొద్దు పోయి వచ్చేయేళ, సూడాలి నా యెంకి సూపు లాయేళ అని పాత అనుభవాలు నెమరుకు తెచ్చుకుంటాడు. పీడకలలు కంటాడు. యెంకి మీాద. జోడావులకు నడుమనిల్చున్నట్లు, రెండు యేళ్ళకు నడుమ పాలకడవ ఎత్తుకుని ఉన్నట్లు, పూలు పుణుకుతూన్నట్టు, బూరా వాయిస్తున్నట్లు, కొండకోనల నడుమ `గుడికీ దండమెడు' తున్నట్లు ఊహించుకుంటాడు. యెంకి నాయుళ్ళ శృంగారము జయదేవుడు రాధాకృష్ణులతో చూపదగినది. `యెంకి వస్తాదని యెదురూగ నేబోయి గట్టు మీాదా దానికంటి కాపడగానే కాలు కదపాలేదు నాయెంకి, కరిగి నీరౌతాది నా యెంకి, అటుతిరిగి పడుకున్న యెంకితో అంటాడు నాయుడు: 'ఈ జంట విడిపోయి ఏ వాడనో తేలి యెంకిపాటిన గానె యెదర నిలిసేదెవరో?... నా పక్క తిరిగి మాటాడవా?' అని. `యెలుగులో నీమిాద నిలుపలేనే మనసు, ఆరిపేయవే దీపమూ' అంటాడు. జిమ్మమని తోట చీకటైపోతే చీకట్లో కళ్ళు సిల్లులడ చూడాలిట. అద్ద మెందుకూ అందాలు తెలపడానికీ అని నాయుడికంటి పాపలో తన నీడ చూసుకుంటూ నొసట చుక్క పెట్టుకుంది' యెంకి. నండూరి సృష్టించిన సంభోగ శృంగారానికి సూర్య చంద్రులు ఈ భావాలు వినండి. `అద్దములో నా రాజ అంతనీరూపు! ఇంత ముత్తెములోన ఇమిడే నేలాగు?' అంటుంది ముత్యములో తన నీడ చూసుకునే నాయుడితో యెంకి. నాయుడు జవాబు `ఎన్ని పొంకాలున్న యెంకివే నీవు! ఇంత నా గుండెలో యిమిడిపోలేదా?'అని. దిలీప మహారాజూ సుదక్షిణాదేవీ లేళ్ళ కళ్ళల్లో ఒకళ్ళొకరి కళ్ళ సౌందర్యము చూసుకున్నారంటాడు కవి కుల గురువు. మాధవుని చేత "త్వమసి మమభూషణం, త్వమసి మమజీవనం, త్వమసి మమ భవజలధిరత్నం" అని - మార్ధ్వీక మధురమైన శైలిలో అయితేనేం?- వాచ్యంగా చెప్పిస్తాడు జయదేవుడు. పై యూహ తనకు తట్టియుంటే సంతోషించి యుండును ఆ మహాకవి. `మాట వరస కెపుడైనా అన్నానా' అన్న ఇటీవలి సినీపాటలోనూ, వాచ్య మాధుర్యమూ, చమత్కారమూనే తోస్తున్నాయి గాని, ఈ పాట ఔన్నత్యము కానరాదు.

`యెంకి పాటల గాలి దుమారము'తో యెంకి పాటలు కొంతకాలము ఆగినా, అక్కడా అక్కడా వినవస్తూ 1953 నాటికి మరొక సంపుటంగా వచ్చాయి `కొత్త పాటలు ' . కాలక్రమరచనను అనుసరించి వ్రాసేటప్పుడు ఈ కొత్త పాటలను గురించిన రాత తరువాత తరువాత చేయవలసినదే కాని, తక్కిన తెలుగు రచనలేవీ ఈ కొత్త పాటల రాకకు కారణము కాక పోవడము వల్ల యెంకి పాటల తరువాయిగానే వీటిని చెప్పవచ్చుననుకున్నాను. తొలి పాటల్లో నండూరి సుబ్బారావు గారు యెంకిని తీర్చి ప్రేమ విద్దెలో ఓనమాలు వర్ణించారు. ఆ పాటలలో యెంకినాయుళ్ళు పరస్పరాశ్రయులే. కొత్త పాటలలో వారు ఇద్దరూ ఇంకా పెరిగేరు. రవల వెలుగుల

గంగ రమ్మంటే యెంకి శివమెత్తి తాణాలు చేసింది. `సిరులతో ముత్యాల సరుల చెల్లాటతో సిరిసిరీ మువ్వలా చిందులా గంతులా' స్నానాలు చేసి, కాశీదేవుని యెదుట గరవాన నిలిస్తే ఆయన (గంగ తలమీది నుంచి ఎప్పుడు దిగిందీ అని) తల తడుముకొని తానె తబ్బిబ్బులైనాడు. మన యెంకే అని నాయుడున్నా, చనవులకు పోరాదు. ఆమె యెప్పుడూ కొత్త నవ్వుల కులుకు, కొత్త మెరుపుల తళుకు, `రెక్కలతో పైకెగిరి సుక్కల్లే దిగు'తుంది. కొండ తిరిగీ, కోన తిరిగీ, గరికపూల కంఠమాల కూర్చి, ఆవు నడిగీ, అడివి నడిచీ, గుమ్మపాలు, కొమ్మతేనే పొందుపరచీ, చాయ వెన్నెలలో లోయ బయళ్ళలో పచ్చిక మెత్తల పానుపుపైన `కోకో' అని అరచి నాయుణ్ణి `కో' అనమంటుంది. నాయుడి కోపాల కోట రూపుమాపడానికి పూలరంగములో కాలు దువ్వుతుంది. నాయుడు ఏ ఊరోపోతే ఎంకే దొరయింట అతని వేషముతో నటిస్తుందట. ఆవుల్ని నాయునివలెనే అదిలిస్తుంది. పసిబాలుణ్ణి అతని వలెనే కసరుతుంది. అయితే, ఈ వింతను గాని, నాయుడు ఆవంతకంటే నేరమంతా నాయుడిదే పౌరుషము నాయుడిమీదే! ఎంతెంత దూరాన ఎందరిలోన నాయుడున్నా సూటిగా అతని వెనక చూసిందా, అతడు తనవైపు తిరగవలసినదే. అయితే యెంకి గర్వపోతు కాదు. రంగుకోక ధరించి రెప్పవాల్చక నిలచి, అలికిడికి ఉలికిపడి నలుదెసల విరగబడే దీపసుందరి దరిదాపుకు పోలేనని ఆమెకు తెలుసు. ఇక నాయుడో? యెంకి దూరాన ఉన్నపుడు ఏటి దరి నుండి `సావాసమింకెవరో సందడెవరో' అనుకుంటాడు. యెంకి అర్థముకాక, ఆమె కళ్ళలో చూస్తాడు, కాని `ఏకాడో తలపుంచు' యెంకి పెదవి సివురాకులను కదలింపగోరి అడిగిందే అడుగుతాడు. ఆమె కళ్ళను జారు- జంకు కనగోరి పయనాలు నటించి బయలు దేరతాడు. `ఏ తపసునే జేయవలెనో యెంకితో ఎటుల నేనేకమవగలనో' అని ఆలోచిస్తాడు. `యిపు డెటులుంటినో చెప్పుకోవోయి' అని ఆమె అడిగితే `చిన్నె వన్నెల రామచిలక' లాగున్నావంటాడు. `ఈ గొంతు పలికేది ఎవరి పదమోయి' అంటే `ఒంక ఒరపులులేని యెంకిదే' పదమంటాడు. వనమంతలో చక్కదన మెవరిదంటే `పొంకాల పోకిళ్ళ ఎంకిదే నిజమంటాడు. ఈ పాటలలో తలపోసి, తలపోసి నండూరి సుబ్బారావు గారు యెంకీ నాయుళ్ళ అందపు కళలు కలబోసినారు. ఇప్పుడడగండి "యెంకెవ్వర?"ని. ఆయనే అన్నారు యెంకెవ్వరని లోక మెపుడైనా కదిపితే వెలుగు నీడలవైపు వేలు చూపింతు. యెంకి పాటలను ప్రభకట్టి విశ్వ సాహిత్య వీధులు తొక్కి రావచ్చు తెలుగువారు.

ఎరగని ప్రణయపు వెలుగులతో పాటు మనము చూడని మెరుపు టందాలు `యేటి కడుపున దాగి' నిదరోయేతోటా `యెలుతురంతా మేసి నెమరేసేయేరూ, యేటి నురగలవలె మరుగు మనస్సులూ, వీపూది పెట్టేది వీపు తట్టేది నీళ్ళు చిలికేదీ

నిలిసి సూసేదీ పడే అచ్చెరువూ, యెంకి సరసాలాడ జంకుతావుంటే సూసి, సూడక, కన్నుమూసి తెరిచే గోవు మా లచ్చిమీ, చాటు చూపుల కులికే ఏటి చంద్రుడూ, నిలువంత చెవిజేసి పిలుపు వినవోరగిలి కటిబిగించి శిరసు కానిమ్మని విసిరే దీపసుందరీ కాన వస్తారు యెంకి పాటలలో. చివరికి ఆటపాటలలోనె మరచిన రాజు చెయ్దములకు కందుటే ఎరుగని తన మనసు గాయముకాగా, అతనికే చేటని కంట నీరు రానీని' యెంకి మన మనస్సులో మిగిలిపోతుంది. యెంకి మధురవాణీ కాంతంల తోబుట్టువు. ఆమెను సృష్టించి మహోజ్వల భావాల్ని నిర్మించి ఆంధ్ర కవిత్వానికి అందపు బరువు చేర్చారు నండూరి సుబ్బారావు గారు. "ఇంతేనటే సంద్రమెంతోయనుకొంటి, మనకు సూరీడుకూ మద్దెనుందేనా?" అంటుంది యెంకి. ఏమీ అని అడిగితే, "నా నీతి, నా జాతి నా వారెపోనాడ మరిగి నా మనసు సాగరమయ్యె నన్నారు. ఇంతేనటే సంద్రము?" మెరుపుని వెనక్కి తిప్పి కొట్టారు కవిగారు. యెంకి భావాలకు మణి మకుటమిది చూడండి: " నా పేరె నా రాజు పాట అను అపవాదు ఈ జన్మకే కాదు ఎప్పటికి పోదు", సీతమ్మకు సంస్కృత కవులు ఇవ్వలేక పోయిన సుధామధుర భావాన్ని ఈ తెలుగు కవి యెంకికి ఇచ్చారు.

యెంకి పాటలకు ప్రారంభములో వాడిన భాషను పరిణతిలో వాడలేదు సుబ్బారావుగారు. మీదు మిక్కిలి బసవరాజువారి శాపము నిజము చేశారు అనిపించేటట్టుగా పచ్చి కర్షక భాషతో ప్రారంభించిన పాటల్ని గ్రాంథిక భాషలో పూర్తి చేశారు. కనుక కర్షక వాతావరణమును స్ఫురింపజేసే ఉద్దేశ్యముతోనే తొలి పాటలలో కర్షకులు వాడే పదాల్ని ప్రయోగించి ఉంటారని ఈ వ్యాసము మొదట్లో అన్నది నిజమే అయింది కదా అంటాను. చివరి పాటలలో యెంకినాయుళ్ళు ప్రేమయోగులు. పరిణతి జెందినవారి మనోరంగాన్ని బొమ్మ కట్టడానిక బరువైన భాష కావలసి వచ్చిందీ, వాడేరు కవిగారు.

చరణము చరణానికీ, భావము సాంద్రతరము చేస్తూ, చివ్వరి చరణములో వీణ తీగెల మీద గెంతినట్టు జుమ్మనిపించే పాటలే కాకుండా మూడు చరణాల చివరి నాలుగో చరణంతో ఆ మూడు చరణాల భావాల్ని అతికి మొత్తపు ఖండానికి సద్యః పరనిర్వృతీ కావ్యత్వసిద్ధీ చేకూర్చిన రచనలు కూడా ఉన్నాయి ఎంకి పాటల్లో. అందుకే అన్నాను బసవరాజు గారి తంత్రము యెంకి పాటల నిర్మాణానికే తోడైంది అని.

శివరాజు సుబ్బారావు గారు అనే బుచ్చిబాబుగారు యెంకిని నాయికను చేసి, ఒక నాటిక రచించారు. వారి దృష్టికి నాయుడు ప్రేమ యోగానికి ఒక మెట్టు దిగువగా ఉన్నట్టు కనబడింది. యెంకి ప్రేమయోగిని, వివాహము అనే కృతక బంధము ఆమె

కిష్టములేదు. నాయుడు ప్రేమికుడే, అయితే సంఘానికి వెరచి పెండ్లి చేసుకుంటే మాత్రమేమి? అని యెంకిని ఒప్పించ బోతాడు. ఆమె చిక్కక నిత్య స్వాతంత్ర్య సీమలోనికి - వెలుగు నీడల నడిమికి వెళ్ళిపోతుంది. ఈ రచనలో బుచ్చిబాబుగారు యెంకిని పైకెత్తేరు నిజమే. కాని, నాయుణ్ణి జారవిడవడానికి యెంకి పాటలలో కారణము కానరాదే అంటాను.

యెంకి పాటల రచనతో ఆంధ్రకవిత్వము ఆరంభము నుంచీ అధిష్టించిఉ౦డిన వ్యుత్పత్తి మీద నుండి దిగి ప్రతిభను అధిష్టించిందంటాను. ప్రబంధాల కాలము వరకూ సంస్కృత కావ్యాలూ, పురాణాలూ ఆధారంగా తెలుగులో సాగిన రచన రచయితల పాండిత్యముమీదా, పలుకుబళ్ళమీదా సాగిపోయిందిగాని, వారి ప్రతిభను కల్పనా శక్తినీ రేపలేదు. ప్రబంధాలలో ప్రవేశించిన ఉపజ్ఞ కవుల అలంకార కల్పనా శక్తినే పోషించింది గాని, కథన కౌశలమూ, పాత్ర నిర్మాణ శక్తీ పెంచలేదు. పురాణ సామాగ్రినే చీట్ల పేకను కలిపినట్లుగా కలుపుతూ, ప్రబంధ కవులు తమ ఇంద్రియాలతో కాక, పూర్వ కవుల కల్పనలు పూర్తిగా కప్పివేసిన భావనతో చూచారు అష్టాదశ వర్ణనా లక్ష్యములను రాజసభలలో. ఆనాడు కవులకు జరిగిన పరీక్షలు వ్యుత్పత్తికే. ఆధునిక యుగంలో, అనగా 1910కి తర్వాత కవుల ప్రతిభకు ఊపిరి తిరిగింది. పూర్వుల కవిత్వములో ప్రతిభ ఏమీ లేదని అనడము లేదు నేను. పలుకుబడి వ్యుత్పత్తిది. తుంగభద్రలాగా సెలయేళ్ళలాగా పాండిత్యపు బండల నడుమనుండి ఒదిగి ఒదిగి ఏ కొంచెమో ప్రతిభ ప్రవహించినా, ఉన్నదనడానికే గాని ఊగించడానికి చాలలేదు. - ఆధునికులకు పాండిత్యము తక్కువ. పరిచయమూ ప్రతిభాన్వితమగు ఆంగ్ల కవిత్వముతో. చెప్పిన ఏ కొంచమైనా చదువరులను పలకరించేది కావలెనని వారి ఆశయము. కనుక సంప్రదాయము మోసుకువచ్చిన నియమాల్ని ఒకటొకటీ జారవిడిచారూ, కావ్య రచనను సులభము చేసుకున్నారు. యెంకి పాటలు కొన ఊపిరితో మిగిలి ఉన్న వ్యాకరణ సూత్రాన్ని తెంపేసి రవీంద్రుని ఊర్వశిలాగా ప్రతిభా తరంగ శీర్షముపైన ఒంటికాలుతో నిలబడ్డారు. ప్రతిభా బలమే యెంకి పాటల జీవము. ప్రతిభ నవ నవోన్మేషశాలినియట. యెంకి పాటల ఇతివృత్తము- దాంపత్య జీవనము- తెలుగు కవిత్వానికి కొత్త; నాయకీ నాయకులవి, వారి పరిసరాల సౌందర్యానివి, ఆవువి పూలవి. ప్రకృతి కొత్త : ఏటి నురగలు నాయుడి మనస్సులాగా మరుగుతాయి. ఏటి కడుపులో తోట నిద్ర పోతుందీ, వెన్నెలలో ఏరు రవల వెలుగులు నింపుకుంటుంది. వళ్ళంతా చెవి చేసుకుని అలికిడికి ఔనని తల విసురుతుంది దీపశిఖ. ప్రబంధాల వర్ణనలా భావాలా ఛునకలు వినివిని

పండిత కవుల మెదడు పురులు విడదీసి విడదీసి, పద్యగతితో నిస్సహాయంగా ఈడిగిలబడుతూ పోతూండిన తెలుగు చదువరి హృదయానికి చక్కని చల్లని వర్షము యెంకిపాటలు. వీటిలో పద గుంభనపు తాషామార్పాలూ సమాసాల రామడోళ్ళూ పదాడంబరపు తూతూబాకాలూ వినపడవు. భాషా పాండిత్యపు స్కైస్క్రేపర్లు లేని పూరి ఇండ్ల పల్లె ఇది. మోసెసు ప్రియురాలు ఆమె వివాహానికి ముందు చెప్పిన అమృత వాక్కులు జ్ఞప్తికి వస్తాయి. యెంకి పాటలు తమ సౌందర్యాన్ని గురించి చెప్పుకుంటే, అస్తు. వాటి రచయితకు శుభమగునుగాక.

యెంకి పాటల విజయముతో పాటకు కవిత్వములో చోటు నిలిచింది. పద్యమో పదమో ఏదయితేనేం కవికి? అన్న అమృతవాక్కు అశరీర వాక్కుగా వినబడింది కవులకు. కృష్ణశాస్త్రి గారు "ఆకులో-ఆకునై" అన్న గేయముతో ప్రారంభించారు తన కావ్య రచనను. దువ్వూరి రామిరెడ్డిగారు `గాలి యడుగుల నెవరి కోసము ఓ మోహశీలా' అని అభిసారికను తీర్చిదిద్దేరు. విశ్వనాథ వారు `ముదురాకు రాలేటి ముదిమి నాళులలోన, తొడిగేటి చివురాకు తొగరు సంజలలోన ఆకునైనా కానుగా, అయినచో సోకేది చిరుగాలి నన్ను'అని పాడుకున్నారు. తురగా వెంకట్రామయ్యగారు `కష్టాలు వచ్చినా కాలమే తరిమినా కన్నీరు రాల్చకే కలుష మెరుగనీ చెలీ, ప్రకృతి రంగస్థల ప్రళయ నాటకములో ఆడుటకు జంకేల పాడుటకు భయమేల'నని చెలిని సమాశ్వసించారూ, "ఈ మాయ లోకమే ఈశ్వరుని రాజ్యమా మాయవాదీ కవీ మాటబొంకోయి; కరకు కత్తులదాల్చు నరహంతకుల ఇంటిబానిసై భూదేవి పడియుండె నీ వేళ ధనికునకు దైవమే దాసుడయ్యేను జూడు"మని అగ్నికణాలు కురిపించారు. కొడవటిగంటి వెంకట సుబ్బయ్య `ఆగు మాగుము తెరువరీ ఆయాసభారము నపనయింపుము' అంటూ తమ `సంధ్యారాగము' సంపుటాన్ని ప్రారంభించారు. గంగి రెద్దు బొంతల సౌందర్యంతోలాగ ఛందోగతి సౌందర్యంతో ఊరేగుతూన్న పద్యానికి ధాష్టికపు పలుకుబడి పోయింది. అంత వరకూ పల్లెపట్టు పదాలను అనుకరించిన వరుసలలో పాటలు వ్రాస్తూండిన కవుకొండలా బాపిరాజా కవులు పాటని అచ్చపు సాహిత్యానికి వాడేరు. గురజాడ కవి సంస్కారరూపంలో ప్రవేశ పెట్టనెంచిన మాత్రాచ్ఛందస్సులూ, వ్యవహార భాషా కవిత్వ సారళ్యమూ అన్నవి ఈ విప్లవంతో వోటు హక్కు సంపాదించుకున్నాయి.

యెంకిపాటలకు వచ్చిన ప్రచారంతో కిన్నెరసాని పాటలు వచ్చాయి. విశ్వనాథవారి పూనికలు పెద్దవి. బైరను పద్ధతినచ్చి కాబోలు ఆంధ్ర పౌరుషం ఖండ కావ్యాలు రచించారు. వాటికి సహాయ నిరాకరణోద్యమ ప్రోద్బలమూ ఉండిందనుకుంటాను. యెంకి పాటల్ని నండూరి సుబ్బారావు గారు సభలలో చక్కగా పాడేవారట. వాటికి

వచ్చిన ప్రచారమువల్ల ప్రభావితులై విశ్వనాథవారు కిన్నెరసాని పాటలు రచించారూ, సభలలో పాడేరు. భద్రాచలానికి దిగువన గోదావరిలో దక్షిణపు వైపు నుంచి కలిసే ఒక వాగు కిన్నెరసాని. పేరు అతి ఆకర్షవంతంగా ఉంది. ఈ పేరును బట్టి కథ అల్లుకుపోయారు సత్యనారాయణగారు. కోడంటికమును భరించలేక పోయిందట కిన్నెరసాని. ఆమె భర్త తల్లిని యేమనలేకా, కిన్నెరను సముదాయించలేకా, కళవళ పడ్డాడట. కిన్నెరకు మహాకోపం వచ్చిందట. ఆవేశ హృదయంతో కిన్నెర అడవుల వెంట పరుగెత్తింది. భర్తపోయి ఆమెను పోవద్దని కౌగలించుకున్నాడు. ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరై, వాగై ప్రవహించింది. అతడు శోకించి శోకించి శిల అయినాడు." పాట రూపంలో ఈ కథలేదు. ముందు చెప్పేశారు కవిగారు. కావ్యాలకు ఈ రీతిగా ముందు కథను చెప్పేసి, తరువాత కావ్య రచన ప్రారంభించడముతో ఖండ కావ్యానికి నిండు రూపము రాక, కావ్య ఖండము అయిపోతుంది. కళకు ఉపోద్ఘాతము ఎందుకూ?

కిన్నెర నీరైపోయి ప్రవహించి నప్పటి నుంచి ఆమె భర్త పడిన పరిదేవనమును `కిన్నెర పుట్టు' అనీ, కొంత దూరము `బిరబిరా నడిచి', `నడవగా నడవగా' `పతి రాయివలె మారిపడియున్న చోటునే విడలేక తిరిగి, జల దేవతల వెంట కిన్నెరసాని సాగిపోవుటను, `కిన్నెర సంగీతము'నూ తగని మోహముతో కడలిరాజు పొంగుటనూ `కిన్నెర దుఃఖము'నూ `గోదావరీ సంగమము'నూ పాటలుగా రచించారు కవిగారు. పాటలు మాత్రమే చదివితే అత్తగారి పోరూ, `అటువంటి కాపురం బిటు చేసికొంటిన'ని కిన్నెర చెందిన వగకు కారణమూ తెలియరావు. పాటలన్నీ జంపె వరుసలలోనే ఉన్నవి. ఈ గుణములో వీటికి యెంకి పాటలతో పోలిక కలదు.

కిన్నెర నీరైపోయినదన్న తర్వాత కవికి, అబ్బూరి రామకృష్ణారావుగారి నదీసుందరి మనస్సులో మెదిలింది కాబోలు. కవేరుడు పెంచిన బిడ్డ కావేరి సహ్యాద్రి నికుంజములో ప్రవేశించి నది యైనది. స్త్రీ రూపంలో ఉండినప్పుడున్నూ ఆమె వర్షములో మెదలకే గాఢ్ఢమము వర్ణించి, రామకృష్ణరావు గారు కావ్యార్థ సూచి నమర్చినారు. ఇక్కడ విశ్వనాథగారు కిన్నెర భర్త పరిదేవనములో"మునుపే నీ కన్నులు గని అనుకొంటిని నీవు నదీవనితపు" అనిపించారూ, "ఈవు రసాకృతి వగుటను ఈ వైఖరి ప్రవహించితి" ననిపించి శ్లేషించారు. కావేరి సస్యలక్ష్మికి సాయముగా, పాపులకు క్షాళనముగా దేవేరి అయి వచ్చిందీ" వనకన్యలు ఆమెకు మంగళ గీతాలు పాడేరు. ఇక్కడ కిన్నెరసానిని పాపము జలదేవతలువచ్చి పదపదమని బలవంతపెట్టి నడిపించారు. కారణము తెలియదుగాని, వనదేవతలూ పూలు కుమ్మరించారు. భూదేవతలు ఎదురుపోయి దీవించారు. వాయుదేవతలు

రమ్మని పాట పాడేరు. ఎందుకనీ? `ఒయ్యారి నడలతో' వచ్చిందని కాబోలు. కావేరి దేవేరిగా రావడమూ, తరులతాగుల్మములు పూలు జల్లడమూ రమ్యము. కిన్నెర బలవంతపు ద్రవీభవమున కూడ భూదేవతలూ, వాయు దేవతలూ సంతోషించడము రమ్యము కాదంటాను. కిన్నెరసాని పాటలను విశ్వనాథవారు `ఇదిగో చూడండి నా రచన' అని మన మీదా విసరినారా అనిపిస్తుంది. అట్లాంటి దానిలో మనకు ఇంపుగూర్చే మెరుగు తక్కువగానే ఉంటుంది, ఆశ్చర్యమేమిటీ?

- భారతి, మార్చి 1963.

# 6. జాతీయ రచనలు

వందేమాతరోద్యమము నవ్యకవికత్వావిర్భావానికి కొంత కారణమైనదని మనవి చేశాను. అంతవరకు దేశీయుల వ్యవహారంలో `వంగదేశమూ, పాంచాలమూ, మహారాష్ట్రమూ అంటూ విడివిడిగా ఉండిన రాష్ట్రాల నన్నిటినీ రంగరించి `మాతృదేశము'నుగా కూర్చి అర్చించినది వందే మాతరోద్యమమే. దీనిని తమ శ్రేయస్సుకు విరోధిగా గుర్తించి బ్రిటిషు వారు `వందేమాతరం'అన్న పలుకునే నిషేధించారూ, భారతీయ తత్వానికి అనుకూలమే కావడము వల్ల ఇది - ఆంగ్లులకు వ్యతిరేకోద్యమముగా విజృంభించింది. బహిరంగంగా ప్రభుత్వాన్ని వ్యతిరేకించ లేకపోయినా, `దేశసేవ చేయండి' అన్న దాని ప్రబోధపు నీడలో మాతృదేశ సంకీర్తనమూ, దైన్య స్థితీ వర్ణించి ప్రజలను ఉత్తేజితులను చేసినారు కవులు.

గురజాడ వారు అట్టి కవులలో ప్రథములు. `దేశమును ప్రేమించుమన్నా' అన్న వారి గేయము వందేమాతరోద్యమ ఫలమే. దీనిలో రూపంగా కాక మిత్రసమ్మితంగా ఉపదేశ పూర్వకంగానే మాటలతోకాక చేతలతో ప్రజకు మేలు చెయ్యమనీ, ఒళ్ళు వంచి పాటుపడి దేశిసరుకులు నింపమనీ, వెనక్కి చూడక ముందుకి అడుగు వెయ్యమనీ, ఐకమత్యం నేర్వమనీ, దేశాభిమానమంటే దేశీయుల యెడ నభిమానమనీ, కవిత్వమన్నది దేశీయులను ప్రబోధించాలనీ చెప్పారాయన. స్వాతంత్ర్యము కోసము యుద్ధము అవసరమని ఆయన గుర్తించారు."ఉసురులకు విసిగితివో? యుద్ధము కలదు, దేశము కొరకు పోరుము" అన్న అంతర్వాణిని పలికించారు గాని తమకు కాలము దాటిపోయిందని విచారించారు. వ్యక్తుల దౌర్జన్యాన్ని రాజుల దౌర్జన్యాన్ని `మాన్యంబులియ్య సమర్థుడొక్కడు లేడు, మాన్యముల్చెరుప సమర్థులంత' అని ఉపాలంభంగానూ `పదుగురు కోతి వెంబడి సంచరింపరే, వాహకుల్లేరే శవంబునకును' అని తిట్టు కవిత్వములోనూ మొరబెట్టుకునే దశనుండి `అన్యాయానికి ఎదురు తిరగండి" అని తోడి వారిని ప్రబోధించే స్థితికి కవిని సానబెట్టి, వందేమాతరోద్యమము గురజాడ ద్వారా తెలుగులో వినబడింది.

అయితే, భారతదేశాన్ని మొత్తంగా ప్రబోధించ యత్నించిన మొదటి ఉద్యమము - 1857 స్వాతంత్ర్య యుద్ధం తర్వాత - వందేమాతరోద్యమమే కావడము చేతనూ,"వందే మాతరం (మన్దే రాజ్యం)" అన్న నినాదాలను ప్రభుత్వము నిషేధించి ఉండుటచేతనూ ఆ ఉద్యమము తెలుగు దేశములో ఎక్కువగా వ్యాపించలేదు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము ఏర్పడాలన్న ఉద్యమముపై ఉద్యమానికి ఛాయగా నైతేనేమి, ఆంధ్రులకు, అవరజులకు లభించగల సౌకర్యాలు మాత్రమే లభిస్తున్నాయన్న అమర్షమువల్ల నైతేనేమి, వేరుతన్ని పెరిగింది. నెల్లూరులో 1913లో జరిగిన ఆంధ్ర సభలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర తీర్మానము ఉదయము నెగ్గకపోతే, రాయప్రోలు సుబ్బారావు గారు `నిండారబారు నఖండ గోదావరి దాగిన చాళుక్య నాగరికత, పల్లె పదాల జీవము నిల్పికొన్న పలినాటి వీరుల రక్తనాళ పటిమ, పాడైన పెనుకోట గోడల దీర్ఘ నిద్రలు వోవు కాకతి ప్రాభవమ్మూ, కడలేక యేడ్చు తుంగభద్ర కెరటాల మణిగిన ప్రాజ్య సామ్రాజ్య భరమూ, ఆంధ్రుల హృదయాలు వినేటట్టుగా దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి కంఠంలోంచి పలికితే మధ్యాహ్నసభలో ఏకగ్రీవంగా ఆమోదింపబడిందట. గ్రంథాలయ సర్వస్వమనే పత్రిక రాయప్రోలు వారి శంఖారావాన్ని తెలుగువారి కందించింది. మృదువులైన పదాలూ, మెత్తని ప్రవాహశయ్యా, మనస్సు ద్వారా హృదయానికి చేరగల వస్తుధ్వనీ అది మేల్కొల్పగల భావ విభూతీ ఆనాటి రాయప్రోలు రచనలలో మేళవించాయి. అవన్నీ పుంఖాను పుంఖాలుగా వచ్చాయి. దేశీయోద్యమము ఆంధ్రోద్యమముగా రూపు దాల్చింది. కృష్ణవేణీ హరితసస్య పృథివీ, గౌతమీ పుణ్య కల్యాణ కంఠసీమా, తుంగభద్రా తరంగరంగమూ శమీపూజలతో, పూనవ్వులతో, ఆటపాటలతో ముఖరితము లైనాయి. జాతి బ్రతికియుండిన నాటి చైతన్య మననము నవచైతన్య స్ఫురణనూ భావావేశమునూ కూడా కలిగిస్తుంది. రాయప్రోలువారి పద్యాలు ఈ రెండు ఫలాల్ని పండించి, దేశమంతటా అందించాయి. వీరి "సిరులు పొంగిన జీవగడ్డయి, పాలుబారిన భాగ్యసీమై" అన్న గేయము వాచ్య ప్రబోధముతో సంతుష్టి చెందక సూత్ర యుగముల శుద్ధ వాసన క్షాత్ర యుగముల చండ శౌర్యము'లను కండగల చిక్కని తెనుంగుల కలిపి పాడి, గురజాడవారి నిసర్గవాణిని కూడా మరపించి తాను వినబడినది. దువ్వూరి రామిరెడ్డిగారు స్వాతంత్ర్య రథము, భారత మాత అని చాలా పద్యాలు రాశారు, **Battle of Blenhem**ను జ్ఞప్తికి తెచ్చే కొండవీటి కథ వ్రాశారు. దేశీ ప్రబోధమూ, రాష్ట్రీయ ప్రబోధమూ, జాతి ప్రబోధమూ త్రిశూలపు మొనలవలె నిక్కి వాడిదేరినవి. బెసంటమ్మ `హోం రూల్' ఉద్యమమూ గాంధి మహాత్ముని సహాయ నిరాకరణోద్యమమూ అసంతృప్త భారతీయ హృదయాలకు చిచ్చు ముట్టించాయి. ఎండ కన్నెరుగని నారీమణులూ, లేత శరీరపు విద్యార్థులూ, నోరులేని కర్షక జనమూ ఉప్పెన

కెఱటాలవలె ఆంగ్ల పాలనమీద పడ్డాయి. ఈ సంరంభంలో కోటి గొంతులు విచ్చి మ్రోగాయి. బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి `స్వరాజ్య సమస్య' అన్న పద్యాల పుస్తకము చదవవలసిన గ్రంథము. `సకల రత్న ప్రభాచటులాంబరంబైన హిమనగం బాత పత్రముగ మెరయ, చేరి భాగీరథీ సింధునదీ తటుల్ విమల వీచీ చామరములు వీవ, ప్రాక్పశ్చిమాగ్ర భూముల గొల్చి గభీర వారిధీశ్వరులు కైవార మొసగ, ఆర్య సంతతి యుదాత్తాను దాత్తములైన స్వరములు స్వస్తివాచనములిడగ ముప్పదియు మూడుకోట్లుల ముద్దు సుతులు, సమత తన యాజ్ఞ శిరసావహింప, సింహళద్వీప పీఠికాసీన యగుచు, కరుణ జగమేలుగాత మా భరతమాత' అని దేశ మాతృస్తవమునే కాక `గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రాది పావనోదక ముగ్ధబాలు త్రావి, నన్నపార్యాది మాన్య కవిత్రయముచేత నల్లనల్లన మాటలాడనేర్చి, ఆంధ్రరాష్ట్ర స్థాపనాచార్య వర్యుడౌ విష్ణువర్ధను భుజాపీఠి నెక్కి,ఆంధ్ర సేవాపరాయణ కృష్ణ రాయాది పతులచే సకల సంపదల బొదవి, కడుపు చల్లగ గాంచి పెక్కంధ్ర సుతుల బహువిక్రమతేజః ప్రభావధనుల నిస్సమాన మహోన్నతి నెగడినట్టి ఆంధ్రమాతా నమస్కారమమ్మ నీకు' అని ఆంధ్ర మాతృస్తవమును అందముగా చేసినారు బలిజేపల్లివారు. వారి నాటక కవిత్వము రసభావ సమంచితము. నదీ ప్రవాహ సదృశము. ఆ సుందర సంస్కారము దేశసేవకు పూనినట్లయితే లోకులు బ్రహ్మరథము పట్టరా? ప్రతీ సభలోనూ ప్రార్థనా పద్యాలు ఈ రెండుగానే వెలసినవి. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి `రసపుత్ర విజయము'లోని`అలహిమాద్రియు వింధ్య మారావళియు చుట్టు పెట్టిన గోడలై పెంపు మీర, లలిమించు కైబర్ బొలాన్ కొండకనుమలు ద్వారంబుల విధాన తనరుచుండ ', అన్న పద్యమూ ఇతరుల పద్యాలూ వీటి యెత్తునందుకోలేదు. నాటికి నేడు జాషువా కవి `సగరమాంధాత్రాది షట్చక్రవర్తుల యంకసీమల నిల్చినట్టిసాధ్వి, బుద్ధాది ముని జనంబుల తపంబున మోద బాష్పము ల్విడిచిన భక్తురాలు, కాళిదాసాది సత్కవి కుమారుల గాంచి కీర్తి నందిన పెద్ద గేస్తురాలు, కమల నాభుని వేణుగాన సుధాంభోధి మునిగిదేలిన పరి పూతదేహ, సింధు గంగానదీ జల క్షీరములను కురిసి బిడ్డల బోషించుకొనుచున్న పచ్చి బాలెంతరాలు మా భరతమాత, మాతలకు మాత సకల సంపత్సమేత' అంటూ సాధ్వి, భక్తురాలు, గేస్తురాలు, బాలింతరాలు అని స్త్రీ మూర్తి అందపు చాయలను గుచ్చెత్తే వరకూ ఆ పద్యాల్ని మరపించే పద్యము రాలేదు.

దేశము యొక్క ప్రస్తుత దీన దశను వర్ణించడము ద్వారా కరుణా, తద్వారా ధర్మామర్షమూ కలిగించడము దేశీయ కవిత్వానికి రెండో ఆయుధము. ఓలేటి నారాయణమూర్తిగారు దుర్గాదాసై `విశ్వ విఖ్యాత మా విశ్వేశ్వరుని గుడి కటకటా తల్లిలో గలిసిపోయె'నని రంగస్థలము మీద అరుస్తుంటే ప్రేక్షకులలో కలకలము

పుట్టేది రసపుత్ర విజయనాటక ప్రదర్శనాలలో. "సూత్రయుగముల శుద్ధ వాసన క్షాత్రయుగముల చండ శౌర్యము. చిత్రదాస్యముచే చరిత్రల చెరగిపోయెర తమ్ముడా" అని వింటే గుండె గుబ గుబలాడుతుంది. `అచ్చరాలొచ్చి అచ్చన గాయలాడుకుండే రాజ్యములో రయ్యో కొయ్యోడ, కిన్నరులొచ్చి కీర్తనపాడే కీర్తివంత రాజ్యములోరయ్యో కొయ్యోడ, అని పాడితే వెర్రిగొల్లడు కూడ ఉగ్రూత లూగుతాడు. దీనికి తోడు `నూరు మంది మలబారువాసులానూ, కూరినాడొక పెట్టెలోన, గాలి, దూరనీయడు ఇంచుకైన, నోట, నీరు పోయడు దేవునాన' అంటూ పరపాలకుల దౌర్జన్యాలను గరిమెళ్ళ సత్యనారాయణవలె దండ గుచ్చితే ఈ ధర్మామర్షము అగ్నిపర్వతమవుతుంది.

చారిత్రక క్షేత్రాలూ, పుణ్యక్షేత్రాలూ శిథిలమైనాయని చూపడము దేశము వన్నె తరిగి కృశించినదని చెప్పడమూ, అన్యాపదేశముగా `దేశాన్ని నీవు పునర్నిర్మించవలెననియు చెప్పడమూ అవుతుంది. `అది తటాకమూ కాదాంధ్ర కుమార అరివీర దుస్సాధ్యమైనట్టి పరిఘ, అద్ది కుంకుమము గాదాంధ్ర కుమార తెలుగు నెత్తుటి గడ్డ దెరలిన దుమ్ము' అని శేషాద్రి రమణకవులూ,`కుక్కలు చింపు విస్తరిగ కూలిన యోర్గలు కోటకంటివే, మక్కువ ఊపిరుండియును మూతికి మీసము గల్గు నాథుడా అని వానమామలై వరదా చార్యులూ `గడ్డి మొలిచెం బులి చారల గద్దె మీద' అని జాషువా `శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణములైనవి తుంగభద్రలోపల, గుడి గోపురమ్ములు సభాస్థలులైనవి కొండముచ్చు గుంపులకు' అని కొడాలి సుబ్బారావూ పలికినప్పుడు మనలో పుట్టే కలవరము కార్యదీక్షతో గాని సర్దుకొదు. పద్మనాభ యుద్ధమును స్మరిస్తూ `భయద దాస్య విశృంఖలా బంధితుడవు, ఓయి! జీవచ్ఛవాంధ్రుడా! ఒక్కమారు ఒలుక నిమ్మిట నింత కవోష్ణ బాష్ప మలినధార స్వాతంత్ర్య సంప్రాప్తి కొరకు' అన్న పురిపండావారి పలుకు అందుకు సాక్ష్యమే కదా? ... చారిత్రక ధ్వనిపూర్వకముగా ఈనాటి దుర్దశను నిర్దేశిస్తూ కలత పెట్టడమే అవుతుంది. దేవుల పల్లి రామానుజరావు ఓరుగల్లును గురించి`అల్లుని స్వేచ్ఛకై నెల్లూరి నెరజాణ పఠియించె నిచటనే భారతంబు' అన్నపుడు తిక్కన మహాకవి సద్యత్నము మెరుపు కొట్టుతుంది. కొండవీడులో `గజపతి ప్రౌఢోగ్రకరి ఘటాశుండా విధూతాంబు నిచయ బిందూత్కరము' ద్వారా విశ్వనాథవారు ఆ `మోహంపు టురిత్రాడు దుర్గ' ప్రాచీన శోభను చూపిస్తున్నారు. `వరదరాజమ్మ కంబముపొంత నిలిపిన మగని పేరిటి సుధామల సరస్సులో " జాషువ గారు విజయనగరపు రత్నాల విపణివీథిని ప్రతిఫలింపజేసినారు. ఈ పూర్వౌన్నత్యానికి బొరుసు ఈనాటి దైన్యము. రెండూ రెండు చక్రములై దేశసేవా శకటమును నడపవలెనని రచయితల కోరిక.

ఈ సంరంభములో వచ్చింది విశ్వనాథవారి ఆంధ్ర ప్రశస్తి. ఆ రావడము సభలలో తుఫానులాగా క్షణక్షణావరోహణాలతో, కంఠ గాద్గదికతతో, ఉరుములతో,

అరుపులతో, పరువులతో వచ్చింది. ప్రబోధమూ, సంగీతమూ, కవనమూ, వాచికాభినయమూ చేరి తెలుగువారికి ఒక వింత ఘోషగా వినబడింది ఆంధ్ర ప్రశస్తి. ఉత్సాహపూరితులాంధ్రులు విని హర్షించారూ, అనుకరించారూ, ఆనందించారు. ఆనాటి తీవ్రవాదుల దేశభక్తి గేయాలూ, పద్యాలూ చేసిన అపాయకర వాచ్య ప్రబోధ వాతావరణంలో అరచాటుగా దేశభక్తిని ఉద్బోధించే ఈ ఖండకావ్యాలు యువకులకు ప్రచ్ఛన్నాయుధాలయాయి. అందరూ విన్నారూ, వినిపించారు.

ఈనాడు ఆ ఉద్వేగమూ సంరంభమూ లేవు. రచనలు సముద్ర తరంగాల్లాగా వచ్చాయి. ఉద్యమాలు ఝంఝూమారుతాల్లాగా వీచాయి. రచనాదర్శాలు బోనులో కెక్కాయి. సమర్థించిన వారు సమర్థించారూ, విమర్శించినవారు విమర్శించారు. ఈనాటి తత్వంలో వెనక్కి చూసి పరీక్ష చేసుకోవలసి వస్తోంది మనం ఆంధ్ర ప్రశస్తిని. కాలాన్ని బట్టి ఆ కావ్యానికి వచ్చిన ప్రశస్తి జారిపోతుంది ఈనాటి సమీక్షలో. అయితే, అది తప్పని సరి.

ఆంధ్ర ప్రశస్తిలో తెలుగునాటి చరిత్రలో కవికి నచ్చిన భావఘట్టాలను ఇతివృత్తముగా గ్రహించి రచించిన ఖండ కావ్యాలు పండ్రెండున్నాయి. `ఆంధ్ర విష్ణువు' కాకుళము రాజధానిగా ఏలుతూ సరదార్ల విన్నపాలు విని - శైల ప్రాంతాటవిలో బీభత్సవము కలుగజేస్తూ ఉండిన - నిశుంభుడనే రాక్షసుణ్ణి ఆంధ్రవిష్ణువనే రాజు చంపిన కథ. దీపకర్ణి మహారాజు వేటకు పోయి ఒక యక్షునివల్ల శాతవాహన కుమారుణ్ణి `పొందడము `శాతవాహనుడు'. మాధవవర్మ మహారాజు తన కుమారుడు పేదరాలి కొడుకు దుర్మరణానికి కారణమైనాడని అతని మరణదండన నామోదించుట `మాధవవర్మ'. `నన్నయ్య భట్టు' భారతావతరణ దృశ్యము. `ప్రోలరాజు కథ' కాకతి ప్రోలరాజును అతని కుమారుడే అయిన రుద్రుడు తెలియక పొడిచిన కథ. `చంద్రవంక యుద్ధము,`యమదంష్ట్రిక', `పల్నాటి యుద్ధమూ, రాయచూరు ముట్టడీ నాటి కథలు. కొండవీటి పొగమబ్బులు, ముఖలింగము, వేగి క్షేత్రము అన్నవి కవి ఆయా క్షేత్రములను దర్శించినపుడు ఆయనకు కలిగిన భావాలు. కాబట్టి ఆంధ్ర ప్రశస్తిని కథాకావ్యాలూ, భావ కావ్యాలూ అని రెండు భాగాలుగా చూసుకో వచ్చును మనము. కథా కావ్యాలు ఏదో కథను వినిపించేటివి. ఇవి మొదలు పెట్టిన దగ్గర్నించీ చివ్వరి వరకూ చదువరి అపేక్షను పోషిస్తూ లాగి చివ్వర, వాటి పరిణామ సౌందర్యమువల్ల సద్యఃపరనిర్వృతిని కలిగించాలి. చివరిదాకా వినాలని ఆసక్తి కలిగిస్తూ చివ్వర విన్న ఫలాన్ని కలిగించని కథకు ప్రయోజనమేమిటి? సత్యనారాయణగారి కథా కావ్యాలలో మాధవవర్మ మనలను పట్టి లాగుతుంది చివరి వరకూ. విజయవాటిక కోట వీథిలో రాజపుత్రుడు కొత్తగా కొన్న తురంగములు

పూన్చిన రథము మీద వాహ్యాళి పోతాడని రాజ భటులు ప్రజలను వీథి పక్కలకు ఒత్తుతూన్నారు. నిమేష మంద మెరుములురుములై వచ్చి రాసుతుని స్యందనము కదలి దాటిపోయినది. తచ్చక్ర ఘట్టితాంగుడయి నెత్తు రోడికలు గట్టపడినాడు ఒకడు. అంతలో సూర్యుడు అస్తమించినాడూ అస్తగిరి గహ్వర స్థితాంధకారము కృష్ణసర్పమువలె దిక్కులన్నిటిని ఆక్రమించినది. మరునాడు పేదరాలు కొడుకు శవాన్ని ఇంకా తీసుకువచ్చి చూపి న్యాయమో -, జరిగిన అన్యాయానికి ఇంకా కలిపి- అన్యాయమో చెయ్యమని కోరి రాజు ధర్మాసనము ముందు పడి చచ్చిపోయింది. ప్రాడ్వివాకులను ధర్మ నిర్ణయము చేయమని కోరినాడు మాధవవర్మ వారు. `ప్రాణమ్ము ప్రాణమును బదులు కోరుననీ, `స్మృతికి భూమిజాని సుతుడనీ కాదనీ లేదు' అనీ అన్నారు. తీర్పు వినింత సేపు ధాత్రీపతి మోము కనుతుదలనైనా కదలిక కలగలేదు. తీక్ష్ణ మార్తాండమూర్తి ఆకాశమధ్య సౌధాగ్రము చేరేడు. కృష్ణవేణి ఇంద్ర కీలాద్రి ఒడ్డు తాకి మొరసినది. ధర్మాసనమున నున్నపు డెంత గంభీరుడో, దిగి అంత దుఃఖదళితుడైనాడు రాజు. నాటి దివసాంతమున యువరాజు మేని రక్తము అసృగుదిత ప్రవాహమై పారింది. నటశివ నూపుర రవాను కారి చిటచిటచిటనినదోద్భట కనకము విజయవాడలో వర్షము కురిసినది. కథలోని పాత్ర భావమునూ, చదువరి భావమునూ రంగరించి కథలోని ప్రకృతి వర్ణనమువల్ల ధ్వనింపజేయడము సత్యనారాయణగారి ప్రత్యేక శక్తి. తీర్పును విని విజయవాడ ప్రజాసచివులూ మాత్రమే కాక తీక్ష్ణ మార్తాండమూర్తీ ఒడ్డులొరసి ఎగసే కృష్ణవేణీ కూడా ఉద్రిక్తులౌతారు ప్రకృతి చైతన్యానికి తమ కథతో గల సానుభూతిని విశ్వనాథవారు పద్యకావ్యాల్లో కంటే ఏకవీర, వేయిపడగలు, వంటి గద్య కావ్యాలలో ఎక్కువ ఉపయోగించుకున్నారు. చివరకు వీరి చేయి సంస్కరించిన `వక్రరేఖ' (ముని మాణిక్యం వారి నవల )లో కూడా ఈ రకపు భావధ్వని మ్రోత వినబడుతుంది. పలుమార్లు, వచనములో రచయిత వాక్యాన్ని ఇష్టము వచ్చినట్లు వంచి నిశితము చేయగలడు. పద్య మనగానే గణాలూ. యతులూ, ప్రాసలూ తెచ్చే నిర్బంధాలూ సంప్రదాయాలు మోసుకొచ్చి మన ముందు పడవేసిన ఉత్ప్రేక్షలూ సమాసాలూ-, దురాన్వయాలూ, పాదపురాణావసరమూ, భాషా- అన్వయ-, వ్యతి క్రమాలూ ప్రవేశించి కవిని చెప్పగలిగినట్లుగా చెప్పనివ్వవు. కవి వచన పద్ధతిగా ఉన్న రచనను పద్యశయ్యలో ఇమిడ్చి లాగితే ఛందస్సు సమకూర్చగల అందపుగతి చెక్కుకుపోయి పద్య సౌందర్యము నష్టమవుతుంది. సత్యనారాయణగారి అసంఖ్యాక పద్య రచనలలో ఈ చికాకులన్నీ కానవస్తాయి. `ప్రవహించినావు, నైశ్చల్యము, నైష్ఫల్యము, ముర్మురించు, పావిత్ర్యము, నైల్యించె, శీతలింపించె, ప్రతిఫలించె, తెండా, అంధ్యము, పట్టుబడలేనేలేదు, ఎరిగిలేను, ప్రహ్వీకరింపబడియె, తెల్లరేగు (శోకాతి విషణ్ణులై) మనెదరు, మృగీమదము వంటి పదాలు వచన

రచనలో వాడారు వారు. మరి పద్యాలలో ఎందుకు వచ్చాయన్నమాటా? `కాషాయ రమ్యవల్కల హుతాశన క్రియా సంహితాశ్వత్థ సామిధేని' అంటూ అలంకార సాధన కోసము అల్పపు పోలికనైనా సరే ఉపయోగించడమూ, గంగా భోజాలు కృష్ణవేణీ ప్లవన్నీరేజాలు పెన్నానదీ సముత్పన్న కైరవాలూ కళింద తనయా వ్యాకోచ (!) నీలాంబుజాలూ సాగరమేఖలా చారు కుచద్వయీశాయి ఆంధ్రావని చక్రవర్తీ' అంటూ లేని పదార్థాల్ని చూచి వచ్చినట్టు వర్ణించడమూ కవిగారి ఆ ప్రాచీనాచారాభిమానాన్ని తెలుపుతాయి గాని తెలుగుకవి పట్టిన సౌందర్యహారతికి ఒక స్నేహబిందువునైనా చేర్చవు. సౌందర్యము వర్ణించడానికి కలము పట్టినవాడల్లా యక్షతనయేందు జయంత వసంత కంతుల వరకూ వెళ్ళిపోవచ్చును కల్పాంతముదాకా! వెళ్ళుతూండడమేనా అని! కుపిత శంకరనేత్ర కుహరాగ్ని దగ్ధ మన్మథ దేవునకు ప్రాణ ప్రతిష్ఠయట ఋషికన్య. మన్మథుడు మగవాడు, ఈమె ఆడది, ప్రాణము స్త్రీయా? నాకు తెలియదు. "సిద్ధ ఖేచర యక్షకాంతలా సొగసు ప్రాకార మార్గమనుసరించెదరు"ట! ఎవరి కోస మనుసరిస్తారూ? వారికి ఆలయాలా? మన్నా? భూలోకానికి దిగకపోతే నాటి నుంచీ నేటి వరకూ వారికి దిక్కేదీ! కవుల ఆట సామాగ్రితో అల్లి పెట్టినదంతా కవిత్వమే! గౌతమీ పుత్రశాతకర్ణి సైన్యములో "కంచు రథాలపై తెలుగువారన్నన్న యొక్కొక్కడే మాపన్ గల్గును ముష్టి ఘాతముల దిజ్మత్త ద్విపేంద్రములన్"ట! ఈ రకపు గొప్పలే టప్పాలు కొట్టుకుంటూ ఎన్ని శతాబ్దాలు నడుపుకు వచ్చారు ప్రబంధ కవులు తెలుగు కవిత్వాన్ని! చుట్టుచూపు వచ్చిన ఈనాడు కూడా, సమకాలిక నాగరిక జాతులకు చూపడానికి తెలుగు కవిసామ్రాట్టుల కవితా సామాగ్రియిదేనా? కొండవీటి పొగమబ్బులు `దగ్ధాంధ్ర రాజ్య నిత్యవిధూత ధూమములు, `బురుజు కొమ్ముల వీడిపోలేని రెడ్ల కీరితి' యట, `దాగ్ధావదాంధ్ర స్వతంత్రకారమ'యట పోయే మబ్బులకు పోయే వాటన్నిటితోనూ పోలికే? వస్తు సామరస్య మవసరములేదు! సంస్కృత సమాసాలు భావాలు తక్కువై నీరసపు టాలోచనలు యెముకల్లాగా పొడుచుకు వస్తూంటే అవి తోచకుండా కప్పిన బొంతల వలె పనికి వచ్చాయి తెలుగు కవులకు. ఆ సమాసాలను వాడుటే గొప్ప అని నేటి కవులు కూడా భావించడము తెలుగు సరస్వతి దురదృష్టము. "హిమక్షితిధర కన్యకా సౌందర్యధనుడు శ్రీ శైలరాజ ఆంధ్రపతి చేత సేవింపబడ్డాడట నిశంభుని మీది దండయాత్ర సందర్భములో. ఆంధ్ర రాజు శైల స్వామిని సేవించడము చుట్టూ సమాసపు మెత్తలేలనో? తెలుగులో వ్రాసి ఉంటే కనబడును భావము యొక్క సత్తువ. "సముద్భవ నినాద బధిరి తాశాచయుంబులు పగిలిపో"వు నట్లుగా నిశంభునిపై పిట్ట పిడుగు పడిందట. "సముద్భవ నినాదము" రణోద్భవ నినాదము కాదు! సముద్భవము! సంస్కృత రక్ష రేపు దైత్యాధిపునకు "దైతేయేంద్ర' దైత్యేంద్రుడు అన్నమాట లున్నాయి.

ఉన్నవా డొక్క దైత్యుడేనే? వీడి ఆధిపత్యాన్ని నిరూపిస్తూ పారిపోడానికైనా దైత్యులితరులు లేరు! `పురరాజ్య లక్ష్మి'ట. పురరాజ్యము! "అమృత వాసనాలహరి" అవును. అసలే లేని నదీ నీరేజముల నుంచి వచ్చేది అమృతవాసనాలహరీ కల్లోలమే కదా? `అహీన మహావహిమ', వాక్కుల కోలాహలంలో అర్థము వినపడనియ్యవు సమాసాలు.

విశ్వనాథవారి కథా కావ్యాలు `మాధవ వర్మ' పాటి లాగవు చదువరిని. కారణము వారి రచనా వైశిష్ట్యమూ స్వేచ్ఛానూ. తమ ఊహలను పరుచుకుంటూ ముందుకు వెళ్ళిపోవడమే కాని అవి చదువరికి పట్టునా? అని తామే చదువరులై ఆయన చూసుకోరేమో అనిపిస్తుంది నాకు. వారుపయోగించే విభక్తులు ఒకదానికి బదులు ఇంకొటి తయారవుతూంటాయి; కవిగారి వ్యాఖ్యానాన్ని పలుకుతాయి పాత్రలు. "అనుపలు కాంధ్రవిష్ణుని ఘుఘాదృత మయ్యెనో లేదో దాని నించునే సరదార్లు దైత్యుడు నిశుంభుడు చచ్చెను జచ్చెనంచు లోననుకొనుటొండె జాగుగద దానవ దివ్య జయారవ ప్రతిధ్వనితమయ్యె నాంధ్ర సభాభవంబు సాంద్రమై" అన్నారు. సత్యనారాయణగారు ఈ కావ్యమును సభాముఖాన వినిపించుచున్నపుడు, `నిశంభుడు చచ్చెను చచ్చెనంచు ' అన్న మాటలు మహోద్ఘూంకారంతో సరదార్లు పలికినట్లే గట్టిగా పలుకుతారు. తీరా చూస్తే(కిరాత) సరదార్లు లోననుకున్నమాటలు అవి! పైకి వచ్చినవి `తదావన దివ్య జయారవములు' అనుకున్నవారు కొత్తవారైన కిరాత సరదార్లు అయి అన్నవారు రాజు తత్వముతెలిసిన శ్రీకాకుళపు సరదార్లు అవడము శోభ. `శాతవాహనుడు'లో యక్షుడు దీపకర్ణితో "నీ నలినాక్షి శక్తిమతి నిద్రితశయ్యను సర్పదష్టయై ప్రాణములం దృజించుట శుభ ప్రతిపాదకమయ్యె నేటికిన్" అని మహా యెబ్బెట్టుగా పెండ్లి దివిటీ సామ్యముగా చెప్తాడు. "శక్తిమతి పోయిన నాట నుండి నీకు, పాపము, ఆశాకిరణమే లేదు. ఇదుగో ఈనాటికీ బాలుడు" అని యక్షుని చేత ననిపించే నేర్పు విశ్వనాథ వారికి లేదనను నేను, ఎవ్వరూ అనరు! లేనిదల్లా లక్ష్యము. తాము అన్నది ఎటు లాగుతోందో రెండోసారి చూసుకో రనుకుంటాను. లేకుంటే శక్తిమతి తొంగలి రెప్పలను ఆ బాలునికి అమర్చిన వారు యక్షుని చేత నామెను తగలేయిస్తారా? దీపకర్ణి బాలునితో నన్న మాటలలో"ఔ రాఘవుండు ఘడింపనిదీ కీరితి, వంశకర్తగుట సామాన్యంబేలే రెందరయ్యిన వంశ్యుల్ రఘు వంశమైన యది కాదా, ఆ మహారాజుపై " నన్నవి కవిగారి వ్యాఖ్యానపు టాలోచనలు దీపకర్ణి నోట పుత్రలాభ సమయంలో - ఉపాధ్యాయుని బోధనలు -ఇవి రాణించవు. `గౌతమీ పుత్రలో' `అనుచు గుసగుసలాడి నా రాంధ్రభటులు' అని,`కొందరని జయారావములందు మునిగె' నన్నారు. ఈ చప్పని ఊహ ఎందుకో?

సత్యనారాయణగారికి కథాకావ్యాలు తీర్చడములో శ్రద్ధ ఎంతో, భావ కావ్యాలు తీర్చే శ్రద్ధా అంతే. అయితే కథలలో పేలవ వస్తువూ పేకింగు సమాసాలూ దాటుకు పోతామూ మొత్తపు కథ కలిగించగల ఫలశ్రుతి అనుభవము వాటివల్ల ఎక్కువ నష్టము కాదు. భావాల్ని నిశ్శ్రేణిగా అమర్చి చదువరికి కూడా ఆ భావాలు కలగడానికే చేసే భావకావ్య రచనలో కవిగారి భావలహరి నిరంతరాయంగా భావౌన్నత్యాన్ని సాధిస్తూనే పోవాలి గాని పేలవపు టాలోచనలు ప్రవేశించరాదు. కథాకావ్యం కంటే భావ కావ్యం సాంద్రతరముగా ఉంటేనే దాని రచన సార్థకమవుతుంది. లేకపోతే, ఏ ఘట్టములో రచన పలచనైతే అక్కడ కవి కనబడిపోతూ చదువరి తన్మయతకి విరుపులు ఏర్పడతాయి. `వేగి క్షేత్రము'లో "ఏ రాజు పంచెనో యిచట శౌర్యపు పాయసమ్ములు నాగుల చవితినాళ్ళ" అన్నారు. నాగుల చవితికి పాయసము పంచే ఆచారము తెలుగునాట లేదు. మరి మన మెరుగని ఆచారపు భుజాల మీద నిలబడి పొందవలసిన భావ సౌందర్యాన్ని ఆచార నవ్యతను దాటేసి పొందగలగడము ఎలాగ సంభవించగలదూ? "ఏ యెఱ్ఱ సంజలో నెలమి పల్లవ రాజ రమణులు కాళ్ళ పారాణులిడిరో" అన్నారు. ఏమి? పల్లవ రాజరమణులు ప్రతీ దినమూ పారాణి పెట్టుకుంటూనే ఉండరూ? యెఱ్ఱ సంజ శుభాశీర్వాదానికి ఒక యెఱ్ఱ సంజ ప్రత్యేకత ఏమున్నదీ- ఏ యెఱ్ఱసంజ అనడానికి? అయితే రాణులు ముత్తయిదువల కాళ్ళకు మాత్రము పర్వదినాల్లో పారాణి పెట్టి మొక్కుతారు. అప్పుడు ఎఱ్ఱసంజ `ఆ పారాణి యెరుపు రాణులచేతా నుదుటా కాలా చిరకాలము నిల్చుగాక' అంటే శోభ. "ఏ ఎఱ్ఱ సంజలో నెలమి పల్లవరాణి రమణుల కాళ్ళ పారాణులిడెనో' అనో అంతకంటే బాగానో తీర్చి ఉండవలసినదేమో? నాలుగో పాదములో మూడు పాదాలలోనూ చూపిన కారణపు మిష ఏమి సూచించకుండానే " ఏ రెండు జాముల ఇనుని వేడిమి వచ్చి కలిసిపోయెనో త్రిలింగ ప్రభువుం" అన్నారు. కవిగారు కలిసి పొమ్మన్నారనా కలిసిపోయిందీ? వీరి సీసపద్యాల పాదాలు మూడు నడిచేసరికి నాలుగోది ఇంకా దారి తీస్తుందా అనిపిస్తుంది. `ముఖలింగమూ' `వేగి క్షేత్రమూ' చదివితే.

కవి యొక్క భావాలు కవిత్వము కావు. చదువరులకు కూడా ఆ భావాలు కలగడానికి చేసిన రచన కవిత్వము. సత్య నారాయణగారు ఛందో బందోబస్తును మించి `రచించే యత్నము ఒకపట్టాన ఎక్కువగా చెయ్యరేమో ననిపిస్తుంది నాకు. ఒక ఉదాహరణము చెప్తాను చిత్తగించండి. `శృంగార వీథిలో అస్మదురోజముల్ మృదుశ్రీ చరణాంకితంబులుగ (కృష్ణుడు) నృత్యముచేసె సకింకిణీ ధ్వనిన్" అన్నది. వజ్రము దొరికింది సత్యనారాయణ గారికి! కృష్ణుని పాదాల వలెనే వారి రచనాకన్య రాధాస్తన మండలీ శృంగార వీథిలో నృత్యము చేయబోయింది. అయితే ఇక్కడి అందమంతా కృష్ణుని నాట్యములో కాదు. ప్రభువు కాళీయుని పడగలమీద కూడా

కింకిణీ ధ్వనితో నృత్యము చేసినాడు. అందమంతా, స్వామి నృత్యము చేసిన సుందర రంగపు తెర వెనుక రాధ హృదయపు టానందములో ఉన్నది. అది శృంగార వీథిలో దారితప్పిన కవిగారికి అక్కడ స్ఫురించలే దంటాను. అయితే ఈ ఊహ పరిణతికి రాలేదన్న తపనలో పక్వమై పక్వమై చివరికి `వేయి పడగలు' లో `నీ చరణ యుగంబు నాదు చన్నుల మీద మోపి బాధ హరింపు వరింపు మాధవా' అన్న గిరిక ప్రార్థనగా పునీతమై వచ్చినది. రాణి తన కులమును నిందించుకొన్నదన్నారు. సత్యనారాయణగారు ధన్యులు. ఆయన కూడా తన పౌరుషమును నిందించుకునే ఉంటారు. కృష్ణ శిరసి మండనమైన ఉదార పదపల్లవమును మించిపోయి పరాంకోటినందిన రాధికాస్తనమండలాంకిత బాలకృష్ణ కవికీ మనకూ కూడాను!..... భావ కావ్యాలు క్లుప్తముగా ఉంటాయి కనక దిద్ది తీర్చి అతి జాగరూకతతో నడిపితేనే కాని అవి చదువరిని చివరిదాకా లాగవు. సత్యనారాయణగారిది ఉరుములా మెరుములా తత్వము. కావ్యాన్ని వెన్నెలలో నావ ప్రయాణంగా నడిపించడముకన్న జరాలున జలధారలలో కిన్నెరసానివలె - పల్టీలు కొట్టించడము ఆయనకు ఎక్కువ ఇష్టము. అందువల్ల వెన్నెలరాత్రిని కంటె మెరుముకూ మెరుముకూ నడిమి చీకటిని పోలిన ఊహలు ఆలోచనలూ పాఠకుణ్ణి ఈడుస్తాయి కాని లాగవు. ఆంధ్రవిష్ణువు వృషత్క శేఖరము హృదయమున నాటు నింతలోన నిశుంభ దైత్యాధిపునకు లోచనాంతములందు మార్తాండ నీలోత్పల బంధు కాంతలూ, అసృజ్జ్నదమైన వక్షస్థలమునందు చారు కౌస్తుభ మణిచ్ఛవులూ, గర్భగోళమున విశ్వ వహన భారమూ, హృద్వీథిలో అఖిల వేదాంత విద్యాశ్రయ వైరాగ్య నిస్ఫూర్తీ కలిగినవట. విష్ణువైన ఆంధ్రవిష్ణుని బాణము సృజించి హృదయ భేదనము చేయు నింతలోన నిశుంభుడికి సాలోక్య సమీప్యముల బాధ లేకుండా పూర్తి సారూప్యత కలిగిపోయినది. వాల్మీకాదులు విష్ణు శస్త్రాహతులకు సారూప్యత చెప్పలేదు. విశ్వనాథవారు (వారి సొమ్మేం పోయిందీ?) ఇచ్చేశారు. ఇది వారినందరినీ దాటుకుపోయిన మెరుగని, స్తోత్ర పాఠకులు అనవచ్చును. ఇక విష్ణు దేవుని గతి చూడండి: లక్ష్మీకుచ కుంకుమారుణ కరమును అవతార వంశాంకురాల తర్పణాలకు చాపించారు విశ్వనాథవారు. యాక్కురారీ! విశ్వనాథవారికి తర్పణ కర్మలంటే ఉన్న ప్రీతి ఆ ప్రభువున కున్నదో లేదో మరి! ఇదొక కొత్త గుణము మెరిసింది స్వామికి వీరి మేకప్ ధర్మమా అని! `చెలియలికట్ట'లో పశ్చాత్తప్తురాలైన రత్నావళి కూడా తద్దినాల కోసమే అర్థిస్తుంది. తమ అభిమానులనూ అలవాట్లనూ తమ చేతబడిన పాత్రలకు ఆరోపించడము శ్లాఘనీయమైన గుణము కాదేమో? `ఆకూత లన్నన్న చంపవు చంపునున్" అన్నప్పటి `అన్నన్న' `కుమారాభ్యుదయము'లో (దేవతలు) అన్నన్న పురుగుల కన్నగనాకష్టమైతిమే యని దుఃఖ మందువారు' అనడములోనూ, ఆంధ్ర ప్రశస్తిలో `అన్నన్న ఒక్కొక్కడే గుద్ది చంపు మత్త

ద్వీపంబులన్'లోనూ వేరై కవిగారి అలవాటుగా కనబడి పోతుంది... ఇలలోనూ కలలోనూ లేని ఊహలు వాటి దారిని అవి వెళ్ళిపోతాయి గాని చదువరులను పలకరించవు. కోటలూ పేటలూ వంటి మానవ నిర్మాణాలకే పౌరాతన్యము మనం లెక్కవేసుకుంటున్నాము. సత్యనారాయణగారు వేంగి క్షేత్రములోని గాలి పౌరాతన్యమును తలచుకొని నిర్విణ్ణులైనారు. సూర్యబింబమే సాంద్రవాయుగోళ మంటున్నారు వైజ్ఞానికులు! అయితే గాలి పౌరాతన్యము ఆంధ్ర ప్రశస్తికి చాలా ముందుది. "ప్రాక్సముద్రమందాసన నీరు పశ్చిమ మహాంబుధి ద్రావుము" అన్నారు శాతవాహనుణ్ణి. వాడు పాపము మేఘవాహనుడేనా అయినాడు కాడు, మేఘము సముద్రము నుంచి గ్రహించిన నీటిని త్రాగేవాడు! ఇప్పుడు ప్రాక్సముద్రమూ పశ్చిమ మహాంబుధీ లభించాయి అతనికి నీరు త్రాగడానికి. కవి కల్పించిన కొత్త సమయాలూ ప్రవేశిస్తే కవి స్ఫురణా రచనాగుణస్ఫురణా కల్పించవా పాఠకులకు? (ఆంధ్ర విష్ణువులో నాలుగో పద్యమూ, శాతవాహనుడులో నాలుగో, పదో, పంద్రెండో పద్యాలూ, మాధవ వర్మలో పేదరాలి మొదటి పద్యములో రెండో సగమూ, ఆఖరిది కాని చివరి పద్యములలో మొదటి పాదమూ, వేగి క్షేత్రములో ఎనిమిదో పద్యమూ చూడండి). చిత్రమేమిటంటే ఈయనకు శక్తి వంతమైన రచన చెయ్యడమూ బాగా తెలుసు! "పాడిన గీతమే మరల బాడెదం గూడిన భావమే మరి గూడెద వేమి పేయవలె గుండియ శోషలి దుఃఖ వేదనల్ గాడిన నా హృదంతర ముఖంబున మా తొలినాటి కీర్తి రాపాడిన నాదు వాక్కులెగబారదు నూత్న పథాల వెంబడిన్" అంటూ వినేవారి మనస్సును కళ్ళెము తగిల్చి పట్టినట్లు పట్టగలరు. "నా జాతి పూర్వ ప్రథా జీవరహితమై శక్తి నాడుల యందు చచ్చిపోయి, నా మాతృభూమి తేజో మహాశ్యతుని బ్రహ్మక్షత్రతేజంబు మంటగలిపి, నా మాతృభాష నానా దుష్ట భాషల యౌద్ధత్యమును తల నవధరించి ... నా తల్లినేల నేనాటి వాచారముల్ పై మెరుగులు చూచి భ్రమసి పోయి, ఏమి మిగిలిన దీనాటి కిట్లు పొంగులొలయు వర్షానదీ గభీరోదకముల దైన్య గర్భ చారిత్రముల్దక్క భిన్నగిరి శిఖర దుర్గపరిదీన గీతి దక్క" నని గుండె పిండగలరు. `దగ్ధాంధ్ర రాజ్య నిత్య విధూత ధూమమ్ము వలె గొండ బురుజుల కెలన లేచిన కొండవీటి పొగమబ్బును చూపిస్తారు. `గజపతి ప్రౌఢోగ్ర కరిఘటాశుండా విధూతాంబు నిచయ బిందూత్క' రాన్నీ అలకసవాపాత్రు నంటి రాజిన కృష్ణ రాయ బాహోగ్ర జాగ్రన్మోహాగ్నినీ స్మృతికి తెస్తారు. "సాయం సమారంభ వేళారోచిస్సుల మందవాయు మృదులీలా వీచికా శ్రేణులలో సౌరాష్ట్రేశ్వరు శేషదుర్గ శిఖరాంచన్మౌళి భాగంబుపై తారామార్గ మలంకరించిన త్రైలింగరాజ్య ధ్వజస్ఫారోదంచిత లోహితచ్ఛటల"ను కళ్ళకు కట్టి చూపిస్తారు. శక్తి కావలసినంత, శ్రద్ధ మాత్రమంతంత. అందుకే వారి రచనలలో శిఖరాల పక్కన లోయ లుంటాయి. చదువరికి ప్రయాస,

పరీక్ష! కొడాలి సుబ్బారావుగారు విశ్వనాథ వారికి ఏకలవ్య శిష్యులు. విశ్వనాథ `వేగి క్షేత్రము' వంటి ఖండ కావ్యాలవల్ల ప్రాభావితులై `హంపీ క్షేత్రము' రచించారు. వారి పద్యాలలో పెక్కులు ఎత్తుబడీ. అన్వయక్రమములలో కూడా విశ్వనాథవారి పద్యాలను అనుసరించినవి కలవు. అయితే విశ్వనాథ వారి దూరపు మాటలూ, వాక్యాల మడతలూ, విమార్గ గమనాలూ వీరు అనుకరించలేదు. కామరాజుగడ్డ శివయోగా నందరావుగారితో చేరి వీరు కొన్ని తొలి రచనలు చేసినా హంపీ క్షేత్రముతోనే వీరి ప్రతిభా ప్రకాశము జరిగింది. హంపిని దర్శించి, ఆ శిథిలాలలో కాళ్ళు నొప్పులెత్తే వరకూ తిరిగి ఆ క్షేత్ర దుర్దశకు పనవి పనవి తమ కన్నీటికి గుండెలయను చేర్చి నైసర్గిక పథాలలో నడిపించారు తమ కావ్య కన్యకను. వీరి చూపులో `ఒక కొండరాజు పేరోలగంబున గట్టు కొలిచి యుండిన లాగు' కుదిరింది, శిలలు ద్రవించి యేడ్చినవి, నాడు మండిన మంటతో తిమ్మరుసు కచ్చేరి మసీదుగా మారింది, బాకుపోటున చిమ్మబడిన నెత్తురు జల్లు రాజవీథిని వెల్ల వేసినది, `లంజదిబ్బ రాకాసిరేడంట రాని మంటను చూపినది', కొండ కోనలు వాల్మీకి యమృతంపు వాన చినుకును శబ్దించినవి, కిన్నరాంగనా పాదముల `పారాణి చిక్కన చెమటలో కరగి ' చార పోసినది. హంపీ క్షేత్ర రంగమున శతాబ్దాల గమనములో తెరలెత్తిన గాథలు ఈయన మనోరంగమున వరుసగా తెరలు దించుకున్నవి. `హంపీ స్థాపన'లో శునకంబుల బొబ్బటిలంగ బెబ్బులుల్ చాలక నిల్చి పోయిన చోట బ్రహ్మ విద్యాఫల ప్రాప్తి ప్రభలజిమ్ము విద్యారణ్య మాధవ స్వామి హక్కరాయలను ప్రతిష్ట చేసెనట. విద్యారణ్యులు తెల్గు భువన ప్రళయంబున కడ్డుకట్ట వేసిన మహనీయుని'కి అంకితములైన పద్యాలు. `కనకాభిషేకము' తలమీద గోష్పద మంతైన జుట్టు లింగకాయ బొట్టు లేక మంత్రి వేషమావహించిన నాథ కవిరాజుకు ప్రౌఢరాయల మందిరమున జరిగిన ఉత్సవగాథ. సుబ్బారావు గారు కవిసార్వభౌమునికి తమ రూపము నూహించినారు! కనుకనే శ్రీనాథుని నోట వీరినోట వలెనే `పూర్వాంధ్రరాజ్య సంపూర్ణ శౌర్యానల ప్రత్యక్ష పుణ్య ప్రభావములు, `హిందూ మతోద్ధారణేందూదయ వికాస చాలితాధ్యాత్మ ప్రచారము'లూ వెలువడ్డవి. వాదములో ఓడిన డిండిమ భట్టు ఢక్క పగిలించగా`వలయంబులునై విరళీ కృతంబులై కదలెను శబ్దముల్.' ' రాజ్య ప్రదానము'లో కృష్ణ రాయలకు ఎదురుతిరిగిన నాగమనాయని మీద అతని కొడుకు విశ్వనాథ నాయకుని విజయమును వినిచి, కవిగారు వాస్తవముగా రాజు విశ్వనాథ నాయకునిపైన చూపిన అనురాగమును పొడిగించి నాగమ నాయకునికి కూడా పంచినారు. ప్రభు సేవను చెయ్యడములో విశ్వనాథుడు నొక్కి పెట్టినప్పటికీ, నరపాలుని సభలో కట్ట తెగి `సలసల వేడి నెత్తురులు చారలు గట్టిన' కన్నీటి బొట్లు కవిగారిని ఈ అతిక్రమణానికి కూడా వెట్టినవని ఊహిస్తున్నాను. `తల్లికోట యుద్ధము'లో

`శంభు స్వామి వైరాగ్య దీక్షానాట్యంబులు ... జేష్ఠాదేవి సంచారములో మహదాంధ్ర రాజ్యాలయమూ వర్ణించబడినవి. తక్కిన నాలుగూ ఆనెగొందె కాప్ప, పశ్చాత్తాపము, పాణి గ్రహణము, కృష్ణ రాయలు, విజయనగరపు కథలు. కొడాలి వారు కవిగాకాక ఆంధ్రుడుగా విచారించారు, తెలుగునాటి రాజకీయ పతనానికి. అయినా కావ్యము వ్రాయడములో నైసర్గిక నిర్వేదాన్ని మించి చూసే యత్నము చేయలేదాయన. కనుకనే ముక్కు మూసుకుని చెట్టుల గుట్టల బట్టి' `ఇతడటయ్యా రెడ్ల కవిరాజు' `వేదాలు తలక్రింద వెలిగించినాడంట' `రాజుకై కొడుకు పరాభవించిన తండ్రి' `కాదందురా చేతకాని మాట' `యువరాజు చావగానే తన కబ్బునా పదవి?' `అయ్య కొరకు పడిన శ్రమ' వంటి వ్యవహారపు జాతీయములలో సత్యనారాయణగారి వలెనే ఈయన, నదీ ప్రవాహము వలె భావాల్ని ప్రవహించనియ్యక నేటికి వాటిని విడదీసి యిస్తారు. అవి ఇంచుమించు చాటు పద్యముల ధోరణిలో నడిచినవి `హంపీ క్షేత్రపు ' తొలి భాగములో. భావావేశములో సాంద్రమైనవే అయినా ఖండ కావ్యములుగా తీర్చక క్లోజప్పులు వలెనే వాటిని తీర్చినారు కవిగారు. కావ్యాల్లో కథకూడా రసవంతముగా కథ సాగుతున్నపుడు దండవలె గుచ్చినా, రెండు రెండు తునకలను చేర్చడములో చుక్కలు ఉపయోగించినారు. కనుక ఖండకావ్య రచనోద్యోగమునకు కాక కథనోద్యోగముకే సుబ్బారావు గారు పూనుకొని యుండిరనిపిస్తున్నది.

తుమ్మల సీతారామమూర్తిగారి రాష్ట్రగానము 1938లో వచ్చింది. వశ్యవాక్కులు చౌదరిగారు `తెలుగులెంక' అన్న చిన్న పేరును స్వీకరించిన నిగర్వ చూడామణి. తెలుగు దేశము, తెలుగు భాష, తెలుగు చరిత్ర, తెలుగు ప్రజ, తెలుగు సంస్కృతి అనినంతనే, వారికి ఒడలు పులకరించును. మరి రాష్ట్రగానమును గొంతునిచ్చి ఆయన మ్రోసినారంటే దాన శక్తి కేమి లోటు?

`కుల తత్త్వములు చుట్టుకొని ఈర్ష్యలకు దింప నైకమత్యము సర్వ మారిపోయె', `పరవీర్యాలుంటాక బాహాబల ప్రౌఢిగల బాల చంద్రులీ గడియ లేరు' `తన కళాలిస్సకద్దము ఎలె రాణింప గల్పించె భువనైక శిల్పవీథి' కైవల్య కల్యాణ ఘంటాపథము గన్న యోగి వేమన్న నీ యొడిని గులికె' నంటూ నిసర్గ సుందరమైన శైలితో సూటిగా చెపుతుంది వీరి కవితాకన్య. వీరు సంప్రదాయముచే ప్రాచీనులే యైనా స్వానుతాప వర్ణనమువల్ల నవీనులైనారు. సమకాలిక చర్యలను నిసర్గ సుందరమూ సూటియైన పలుకులతో వివరించినారూ, దేశీయుల వెన్ను చరచినారూ ముందుకు నెట్టినారు. సెలయేరు వలె వీనుల విందై వేగవంతమై చల్లగనే ప్రవహించే వీరి రాష్ట్రగానము ప్రాతస్మరణీయము. దాన ప్రతి పద్యములోనూ వీరే. విశ్వరంగముపై నిలిచి చేతులు. జోడించి" నీ రమణ మూర్తి కమనీయ వచస్స్ఫురణంబు

దాతృతాగౌరవ మద్వితీయ రసికత్వ విభూతి విశిష్ట శౌర్య విద్యా రుచిరత్వ మంత కొని యాడిస మత్క వితా పిపాస చల్లారదదేమి తల్లి! ఇది యారక మారక ఇట్లె నిల్చుతన్" అంటున్నారు."తథాస్తు" అని దీవించునుగాక తెలుగుతల్లికి తల్లి.

శ్రీనివాస సోదరుల ఓరుగల్లు కోట 1942 నాటిది. ఇన్నాళ్ళకును వాడని అష్టదళ పద్మము వంటి శిల్పములూ, వేణు గోపాల ప్రతిమా, నందికేశ్వరుడూ, దేవాలయములూ, నర్తకీ ప్రతిమలూ గురించి పద్యాలు వ్రాశారు. ఒక నర్తకి ఒక్కటే మచ్చు నాట్యము నొలుక' బోసెనట. "ఏమి చూచిన యానందమే యిదంత?" అని యామె నడిగి ఆ శిథిల శిల్పపు కిటికీలో నుంచి నాటి సభా భవనాల చైతన్య శోభమ ధ్వనిస్తున్నారు. ఓరుగంటి ప్రతి శిలా శబ్దించే `ఆంధ్ర నాగరకత విజయపు చరిత్ర చదువుకొనిన జేతగాని' జడుని చూచి నవ్వుతున్నారు. క్రీడాభిరామమునాటి కోలాహలము కవుల దృష్టి ముందూ (వారి లేఖినీ నర్తనముతో మన ముందూ) సాక్షాత్కరిస్తోంది ఓరుగల్లు కోటలో. ఈ చైతన్యమంతా `నిజంబో! నిద్రబోవుచునుంటినో .... మేలుకొని యుంటినో!' అని అనుమానించి `నాదు మిత్రులెల్ల నన్ను వంచించి యెటు వోయినారో, ఇపుడు!' అన్న తన్మయభావము వల్లనే తన్మయత్వాన్ని స్ఫురింపజేస్తున్నారు.`తెలివిగలిగి కనులు తెరచి చూచెదులోన, స్వర్గలోకము తెరచాటు కేగె.' `ఇంద్రావసథము నందనారామ మెదుట గన్పట్టినపుడు' వీరి మది యైరావతంబు కొరకు' తడవినదట. ప్రతాపేంద్రుండు ప్రాతస్నానము సేయు కాసారము తన చిత్త కమలమును నేడు ముచ్చముడిగించుకొని మూగదైనదట. గణపతిదేవుడే స్వయముగా కదలిరాగా, `భేరికా భాంకృతి సెలంగి పృథివి రజము గగనమును గప్పి, అడవులు నగరులై, ఉద్గత క్రుద్ధకాల సర్పోత్కరమయి బుసలు కొట్టెనట `విక్రమ సింహపురి యగత్తె!' బంభర రసికావతంసములు! మాటలు నేల? ధ్వని ప్రధానులౌదురు గద!... తరి తోడన గ్రోలుడు తెల్గు వెల్గునన్.

దేశీయ కవిత్వానికి మణిమకుటము నిన్న వచ్చిన `తుది విజయం మనది నిజం.' కాళోజి గుండెలో పేరుకున్న జనతాభిమానము `గొడవ' నుండి రణభేరిగా మారినది.`కన్య కుమారీ కన్నులు రుద్రాక్షలు - ఎందులకని? ఉత్తరదిశలో ఉరుములు - ధనుష్కోటి టంకారము - ఏమిటి కథ?- వాయవ్యములో అరుపులు. మీనాక్షి రక్తాక్షిగ మారినదే, ఎందుకు ? అస్త్రాద్రిలో ఆర్తి. కామాక్షి కన్నులలో క్రోధాగ్నులు- కారణమేమిటి? - ఉదయాద్రిలో అవమానము. చాముండీ రణచండిక హుంకరించె - లేపాక్షి బసవయ్య లేచి కాల్దువ్వుచుండె - నందీశ్వరు గంగడోలు నిండ రక్తము చారలు!' `ఇల పుట్టిన నాటి నుండి ఇలవేల్పుగ నిల్చి మనల ఇరుగుపొరుగు దుండగాల కొరగాకుండగ కాచిన హిమవంతుని కాపదయట. పదపదపద అదుకొనగ.

ఆంధ్రావళి అండదండ అస్సామును అందింపగ, నయ్యర్లకు తోడ్తోడుగ నాయర్లను నిలిపిఉంచ, బదరీనాథుని రక్షకు మధురను కంచిని కదుపగ, కాశ్మీరమునకు జంటగ కన్యాకుమారిని నిలుపగ, బిహారీల రణభేరిగ మహా రాష్ట్రము హుంకరింప, గురుగోవిందుని గర్జన ఘూర్జరులను కదలింపగ, కర్ణాటక చాముండియే కలకత్తా కాళి కాగా, కైలాసము పిలుపును విని కాకతి చిందులు త్రొక్కగ, ఏడుకొండ లెలుగెత్తుచు, హిమవంతుని పురిగొల్పగ, నగరము చేయూతకు రంగము ఎగిరి దుముక, శైలము గంతులిడుచు శీత నగరము నాదుకొనగ, కలము కుంచె కదలింపుము.' `సరిహద్దును కాపాడే జై సేనా జైహింద్, లద్దాకును కాపాడే లచ్చన్నా జయ్‌హింద్, ఈశాన్యము రక్షించే ఎంకన్నా జయ్‌హింద్, ప్రాణాలకు లెక్కించని పంజాబీ జైయ్‌హింద్, అరచేతిలో తల ఉన్న అస్సామీ జయ్‌హింద్, సాదోబా జయ్‌హింద్, మదోజీ జైహింద్, మల్హారూ జైహింద్.' చిరుతిండ్లను మానుకొన్న చిట్టి చేతుల చిల్లర రేసుకోర్సు మానుకున్న లేడీతార బాంకునోటు, పేకాటలు మానుకున్న చీకటన్న పాతరలు బిచ్చగాడు దులుపుకున్న లచ్చి పారాణిపైన, మంత్రాంగం చేతి పొదుపు మహిమతో మిగిలిన కోట్లు, నీ కెంతో ఉత్సాహం' ప్రోత్సాహం కానున్నది కనగలిగిన కాళోజీ `ముందంజ వేయవలసిన సమయాన ఇజాలు అడ్డు పడతాయా తమ్ముడూ' అంటూ, ఈ యశ్రుఝురులతో ఇతరులతో రొదలతో సొదలతో విసముతో సిగ్గుతో బ్రదికే జనాన్ని `హిమవంతుని కాపదయట పదపదపద మంటున్నాడు. పదండి ముందుకు, పదండి ముందుకు, పదండి, పదండి పైపైకి.

- భారతి, ఏప్రిల్ 1963.

# 7. కృష్ణ శాస్త్రి

కృష్ణ శాస్త్రిగారి రచన వెంకట పార్వతీశ్వరుల రచనల వల్లా, సమకాలిక పరిస్థితులవల్లా ప్రాభావితమైంది. వెంకట పార్వతీశ్వరులు ఆలోచన నుంచి ఆవేశములోనికి కొంత కొంత ప్రవేశించారూ, వీరు ఆవేశము నుంచి ఆలోచనల లోనికి తొంగి చూస్తారు. వారు ప్రాచీన సంప్రదాయానుసారులు, వీరు తిరుగుబాటుదారులు. కనుక వారి అమ్రేడిత కవిత్వాన్నీ శబ్దవాచ్యతనూ వీరు శ్రవణ సుఖానికి లోభించి కొంత అనుకరించినా వాటినే చిరకాలము పట్టి మనలను పల్లార్చలేదు. (శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చేశారు ఆ పని.)

కృష్ణశాస్త్రి రచనల మీద రెండో ప్రభావము స్వేచ్ఛది. ఆంగ్ల కవులు షెల్లీ వంటి వారి కవన పఠనమూ, బెసెంటమ్మా మహాత్ముడూ వెలిగించిన స్వాతంత్ర్య జ్యోతీ వీరిలో రెండు మూడు స్వేచ్ఛలను రేకెత్తించింది. మొదటిది `నా సంగతే వేరు' అన్న ఆత్మ విశ్వాసము. `ఎవ్వరిని ఎంతురో నన్ను, ఏననంత శోక భీకర తిరమి లోకైక పతిని' అన్నారు. సామాన్య మానవులు బలహీనతనుగా విశ్వసించే కన్నీటిని వీరు అపూర్వ మత్యంత మానంద మొసగు నిరుపమ నితాంత దుఃఖంపు నిధు' లంటారు. `మీరు మనసారగా నేద్వనీరు నన్ను' అంటారు. ఈ వింత ఏమిటీ? అని ఆలోచిస్తే నాకు ఒక సమాధానము తట్టుతున్నది. చిత్తగించండి మనవి చేస్తాను.

కృష్ణశాస్త్రి గారు భక్తులు, అనేక భక్తి కీర్తనలు రచించారు. అనుతాపమూ, ప్రపత్తీ భక్తికి అంగములు. `ఎట్లు ని న్నూహసేయుటో యెరుగలేక వంగి వంగి శిరము వాంచి కృంగిపోదు' నంటారు. `తారకారత్న భాసుర తారహార సుప్రభా మాలికాజాల శోభితుడవు...... వీథి వీథుల వాడల విపినములను భిక్షుకునిబోలె తిరుగాడు పేదనోయి' అంటారు. `ఏది నీకిత్తునందు నా హృదయనాథ కాన్కగానే మొసంగగా గలను నీకు ..... వలపూర కరవుదీర గాటమగు వేడి కన్నీటి చుక్క దక్క కాన్కగా నేమొసంగగా గలను నీకు' అంటారు. `కురియుమురా కన్నీటిని మరి మరి విలపింపుమురా, పరము గూర్చి పరమేశుడె దాల్చునురా పాపీ' అన్నారు.

పరమేశ్వరుని యెదట వినయముతో, ప్రపత్తితో కన్నీరు కార్చుట గంగాస్నానము వంటిదే. ఈ `కన్నీరు' కృష్ణ శాస్త్రిగారి కావ్యమంజరి కొక దానికి శీర్షిక అయినది. కృష్ణ శాస్త్రిగారికే కాక వారు నిర్మించిన పాత్రలకు కూడా ఈ కన్నీరు జీవము. పెరియాళ్వారు `తీరా నీ వేతెంచిన, ధారలైన అశ్రులనీ రూపుతోచదేమి స్వామీ' అంటారు. గోదాదేవి వారి గని 'నంతనే బాష్ప వారి క్రమ్మ' నంటుందీ, రంగదేవుని కన్నులు చూసిన ధనుర్దాసు `ఏడుస్తాడు'. రాధ `అలరు పన్నీరో నా చలువ కన్నీరు నీ తలిరు పాదములకై కృష్ణా' అంటుంది. కనుక కృష్ణ శాస్త్రిగారికి కన్నీరు పూజాద్రవ్యముగ .... విధి బలీయమై`ప్రేయసి' `సడిలేని నడి రేయి బడిపోయి'నది. ఆమె కొరకు పడిన నిర్వేద నౌకకు ఆయన కన్నీరే నదియైనది. పూర్ణరాగ కవిత ప్రియురాలు కోసము అనుభవించిన దుఃఖమే ఆమెకూ కవికీ ఏకైక శేషబంధమైనది. ఈ బంధమును - అనగా తన దుఃఖమును - వీడుట కీయనకు ఇష్టము కాలేదు. కనుక ఈయన `నాకు మరణమ్ము వలదనినాను' అన్నారూ. దుఃఖమునూ కన్నీటిని కౌగిలించుకున్నారు. "నన్ను గని యేరు జాలి జెందగల" దన్నారు. `నా విలాప నిబిడ గీతికావళీ నిస్స్వనమ్ము నిర్ధరాత్ర గర్భమ్ము మరియు మరియు భీషణ కాళిమోన్మత్తగాగా జేయుతరి నన్ను మీరు వీక్షింపలేదో?' అని సవాలు చేస్తున్నారు! తన దుఃఖముతో తనకు గల బంధము మీది మమతతో, ఈ సవాలు తన దుఃఖాన్నంతటినీ - తానే చూచి దాని భీషణ కాళిమను మెచ్చుకునే - నటననుగా అన్వయిస్తున్నదైనా చూసుకోలేదు ఈయన. `నా సంగతే వేరు' అన్న ఆత్మ విశ్వాసమే `నా దుఃఖము కూడా వీక్షనార్హమే, నాకు కన్నీటి సరులు దొంతరలూ నిశ్శ్వాస తాళవృంతాలూ' ఉన్నాయి. `నన్ను గని యేరు జాలి జెందగ వలదు' అన్న అదలింపులకు కూడా దారి తీసింది.

వీరిలోని రెండో స్వేచ్ఛ సాంఘిక సారస్వత రాజకీయ సంస్కారములు కోరే స్వేచ్ఛ. మానవుడన్న వాణ్ణి ఇంకొక మానవుడు ముట్టరాదనుట చైతన్యానికి అవమానమనీ పర ప్రభుత్వానికి భృతులై ఊరేగే అధికారుల ధాష్టికము నీచమనీ, సంప్రదాయ శృంఖలాలు మోస్తూనే రచించడము కృతకమూ నికృష్టమూ అనీ ఘోషించినా రీయన. పతితుల మహా ప్రస్థానములో చేరి `కదలి నడువగలము మేము మడమ త్రిప్పి రాము మేము' అన్నారూ. `జిలుగు వసనాల మణిమయోజ్వల మనోజ్ఞ కాంచనాంచిత భూషణ గణము బూని రాజ వీథుల రతనాల రథము నెక్కి' ఊరేగే ఉద్యోగి దివాంధాన్ని తిట్టారు. రాయి రప్పయు కంఠస్వరంబు దాల్చి గానముచేసే సహృదయ కాలంలో `పికమ పాడకుము' ని శపించిన ఆచారాను సారి ఛాందసాన్ని నిరసించారు. మాత్రాచ్ఛందస్సులూ పద్య చ్ఛందస్సులూ యథేచ్ఛంగా వాడుకున్నారూ పద్యములో భావము ఎక్కడ పూర్తి అయిపోతే అక్కడ ఆపేశారు రచన. పెద్ద పుటలో ఒక్క పద్యము వేసి దాన్ని తేల్చి చూపించారూ ఖండ కావ్యాలకు శీర్షిక ఇవ్వకుండా

చుక్కలు పెట్టారు. (శుష్కాచారాభిమానులు ఇంత మాత్రానికే అల్లరి చేశారు.) తరువాతి దశలలో `స్వాతంత్ర్యరథము' వంటి నాటికలూ ప్రగతి శీలమగు రాజకీయ తత్త్వ సూచకములుగా `ప్రాభాత ప్రాంగణాన మ్రోగెను నగారా' ఆకాశము నొసట పొడిచె నరుణారుణ తార' అన్న గేయాలూ రచించారూ. అయితే వీరి ఈ స్వేచ్ఛ వీరి రచనలలోనూ, చర్యలలోనూ గౌణాతి గౌణముగానే ఉండిపోయింది.

వీరి మూడో స్వేచ్ఛ స్వేచ్ఛా ప్రేమగా పొడచూపింది. ఆధునిక కవిత్వ ప్రారంభంనుంచీ ప్రబంధ శృంగారాన్ని సమర్థించడానికీ శృంగారాన్ని ఉపాదేయంగా నిరూపించడానికీ గురజాడ అవ్యాజ ప్రేమనీ, రాయప్రోలు సుబ్బారావు అప్రాప్త ప్రేమ, అపరిణత ప్రేమ, విశ్వ ప్రేమల్నీ, అబ్బూరి పూర్వ ప్రేమ, మృత ప్రేమ క్షణిక ప్రేమ, దాంపత్య ప్రేమలనూ, దువ్వూరి నైసర్గిక ప్రేమనూ, అధికార్లా, బసవరాజూ, నండూరీ దాంపత్య ప్రేమనూ చిత్రించి శారీరకాకర్షణపైన మొలిచే సర్వ సాధారణ `ప్రేమను' వెనక్కి నెట్టారు. ఈ ప్రేమను- ఇది నైసర్గికమన్న కారణాన్ని పట్టుకుని పెద్ద జేసి - `అలరు పడంతి చక్కిలిగింత వెట్టి విరిచేడె పులకింప సరసనుబాడి, మరియొక్క ననతోడ మంతనం బాడి వేరొక్క సుమకాంత వ్రీడ బోగొట్టి తిరిగే తేటి `వలపు' ను ప్రవచించి, `సౌరభములేల జిమ్ము పుష్ప వ్రజంబు? చంద్రికల నేల వెదజల్లు చందమామ? ఏల సలిలంబు పారు, గాడ్పేల విసరు, నేల నా హృదయంబు ప్రేమించు నిన్ను' అన్న వశీకరణ మంత్రాలతో ,`ఏటి పని యిది లోకమా హృదయదళన దారుణ మహోగ్ర కార్యంబు దలచినావు, ప్రణయ మధురిమ మెరుగవు పాప మనవు పక్ష్మముల దూల్చి బంధింతు పంజరాన' అన్న హోదా ఉపన్యాసాలతో, `హృదయ వనజాత సుమ మృదు మనోహరదళము లదయతను ద్రుంచి నారే పెంధూళి జిదిమి వెదజల్లినారే' అన్న ఆక్రోశ నటనలతో ఒక్క ఖండములో కాకపోయినా, `అన్వేషణము, ఏల ప్రేమింతును, అయ్యో, లోకము, శాపము, అబ్బ' అన్న ఖండాలలో స్వేచ్ఛాప్రేమనుగా దిద్ది తీర్చారు కృష్ణశాస్త్రిగారు. తిరిగి, తిరిగి లాలసను వర్ణిస్తున్నాయని తెలుగు ప్రంబంధాలను నిషేధించే తొలి నాటి ఉద్యమానికి బలము చేకూర్చే ఘట్టానికి వచ్చాయి ఈ రచనలు. అయితే వాటిల్లోది దాంపత్య శృంగారము, గురజాడ వారు `మాట మంతి'లో అన్నట్టుగా నిరపాయ కరము. ఈ స్వేచ్ఛా ప్రేమ పారదారికము, సంఘ శాంతికి ధూమకేతువు!

కవిత్వానికి నీతితో పనిలేదనీ, ఆర్ద్ర భావాలతో అందాలతో నిండిన రచన ఏదయినా గ్రహణయోగ్యమే ననీ ఒక వాదము బయలుదేరిందా రోజుల్లో. నిజమే నీతిని బోధించడము కాదు కవిత్వానికి పని, నీతి శతకాల్ని కవిత్వముగా జమ కట్టలేము. అయితే, నీతితో పనిలేదు అన్న మాటలకు అర్థము `అవినీతినైనా పట్టి

చూపించు' అని కాదు. కావ్య సాహిత్యమనేది కథనకావ్యములు భావకావ్యములు అన్న రెండు భాగాలుగా కనబడుతుంది. కథన కావ్యాలు మానవుని కథను వర్ణిస్తూ, చదువరుల మానవత్వానికి అపేక్ష కలిగిస్తూ లాగి, ఆ కథ వల్ల ధ్వనించే సత్యాన్ని చదువరులకు కాంతాసమ్మితంగా వారికి తెలియకుండానే బోధ చేస్తాయి. ఈ కథనములో మంచీ చెడ్డా అందమూ అసహ్యతా వంటి ద్వంద్వాలు దేనికది మోతాదు బరువు కాకుండా ఉంటాయి. ఎక్కడేనా ఒక భాగము అనవసరముగా పొడుగైతే రసాభాసము అయిందంటారు రసికులు. మొత్తపు కథ పెద్దదైతే దాని మొత్తపు ప్రభావములో ఈ చిన్న రసాభాస ఘట్టము తలయెత్తి నిలవక మునిగి పోతుంది. ఈ కథను మాత్రము పెంచి చిన్న ప్రబంధంగా రచిస్తే తారాశశాంకమూ అహల్యా సంక్రందనమూ లాగా తయారై అవినీతి బోధకము అవుతుంది. అలాంటివి రచించడమా కవి చేయవలసిన కార్యము...? భావకావ్యాలలో కూడా చదువరిని నిండు మానవునిగా తీర్చడానికి సాయపడే భావాల్ని తీర్చి ఇస్తే చదువరికి క్రొత్త అనుభవమూ, వికాసమూ కలుగుతుంది. ఈ భావాలలో నీతి ఉండనక్కరలేదు, క్రొత్త అనుభవముంటే చాలు. వర్డ్స్‌వర్త్ చిన్న కావ్యాలూ కీట్సు ఖండ కావ్యాలూ సాధిస్తాయి ఈ ఆశయాన్ని. ఏ సైతాను ఉపన్యాసాన్ని మాత్రమో రచించి ఊరుకుని కవితకు నీతితో పని లేదంటే? తిక్కన గారు కీచకుని అధర్మ విరహాన్ని మూడు మారులు వర్ణించారు. చదువరికి కీచకుని అధర్మ మోహముపై సానుభూతి కలుగవచ్చునా? అని అడిగేరు ఉమాకాన్తముగారు! నీతితో పనిలేదు గాని! చదువరుల్ని షాక్ చేసే సంఘ విరోధి కళాబాయి రచనలకు పని ఉన్నదా కవితలో? అయితే రక్షించి ఈ స్వేచ్ఛా ప్రేమ వాదుల స్వార్థమూ లాలసా పద్యాలలో నుంచి తప్పుకుని గుడిపాటి వారి వచన రచనలలోనికి వెళ్ళిపోయినాయి ఇటు తర్వాత.

కృష్ణశాస్త్రిగారి రచనలకు ఆవేశము ప్రాణమూ శక్తీని. ఈ ఆవేశము ఎన్ని అవతారాలో ఎత్తుతుంది. ఆవేశము కవిని ఆవరించినప్పుడు ఒక్క ఉదాహరణ నిచ్చి సంతుష్టి పడలేదు కవి. `ఏను స్వేచ్ఛా కుమారుడ నేను గగనపథ విహార విహంగమపతిని నేను, మోహన వినీల జలధరమూర్తి నేను, ప్రళయ జంఝూ ప్రభంజన స్వామి నేను' అని ఉదాహరణలు విసురుతాడు. ఇది నితాంత తమః క్రాంత, మిది దరిద్ర, మీ నిశాంతమ్ము శూన్యమని చాయమీద చాయ నెక్కిస్తాడు. శర్వరీ శీతపవన పక్షముల మలసి, స్వాదు యమునోర్మి సంగీత ఝురుల గలసి కౌముదీ ధౌత శుభ్రదిక్తటుల పొలసి మురళికా మాధురుల రుచులు దాటి దాటి వచ్చిన వంటాడు. `చిరుత తొలకరి వాసనగా చిన్ని సొనగ బొంగి పొరలెడు కాల్వగా నింగి కెగయు కడలిగా పిల్ల గ్రోవిని వెడలు వింత తీయదనముల లీనమై పోయె నెడదని జల్లులతో ముట్టడిస్తాడు.`ఇచటనే-ఇచటనే- యత-డిచటనేను - ఇచట నీ

జాజిపూబొదరింట నేను అతండు కన్నుల గట్టిన సరణి దోచు'నని మళ్ళీ మళ్ళీ విసురుతాడు.

"నాకుగాదులు లేవు, నా కుషస్సులు లేవు, నేను హేమంత కృష్ణాంత శర్వరిని, నాకు కాలమ్మొక్కటే కారు రూపు, నా శోకమ్ము వలెనె నా బ్రదుకు వలెనె, నా వలెనె" అంటా రీయన. ఇంత చిన్న ఆవరణలో నింత భావావేశము గల పంక్తులు నే నిప్పటికి ఎరుగను. అభిప్రాయాలుగానూ, ఊహలుగానూ కవులు సామాన్యంగా ఇచ్చే వస్తువు ఆవేశము చేరడముతో భావాలుగా వస్తుంది. "ఇదీ ఎంతో బాగున్నది" అన్నప్పుడు కంటే `ఇది ఎంత బాగుందో అంటే మనము ఎక్కువ అనుభవిస్తాము. "కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మారె వ్యర్థపుంజాతురి హెచ్చె నల్పమగు సాహితితో పెద్ద పెద్ద పాత్రముల్ జూతురు తప్పు దిద్దుదురు శూరత సచ్చె కవీంద్రులందు, సీ! మూతులు గట్టివైచికొన బోలదే సత్కవులైన వారికిన్" అన్న ఊహలు "ఇపుడు ప్రళయమ్ము క్రమ్మిన దేమొ కాక దొరకదొ నిల్వ నీడగా చిరుతపాట కింత యిరుకౌనె యిమ్మహానంత విశ్వ మలమికొను చీకటుల కలకలము వలన" అని శక్తివంతములైన భావాలుగా వస్తాయి వీరి నుంచి. దువ్వూరి రామిరెడ్డి "సాంధ్య కిమ్మీర వర్ణ వస్త్రములు దాల్చి, గిరితట విహార శృంగారకేళి సొలసి రమణ జరియించు జలధ రార్భకుని గాగనేల సృజయింపడో నన్ను నీశ్వరుండు"అని ఆశను వివరిస్తే, విశ్వనాథవారు"ముదురాకు రాలేటి ముదిమి నాళులలోన, తొడి గేటి చివురాకు, తొగరు సంజలలోన, ఆకునైనాకానుగా, అయినచో, సోకేది చిరుగాలి నన్ను మెల్ల, తాకేది మిణుగురుల హొన్ను" అని ఆశకు కారణము కూడా చెప్పారూ, కృష్ణ శాస్త్రిగారు "గలగలని వీచు చిరుగాలిలో గెరటమై, జలజలని పారు సెలపాటలో దేటనై, ఈ యడవి దాటిపోనా, ఎట్లయిన నిచటనే యాగిపోనా"అనేశారు కారణాలే చెప్పకుండా. విశ్వనాథ వారి కృష్ణుడు విరహవ్యగ్రమైన రాధ చింతా సౌధానికేగి"రాధా" అన్నాడుట. కృష్ణశాస్త్రిగారి ఊర్వశి "నడికి రేయి వెన్నెల యెద చలించు పిలుపెగా`నా సఖా' యని వేగిరి"స్తుంది. కృష్ణశాస్త్రిగారి భావాలు వెన్నెల యెద చలింపజేసేట్టుగా వస్తాయి.

వారి భాష కూడా తీర్చిదిద్దినట్టిది. చిన్నతనముతో వారి తండ్రీ , పెదతండ్రీ - మహా పండితులు - రెండు మూడు రచనల్ని చూపించి "ఏది బాగుందిరా నాన్నా" అని అడిగేవారట. అలాంటి శిక్షణవల్ల ఈయన కలవడినది నదీ ప్రవాహ సదృశమైన శైలీ శక్తి వంతమైన ఎంపికాను. (తలిరాకు జొంపముల) సందుల త్రోవలు, (కారు మొయిళ్ళ)కాటుక పొగలు, ఏ త్రోవరుల్ త్రొక్కని దారులు, కనపడని చేయి, వేయబోవని తలుపు, యెదలోపలి యెద, మూయని వాకిలీ, తిగవని వింటివాడు,

వంటి శక్తివంతమైన నవ నిర్మాణాలు ఇంకొకరెవరూ చేసినట్లు కానరాదు. `వికృత క్రూర క్షుధాక్షుభిత మృత్యు కఠోర విగత పాండుర శుష్క వదన దంష్ట్రాగ్ని' అని సంస్కృతమూ, `మ్రోగు పాటల పేటి నా గళమ్ము వలె తీయ తీయనైనది పులుగు తెరవ గూడు' అని తెలుగూ, `ఏలా వచ్చె హవాహుమాయి పయి వాడే కుచ్చు పాగల షోకేలా, పచ్చజరీ బుటా మొఖ మలంగీ దాల్చి చైత్రుండు కెం గేలన్ సోగ గులాబి కొమ్మ కొరడా కిలించి సారానెరా, ప్యాలా సారెకు సారెకున్ పెదవులున్ పట్టించుచున్ నవ్వుచున్'అని ఖాయాము తెలుగూ, వైష్ణవుల అరవ తెలుగూ అందముగా వాడగలరు కృష్ణశాస్త్రిగారూ, ఆషాడ యోషామణీ కేశ పాశాన అల్లుకొన్నది తటిద్వల్లియో' అనీ, `తరుణతమాల కిసాల సమాన, శ్యామల కోమల చారు శరీరా' అనీ `మస్రృణ కుసుమ హృద్గళన్మరంద స్నపితచరణ యుగళా వసంతా' అనీ ఇక్షుఖండ సదృశ రచనా చేస్తారు. నాకు వచ్చిన అసంతృప్తల్లా వారు తేనె బిందువుల్ని చిలికే శ్రద్ధను పెంచి తేనె పెరలాంటి ఖండకావ్యాల్ని నటరాజ, ఆకులో ఆకునై, నీలాభ్ర సరసిలో దారులన్నియు మోపె వంటివే ఎందుకు చేయరూ అని. తెలుగు ప్రబంధాలు అందపు టూహల్నీ సుందర భావాల్నీ కాలిబాటలాగా తీర్చి చదువరిని లాగాక, ఎక్కడికక్కడ ఇతర ఊహలతో దట్టించి సత్రంవేసి, కవిగారు చాప వేసుకుని కూర్చుని గోష్ఠి నడుపుతున్నట్లుగా తయారు చేశాయి. ఆంగ్ల కవులు - కీట్సు, బైరను టెన్నిసన్నూ వంటి వారు- పూలదారుల్లాగా తయారు చేశారు తమ ఖండ కావ్యాల్ని. వాటిని చూచీ కూడా మన వారు చెరకు గడల్లాగా ఎందుకు నిర్మించరూ? కలకండ ముక్కలు జల్లుతూ సంతుష్టి పడిపోతారేమో?

కవిత్వము చదువరికి ఇంద్రియ గోచరము కావాలి. అప్పుడు కవి వర్ణించిన ప్రకృతి చదువరికి గోచరించడమూ తద్వారా చదువరికి అనుభవము కలగడమూ జరుగుతుంది. కవి భావాల్నే వెలిబుచ్చినపుడు ఆ భావాలు మహా పండితుడైన కవికే గాని సామాన్య చదువరిని జల్లు మనిపించేవి కాకపోతే కవి మానాన్న కవి రచించుకుంటూ పోవడమే మిగుల్తుంది. కాని చదువరిని అంటదు. వర్ణనకు ఈ చిక్కు లేదు. తనకు ఆవేశ కారణమైన ప్రకృతి చైతన్యాన్ని కవి వర్ణించి విడిచినా, ఎంతో కొంత ఉద్రిక్తత చదువరికీ కలుగుతుంది. అయితే ఈ వర్ణిత వస్తువు చదువరికి ఎంత చక్కగా కనబడితే అంత ఎక్కువగా అది అతణ్ణి స్పందింపజేస్తుంది. కనుకనే అన్నాను కవిత్వానికి ఇంద్రియ గోచరమయ్యే గుణం ఉండాలని. కృష్ణ శాస్త్రిగారి రచనకు ఈ గుణము బాగా ఉంది. ' గల గలని వీచు చిరుగాలి', `తలిరాకు జొంపముల సందుల త్రోవల నేలవాలు తుహిన కిరణ కోమల రేఖ' `చంద్రాత పాంతరాళ రజత తల్పము' `బృందావన వీథులందు యమునా నవభంగ మృదంగ వాద్యములు' `నీలాభ్ర సరసిలో రాయంచవలె విహారము చేసే జాబిల్లీ, యమునోర్మి

సంగీత ఝురుల గలసి వినిపించే మురళీ నినాదమూ, కనులలో మిలమిల నిలచే బాష్ప మౌక్తికమూ' చక్కగా గోచరిస్తాయి.

కీట్సుకవి `చెవి సోకిన గీతములు మధురములే అయితే, చెవికి సోకగరాని గీతములు మధురాతి మధురము' లన్నాడు. కృష్ణశాస్త్రిగారు `శర్వరీ శీత పవన పక్షముల మలసి, కౌముదీ ధౌత శుభ్ర దిక్తటుల సొలసి'న మురళీనాదాన్నీ మాత్రమే కాక `కనుచూపుదాటు నామని బాయుకోయిల గొంతులో చిక్కు వసంత గీతి'నీ, `విభువీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో నడగిన కడలి మ్రోత' నీ చెవికి సోకించకుండానే వినిపించారు. దిశ దిశాంతగత శకుంత దివ్యగానమును వినిపించిన ధన్యత వీరిదే. ఒక అనుభవము యొక్క స్మృతిని ఉపయోగించుకొని ఆ అనుభవాన్ని చదువరులలో రేపడము చక్కని నేర్పు. ప్రకృతికి చైతన్యాలూ, భావాలూ ఆరోపించి వర్ణించడమూ నేర్పే. ఈ భావాల వల్ల ప్రకృతి చిత్రము సాంద్రమై కంటికి కట్టడమూ, ఈ భావాల అనుభవము ఆ ప్రకృతి దర్శనానుభవానికి తోడ్పడడమూ జరుగుతుంది. `వరివంటి విరిచేడె చిన్నారి సిగ్గు' అని విన్నపుడు, మనము గుర్తించని వరి యొక్క వంపును చిన్నారి సిగ్గు అన్నమాట అవకుంతనము తీసి చూపిస్తుంది. గాలి, "ఇంత చిరుగీతి యెద వేగిరించెనేని పాడుకొనుటా, తాండవ నృత్య మాడుకొనునట! అతడు, 'పాట పదములకై నృత్య పథికుడయ్యెనట. నవమల్లికాసతి హిమాంబువులలో జలకమాడిం'దట. `తొలి ప్రొద్దు తెమ్మెర త్రోవలో బయనమై' పరువెత్తినదట కోయిల పాట. `మొండి చేతుల నెత్తి', `వనతరుల్ శూన్య దృక్కుల దిశలు చూచు'నట. ప్రాయంపు వంశి `మలయ పవను కౌగిలిలోనే పులకరించి హాయిగా గంతమెత్తునట. `ప్రావృడంబోధర స్వామి జీవనంపు భారము తొలంగిపోవ ... తన సొదలు చెప్పుకుంటూ `గొణుగు' కుంటాడట. `ఎంతో దాహమ్ము గొన్న శ్రవణములు విచ్చి గీతరసము కొరకు వెదకునట. గాలి `మృదు వసనాంచలముల గుసగుసలు' `చరణ మంజీరము కొసరు జాలి పలుకరింతలు' విన రాలేదుట. మూగవోయిన (నా) గళమ్మునకు గూడ నిదురవోయిన సెయేటి రొదలు కలవట.`నీప పాదప శాఖికాగ్రపత్ర కుటిల మార్గాలలో ఇరులు గుసగుసలాడు'నట.`రాగాంశు మాలికా కాంతి నాట్యాలు సలుపునట. అమృత గళరవమ్మునకు రెక్కలు విరిసిపోతున్నవట. చలువ తుమ్మెర జాణ చలచిత్తుడట. ప్రకృతికి మానవ చైతన్యము నలవరిచే దృష్టి రవీంద్రుని వర్ణనలకు జీవము. తెలుగు కవులకు కొంచెమే పట్టుబడినా కృష్ణశాస్త్రిగారికే పట్టుబడింది ఎక్కువగా ఆ దృష్టి. దీనిని సాధించే యత్నములో వీరి వర్ణన పలుచోట్ల మన అనుభవశక్తిని దాటిపోవడమూ కద్దు- ప్రబంధ కవుల ఉత్ప్రేక్షలవలె. `పాడుచు చిన్కునై పడిపోదు నిలకు' `కరుణా మధుకణము' సుదూరము ఊహలోనికి వెళ్ళిపోయినది అలంకారము. `గాలి నీలాల పాట' గాలి నీలమా? తల నీలాలు

ఎరుగుదుము, గాలి నీలా లేముటో! నడక నెరుగని తేనె' `పాట రెక్కల రొద' ఎక్కడికో వెళ్ళిపోతాయి.

కృష్ణశాస్త్రిగారి రచనలో కొన్ని చిత్ర విచిత్రాలున్నాయి. ఒక ఇంద్రియాన్ని పలకరించడముతో తృప్తిపొందక, వీరి కవిత్వము రెండు మూడింద్రియాల్ని లేవగొట్టుతూ ఉంటుంది. "ఈ నిశాంతమ్ము శూన్య, మిందెన్నడో రహశ్శిథిల సుప్తి గలవర మంది లేచి గుబులు కొను లేత నెత్తావి గుసగుసలెవో" "తేనె తేట చినుకేని లేని ఈ పాట" "నీ వెలుగు చూపొక రేయి వికసించి వాసించి మిల మిలా తళతళా మెరసినది కురిసినది". "హాలాహలాంధకారానల జ్వాల" "కరుణార్ద్ర వీక్షణ పరిమళములు"! ఇవి కవి చదువరుల రుచితో, చైతన్యంతో, చేసే ప్రయోగాలు, పోయినవి పోతాయి, కదిపినవి నిలుస్తాయి. అమృతగాన శీతల తుషారములు, పలుకుదేనెలూ, నవ్వుతావులూ సుగమములే. హాలాహల అనల అంధకార జ్వాల! వెంటబెట్టి వెతకాలి ఇదేమిటో. విశ్వవీణ అనే ఉత్ప్రేక్షా ఇలాటిదే. దశ దిశాతంత్రులు (దశతంత్రుల వీణట!) ఒక్క సుధాశ్రుతిని బెనంగుటా, చుక్కలు, మెట్లగుటా, వింతలలో వింత. `వీణ' అన్నమాట ముందు అనేసి సర్దుకోవడము ప్రారంభిస్తే అలంకారము ఇలాగే తయారౌతుంది. పిలుపు అనలమై నిశ్శబ్దాన్ని కాల్చడమూ ఇలాటిదే. కృష్ణ పక్షమూ, ప్రవాసము ఊర్వశీ చదువుతూ రాగారాగా రచన మంచులాగా అదృశ్య మౌతూ "యేలో యెటకో యెటకో జలదాల దాటి తారకల విశాల నీలపథ రాజులనెల్ల నతిక్రమించి పోయి కలియు సోలి సోలి చదలేటి తుషారపు స్వప్నరాశులన్". పారలే కాలువలు, వంపుతడి, విషాదసుఖము అన్నవి సామాన్యుల అనుభవానికి దూరము. మొయిళ్ళ కాటుక పొగలు, ఉడుమణి విషాద పూరిత ద్యుతులూ కూడా ఊహాసాధ్యాలే.

`మీ మీ అనుభవాల్ని బట్టి రచించండ'ని శివశంకరశాస్త్రి (ఇప్పుడు స్వామి) గారు చేసిన ఆదేశాన్ని కృష్ణశాస్త్రిగారు మితిమీరి పాలించారనిపిస్తుంది. ఆయనకొన్ని రచనల్ని పరిశీలిస్తే. అనుభవాన్ని బట్టి రచించమంటే ఈయన అనుభవాల్నే రచించారు. అవి అనుభవాలు కవిత్వము కాదు, చదువరికి అనుభవాలు కలిగించే రచన కవిత్వము. తానూహించిన, లేదా అనుభవించిన, ఆనందాన్ని చదువరులకు కూడా కలిగించే ఉద్దేశంతో కవి రచన చేస్తాడు. వ్రాస్తున్నపుడు కవిగా వ్రాస్తాడూ, పాఠకుడుగా చదివి బాగున్నదా లేదా చూసుకుంటాడు కవి. ఒక మాట మారుస్తాడు, ఇంకొక మాటకు చోటు మారుస్తాడూ మళ్ళీ చదువుతాడూ. సంతుష్టిగా ఉంటే ముందు పద్యం రచించడానికి ఉపక్రమిస్తాడు. కవిలో రచయితగా ఉన్నాడూ, చదువరీ - అనగా - రసికుడూ- ఉన్నాడు. కవిగా రచిస్తూ రసికుడుగా ఆ రచన

అనుభవాన్ని రేపుతున్నదా లేదా అని చూసుకుంటూ చేస్తాడు రచన. అనగా తనవంటి రసికులకు శక్తి వంతంగా తాకి అనుభవాన్ని కలిగించేదిగా తయారుచేస్తాడు రచనని. నేను నా కోసమే రాసుకున్నాననే కవి చెప్పేది నిజము కాదు. రచించేటప్పుడు కవి తన కెదురుగా పాఠకుడున్నాడని ఊహించి రచన చెయ్యడం కనుక పాఠకుని కోసము అతడు రచించలేదనడము వట్టి అపోహ. మీరు మిమ్మల్ని అద్దంలో చూసుకుంటూ అలంకరించుకుంటున్నారంటే మీరు ఇతరులకు వెకిలిగా కనబడకుండా సర్దుకుంటున్నారనీ, అందంగా కనబడడానికి దిద్దుకుంటున్నారనీ కదా అర్థము? అదే రీతిగా కావ్యాన్నో, వర్ణ చిత్రాన్నో, శిల్పాన్నో నిర్మిస్తూ అడుగడుక్కీ రచన ఎట్లా సాగుతున్నదో చూసుకుంటున్నారంటే ఆ సరిగ్గా ఉన్నదో లేదో చూచే వ్యక్తి ఆమోదము కోసము రచిస్తున్నారన్నమాటే కదా? ఈ వ్యక్తి సర్వ రసిక లోకానికి ప్రాతినిధ్యము వహించిన మీ రాసిక్యమే రూపంగా కలవాడు. కనుక రచన ఎట్లా ఉన్నదీ అని చూసుకున్నవాడల్లా రసికలోకానికి ఉద్దేశించి రచించినవాడే అవుతున్నాడు. రచించేవాడల్లా తన రచన తన ఉద్ధేశాన్ని కడతేర్చేటట్టు సాగుతున్నదా లేదా అని చూసుకుని తీరాలి. ప్రేయసుడూ కవీ తప్పక చూసుకోవాలి. పిచ్చి వాడు చూసుకోడు. తన భావాలు (రసిక) పాఠకునికి కూడా కలగాలని - అది జల్లు మనిపించాలని - చూసుకునే కవి తన రచనని చెక్కి తయారు చేస్తాడు. తన రచనకు ముక్కూ మూలమూ దిద్ది, సర్వ మానవులు సామాన్యంగా ఉండే తటస్థ స్థితిలో నున్న చదువరి చెయ్యిపట్టి తన కావ్య ప్రపంచం లోనికి తీసుకుపోయి ఆ వేగం హెచ్చించి చదువరిని బయల్దేరే ఏరోప్లేనులాగా లాగి భావావేశంలోకి ఎత్తి వదుల్తాడు. చదువరి భావావేశంలో మగ్గి అనుభవం పొంది ఆనందిస్తాడు. కథాకావ్య మయ్యేది, భావకావ్య మయ్యేది" అప్పుడు గొంతెత్తి ఏడ్చినాను" అని ప్రారంభిస్తే చదువరి సంకోచిస్తూనే చదువుతాడు. "ఎప్పుడు? ఏమొచ్చింది? గొంతెత్తి ఏడ్చే స్థితికి ఎలాగు వచ్చాడు రచయితా?" అన్న సందేహాలుండిపోతాయి. కృష్ణశాస్త్రిగారి కృష్ణ పక్షములో26ఖండములు ముక్కూ మూలముతోనే పుట్టినవి. అబ్బ! అన్న ఖండము"హృదయ వనజాత సుమ మృదు మనోహరదళము లదయతను ద్రుంచినారే, పెంధూళి జిదిమి వెదజల్లినారే" అని ప్రారంభించింది. ఎవరేనా ఏమి? ఎందుకు అలాగ జరిగింది? " అని అడుగుతారు. దానికేమీ సమాధానం లేదు. ఈ ఆరోపణే మరో రీతిగా వచ్చింది. రెండో చరణంలో. ప్రశ్నా సందేహమూ అలాగే ఉండిపోయాయి. మాటవరసకి, ఒకడు భార్యను హత్యచేసి ఉంపుడుకత్తె కామె నగలిచ్చా డనుకోండి. వాణ్ణి తన్నినవారిని గురించి వాడు ఈ మాటలే అనవచ్చును కదా? నలుగురి యెదటా వాపోయేవారు పూర్వాపరాలు దాచడమేమి?... `ఆశ' అన్న ఖండములో ప్రశ్నలే ఉన్నాయి. పొడుపు కథల్లాగా ఎంత గళ గోర ఘంభీర ఫెళ ఫెళార్భటులతో అడిగినా అదే ప్రశ్న. ఈ ప్రశ్నలలో నిశ్శ్రేణి మెట్లకు వలె ఒకదాని కంటె ఒకదానికి ఎత్తు లేదు. అన్నిటినీ

బిగించి సందేశ మివ్వగల చివరి పాదము లేదు. ఇది భావాలమూట. ఆ భావమిక్కడా ఈ భావమక్కడా పెట్టినా ఏ మార్పు రాదు. మరో నాలుగు చరణాలు కలిపినా వడ్లగింజంత బరువేనా ఎక్కువ కాదు. `ప్రౌఢ రాయక్షితీంద్ర' అన్న పద్యాలలోదే ఇది. రచన మాత్రము ఆధునిక కవిది. "నన్ను గని యేరు జాలి జెందంగ వలదు" అని ప్రారంభించిన పంక్తులకు కూడా పూర్వాపరాలు తెలియవు. లేవు గనుక! ఇది ఖండకావ్యము కాదు, కావ్యఖండము. దారిలో దొరికిన ఒక పుట లాంటిది. గళఘోష గంభీర ఘెళఘెళార్భాటులు దీనిలోనూ ఉన్నాయి.

"మీరు మనసారగా నేడ్వనీరు నన్ను" అన్న ఖండకావ్యమునకు పూర్వ భాగము తెగిపోయింది. `ఒకసారి నన్ను విడువుడు' అన్న మాటలు, ఈ పలికే వ్యక్తిని ఎవరో పట్టుకున్నట్టు సూచిస్తున్నాయి. అంతమాత్రమే. పూర్వగాథ తెలియడము లేదు. నా గుప్పిటిలోది ఏమిటో చెప్పమన్న ప్రశ్నకిలాగే, చకితుడౌతాడు చదువరి. సంఘటన (Composition) చిత్రములో ఒక ముక్క కత్తిరించి మిగిలిన ముక్కని ఎదుట పెట్టినట్లే ఈ ఖండము ఎదుట పెట్టడమూను. `కలువపూ బ్రతుకులో' అన్న రచనలు నాటకాల్లో అభాగినుల వచనాలు లాగా వినబడుతున్నాయి.

ముక్కూ మూలమూ తెలిపే రచనల్లోనైనా భావఝరీ గమనములేని రచనలున్నాయి. ఏవో కొన్ని పద్యాలు గుచ్చి పెట్టితే అది ఖండ కావ్యమయిపోదు. స్వేచ్ఛా గానములో ప్రతిజ్ఞ లున్నాయి. అయిదు పద్యాల్లో. ఒక పద్యం తీసినా, ఒకటి కలిపినా మార్పు రాదు. `స్వేచ్ఛాగానము2'లోని వరుసలో సార్థకత లేదు. వెర్రిపాట వెర్రికి ఎంతో దూరము లేదు. ఇదేదైనా ఖండకావ్యానికి భాషాంతరీకరణమేమో. "ఏను నిద్దుర వోవుదునో యేమో" అన్నది రవీంద్రుని రచనకు తెలుగు. `కవికుమార' లో మూడు పద్యాలకీ ఐక్యత లేదు. ఏది తీసేసినా మొత్తపు కావ్యానికి నష్టము ఏమి రాదు! ఎనిమిదోదీ అంతే. వీటన్నిటా ఆఖరి పాదాలు బిగుతు సళ్ళి పోతాయి. `లోకము'లోని మూడు పద్యాలూ ముక్తకములు. సప్తశతి గాథలవలె నున్నవి. `ఆరని దివ్వె'లో మొదటి రెండు పద్యాలలోనూ సఖునికి సంబోధన. తరువాతి మూడింటా సౌదామినికి. చెప్పవలసే ఇలాగు చెప్పేరా?

కృష్ణశాస్త్రిగారు "శబ్ద సంస్కార మెచ్చటను జారగనీక పదమైత్రి అర్థ సంపదల బొదలు' నట్లు `పొసగ ముత్తపు సరుల్ పోహళించిన లీల' పద్యాలు రచించగలరు. వారి నాటికలలో అలాంటి రచన సమృద్ధిగా గలదు. భావ చంచల ఆలాపి పోష్టి ఎన్ని మార్లో జరాలున మెరుస్తుంది. (ద్రాక్షారసములోని పండ్ల వలె మధు ఏందుప్పు వంటి వీరి పద్యాలు నాటికలలో రాణించాయి) `ఉలికిపడి లేచు కోవెలతోట వలిగాలి' `తొలి ప్రొద్దు కొండపై మొలిచె నొక దేవళము, వెలుగు గుడి మొగసాల నిలిచె యాత్రాజనము' `పొడుపు వాకిలి గవను తల్పులు మూలములందు చొరబడి

పోయినాడా మని దొర!' పారిజాతానికి మరిగిపోయె రక్త హృదయం, శాంత ధవళమైన పై మూర్తిట! `ప్రక్కనున్న సైకతవీథి కంటె మూగగా నున్నది'ట యమున. `కడలి యేదో గౌతమేదో ఏకమైనవి ఏడు పాయలు!' నాటి నుండి నేటివరకు ఇంపుగా మోగుతున్నది వీరి కవితాకన్య చరణ మంజీర కింకిణి. మధు బిందువుల నందించే పూవులు వీరి కవితావనములో వికసించాయీ, వికసిస్తున్నాయి. బృందస్వీడిన కృష్ణస్వామి కైలాస గిరినుండి కాశికీ, కాశికాపురి నుండి యెదటికీ వచ్చి తన కన్నీటి బిందువులను సరము గుచ్చుట కోసమై చేయి చాచాలని ఈయన ఆశయము. వెన్నెల్లు పరిచినా నిన్ను పానుపు మీద కన్ను విప్పక పన్నుండు కరిమబ్బు చాటు నుంచి, తరుణ తమాల కిసాల సమాన శ్యామల కోమల చారు శరీరి, హరిదంత పదమ్ము నుండి మ్రోయు చైత్రమాస తరళ తరళ మలయానిలలోల తరంగచలిత! వసనాంచలముల గుసగుసలతో, వచ్చును గాక జగత్ప్రభువు! రచింతురుగాక వీరు తేనె పెరల వంటి నిండైన ఖండ కావ్యములు.

కృష్ణ శాస్త్రిగారి రచనలతో, అంతకన్నా యెక్కువగా ఆయన కావ్య పఠనాలతో, ఆధునిక కవిత్వానికి సత్త చేకూరినది. వారి వ్యక్తి అప్పటి వారి రచనలతో పూర్తిగా రూపొందలేదు. సంప్రదాయము నతిక్రమించని శైలిలో వారు రచించి, చక్కగా పాడుతూ వినిపించేవారు. కనుక `ఏదియొ అపూర్వ మధుర రక్తి స్ఫురియించు కాని, అర్థమ్ము కాని' భావకవిత్వముగా జమ కట్టేరు, యువకులు వారి రచనని. వాచ్యార్థము వల్ల తేటతెల్లములుగాని అంతరార్థమేదో వారి రచనలలో ఇమిడి ఉన్నదని నమ్మేవా రెంద రెందరో. ఈ నమ్మికతో అజ్ఞాత అగోచర సౌందర్యాన్ని దేన్నో అన్వేషిస్తూ రచించడమూ, గతించిన ప్రేయసినో అప్రాప్త మనోహరినో ఉద్దేశించి దుఃఖ గీతాలు రచించడమూ, లోకపు వైముఖ్యమును ఊహించుకుని పడదిట్టడము ప్రారంభించారు. 1920 తరువాతి నాటి నవ కవులు. వేదనా దుఃఖమూ, ఏదో చెప్పరాని సౌందర్యాన్వేషణా, ప్రియురాలి పాదలాక్షకు హృదయరక్త మర్పించడమూ, ప్రియురాలిని కూడగట్టుకుని మృత్యు మందిరములో దూకుతామనడమూ అనాటి రచనలలో జల్లు జల్లులుగా కురిశాయి. కావ్య పఠనాలూ కృష్ణశాస్త్రి రూపానుకరణాలూ చెప్పనే అక్కర్లేదు. `భావ కవి' కి రూపమూ కావ్య వస్తువూ, (గీత పద్య) ఛందస్సూ, నాట్యరంగమూ ఏర్పడ్డాయి. ఈ భావ కవిత్వపు గుడారుకు కృష్ణ శాస్త్రిగారు మూలస్తంభమై నిలిచారు. అయితే మన దురదృష్టము వారి అనుయాయుల రచనలలోనూ కావ్యసిద్ధి కలిగి రసానందము కలిగించగల నిండు భావ కావ్యాలకంటె కవిత్వపు తునకలు గల సంక్లిష్ట రచనలే ఎక్కువ వచ్చాయి.

-భారతి, జూన్ - 1963

# 8. వేదులా, శివశంకరులూ

వెదుల సత్యనారాయణ శాస్త్రిగారు సంప్రదాయసిద్ధంగా పండిత గురువుల శుశ్రూష చేసి కావ్యనాటకాలంకారాలు నేర్చినవారు. రాయప్రోలు మాధవ పెద్దీ కవుల వలె ఆశువుగా పద్యాలు చెప్పడమూ, శతావధానాలు చెయ్యడముతో రచనా ప్రారంభము చేసినవారు. ఆంగ్లకవిత్వ పరిచయమూ, స్వాతంత్ర్యోద్యమమూ రాయప్రోలు వారిని పద్య రచన నుంచి కావ్య రచనకు తిప్పినవీ; మాధవ పెద్దివారు కాలానుగుణంగా కథాకావ్యాలు రచించడములో వారి ఆశు రచనా ధోరణి ఎంతో కొంత వర్ణనీయ వస్తువును స్వీకరించి బరువైతే ఎత్తినది కాని ధోరణీ మారలేదు. వేదుల వారు గొంతువిప్పే రోజులలో రాయప్రోలూ దేవులపల్లీ వారి రచనలు వారిని ఎక్కువగా ఆకర్షించినట్టు కనబడుతుంది. చెవికి ఇంపుగా వినబడే పదములతో పద్యాన్ని దాని జోరుతో దాన్ని పోనియ్యక తనకు కావలసినట్టు నడపడము రాయప్రోలు ప్రత్యేకత. అనుభవాన్ని వాడిగా వేడిగా ఇవ్వడము కృష్ణశాస్త్రి ప్రత్యేకత. ఈ రెండు గుణాలు పెనవేసుకుని వేదుల వారి కవిత్వమును నడిపినట్టనిపిస్తుంది.

రాయప్రోలు కవిలాగనే వేదుల సత్యనారాయణ శాస్త్రి గారున్నూ సంస్కృత పదాల్ని ధారాళంగా ప్రయోగిస్తూ అక్షర రమ్యతను సాధించ యత్నించారు. `నూతన మనోరథము' `నృత్య గీతానునయమ్ము' `ద్వారతోరణా స్థానము' `ఘోరకారానరకమ్ము' `పార్థివశ్రీ' `ఆషాఢ వారిదము' `మధు ప్రవాస ప్రయాణ వేళ' `అంధ తమసమ్ములు' వంటి ఉదాహరణలు వారి పద్యాలన్నిటిలోనూ కనబడతాయి. సమాసమువల్ల ప్రవేశించే క్లిష్టతరాదూ, సంస్కృత పదాల శ్రవణ సుఖము చక్కగా ఆవరిస్తుంది; రెండు లాభాలు ఈ పద్ధతి వల్ల. సంస్కృతాంధ్రాలు రెండూ చేర్చినందుకు సత్ఫలమిదీ. కాటూరు వెంకటేశ్వరావుగారన్నట్లు రాయప్రోలు వారికి గల ఆంగ్ల కవితా పరిచయము వేదుల వారికి లేదు. రవీంద్రుణ్ణి అనుసరిస్తూ అయితేనేం, ఆంగ్ల కవుల్ని అనుసరిస్తూ అయితేనేం రాయప్రోలు వారు `ముసుగెగాని మోము గానగరాని' మర్మకవిత్వం వ్రాశారు. సత్యనారాయణ శాస్త్రి గారు చేసిన పండితగురు శుశ్రూష

వారి రచన మీదికి మంచు తెరను దిగనియ్యకుండా కాచింది. యత్నించి యత్నించి వారు `ప్రణయ మూర్తి' `ఆ వృత్తి' `పూజా ప్రసూనములు' అనే ఖండికలలో వాచ్య భావాలకు అవకుంఠనము చేసినా, నాటికి వ్యంగ్యము నలవరిచే శక్తి వంతములైన వ్యంజక శబ్దాలు వాడక పోవడము వల్ల కాబోలు అవకుంఠనము వాచ్య భావాలకు కృతకమైన ఆటంకమే అయినదనిపించినది నాకు. మీదు మిక్కిలి `తొడిమ వీడిన పూవ్వకై పడుచుతేటి విరహగీతాకలనము' ,`మధు ప్రవాసమున'కు వీడుకొలుపు పాడ నుత్సహించు పికము, `అశ్రుకణముల నేరుకొను తారలు,`మాలిక గ్రుచ్చ నెంచు ప్రేమాలసులకు' అందని పూవులూ' అపరిచిత ప్రపంచాగత కవి సమయములై అక్కరకు రాని ఆలోచనలను రేపుతున్నాయి. అయితే అక్కడక్కడ మాత్రాన్నే వీరు కవితాకన్య గుప్పిలి మూయించడమూ, ఆమె వ్రేళ్ళ సందుల్లోంచి వాచ్య భావాలే బలమై కనబడడమూ వల్ల, ఆ చోట్ల రచన పలచనైతే అయినదేమో కాని రాయప్రోలు వారి బురఖా భావాలవలె - అయోమయత్వము స్ఫురించడము లేదు.

కృష్ణశాస్త్రిగారి వేదన, "ప్రేమ పట్టున కిటు బిచ్చగాని చేయి చాచికొనినాడ మృత్యు ఘోషమ్మె మరచి, వట్టి బయలున నొక మోడు చెట్టువోలె ఎత్తినది కరమెత్తినట్లే కృశించె" వంటి రచనల లోనిది వేదుల వారి అనుభవాని జల్లుమని"నవ్వుచును పొంగిపోవుచు నాట్యమాడు తరగలను వెల్గు చుక్కల తళ్కగాని, లబ్ధి గర్వోజ్జ్వలద్భడబాగ్ని శిఖర హృదయమున దూరి ఎవరు చూచెదరు సఖుడు" అనీ, "దారుణపు జీవితంపు టెడారులందు తీరని పిపాసనే దారి తెన్ను లేక, నేనే నా దుఃఖ బాష్పశోణితలహరులనే విసుగువేసటలు లేక త్రావినాను" అనీ, ధ్వనించింది. "కడుపు గాల్చెడు మండుటాకటనురేగి, కోర్కెలొండొంటిని గ్రహించుకొనె"నట. `దినములు పరస్పర ప్రతిధ్వనులుగాగ నిర్వదైదేండ్ల బ్రదుకిట్టె గడిచె'నట. రచనలలో సామాన్యముగా వేదన ధ్వనిస్తూనే ఉంటుంది. ఒక్కొక్కచోట "దివ్య రథధూళి సుగంధిలమైన దుఃఖపుం ద్రోవనె వేడి యూరుపుల ధొంతరలం బొరలాడి చచ్చియుం జావని యాశలం బ్రణయ సాగర పారముదాక జల్లితిన్" వంటి ఉదాహరణల్లో వాచ్యార్థము అతి బలహీనముగా ఉంటుందీ, ఇంక కొన్ని చోట్ల "నీలి మంటల పొగ కెరటాల గురియు, కారు మబ్బుల చిమ్మ చీకటుల త్రోవ దిరుగులాడిన వేసట"లలో వాచ్యార్థము బల వంతమూ అవుతుంది, మొత్తానికి ధ్వనించేది వేదనే. కృష్ణశాస్త్రిగారి ఆవేశము ఆలోచనలను అతిక్రమించి నాలుకలు చాస్తుంది అగ్నిహోత్రములాగా. వేదుల వారి ఆలోచన ఆవేశ తరంగాల మీద నృత్యము చేస్తుంది. వర్ణనలు ప్రవేశించి వారి భావాల్ని బరువెక్కిస్తాయి. "మ్రొక్కిన కొలంది కాలితో తొక్కివేయు కఠిన లోకమూ" "మరుపు దట్టిన కాలమ్ము మడతలందు పాడుపడని" `బహుజన్మ పరిచయమూ, ' `దుఃఖ తాపముల కిల్లగు `పాడు

ప్రపంచమూ', 'ప్రేమ విహీన మానసము' రీతి విషాద పయోద ధూమములు పై గప్పిన 'రాత్రీ' దుఃఖపుం గసటువోవని 'ఆశలూ', భస్మరాసుల నుండి పావనత మేలు కొలిపినట్టి 'భాగీరథీ జలమూ', 'ఉదయాస్తమయమ్ములె జీవమ్ముగా దలచెడు మర్త్యపాళీ' ఆలోచన మోపించే బరువుతో దౌహృదులవలె నడుస్తాయి మన హృదయాల మీద.

దినముల పరస్పర ప్రతిధ్వనులుగా జీవితము సాగుతూన్నప్పటికీ వేదుల వారు సృష్టి సౌందర్యాన్ని ఏమారలేదు. వారి ఊహా ప్రపంచములో కాని ముసుగుల్లాడ వేకువ కాంత దివసాంగణము చేరుతుంది. ద్విజ సంతాన గళ కాహళులు ప్రాతస్తవము మ్రోగిస్తాయి. తూరుపు పైడి మోసాల మ్రోల సప్తరథ్య ప్రయాణ హేషారవము సాగుతుంది. పైరగాలి తరంగాలపై పూర్వ పరిమళ విలాసాలు వెల్లి విరుస్తాయి. మేధుర వినీల మేఘాల మేలి ముసుగు వేసుకుని వస్తుంది శ్రావణ మాసలక్ష్మి. తొలకరి సారె యిడిన ఆర్ద్ర పురుగు పూవుల శాద్వలాంబరము ధరిస్తుంది ధారుణి. కడిమి పూవుల నెత్తావి కసటువార వృష్టి ముందటి తడిగాలి వీస్తుంది. దినమంతా, త్రోపుడులాడు కార్మొయిలు దొంతరలు మావి తోపులపై నీడలారుస్తాయి. ప్రావృడంబరు శ్రీ చికురాయమాణ జలభృత్పటలీ చటులాంధ్రమౌతమస్సు భువిని కప్పుతుంది. తూర్పు వాకిటి గూట తొలిదివ్వె వెలిగించి తొగరు పావడ సంజ తొలగిపోతుంది. రేరాజరు దెంచుననుచు గగన దుర్గపు తూర్పు బంగారు తలుపులు తెరుచుకుంటాయి. ఆ యుదయాద్రి నుండి, అరుణారుణమౌ మొగమెత్తి గాఢలజ్జాయుతయౌ నవోఢ వోలె సందడి సేయక తొంగి తొంగి చూసి చంద్రుడుదయిస్తాడు. మోహినీ సాట్టహాస కోలాహలములు పండువెన్నెలలు బ్రహ్మాండమంతా ఆవరించుకుంటాయి. ఆ అనంత లోకైక పవిత్ర కాంతి సుధల మూగ సోయగపు మనోజ్ఞత కవి అనుభవించి మన కందిస్తారు.

కవి కనులకు కట్టిన సౌందర్యము కవి లౌకిక భావాలను కూడా వెన్నెలలాగా ఆవరిస్తుంది. "అలరునకు బోలె నా హృదయమ్మునకు జన్మమున కొక్కటే వికాస" మంటారు. దూరదూరము నుండి తోయధి పిలుపు చెవిసోకి పరువెత్తునట సెలయేరు. ముది శిశిరమ్మాకు చిదిమిన పట్లు పూలకారు చివుళ్ళ పురిటి పొత్తిళ్లట. శైల గర్భాంతరాళ నిర్ఝరము వోలె నేదో ఎడదలో యెగయ నుంకించునట. రేయి పదే పదే కనుల రెప్పల స్వప్నపు నీలి క్రొందెరల్ వేయ దపించునట. ప్రకృతి సౌందర్యమూ భావనా గంగాయమునల్లాగా అల్లుకో గలిగినప్పుడు ఈ రెండూ విడివిడిగా కూడా భాసిస్తాయని చెప్పే అవసరము లేదనుకుంటాను. చలత్తరు శాఖ నీడ వాతాయన బింబితమ్మయి ప్రియాగమన భ్రమ గొల్పునన్నపుడూ, పండి వ్రాలిన వరిపైరు పైని

ప్రాకి వచ్చు చిరుగాలి తరగల వరుసను చూపినప్పుడూ, సృష్టి ముందరి తడిగాలి వీవసాగెనన్నపుడు, వర్ణన ఇంద్రియ గోచరమై ప్రకృతి సౌందర్యము అనుభవానికి వస్తుంది. ద్విజ సంతాన గళకాహళులూ వాత్సక ధేనుకాన్యోన్య సమ్మేళ నాహ్వాన సంభ్రమాలూ జంఝానిల విఘూర్ణిత నీల వారంబునిధిగా తరంగాలూ సాట్టహాస కోలాహలాన్ని వినిపిస్తే, సుగంధ శీతల సమీరాలూ అగరుధూప సుగంధిలమైన కేశపాశాలూ సువాసనలూ గుప్పుతాయి. వీరి భావన `వెల్గు నీడల మధ్య నిలువజాలని శ్రావణ మాసలక్ష్మి'నీ, నిరాశాపథైక పురాణ పాంథుణ్ణీ, కవి భావనా విలాసినీ నిత్య సైరంధ్రి (వెన్నెల)నీ, `జీవితావసాన శైశిర తమోభిసారిక, (మృత్యువు)నీ గుర్తించి మనకు చెపుతున్నది.

సత్యనారాయణశాస్త్రిగారి రచనలో కల్పనదే ఎక్కువ పాలు అన్నాను. కల్పన అన్నది చదువరికి అందునట్టిదే అయితే అతని మెప్పును పొందుతుంది. సామాన్య చదువరి భావనకు అందక కృతకంగా కనిపించే కల్పన కవియత్నాన్ని విపరీత గడసాధనగా చూపిస్తుంది. `తేనె తావుల బరువోపలేని పూవు ప్రొద్దు పొడుపుకై వేగిపోవునా? `చెక్కిన నెలరాల చెరసాల నడుమ వధ్యశిలా వైభవం బిచ్చగించి దేవులాడునా' దేవుడు? `ఆత్మను దహించు ప్రణయ దుఃఖాగ్ని మండి నీలమై వంగిపోవునా' నింగి నెలత? నింగి నీలమై వంగినది అనడము చక్కని అవలోకనము. కీట్సు `వంపులతో కాలి బాట'ను జ్ఞాపకానికి తెస్తోంది. ఆ నింగి తన వలెనే ప్రణయ దుఃఖాగ్ని మండి వాపోతున్న దనడం దూరము నుంచి 'పిలిచే కల్పన. నిర్మేఘ మార్గశీర్షాభ్రవీధి వృద్ధ సంధ్యా తపస్విని పెదవి విరచినదా? ఆమె తపస్వియే అయె. పెదవి విరవడ మెందుకనీ? మేఘ సౌందర్యము కొరవడినదా? భస్మరాసుల నుండి పావనతను మేల్కొల్పినదా భాగీరథీ?.... ఇలా ప్రశ్నలను రేపే కల్పనలు ప్రబంధ కవుల కల్పనలకు అనతావంతరాలు, కవిగారిని చూపిస్తాయి మనకి. `విరిగి సమముటే ఫలమని యెరిగి కూడ దరి నెనయ పాడుచు బోవు గెరటమూ' `నరక లోకపు చీకటి తెరలవంటి నిశలూ' `సుస్తి పడిన ఉషస్సునకు పునాదియైన దగ్ధనైక చితా భస్మదాశీ- కవి కల్పనలవల్ల వైలక్షణ్యము పొందిన మన అనుభవాలు చదవగనే ఝల్లుమనిపిస్తాయి.

సత్యనారాయణ శాస్త్రి కావ్యసామగ్రి ప్రణయములో `ప్రణయ మూర్తి'లో వారు`ఆషాఢ వారిదము మ్రోల గాదములాడు చాతక వధూటీ' `దీపిక వలగొను శలభకాంత" ప్రణయమునే సాధిస్తున్నవి సూచించారు. ప్రణయోత్సాహముతో మెల్లగా మెట్లెక్కి `నీలమై వంగు' నింగి లలిత ప్రణయ దుఃఖాన్నీ, తొడిమ వీడిన పూవుకై పడుచు చేసే విరహ గీతాకలనమూనూ, మధుర ప్రవాస ప్రవృతినీ, ప్రణయ

రాజ్యములోనే దర్శించారు. `ప్రేమ స్వతంత్ర యగు దారికి సఖిని ప్రోత్సహించే ప్రియుణ్ణి, ఒక క్షణమ్మై యైనా ఛాయారోచిరుదయవీథి కూడుకొను దినసంధ్య ఇల్లు చేరు ప్రేయసులనూ, నిండు ప్రాయపు దలపులన్నిటిని దండలుగ ప్రియమెడ నిండవేసి విధివశాన వేరైన సంజీవి పలవింపునూ, ఉరుము లురిమెడు మబ్బుల కేసి చూడబోవని ప్రవాస మయూరి వేదనా, వలచి వంచిన ప్రేమగాయకుని గానమూ, నిరసించు ప్రేయసి నవ్వు కొరకు బ్రతుకు వెలిగించిన నివాళినీ, గౌతమీనదీ తన గర్భములో మ్రోతమెట్టు దుఃఖ జీవగీతాల కావృతి చెప్పుకునే తిమిర యాత్రికుని మౌన విషాదతమమూ, ప్రేమ విహ్వలాశౌకరుణమమ్ములౌ గుసగుసలు వినే శిశిర జీవి తలపులూ, వలపు తొలగిన బ్రదుకీడ్చు ప్రేయసుడు జీవితా వసాన శైశిర తమో భిసారికనుచేయు నాహ్వానమూ, "దీపావళి"లో నిక్షేపించారు. వీటిలోని శైల హృదయ నిర్ఝరాలూ, జన్మ జన్మాల యాత్రలూ, దిన సంధ్యల వియోగైక్యములూ, పశ్చిమాశా నికష సువర్ణ రేఖలను చెరపుచుబోవు ప్రొద్దు, రెక్కలురాని హృదయాలూ, రాతిగుండె లోకము కురిసే నిప్పులూ, మరణ వాద్యమ్ములట్లు కొట్టుకొను గుండియలూ, వేదనా ప్లావితములై చదువరుల జాలిని పలుకరిస్తాయి. అయితే వీరి వేదన ఎటకో ఎటకో జలదాలదాటి తారకల వినీలపథ రాజుల నతిక్రమించి చదలేటి తుషారపు స్వప్నరాసులలో కలిసేటిది కాదు. మ్రొక్కిన కొలంది కాలితో త్రొక్కివేయు కఠిన లోకమును వదలి `ఆ మృధు చంద్రికా యవనికాంతర నీల నభో నిశాంత శోభామయ సీమలందు' తిరుగులాడ నుత్సాహించినా, ఒక్క యామిని మాత్రమే. వలపు తీపి యెరుంగని వట్టి రాతి గుండె లోకమ్ము నిప్పులు గురిసినా, `ఏ తలపు దారి చూపునో ఏ వెలుగు తన దరి కీడ్చుకొనునో" అని ద్వారము మూయని అనురాగముతో వేచి బ్రతకడమే ఈయన ఆశయము. ఈ ఆశకు ఫలితముగా, ఇరుగట్లు నొరసికొనుచు ఆనంద ప్రపూరము పొంగిన ఘడియలూ జగ దజస్ర సహస్ర ఎసంత లక్ష్మి మూర్తీభవించిన క్షణాలూ, అమృత సౌందర్య లోక వాతాయనాగతానుకూలా నిలము. సోకిన దినాలూ నిండేయి ఈయన జీవితములో. ఆ ఆనందముతోనే ఈయన రచించిన యాత్ర, కృతజ్ఞత, నేడు, పూర్ణిమ, శరదుత్సవము, సుధాకరా అన్న ఖండకావ్యాలు విశ్వసాహిత్యాకాశపు చుక్కలు.

సత్యనారాయణ శాస్త్రిగారు ఒక చక్కని భావన చుట్టూ అందపు ఖండ కావ్యాన్ని నిర్మించడములో సిద్ధహస్తులు. ఆత్మనాథుని కరస్పర్శ, కేళీ ప్రసన్నయైన ప్రేయసి చిరునవ్వు, ప్రవాసవేదన, ప్రేమావిర్భావ మధుర క్షణస్మృతీ, ప్రేయసీ తిరస్కారమూ, మరణేచ్ఛ అన్న రసబిందువుల్ని వాన జల్లులుగా నిర్మించిన ఖండకావ్యాలు ఒక క్షణము, నిష్కృతి, పెంపుడు నెమలి, కృతజ్ఞత, నిరసనము, ఆహ్వానము అన్నవి భావకావ్య శిల్పానికి చక్కని ఉదాహరణలు. సంబంధములేని

భావాలను దండగుచ్ఛడము శతకాలలో మనకు కనబడుతుంది. ఒక చక్కని భావాన్ని సందేశించేటట్లుగా, ఆదీ అందమూ అంత్యమూ కూర్చి ఖండకావ్యముగా మలచడము కావ్య రచనా యత్నానికి కడపల. నేటి చదువరి దినశ్రమ తీర్చుకోవడానికి ఏ పడక కుర్చీలోనో జేరబడి కావ్యము విప్పుతాడు. సుదీర్ఘ కావ్యాలు చదివి వాటి బరువు వంటను మార్చుకునే విరామము అతనికి లేదు. కావ్యము అతడున్న మానస స్థితిలోనే అతని చేయిపట్టి తిగిచి భావనిశ్శ్రేణి నెక్కించి- ఎంత చిన్నదైతేనేం - భావసమాధి లోనికి విసరాలి. జీవితానుభవ ప్రవంతిలో తానున్న రేవును దాటి కావ్య నౌకలో ప్రయాణము చేసిన చదువరి మేల్కొని ప్రకృతిలో పడేసరికి అతని హృదయ వీణకి కొత్తతీగె మొలవాలి. అంతేగాని ఈ పద్యం బాగుంది, ఈ సమాసము బాగుంది అని కవిగారి రచనాశక్తికి వ్యాఖ్యానాలు తెచ్చే రచనలు కవిగారి "యశేర్థ కృతే వ్యవహార విదే" లేగాని చదువరికి " సద్యః పర నిర్వృతియే కాంతా సమ్మిత తయోపదేశయుజే"లు కానేరవు. పోలికలు దేశాల తీరాలు దాటి సముద్రాలు గడచే ఈ రోజుల్లో కూడా సూరకవిలాగా `నా కొరుండు సాటియే' అనేటట్టున్న రచనలు పుట్టడం మన దురదృష్టము. సత్యనారాయణ శాస్త్రి గారి కొద్ది రచనలలోనూ పైన సూచించిన కావ్యత్వసిద్ధిని పొందిన రచనలు ఎక్కువ.

కావ్య వస్తువు సుదీర్ఘమైన కథ కాక అందమైన భావమే అయినప్పుడు, కవులు రచించిన కావ్యములలోని సుందర భావనలు కూడా క్రొత్త రచనలకు ప్రాతి పదికలు కాగలవు. సత్య నారాయణశాస్త్రిగారి కొన్ని రచనలలో ఇతరుల రచనల ఛాయలు అంతర్వాహినులుగా స్ఫురిస్తూండడము కద్దు. రాయప్రోలు వారి `రాధ పిలుపు ' వీరి సంధ్యాన్వేషణము (`రాధ')లలో కడ తీరుతున్నది. జయదేవకవి ఈ మూడు ఖండకావ్యాల్ని చూస్తే సంతోషిస్తాడు. తన ప్రారంభ శ్లోకం పరువెత్తించిన భావస్రోతస్సులవి. వెంకట పార్వతీశ్వరులు వీరి కన్నీటి పాటలు ధ్వనించే తమ ఏకాంత సేవనము తలచుకొని సంతోషపడతారు. ఠాగూరుకవి తాను రచించిన అభిసారిక `నిరీక్షణము'నూ `ఉత్కంఠ'నూ తాను నడిపిన దివ్యరథ యాత్ర అవృతినీ, ధరింపించిన వేణుదండ నైపథ్యమునూ వీరి రచనలలో గుర్తించి సంతుష్టాంతరం గుడు కాగలడు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తన భావావేశము ఈయన యెదదలో కూడ వాసించెననీ, తాను ప్రేమపట్టునకై చాచి కొన్న చేయికే కాక ఈయనకు కూడా పాడులోకంలో చిరు నవ్వు తునుక కరవైనదనీ, తాను చూచిన గోపికకే కాక కా... మొయిళ్ళ కాటుక పొగలు వేదులకూ, అందపు సామాగ్రియైనవనీ, తన కాళరాత్రి గోష్ఠి దివాంధ సాహచర్యమూ ప్రవాసులకు సామాన్యములేననీ, జీవిత విపంచి మెట్లు కదలిపోయినది తనకే కాదనీ చూచి తృప్తి పడగలరు. `ఇంతేనటే పంద్రమెంతో యనుకొంటి' అన్న నండూరి యెంకి,`కరకు గత్తుల దాల్చు నరహంతకుల ఇంట

బానిసై భూదేవి పడియుండె నీవేళ' నన్న తురగా వెంకటరామయ్యా "కొరవిచే గాల్చినట్టుల సురియవెట్టి వచ్చినట్టులు, కరకు రంపాన గోసిన కరణి బాధపడిన `పాపాయి' తండ్రీ, తమ వాక్యాలు వేదులలో ప్రతిఫలించిన తీరు చూసి ఊరడిల్ల గలరు. హిందీ కవి మాఖన్‌లాల్ చతుర్వేది వేదుల `కాంక్షలో' తన `పుష్పకీ చాహ్'ను పొడగని చకితుడు కాగలడు.

దిద్ది తీర్చడము వేదుల వారి ప్రత్యేక శక్తి. ఈ తీర్పు ఈయన అనుయాయుల రచనల లోనే కాక ఈయన తిప్పి వ్రాసిన రచనలు కొన్నిటిలో కానవస్తుంది. ఆ వృత్తి, ఆశాగానము, ఎపుడో, జ్వాల, ఆహ్వానము రెండో ముద్రణములో నందగించినవి. `దీపావళి' సంపుటము ఒకటే ఈయనది వచ్చినది . దానిలో ఖండ కావ్యములు మొత్తము మీదా - సినిమా పాటలను కూడా చేర్చుకుని - సంబద్ధములు కాకపోయినా పులుగు గొంతుక, జన్మ జన్మాల యాత్ర, తొడిమ వీడిన పూలూ, శైల హృదయ వాసనలూ వాటిని వేదుల ముద్రాంకితములుగా చేస్తున్నవి.

సాహితీ సమితి సభాపతులు శివశంకర శాస్త్రిగారు బహుభాషా ప్రవీణులు, నారాయణ తీర్థుల వంశములోని వారు. కావ్యానుభవ మెంత ఉన్నా కడలివలె గంభీరులు, ప్రియవాదులు, అనేక రీతులలో పలుకుతూండిన నవరచనా పరుల నందరినీ సాహితీ సమితిగా కూర్చి రచనలు అనుభవాలను బట్టి చేయు సూచించి నవకవిత్వానికి బంగారు బాటలు వెలయించిన దేశికులు. సౌందర్య మెవరి రచనలో ఉన్నా దానిని గుర్తించి చెప్పి నవ్యసాహిత్యానికి ఉత్సాహమిచ్చిన అమృత మూర్తి. ఈ అభిమాన గుణము ఈయనను ఒకరి దారిని ఒకరు పోని నవ కవులకు అన్నగారిని చేసినది. ఒకరి నొకరు తిట్టుకునే సంప్రదాయానికి చెందిన తెలుగు కవులు వీరి స్నేహ ప్రభావముల మూలమున తిట్టుకొనుట మాని తమతమ రచనలలో నిమగ్నులైనారు. ధనవంతుల నాశ్రయించిన వారికి ప్రీతి కరమైన రీతులలో కవనమల్లే కవి తన సౌందర్య దర్శనోత్సాహాన్ని, తన బాధను, తన నిర్వేదాన్ని వస్తువుగా చేసి కావ్య రచన చేశాడు. నవ కవిత్వానికి ధ్యేయము ఏర్పడింది.

ఊరూరా కావ్య పఠన సభలు ఏర్పరచి, నవ కవిత్వాన్ని గురించి నచ్చజెప్పి, నవ కవిత్వములోని అందపు రచనలను వినిపించి, ప్రజా యుగంలో సారస్వత వ్యాపనానికి వీలిచ్చే సాధనాన్ని వీరూ వీరి సమితి వారూ చేపట్టినారు. కావ్యానుభవము వైయక్తికమే అయినా, నాటక - ప్రేక్షకులలోవలె మూహ ప్రభావము కదిలి ఆనందాన్ని వెలిబుచ్చ సదస్యులూ, నిజంగా నచ్చి మెచ్చుకునే వారూ దేశంలో ఏర్పడ్డారు. సాహితీ సమితి వార్షికోత్సవాలలో సమితి సభ్యులు తమ కావ్యాల్ని ఒకరికొకరు అంకితమిచ్చి, ప్రశంసా వాక్యాలు చెప్పి నవ్య సాహిత్యానికి ప్రచారము కలిగించారు. ఈ సమితి

సభ్యులు కొందరు ఒత్తుగాటోపీ పెట్టినట్టుగా కనబడే జుట్టూ గిరిజాలూ, పెంచేవారూ, కండువాలను వల్లెవాటుగా వేశేవారు. ఇది కవికి ఒక విశిష్ట వేషము అన్న అభిప్రాయము కలిగింది దేశంలో. యువకులు చాలామంది వల్లెవాటు కండువాలు వేసుకుని పద్యాలల్లడమూ కావ్య పఠనాలంటూ చేయడమూ ప్రారంభించారు. రాజమండ్రిలో సారస్వత సమాజము, విశాఖపట్టణములో కవితాసమితి, హైదరాబాదులో సాధన సమితి ఏర్పడ్డాయి. జంట కవుల ఉద్యమము వెళ్ళిపోయి సమితులేర్పడ్డాయి. విమర్శా ప్రతి విమర్శలనే కాలకూటాన్ని ఈ సమితి నిర్మాణోద్యమాలు మింగేశాయి. ఈ రకపు సంఘీ భావోద్యమానికి శివశంకరశాస్త్రిగారే పునాది వేశారనాలి.

శివశంకరశాస్త్రిగారు 1925లో హృదయేశ్వరి అనే పద్యాల సంపుటి ప్రచురించారు.(అప్పటికి రాయప్రోలు వారు సూచనగానూ అబ్బూరి వారూ నిండు పేరులోనూ సృష్టించి వదలిన అప్రాప్తమనోహరి దేశమంతా వ్యాపించింది. వివాహాలు బాల్యదశలోనే ఒరిగి పోతూండిన కాలమది. కనుక ప్రౌఢ యువకుల మనోహరులందరూ అప్రాప్త మనోహరులే. ఇంకేమైనా చేస్తే ఇబ్బందిగాని కవిత్వము వ్రాస్తే ఏ ఇబ్బందీ లేదు సరిగదా, మెప్పుకూడాను! బహు భార్యత్వమువల్ల చిక్కులు గాని బహు మనో హరిణులుంటే కవికి అధికస్య అధికం కావ్యం ! ప్రేమ కావ్యాలు ఎటు చూచినా అవే కనబడుతూండేవి. దేశం స్వతంత్రం కాదాయెను! రాజకీయ తలపులు బంద్! ఇక మిగిలినవి ఏమిటీ అనుభవంలో? ప్రేమా, ప్రకృతి సౌందర్యమూను. హృదయము ప్రేమమీదికి వెళ్ళినంత సాధారణముగా ప్రకృతి సౌందర్యము మీదికి పోవడము సహజము కాదు. కనుక పరిస్థితులూ, కవి మానవుని నైజమూ, అనుభవ బాహుళ్యమూ ప్రేమ వైపు తిప్పేయి రచనల్ని.) ఇది మొత్తము మీద ఒక యువకుని ప్రేమోదంతము (ప్రేయసీ దర్శనానంతర) `విభ్రమమూ', (ప్రేమ సంపాద నోత్కంఠతతో సలిపిన) `విరహ వీచి', (ప్రేయసికి తనపై గాఢాను రాగము కలదనే) `హృదయశాంతీ' (ప్రేయసి నుద్దేశించి రచించిన) `గీతావళి (లభ్యమైతే ఎంత బాగుండును అనే) `సుఖ స్వప్నము' అన్న అయిదు ఉచ్ఛ్వాసముల కావ్యము ఇది. నాయిక స్వతంత్రురాలు కాదు. బంధుజన పరివేష్టిత. ఆమె దర్శనమూ, విద్యాలయములో పునర్దర్శనమూ, ఆమె గృహనిర్దేశమూ, వాతాయన నిరీక్ష/హర్మ్య ప్రదక్షిణా పూర్వక దర్శన నిష్ఠ, విద్యాలయ సమీప దర్శనము, ప్రేమ ప్రతిష్ట, ధ్యానము, మననమూ, వస్తువులుగా పది లోపుగా నున్న గీత పద్యాల ఖండికలు చేరి విభ్రమము. ఇట్లే విరహవీచీ హృదయ శాంతినీ. గీతావళి ప్రేయసుని భావ గీతావళి (త్రిపుటల)ముత్యాల సరములలో ఉన్నది. సుఖ స్వప్నమే స్వప్నము. మొత్తానికి ప్రేమ సాఫల్యము స్వప్న జీవితములోనే అయినది. నాయకుడు కృష్ణాతీరాన్న కూర్చున్నపుడు సఖుడు `లక్ష్మి'ని వర్ణించినాడు. ఈయనకు ప్రణయ

ముదయించినది. తర్వాతికథ పైన చెప్పినాను. నాయకుని హృదయము `ధీర గంభీర శాంత' మౌటవల్లనూ `ఇష్టసఖుతోడ సరణి నేగుచూ చూచిన కారణము ఘంటాపథంబైన కారణమూ, నాయిక సహోదరితో నిల్చిన కారణమూ చేరి వారించుట చేతనూ నాయకుడు సాహసి కాలేదు. కాని ఆమె మూర్తిని ధ్యానించుకొనుచు ఆమె సౌధ సవిధమ్మునకు సల్పిన తీర్థయాత్రలూ, ఆమె హర్మ్యమునకు చేసిన ప్రదక్షిణములూ, `మందిర ప్రయాణాలూ, జాల మార్గమ్ము వెంట ఆమె సౌధ దిశను సారించిన చూపులూ ఈయన వేదనను ధ్వనించగా, ఆమె యౌవన శోభను తృతీయ (త్రి) రత్నముగా గ్రహించి, ఆమె కటాక్షమును `శరణం గచ్ఛామి' అని భోగ వాంఛ లోపించి పోయిందంటూ బాలుపోల్కి విలపించిన ఈయన పనులు ఆవేదనను వాచ్యము చేశాయి. తొలిఘట్టములో ఆమె పాదయుగళి, వదనము, నేత్రయుగళి, కైశికమ్ము ధ్యేయములని ఈయన చెప్పినా, తరువాత నాయిక మధురాధరము, గండపాళి ప్రశంసించి, మనోజ్ఞ వక్షః స్థలము ననిలవశమున స్పర్శనము చేసిన పుస్తకమును `నా కన్న సుకృతి ' వనడములో ఈ ప్రౌఢ ప్రేయసుని ధ్యేయ తత్త్వము తెలియ వస్తుంది. అయితే వానప్రస్థ పరిస్థితులు ఈ కావ్యములోని శృంగారానికి కనబడని కళ్ళెము తగిలించాయి. కనుక కవిగారి వర్ణనలలోని విశేషములు సార్థకములుగా కాక లాంఛన ప్రాయంగా గోచరిస్తాయి.

శివ శంకర శాస్త్రిగారు గొప్ప పండితులు. వారు తలుచుకుంటే శబ్దాలకు కొదవయేమిటి? `వాసవ మణిద్యుతిచ్ఛటా భాసురంబు, చిత్క్వణతమాల దీధితిస్నిగ్ధముగ్ధమా కళింద సుతాతరంగాభిరామ 'మట లక్ష్మీదేవి కైశికము.`సతత హృదయాంతరాళ జ్వాజ్జ్వల్యమాన దివ్య విమలానురాగ సందీప్తిశాలి'యట ఈయన. సంస్కృతము ఈయన రచనలో రాయప్రోలు వారి రచనలో కంటె సులభముగా మృదువుగా ప్రవేశిస్తోంది. తెలుగులో విశేషణాలు`రెండు చేరినా ప్రత్యేకంగా కనబడిపోతాయి కనుక మమతనూ, లలిత సౌందర్యమునూ తెలపడానికి `క్రమ సుస్నిగ్ధ నీలాంశుకము' `లలిత జంగమ కాంచన లతిక' `అతి విశాల గంభీర భవార్ణవంబు' `ధీర గంభీర శాంత మదీయ హృదయము' అని వ్రాస్తే కీట్సు వంటి ఆంగ్ల కవుల రచనలలోని విశేషణ లాలిత్యాన్ని స్వీకరించినట్లు స్వీకరించగలము గాని `నీ మనోహర వనస నిర్నిద్ర విమల సాంద్ర చిత్రిత సహకార జాలకముల'నీ, `మహిత లావణ్య నిర్ద్యోతమాన తావకానన సుధాంశు బింబమ'నీ `విమల కమనీయ వదనారవింద దివ్య వీక్షణ క్షణరక్తి' అని, దివ్య రాగము దివ్య శోభ దివ్య దరహాసము దివ్యవదనము దివ్య శీతల దృష్టులు దివ్య తాటంకములు దివ్య విమలాను రాగము దివ్య సంస్థితి అనీ ప్రారంభిస్తే విశేషణాలు Words words wordsఅనిపిస్తాయి. ధ్వని రూపంగా,

చర్యరూపంగా కాన రాని ప్రేమ విశేషణాలవల్ల కానరాదు,. విశేషించి రచన అంతటా శబ్ద వాచ్యత-పొగమంచులాగా ఆవరించి భావాల్ని కప్పివేస్తుంది.

శబ్ద వాచ్యత తక్కువైన చోట్ల `విభ్రమము'లో తొమ్మిదో ఖండము (1925 ప్రతి) `మినుకు మినుకని చుక్కలు' అని ప్రారంభించి, కలవరంబున పారు బందరు కాల్వనూ, కృష్ణవేణీ మహాపగా గీతరవమునూ వినిపించి, ఆప్త వాక్యములతో అవతరించిన ప్రణయమునకు కదిలించి విజయవాడ పురమ్మును వీడి, కృష్ణవేణీ మహాతరంగిణి దర్శించి దక్షిణాపథ వర్తియౌనట్లు విసరును. కరస్పర్శలో తన్మయత తోడ నర్ధారాత్రము వరకూ నవ వినోద కథా పఠనములో నలసి కారాగృహములోని అరుగుమీద నిద్రించిన కవిని శీతల కరస్పర్శతో లేపి కాశ్యపీపతనోన్ముఖమైన ఆయన కాయమును కాపాడిన కవిపత్ని యొక్క దివ్యమూర్తి అదృశ్యమయ్యినా మన హృదయాల్ని జల్లు మని పిస్తుంది. పురాణభట్టు `హరి జగత్కర్త' యని వదలి`హరికి భర్త ఈశ్వరుడని' చెప్పని కారణము చేత ఆ `భవి' శిరముద్రుంచి శోణితాక్త శరీర సంశోభియగుచు `జయ బసవలింగ' నందికేశ్వర కుమార `శివ భవానీశ' యని తాండవము చేస్తూ వీరశైవుడు కక్కయ్య మనకు అచ్చెరువు కలిగిస్తాడు. ఈ మూడు ఖండ కావ్యాలూ చదువరిని ఉన్న చోటునుంచే పట్టిలాగి భావాల మెట్లెక్కించి, ఆమోదములో, అచ్చెరువులో, వదుల్తాయి. ఖండ కావ్యాలు ఈ రీతిగా భావాల నిశ్రేణినీ కొసాకి భావావేశాన్నీ కలిగించేటివి - మానవ హృదయం మీద ప్రభావము కలిగి ఉండడమువల్ల - కలకాలమూ రసజ్ఞుల సారస్వతంలో నిలుస్తాయని నా నమ్మకము.

శివ శంకర శాస్త్రిగారి `హృదయేశ్వరి' అనుభవాన్ని బట్టి రచించిన కావ్యమే కావచ్చును. వారి వర్ణనా పద్ధతి మాత్రము సంస్కృత ప్రబంధ, సంప్రదాయాన్నే అనుసరించింది. పౌరాణిక గాథా సన్నివేశాల్ని వారు అందపు సామాగ్రిగా పోలికలకూ వర్ణనలకూ వాడుకున్నారు. జలజములూ, చకోరములూ, పద్మపాణులూ, అంచనడలూ, ముఖాంభోజాలూ, సంజీవనీ అమృత బిందువులూ, హరి విలోకనాలూ, కువలయములూ, గాత్ర లతికలు, ఆర్ణవ నౌకలూ, సంసార జలధి, శిరీష పేశలత్వమూ కళింద సుతాతరంగాభి రామకేశ సంపద నూటికి తొంభైతొమ్మిది పాళ్ళు ప్రాచీన గ్రంథ పాఠకులను అతి పరిచితమైన సుందర సామాగ్రినే వాడుకున్నారు. శివశంకర శాస్త్రిగారు`హృదయేశ్వరి' అయితే దీనిలో స్ఫురించిన కొత్తదనము ఏమిటంటే, హృదయేశ్వరిని `అమ్మ' అని సంబోధించి అంకితమివ్వడము. అప్రాప్త మనోహరినెంచి, ఆమె పరిచయ సౌందర్యము వల్ల `మనమ్ము లీనమై మాటు వడిన కవితా ప్రవాహము వెగ్గలించి'న కారణము వల్ల కవియామెను దేవీ పదమున కెత్తి కూర్చుండబెట్ట

వచ్చును. కాని ఆ వ్యాఖ్యానము చెయ్యాలంటే హృదయేశ్వరి కావ్యము విభ్రమ విరహవీచి హృదయ శాంతి ఉచ్ఛ్వాసాలతో పూర్తి అయి ఉండాలి అనిపిస్తున్నది నాకు. గీతావళిలో ఛందస్సు మారిందీ, సుఖ స్వప్నము శుభస్వప్నము. కనుక `హృదయేశ్వరిని' మూడాశ్వాసాల కావ్యముగానే చూస్తున్నాను నేను. 1952 ముద్రణములో `గీతావళి' వైతాళికముగానూ, సుఖ స్వప్నము శుభ స్వప్నముగానూ మారి ఆ రెండు ఉచ్ఛ్వాసాలూ స్వప్న ప్రాయములేనని సూచిస్తున్నాయి అంటున్నాను.

కాగా హృదయేశ్వరిలోని నవ్యత అనుభవ వర్ణనమూ, గీత పద్య స్వీకారమూను. గీత పద్యాన్ని శివశంకరులు పూర్తిగా స్వాధీనము చేసుకున్నారు. అక్కడక్కడ చెప్పదలచిన భావము ఒక పంక్తి దాటి రెండో పంక్తిలోనికి తీసుకుపోయినా మొత్తము మీద పంక్తి పంక్తికీ కావ్య రచన - సంస్కృత యతి దగ్గరవలె - ఆగి నడిచిందీ, రాయప్రోలు వారి కవిత్వ ధోరణులు లేవు. కనుక చక్కగా అర్థమవుతూ సాగిపోతుంది ఈయన రచన. తక్కిన కవులు గీత పద్యాన్ని కూడా వాడినారు, కాని ఈయన గీత పద్యాన్ని మాత్రమే వాడినారన్న నమ్మిక కలిగించేటంత ఎక్కువగా వాడినారు. వారు రచనా వ్యాసంగము చేయ నారంభించిన తొలి రోజులలో తెనిగించిన తేజసింగులో "జరుగ నున్నదియట పుష్ప పరిణయంబు, వరుడు వేరెవడును కాడు వాయురాజు, మొదటి నుండియు పెండ్లికై మొత్తుకొనెడు బంభర కుమారుడందులో పాటగాడు" అంటూ గీతమునే సరళాతి మనోహరముగా నడిపించారు. వారు హృదయేశ్వరి తరువాత రచించిన కావ్యాలలోనూ, సమకాలికుల రచనలలో కానరాని ప్రసన్న వేగము చక్కగా గోచరిస్తుంది. వారి ప్రభు వాక్యము గేయరచన, అమోఘము. ఇందాకా చెప్పిన మూడింటితోపాటు ఏ ఖండ కావ్య సంకలనములోనైనా చేర్చవలసినట్టిది. వారి పెట్రార్కా, మేడూరి వారి కోడలు, మన మాటలే కావ్యములుగా తీరిన రచనలు. రచనా సారళ్యములో ఈ నాడు శివశంకరుల కుద్దీలుఎవరు ? అని ప్రశ్నవేస్తే జవాబు రావడము కష్టము. మళ్ళీ ఆశు `రచన'కూ వారి రచనకూ చాలా అంతరము!

**-భారతి, జూలై - 1963**

# 9. ఆధునిక కవిత్వము

కొంపెల్ల జనార్ధన రావు గారిని మాన్యశ్రీ రాధాకృష్ణన్ పండితులు `ఆధునిక కవిత్వమంటే దాని తత్వమేమిటి? అని అడిగేరట. ఆ రోజులలో(1925ప్రాంతము)చాలా మంది ఇలాటి ప్రశ్నలే అడిగేవారు. విశ్వవిద్యాలయాధ్యాపకులు `ఆధునిక కవిత్వము, అయితే గియితే, క్షీణయుగ కవిత్వము మీద తిరుగు బాటు మాత్రమే' నని ఇంచుకంత దాక్షిణ్యము చూపించేవారు. యెంకి పాటలను సమర్థిస్తూ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులు గారు వ్రాసినదీ , ఆధునిక కవి పండితులు సభాముఖాన్నా, గ్రంథ పరిచయాల్లోనూ చెప్పిన విమర్శలూ మించి, ఆధునిక కవితా వివరణ రావసినంత రాలేదు. ఏ వాఙ్మయ చరిత్రలోనైనా, పురోగామి ఉద్యమాలు వెంటే గుర్తించ బడలేదు. కీట్సుకవి విషాద మరణానికి కారణమైన పండిత విమర్శలు చూడండి. చుట్టు చూపు ఉండిన పాశ్చాత్యుల వాఙ్మయాలలోనే నవీన పద్ధతులను గుర్తించలేక ఆచారాభిమానులు బండ విమర్శలు చేశారంటే, చిరనిద్రలో నుంచి మేల్కొని చైతన్య వంతములైన రచనలకుద్యమించిన చిన్న వాఙ్మయాల సంగతి చెప్పేదేమిటి?

చిన్న వాఙ్మయమన్నానా? అవును, తెలుగు వాఙ్మయము వయసులో పెద్దవాఙ్మయమైనా ఒడ్డూ పొడుగూలో ఆంగ్ల వాఙ్మయము కంటె చిన్న వాఙ్మయమే. ఏనాడో రేనాటి చోళుల అభిమానము వల్ల శాసనాలలో ప్రవేశించి పెరిగిన తెలుగు వాఙ్మయములో ఇంకా ఆరుశతాబ్దాలు గడిచి పోయిన తరువాత వెలసిన ఆంగ్ల వాఙ్మయము గ్రహించవలసిన రీతులేవి? సంస్కృత పురాణాల అనువాదాలలో ప్రారంభమైంది బహుళాంధ్రోక్తిమయ ప్రపంచము! "స్వేచ్ఛాను వాదము" (rendering into Telugu) అని పెద్ద అక్షరాలతో వ్రాసి పెట్టుకున్నా ఇది మూల గ్రంథ పుటంతస్థును అందుకోలేదు. కథ, పాత్రములూ, పాత్ర పోషణమూ, సన్నివేశాలూ అనువాదకునివి కావు. ఆంధ్ర భారతమును తెలుగులో అందంగా చెప్పే యత్నంలో కథా సరళి కోసమూ, విసుగును తగ్గించడము కోసమూ, నుడికారపు సొంపు కోసమూ,

(ఏకంతో) తెలుగు పద్యంలో ఇమడ్చడము కోసమూ కవుల ప్రయత్న పూర్వకంగా కొంత అక్కడక్కడ మారిందీ, ప్రబంధ ఫక్కీగా రచించడములోనూ సమకాలిక అనుభవాలు ఇమడ్చడములోనూ యదాలాభంగానే మూలము కంటే భిన్నంగా కొన్ని చోట్ల సాగింది. మనము ఇంత మాత్రంతో సంతోషించుకుని భారతాదులు స్వతంత్ర గ్రంథములే అనడము మనకు ఆ కవుల యెడనున్న గౌరవాన్ని తెలుపుతుంది గాని సత్యాన్ని సూచించదు. చెప్పినది సంస్కృత మూలమున్న పురాణాల్నే అయినా చక్కగా చెప్పినందుకు మనము ఆ కవులకు `ఆదికవి' అనీ `కవిబ్రహ్మ'అనీ `ప్రబంధ పరమేశ్వరుడనీ' అగ్గించుకోడము మన దేశంలో చెల్లుతుంది గాని అద్భుతమైన మౌలిక రచనలు వెలసిన పాశ్చాత్య దేశాల్లో చెల్లదనే అనుకుంటున్నాను. మన వాఙ్మయ శోభ వారికి చెప్పడము ప్రారంభిస్తే వారందర్నీ `చెప్పడంలో నేర్పుగా చెప్పిన కవులు' అనే చెప్పుకోగలం గాని ఇతర భాషల్లోకి మార్చుకోవలసిన మౌలిక వాఙ్మయానికి కర్తలని చెప్పుకోలేము.

మనవారి పరిగణనలో, చక్కగా చెప్పగలిగినవాడు కవి; వస్తు సృష్టితో నిమిత్తము లేదు. నాథుడు తన రచనను `ఉద్దండలీల' `సూక్తి వైచిత్రి' `ఉభయ వాక్ప్రౌఢి' గల రచనముగా గొప్ప చెప్పుకున్నాడు. (కథా -, సన్నివేశ-, పాత్ర-, సృష్టి సంస్కృత కవిది అయినపుడు `రసాభ్యుచిత బంధము' తెలుగు చేసిన వారిదేనని అనలేము కదా?) ఆయన గొప్పదనము కూడా `ప్రౌఢి' `పలుకు నుడికారమూ'నే. పెద్దన గారు `చతురవచోనిధి'. `పెద్దనబోలు పండితులు పృథ్వినిలేర'న్న కీర్తిని గన్నవారు. ఆయన `అల్లికబిగి' కవులను కూడా ప్రత్యేకముగా ఆకర్షించింది. ఆయన కాలములో రాజసభలలో కవులకు జరుగుతూండిన పరీక్షలు చెప్పగల చమత్కారములోనే. నగరు, తగరు, తొగరు, వగరు అన్న మాటలను ప్రాస స్థానాల్లో ఉంచి మూడు పురాణాల పరంగానూ పద్యాలు చెప్పడమూ, కుక్కుటము వంటి పరిచిత పక్షి-, జంతు-, జాలము మీద పద్యాలు చెప్పడమూ, సమస్యలు పూర్తి చేయడమూ, ఇవే సాహిత్య సభావినోదాలు. కవులు ప్రాకృత సంస్కృత ఘూర్జర భాషలు నేర్చి ఉండాలి. ఆద్య సత్కథలను రచించినా అందులో కవి కల్పనా విశేషము ఉండాలి. అక్కడ కూడా కవి మాటకారితనానికే గౌరవము. అష్టాదశ వర్ణనలూ కవి యెంత చమత్కారంగా నిర్వహించాడూ అన్నదే ఆ నాటి రసికులు గమనించినది. కథా కల్పనతో నిమిత్తము లేదు. కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములు. వర్ణనలు కథా వస్తువుతో సంబంధించి ఉండనక్కర లేదు. ఒక ఊరు , మేడలూ, నాలుగు వర్ణనలూ, వారాంగనలూ, పుష్పలావికలూ, వేట, దాని సరంజామా, కథ కోసము కాదు రచన. కథా సన్నివేశము ఒక కడకు తెచ్చి కవి సాయంకాల, చంద్రోదయాది వర్ణనలు చేసుకుంటూ హాయిగా పాండిత్యము ప్రదర్శించుకుంటూ సాగిపోతాడు. పెద్దన గారి

లాంటి వాడు కూడా ఏ కాదంబరి నుంచో ధారాళంగా తెచ్చుకోవడము `కొరతంబడ' డమనుకోలేదు. చక్కని సత్యా పరిణామ గాథను స్వీకరించిన నంది తిమ్మన గారు ఆ పరిణామాన్ని తప్పింపచేసి, స్త్రీల పాటల `తులసి దళము' పాటి పరిణామ సౌందర్యాన్నైనా తేలేకపోయారు. గొప్ప గొప్ప సంస్కృత నాటకాలూ- శాకుంతలము లాంటివి - కూడా పల్చబడిపోయాయి. `ప్రబంధ రూపములో'. సూరన్నగారంతటి కవి ఇటునుంచి చదివితే తెలుగూ అట్నుంచి చదివితే సంస్కృతమూ అయ్యే పద్యము చెప్పుకున్నాడూ,సులువుగా శ్లేషను సాధిస్తానని చూపడానికి శ్లేష ప్రబంధము రచించాడు. దేశము ఈ నాటివలె ఒక్కటిగాలేదు. అక్షరాస్యులు చాలా కొద్ది. ప్రజల రుచితో ప్రసక్తే లేదు. రాజసభయే తప్ప కవికి శరణమే లేదు. ఇక తెలివి తేటలు ప్రదర్శించడము కంటే,`రమ్మున్నారా, కమలమ్ములున్న చోటికి భ్రమరమ్ముల' అని చమత్కరించడము కంటే కవి ఏమి చెయ్యగలడూ?

దక్షిణాంధ్ర వాఙ్మయంలో శృంగారము స్త్రీల కావ్యాలలో కూడా అతి నగ్నంగా విహరించింది. కరుణ మానవులందరికీ సర్వ సామాన్యమైనా, శృంగారమే `పాకాన్నపడు'తుం దని రసికుల నిర్ణయము. అష్టభాషారచనల భేషజాలూ, శబ్దాలంకారాలూ బంధ గర్భ శ్లేష చిత్ర కవిత్వాలూ విజృంభించాయి. ఆశుకవిత్వాలూ ఏకాక్షర ద్వ్యక్షర రచనలూ ఉత్తరాంధ్ర కవులు స్వీకరించిన దయ్యపు కథల్ని పట్టి రచన చేశారు. సైనికుడు కత్తినీ రచయిత కలాన్ని నమ్ముకొని గొప్పలు చెప్పుకుని బ్రతికేవారు. ఇద్దరికీ ఉదరపోషణ మాత్రమే ఆశయము.... ఏతావాతా చెప్పవచ్చేది ఆ వాఙ్మయంలో యశసేర్థకృతే ఆశయాలతోనే గాని సద్యఃపర నిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే ఆశయాల మౌలిక కావ్యాలు లెక్కపెట్టదగినన్ని రాలేదని. ప్రభావతీ ప్రద్యుమ్నము లాంటి చక్కని కావ్యాలు కవులకు ఒరవడి కాలేదు. పారిజాతాపహరణమువలె కథను చెపుతూ ప్రారంభించి చదువరిని ఆకర్షించగలిగిన కావ్యాలు ఆ ఒక్క ఆశ్వాసమూ గడిచాకనే మార్చేసాయి. కావ్యంలో మహా ఉంటే ఏ పాతిక పరక మేరకో చదువరి ఆపేక్షను పోషించే రచన ఉంటే అబ్బురము. తక్కినదంతా రచయిత పాండిత్య నిక్షేపమే. చిన్నచిన్న రాజ్యాలుగా పలువురి పాలన క్రింద ఉన్న దేశంలో ఇది సహజమే ప్రతీకాలములోనూ ఆ కాలపు మేధావుల `ఉత్తమ' రచనలు వస్తాయి. వాఙ్మయములోని ప్రతీ మెట్టూ దాని వెనక మెట్టుకన్న ఎత్తయినదే ఏదో అంశంలో. అయితే రాజును పొగడి మెప్పించడమూ, పాండిత్యము చూపి మెప్పించడమూ మాత్రమే ఆనాడు ఇంటికి బయట కవికి అందిన అవకాశాలు. తనంతట తాను ఆశయ సాఫల్యానికో, భక్తి సంతుష్టికో రచించిన శతకాల్లో మాత్రము తెలుగు కవి కొంత కొంత సద్యః పరనిర్వృతీ, శివేతర క్షతీ, ఉపదేశమూ చేశాడనిపిస్తుంది. ఆ మధు బిందువులను తేనె పెరలని ఎట్లనగలమూ పరజాతులకు, ఇదీ మావారి రచన అని శతకాలలోని పద్యాలను మూటలు కట్టి ఎలాగ అందించగలమూ?

ఆంగ్లపాలనమూ, ఆధునిక యుగమూ వచ్చాయి. ప్రభువులు, పండితులూ మాత్రమే కాక, ప్రజలూ కావ్య పాఠకులలో చేరేరు. పూర్వము పుస్తకాలు అమ్ముకోలేదు కవి. ఎవరైనా తాటాకు ప్రతి వ్రాసుకుంటానంటే మహాభాగ్య మనుకునేవాడు. "దీని వ్రాయ జదవ నైహికాముష్మిక ఫలంబులందు నరుడు" వంటి ఫలశ్రుతి వాక్యాల కవసరము నాడుండేది. ఈనాడు అచ్చుకూటములు వచ్చాయి. వేలాది పాఠకులకు ఒక్కమారే అందుతాయి రచనలు. నాడు కంటే నేడు ప్రజాసభల కవకాశము లెక్కువ. వ్యక్తుల రుచి భేషజానికి కాక సమాజపు రుచి సామరస్యానికి గురిచూచి రచన చేస్తేనే ఈనాడు కావ్యాలు చదువుతారూ, మెచ్చుకుంటారు. `సేతు శీతాచలేంద్ర మధ్య నవ్యధాత్రీ జనైక కంఠ్యప్రణీత జయజయధ్వానములు' ఏనా డెరుగుదుమూ? ఈ జన బాహుళ్యాన్ని పలకరించడానికి రచయిత పాండిత్య ప్రకర్ష కాక, చదువరికి అనుభవమూ, ఆనందమూ కలిగించె రచన కావాలి, ఆంగ్ల కవిత్వములో అలాటి రచనలు కొల్లలు. రామలింగారెడ్డి, రాయప్రోలు ప్రభృతులు ఆ పద్ధతులలో, ఆ కథలూ, తమ కథలూ వివరించారు. మేధా వసువురెడ్డిగారు అకుంఠిత తర్కముతో కవిత్వ తత్వ విచారము చేశారు. కీట్సూ, షెల్లీ కవుల కావ్యాల్ని కొందరు తెలుగు చేశారు. యథాశక్తి సంవత్సరాది సంచికల్లో కొందరు స్వంత రచనలు చేశారు. వందేమాత రోద్యమంలో భావ స్వాతంత్ర్యము మొలకలెత్తింది. ఠాగూరు కవి అమృత నిష్యంది భారతీయవాణి పాశ్చాత్యదేశాల్లో ముఖరితమైనది. గురజాడ కవి కవితా సామగ్రీ, ఛందస్సూ, వర్ణనా పద్ధతీ, భాషావేషమూ మార్చి ఆదీమధ్యమూ అంతమూ గల ఖండకావ్యాలు ముత్యాలసరాలూ, కన్యక, డామన్ పిథియనూ, పూర్ణమ్మా, లంగరెత్తుము రచించారు. ఇవి సద్యఃపరనిర్వృతి కలిగించే కావ్యాలు. కవిత్రయమువారి ప్రబంధమండలి వ్యాసునిది తెలుగువారు`మా జాతి సృష్టి' అని చెప్పుకో వీలైనది కాదు. అది పెద్ద సత్రములాంటి భవనము, మన స్వంతము కాదు. గురజాడవారు నిర్మించిన పర్ణశాలలు మనవి. ఇతరుల నిర్మాణ పద్ధతులను విమర్శగా పరిశీలించి చేర్చిన రీతులలో చేసిన రచనలే గాని అనుకరించినట్టివి కావు. మను చరిత్రాదులు సంస్కృతకవుల కల్పనల దారిలో ఉత్ప్రేక్షలూ, అతిశయోక్తులతో రాజసభల కుద్దేశించిన రచనలు. చెప్పే రీతిని వెలయించే రచనలే గాని చెప్పే కథను గాని, సందేశమును గాని వెలయించే రచనలు కావు. విజయనగర సామ్రాజ్య కాలానికి అన్ని కళలలోనూ విజృంభించిన `బరోఖ్'(అతి అలంకార భార) పద్ధతిలో రాతి యేనుగుల్లాగ తీర్చి అలంకరించిన రచనలవి. కొయ్యబొమ్మ లన్నారు గురజాడవారు వాటిని. పరభాషలలోనికి అనువదించుకుని చూస్తే తెలుస్తుంది వాటి `సౌందర్యము' ఎంత పరిమితమో. గురజాడవారి రచనలు ఏ భాషలోని కనువదించినా వాటి కాళ్లమీద అవి నిలబడగలవు. (కవి విమర్శకులు గురజాడకూ వర్డ్స్వర్తుకూ పోలికలు చూపుతున్నారు.

అవి యదాలాభములేగాని యత్న ఫలితాలు కావు. గురజాడ సంస్కారి, కవిత్వ రచన ఆయనకు సాధన సామగ్రిలో ఒకటి, సాధ్య ఆశయము. నాటకానికీ చిన్నకథకీ, కావ్యానికీ, వ్యాసానికీ, విమర్శకీ వాడుకభాష అనుకూలమే అని నిరూపించడమే ఆయన ఆశయము. ఆ అనుకూల్యమును నిరూపించడము కోసము రచించిన ఖండ కావ్యాలలో అయన వాడుకభాష పాలు క్రమంగా ఎక్కువ చేశారూ, ఆ మాట చెప్పుకున్నారు కూడాను. వర్డ్స్వర్తు నూటికి నూరుపాళ్లు కవి. సరళ భాషలో సాయిలా పాయిలా మాటలలో కవిత్వము రచించడమూ, మెప్పించడమూ సాధ్యమే అని నిరూపించడము కోసము ఆయన తన ఖండ కావ్యాలు వ్రాశారు. ఆయన కుసంస్కారి కాదు. సంస్కారము ఆయన ఆశయాల్లో గౌణము. గురజాడకు కవితారచన గౌణము. వర్డ్స్వర్తు వెంట బెట్టినది సౌందర్యాన్ని. గురజాడ గురిచూచినది సంస్కారాన్ని. ఆయన కాంతా సమ్మితోపదేశము చేశారూ, ఈయన సుహృత్సమ్మితంగా ప్రబోధించారు. భాషా సంస్కారము కోరి గురజాడా, కవిత్వ సంస్కారము కోరి వర్డ్స్వర్తూ చేసిన పనులలో సామరస్యమున్నా గురజాడ ఆయనను అనుకరించె ననడానికి సాక్ష్యము చాలదనుకుంటాను.) ... రాయప్రోలువారు తెచ్చిన నవ్యత ఆదర్శములో "ప్రేమ విహ్వలత నిరాశకు రాచబాట అనుకునేరూ, కాదు. కానేకాదూ, అది త్యాగముగా ఫలింపగలదు." అని వారి తొలి కావ్యాల సందేశము. ఇది ఆంగ్లుల నుంచైతేనేమి, రవీంద్రుని నుంచైతే నేమి, వారు తెచ్చారు. మేధావసువు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ఈ దశపరిణామాన్ని మెచ్చుకున్నారు. ఆ తరువాత కూడా ప్రేమపుష్పదళాల సుగంధాన్ని విరజిమ్మే కావ్యాలే వ్రాశారు రాయప్రోలువారు. ఒక్క శాలీనుడు తప్ప అలంకారాలు మరుగుపరిచే సౌందర్యాన్ని గుర్తించినవారు లేకపోయిరి మన వాఙ్మయంలో. ప్రేమయోగి ఎక్కడినుంచి వస్తాడూ?

కవిగారి ఘనతను చూపించడానికి కాక చదువరి హృదయ పరివర్తనము కలిగించడానికి చేసిన రచనలు `అభినవ కవిత' అని తేల్చారు రాయప్రోలువారు, `అభినవ కవితామండలి' ప్రారంభించి. కొయ్యబొమ్మల్ని కాక కోమలుల్ని నిర్మించండని గురజాడవారు ప్రబోధించారు. రవీంద్రుడికి ప్రపంచ సన్మానము వచ్చింది. ప్రపంచ యుద్ధముతో దేశ దేశాలా రాజకీయ ప్రబోధము కలిగింది. వెయ్యి గొంతుకలు విచ్చి మ్రోశాయి. పల్లెపట్టు సౌందర్యము, జీవితంలోని రస ఘట్టాలూ, పౌరాణిక సన్నివేశ మాధుర్యమూ, కర్షకుల ప్రేమ, పలకరించే ప్రతీ సౌందర్యమూ, కవితా సామగ్రే అయింది. సమాసాలూ, విపరీతాలంకారాలూ, గుక్క తిరగకుండా ప్రవహించే నిరంతరాయ వృత్తాలూ, భాషా భేషజాలూ తగ్గేయి. ఎవరు పట్టితే వారు తమకు స్వాధీనమైన ఛందో ధోరణిలో తోచినంత అందంగా రచించ నారంభించారు.

ఇది తిరుగుబాటే, పెద్ద తిరుగుబాటు. ఇన్ని ప్రబోధ పరిస్థితులు తెలుగు దేశములో ఎప్పుడు వచ్చాయి? ఇంత మార్పు కవిత్వంలో ఎప్పుడు వచ్చిందీ? విశ్వసాహిత్యానికి `ఇదిగో' ఆంధ్రుల ఉపద' అని ఇవ్వడానికి ఇపుడు వచ్చినంత కవితా వస్తువు ఇదివరకు ఎప్పుడు వచ్చిందీ? బలవంతములైన సంకెళ్లు తెగిపోయాయి. 1910లో గురజాడతో ప్రారంభించిన చైతన్యము, ఆయన సూచించిన దారులలో సాగకపోయినా, ఒకొక్క కవి ఒకొక్క శాఖని పెంచుకుంటూ పోవడముతో సుమారు 15 సంవత్సరముల కాలంలో కవిత్వ సమయాల బిగుతును సడలించి కవిని నైసర్గికమైన చైతన్యంతో విరాట్పురుషుని సుందర రూపము ముందు నిలబెట్టింది.

"ఈ తిరుగుబాటు క్షీణయుగ కవిత్వమ్మీద" ననడము చక్కగా విలువ కట్టలేకా, కట్టడము సయించకా దాటుకుపోవడ మవుతుంది గాని, సద్విమర్శ అవదు. పూర్వకవుల వర్ణనలలోని చంద్రుణ్ణి చూడండి: `ముక్కంటి తలపువ్వు మున్నీటిలేబట్టి కైట భారాతి డాకన్ను దమ్మి' అని శ్రీనాథుడు; `కలశపాథోరాశి గర్భవీచిమతల్లి కడుపార'... గన్నకొడుకు, అసలాక్షు ఘన జటావన వాటికి... అనార్త వంపు బువ్వ' అని పెద్దన; `చరమాద్రి దావాగ్ని సంప్లుష్ట సురసౌర భేయీ కరీ షైక పిండమ'ని నంది తిమ్మన; `చలువ వెలుంగురే మగడు జక్కన నెచ్చెలి జోడు కోడె చుక్కల జవరాండ్రలో ననువుకాడు జగంబుల చూడ్కి విందు" అని అయ్యలరాజు; "కుముద నవాళికిన్ బలుపు కోకము లాటకు నిల్వు, దిగ్వధూ సమితికి బూత" అని మరొకరు! గాథా వ్యక్తుల బాంధవ్యపు టచ్చులలో తీర్చిన రచనలే అన్నీ. ఆధునికుల రచనలు వినండి: నీలాభ్ర సరసిలో నిండు జాబిల్లి రాయంచవలె విహారము సల్పుచుండె' నని కృష్ణశాస్త్రి; తాడి వనమున ఆగి చంద్రుడు తాను చెవియొగ్గెన్' అని వేదుల; `తెప్ప నోలిక చంద్రబింబం తేలిపోతూ ఉంది నింగిని' అని విశ్వేశ్వరరావు; `చందమామ విరుగబడి విరుగబడి వెసనవ్వు చున్నాడు' అని పుట్టపర్తి. వెన్నెలను `శీత చంద్రాత పాంతారాళ రమణీయ రజత తల్ప'మని కృష్ణశాస్త్రి; `మోహినీ సాట్టహాస కోలాహలములు' అని వేదుల; ఆకాశపు ఎడారి అంతటా నిండి ఈ రేయి రేగింది ఇసుక తుఫాను' అని శ్రీ. శ్రీ; వేయి సుపర్వ కాంత లొక పెట్టున మౌనగీతి దెసలంట నుయ్యేల లూగె' నని భమిడిపాటి రామ సోమయాజులు. నేటి కవి స్వంత దృష్టితో తన కనుభవమైన ఆనందాన్ని వర్ణిస్తాడు. ఊహించేపట్ల ఎవరి ఊహ వారిదే. శివతాండవాన్ని వర్ణిస్తారు వినండి: "నొసట కొసరిన మూడో కన్ను నివురు లూదిన కొలిమి దెగడి వెగడి ద్రిప్పింది అని కవికొండల; నొసట జేగురుకంట మసలి రేగిన మంట పశ్చిమాంగణమంత ప్రసరించు నెరపంజ' అని కందుకూరి రామభద్రరావుగారు; `ఎగుర గొట్టబడ' విడిన జుట్టుముడి నల్లగట్టు లాగు గనుపట్టు; గిరుల నట్టనడి దుముకునట్టి అట్టహాస నదిగట్టు ' అని పఠాభిగారుసు... వస్తువులో ఐక్యము వర్ణనలో విభేదమూ రెండూ

ఉంటాయి. గోదావరిని గూడ `ఉప్పొంగిపోయింది. గోదావరీ తాను తెప్పున తేలింది గోదావరి అని బాపిరాజుగారూ; `రాజ నరేంద్ర సామ్రాజ్య వైభవ రమాదుల కనులతో గన్న భాగ్యశాలినివి' అని రామభద్రంగారూ; `భద్రగిరి రామ పాదుకా స్పర్శనంబు గణన కెక్కి కోటిలింగాల పూజ, కలిగి' న దని జాషువా; `భద్రాద్రి రఘునాథ పావనసేవనా పాదియౌ విష్ణు పాదోదకమ్ము' అని ఇంద్రకంటీ వర్ణిస్తారు. ఓరుగల్లు కోటలో `అది తటాకము కా దాంధ్రకుమార, అరివీర దుస్సాధ్యమైనట్టి పరిఘ అది కుంకుమము కాదాంధ్రకుమార, తెలుగు నెత్తుటి గడ్డ రేగిన దుమ్ము' అని శేషాద్రి రమణ కవులూ; `అల్లుని కోసమై నెల్లూరి నెరజాణ పఠియించె నిచ్చోట భారతంబు' అని దేవులపల్లి రామానుజరావుగారూ.

భేదము మాత్రమే కాదు వైరుధ్యమూ ఉంటుంది ఇద్దరి ఊహలకు. ఓరుగంటి నందిని చూచి విశ్వనాథ వెంకటేశ్వర్లుగారు `మోము మలంచి దుఃఖమున మున్గిన నీ యెద రాయిగాగ నే బాముల నెంచు కొంచు గడ బారెదవో, యరి యోరుగంటి రాష్ట్రీ మహనీయ హస్తమున చెందిన దానిగ గంగడోలు భాష్పామితవారి నల్లబడి పాకుడు పట్టినదే వృషేశ్వరా" అని పలవిస్తే, జాషువా గారు `యెమ్ములను పిండి మూలుగ లిగిరిపోవ కృషి యొనర్చెడు పశువుల నెండగట్టి రాతినందికి గంధపు బూతబూసి మ్రొక్కుచున్నది భువనంబు మోకరించి' అని యీసడిస్తున్నారు. కృష్ణశాస్త్రి `ఆవరింతువు ప్రతి దివసాంతమందు నిత్య నూతన తాండవ నృత్య కేళి, ఓయి నటరాజ తలలైన నూపలేక భువనములు దుర్భరానందమున మునంగ' అని కీర్తిస్తే, కొడాలి ఆంజనేయులు `పశ్చిమాశా ముఖాంత గహ్వరమునందు గాఢ నిద్రాణమైన యేకాంతశిలకు పూలతావులతోడ కర్పూర దీప గీతములతో దివ్య ప్రభాతమయ్యె! భీకర వనమృగా భీల ఘోషణము కదలి మెదలి యెరుంగదు కల్పములకు, బ్రాహ్మణోపనిషద్గాథ పఠనములకు జడత మానునోయేమొ ఈ చలువరాయి' అని సవాలు చేస్తున్నారు. కొడాలి ఆంజనేయులుగారు `కాశీ రత్న పూసేచోట, పందిరి ద్రాక్షలు ప్రాకే చోట, కొండకోనలో గంగాజలములు మిలమిలలాడుతు మెరసేచోట కలకల లాడే కవితాకన్య' అంటే, తురగా వెంకట్రామయ్యగారు `కడుపుమంటల కింత గంజియైనా లేని చిరుత బిడ్డల గోల భరియించగా లేక ఉరిపోసుకొనునట్టి ఇల్లాలి కడుపులో కుండమ్ము నీ వీణ చల్లార్చునా కవి' అని సవాలు చేస్తున్నారు. ఈ రకపు వైవిధ్యము చైతన్యానికి లక్షణము. ఒకే కవికి వేర్వేరు క్షణాల్లో భావ భేదము కలగడమూ ఉన్నది. ఇంద్రకంటివారు కవితా సుందరిని"రావే బర్హి శిఖాచకచ్చకితనేత్రా" అని వెన్నెల రాత్రిలో ఆహ్వానించనూ ఆహ్వానించారూ, ఇంకొకమారు తేనె పాట కవిగారూ, ఈనాడా మా కోతలు, మా జీవన యాత్రా యాతన కలిగించుకు తెలిగించని మహాకవీ జహాపనా మోయలేమయ్యా - నీ పల్లకీ" అని నిర్మొగమాటంగా

దులపనూ దులిపేరు. జాషువాగారు `గాలలియ సముద్ర కల్లోల పంక్తిని గద్దించు... అధికార రేఖను' మన్నించారూ, `ఈ రహదారిలో నడువు మీశ్వర దర్శన మబ్బునంచు నాధారములేని పుక్కిటి కథల్ వినిపించెడి మోసగాణ్ణి'ఈసడించారు. వేదులవారు`మానవుల ఆశలతో విధికిన్ నిరంతరానీకము సాగు నీ కటిక నేల'ను తేలికగా తీసేశారూ, `మోహినీ సాట్టహాస కోలాహలములు పండువెన్నెల లలమిన బ్రహ్మాండ'మును చూచి కీర్తించనూ కీర్తించారు. కృష్ణశాస్త్రిగారు ఆత్మవిశ్వాసముతో `ప్రళయ ఝుంఝూ ప్రభంజనస్వామి నేను, మోహన వినీల జలధర మూర్తి నేను' అని చెప్పి, ఇంకొక పరిస్థితిలో `రాజ రాజేశ్వరుడ వీవు ప్రభుడ వీవు, వీధి వీధుల వాడల విపినములను, భిక్షుకుని బోలె తిరుగాడు 'పేదనోయి' అనీ వినమితులయారు. జీవనానికి వైవిధ్యము ఒక లక్షణము. ఆధునిక కవిత్వముతో భావ వైవిధ్యము విరివిగా గోచరిస్తూన్నది. భావ వైవిధ్యములో ఉన్న శక్తి కల్పనా వైవిధ్యానికి లేదు. ప్రబంధ కవిత్వములో కల్పనా వైవిధ్యము చంద్రుని మచ్చ, చీకటి వంటి వాని వర్ణనలలోనూ, రచనా వైవిధ్యము చాతుర్వర్ణ్యమూ, పుష్పలావికలూ, సౌధరాజములూ వంటి వాని వర్ణనల లోనూ గోచరిస్తుంది. ఈ వైవిధ్యము కవుల భావచైతన్యాన్ని కాక మేధా చైతన్యాన్నే ఎక్కువగా చూపిస్తుంది. ఒక నమూనా నుంచి వేర్వేరు నమూనాలను నిర్మించడము చైతన్య లక్షణము కాదు. ఆచారాభిమానమే అవుతుంది. చేసినంతలో క్రొత్త సృష్టి చెయ్యడము చైతన్య లక్షణము. అది ఆధునికులలో కనబడుతుంది. భైరవ కవి శ్రీరంగ మహాత్మ్యము చూడండి, ఒక్క సీసపద్యపాదము, `ఎందు నెవ్వాని చరణారవింద రజము పేర్మి గౌతమ సంయమి పెండ్లిపెద్ద' అన్నది తప్ప మనలను పలకరించే పంక్తే లేదు. ఎందుకా ఏనుగుకాలిరచన? `నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నే నెగిరిపోతే నిబిడాశ్చర్యంతో నీరూ, నెత్తురు కక్కుకుంటూ నేలకు నేను రాలిపోతే నిర్దాక్షిణ్యంతో వీరే!' అన్న శ్రీ శ్రీ రచన చాలు, ఆ మొత్తపు పుస్తకం కంటె బరువుగా తూగడానికి. నాటికి నేడు ప్రపంచ మందు తెలుగుకవి యాచకుడుగా కాక, గారడీవాడుగా కాక, సంస్కృతకావ్య వైతాళికుడుగా కాక, విశ్వ సౌందర్య బంభరముగా నిలబడుతున్నాడు.



ఆధునిక కవిత్వములో కొత్తదనము ఏమిటి? అని పండితులు నాడు అడిగేవారు. నేటికీ దక్షిణాంధ్రములో అడుగుతూనే ఉన్నారు. వింత ఎక్కడున్నదంటే ఈ అడిగేవారు కవిత్వంలో కొత్తదన మనగా ఏమిటి? అని తర్కించుకోకుండానే ఈ ప్రశ్న వేస్తారు. వారిది జిజ్ఞాస కాదు, మరి సవాలు. వారి సవాలుకు ప్రతిసవాలు ఇదే: "అసలు కవిత్వంలో క్రొత్తదనమంటే ఏమిటో తేల్చండి. అది ఆధునిక కవిత్వంలో ఉంది". ఈ మనకు కనబడే ప్రపంచ మంతా నిన్నటిదే. ఆ సూర్యుడే, ఆ చంద్రుడే, ఆ గాలే, ఆ ప్రేయసే, ఆ ఫలమే. మరి కొత్త అన్నది ఎక్కడ ఉన్నది? ఎందు కిందరు

జీవులూ పొందిన అనుభవమే పొందుతూ తృప్తి పడుతున్నారూ? దీనిలో కొత్త ఏమిటి? చెపుతున్నాను వినండి. చక్కగా ఏది అనుభవమైతే, అప్పటికి అది కొత్తే, అనుభవము కావాలి, గారడీ కారాదు. నంది తిమ్మనగారు చంద్రుణ్ణి `చరమాద్రి దావాగ్ని సంప్లుష్ట సుర సౌరభేయీ కరీ షైక పిండమనగ' అని వర్ణిస్తే, అది కల్పన కనుక ప్రదర్శన మాత్రమై ఆలోచన రేపుతుంది. సూర్యుడు పశ్చిమాన్న అస్తమిస్తూంటే కదా. తూర్పున నిండు చంద్రుడు దయిస్తాడూ, మరి చరమాద్రి దావాగ్నిలో ఉదయాద్రి చంద్రుడు సంప్లుష్టు డవడ మనగా యేమిటీ? అని లేదా, చంద్రుడింత సేపూ వెలిగేడు గదా, తెల్లవారేముందు కాలి పిడక అయ్యేడా? అని. దంష్ట్రాగ్ని నిర్గళద్దహన కీలల వియద్భ్రష్ట తారాలాజ పటలి పెటుల' అని ఎర్రనగారు వర్ణించగానే అగ్నికీలల్ని భ్రాష్ట్రము లోపలికి ప్రవేశపెట్టుదురా? అన్న సందేహము కలుగుతుంది. అనుభవమన్నదే ఉంటే, అది ఎప్పటికప్పుడు కొత్తగానే స్ఫురిస్తుంది. జనమంచి కామేశ్వరరావుగారి `కృష్ణవేణి' చదవండి: "పర్యంకంబున కృష్ణవేణితో చేయితలాడగ శయనించిన నా ప్రేయసి జేరితి ప్రేమోత్సుకతన్. పెదవుల భృశమ్ము మెరసే హాసము ముగ్ధ వయస్వీసుమ మృదుహాసము ముత్యపు ముడియై నిర్వృతి నుండెన్. దేహయష్టిపై దృష్టే లేదు మన మూరకయే వేణి వసించున్. నేత్రద్వయ మొక భృంగద్వయమై కుంతలాల మధుపానము చేయున్. ఆవశంబగు నా పాణి ద్వయమూ కృష్ణవర్ణమౌ వేణిక నిమురుచు కేశబంధమును పదలించెన్. వేణి బంధములోని పాణిద్వయము బట్టి నిదురజోగే కనుల వాల్చుచున్ నను జూచె మందస్మితాస్య అస్మత్ ప్రేమరాజ్ఞి. చిగురించిన చిరునవ్వు మోముతో జీరాడెడి కైశిక పాశముతో నా మోము కప్పి తన మోము జేర్చె ననురాగ రక్తనాశ్లేషరుష్టి." దీనిలోని నవ్యత ఏమిటి? అనుభవమే. ఈ కావ్యము. చదివి ముగించగానే చివరి పంక్తుల చైతన్యపు స్పర్శతో నరనరాల్లో దాగుకున్న అనుభవము ఝుమ్మంటుంది. అనుభవము కలగించగలిగిన రచన కోకొల్లలుగా ఉంది. `చనిన నాళుల తెనుగుకత్తులు సానబట్టిన బండ ఈ పెనుగొండ కొండ' అన్నారు అనంతకృష్ణశర్మగారు. `ఎంత బిగి కౌగిలించినా ఈ విభేద మంతరింపక యున్నదే' మన్నారు వెల్లాల ఉమామహేశ్వరరావుగారు."ఊరిలో అందరికీ ఉత్సవమ్మౌట ఇంటింటి బాలురకు ఇది పండుగేట, ఏ అబోధ నిరాశ ఏ మానసాగ్ని ఇతని పండుగమీద ఇంత రగిలింది?" అని అడిగేరు ఇంద్రకంటివారు. `ఆ రాటపు కదురును తీసుక ఏరాటా నెట్టినా ఒకటే, ఆవేశపు ఆంధ్రుడు తగునని ఏ వేషం వేసినా ఒకటే' నన్నారు సంపత్. `విను దదిగో వినుదదిగో వినబడుతూ ఉన్నాది (శ్రీకృష్ణుని వేణువు)' అని వినిపించారు బాపిరాజుగారు... `అసురసంజను చుక్క అగుపించెను, అపరదిక్కృతి తిలక మనిపించెను' అన్నారు కవికొండలవారు. `అంతె పేరున కంతే భార్యాస్థిగాని నిజము

నా శరీరాస్థి కృష్ణార్పణమ్ము' అన్నారు విశ్వనాథవారు.`ఎక్కడున్నావోయి వెఱ్ఱి శంకరుడా ఉంగాయి (కాత్యాయని) నీ కొరకు బెంగతో ఉన్నది' అన్నారు బొడ్డుబాపిరాజుగారు. `ఎన్ని యుగముల మాట ఈనాటిదా తరుణి ఈ ప్రేమమాట' అని గణపతిశాస్త్రిగారు. `పూరిగుడిసెలలో నైన బుత్తుగాని గీత మల్లక బ్రదుకు సాగింపలేను' అని బెళ్లారి శ్రీనివాసమూర్తిగారు. `భూమి సమస్త మీ యెడ సముజ్జ్వలమైన సుధాసముద్ర వీచీమయ లాస్యరంగమున జిందులు ద్రొక్కుచు న్నన్న దొర' అని పెమ్మరాజు లక్ష్మీపతి. `ఈ జలదఖండ మెందో గతించు నించు కంతయేని చింతిలక కాలానువృత్తి' అని కుందుర్తివారుయ`కల్పవృక్షపు పూలజల్లులు, కామధేనువు పాలధారలు, భాగ్యదేవత వెల్ల గొడుగులు పల్లె కర్షకులు, అని చిరుమామిళ్ల పార్థసారథిగారు. `పాడుపడు ఖిల్లాల పుట్టు పాడుకొనుచును తూర్పు వనములు మ్రోడు చిగురుచు పచ్చదనమున గగురు పొడిచి కవి' అని ముక్తినీ నూరపనేని కవులు.`అలసిపోయినదొ నా వలెనె యీ త్రోవ ఆ యింటి ముందుగ నాగిపోయినది' అని దిగుమర్తి సీతారామస్వామిగారు.

మనము చూచి కూడా గుర్తించని అనుభవాల క్రొత్త దనము మనము గుర్తించిన అనుభవాల కంటె సులువుగా తగులుతుంది. కాళోజీ నారాయణరావుగారిది ఈ అందము రూపుదాల్చిన రచన. `రాయి విసరినా రాకెట్ విసరిన కిట్టని వానిని కొట్టుటకే కద?, అంటారు, "కుటిలమతులు దేబె మొగాలు జగతిలో రెండే రెండు రకాలు, చతురవర్గ విలాసం కొరకు దేబెల సర్వస్వం ముడిసరుకు" అంటారు. ఇందుపుర దుర్గపు జైలులో దాశరథివారు `ఒక కాలమ్మున ఇద్ది దేవళము, వేరొక్కప్పు దుర్గంబు, నే డకటా! జైలయి కనుపించెను. భవిష్యత్కాల మందెట్టి రూపకమున్ దాల్చునొ! కాల చక్రగమన స్వాభావికావర్త కల్పకమై దేవళమౌను దుర్గమగు నీ బందీలె పాలింపగన్' అన్నారు. రాయప్రోలువారు `పల్లెపదాల జీవము నిల్పికొన్న పలినాటి వీరుల రక్తనాళ పటిమ'ను జ్ఞాపకము చేశారు. రామిరెడ్డిగారు `పారసి కన్న శ్రావ్యమయి పల్లవ కోమలమైన'తెలుగు భాష తీపిని స్మరించారు. కవుకొండలవారు దారిపక్కన గడ్డిపూలు `దాక్కని చూస్తాయి, దారంట గడ్డి నిరుక్కని చూస్తాయి' అన్నారు. గోదావరి ఉప్పొంగిపోతే `నర మానవుడి పనులు శిరమొగ్గి వణికేయి' అన్నారు బాపిరాజుగారు. వేసవిలో `చిలుకమ్మ చివర వేసిన సెగ గడ్డకు బాల గుండ్ర మొగమ్ము పనులు శిరమొగ్గి వణికేయి' అన్నారు విశ్వనాథవారు. `విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైన వీథి వాకిలి యేది చెల్లెలా?' అని అడిగేరు కృష్ణశాస్త్రిగారు. `రోజూ కనపడే నక్షత్రాల్లోనే రోజూ కనపడని కొత్తదనం చూచి రోజూ పొందని ఆనందానుభూతి పొందడం అంటేనే కవిత్వ' మట దాశరథిగా రంటారు `పునర్నవం'లో.

మనము పొందని అనుభవాల్ని పట్టి కవి మనకు అందించినప్పుడు ఆ అనుభవాలు - సరికొత్తవి -మనలను గట్టిగా తాకుతాయి, స్పందింపజేస్తాయి, జల్లు మనిపిస్తాయి. కవి ప్రతిభకు బిరుదైన పని సౌందర్యాన్ని సేకరించి చదువరికి అందించడమూ. చదువరిని తద్వారా నిండు మానవునిగా తయారు చేయడమూను. `తొలి ప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై పరువెత్తు కోయిలపాట' ను వినిపించారు కృష్ణశాస్త్రిగారు. `సుక్కలన్ని కొండమీద సోకు జేసుకునే వేళ, పంటబోది వరవ డితో పకపక నవ్వేవేళ, సల్లగాలి తోట కంత సక్కిలిగిలి పెట్టువేళ, మొక్కజొన్న తోటలో ముసిరిన చీకట్లలో మంచెకడ, చేరిన ప్రేయసులను చూపిస్తున్నారు కొనకళ్ల వెంకటరత్నంగారు. పలుకులతో ధ్వని చిత్రము రచించారు- `నాగార్జున కొండలో రాత్రి'లో మొక్కపాటి కృష్ణమూర్తిగారు వినండి : నీలికొండల నీలి గుస గుస, ఏటి తెలి క్రొన్నీటి, గలగల, మలుపుబాటల వలపు పిలుపులు, మరగి వచ్చితిని ని న్నరయ వచ్చితిని... ఎడదరేగిన యేటిహోరులో, కొండకోనల గ్రుమ్మరిలి యీ, రేయి నీ యేకాంత సేవలో, కలత నిద్దురలో నీకై కలవరింతలలో నీలికొండల నీలి గుసగుస! ఏటితెలి క్రొన్నీటి గలగల!" ఏటి గలగలవలె కాలావధి దాటి సాగే పాట ఇది. నీరే `కొండపల్లి స్వప్నము'లో `కదలికాలము నీలు కలలు నిద్దుర వలువ ముసుగుతీయని పల్లె గుసగుసలు' ముసరించారు. సుప్తాస్థికల చూపు మనలో కలిగించే కలతను`వణకు నేటికొ నా యస్థి పంజరమ్ము' అని వివరించారు శ్రీ శ్రీ. `తాళీవని'లో`ఇలనిలంబడి' శీతోష్ణములు సహించిన యుగాంత కవుల'ను గుర్తించి చూపుతున్నారు పెనుమర్తి వెంకటరత్నంగారు. `అవలింతంత యెత్తయిన చెట్ల'నూ `పలవ రింతంత ఇరుకైన కాలాన్నీ' ఆరుద్ర చూపించారు.`ఇలుదాటిపోయినన్... మరలినదాక.... వెనుక మూడు కాళ్లతో తిరిగే' తల్లి ప్రాణాన్ని చూపిస్తున్నారు జాషువాగారు. `శుష్కించు సెలయేటి విరహిణి కడుపులో నడగిన కడలి మ్రోతను' వినిపించారు కృష్ణశాస్త్రిగారు. `నిముసాని కొకరూపు నీలి తొలకరి మబ్బు, తృటికొక్క కళ సాంధ్య దివ్యతేజోరేఖ' అంటారు భమిడిపాటి రామ సోమయాజులుగారు. `ఓ ఇంద్రగోపమా! ఓ సాంద్ర తేజమా! మౌన ముద్రాధారీ' అని సంబోధించి ఇంద్రధనుస్సు మౌన సౌందర్యమును అనుభవానికి తెస్తున్నారు బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు. "ఏనాటికైన నీ వేణునాళమును వాయింప వత్తు నీ వాకిటికతెకు నడియాన దలుపుల గడె దీసివైతు వీనుల నూపిరి బిగపట్టివైతు"నని `ఆశొకు వాసకసజ్జికా రూపమిస్తున్నారు పాపినేని ఈశ్వరరావుగారు. `కరకు గత్తుల దాల్చు నరహంతకుల ఇంట బానిసై భూదేవి పడియుండెనీ వేళ, ధనికునకు దైవమే దాసుడయ్యెను చూడు'మన్నారు తురగా వెంకటరామయ్యగారు. `భువనగిరి కోట యది మొగమెత్తు సింగ' మన్నారు పుట్టపర్తివారు. `ప్రకృతి పుస్తకమందు దిరుగవేసిన యాకు మరల చూడదు కాలపురుషు' డన్నారు.

అలసిపోయిన కన్నుల ప్రతిఫలించి సురనదియేని వైతరణిగా దోచు'నట దిగుమర్తివా రంటున్నారు. `చుక్కలతో నిండి చక్కని రేయి తనువెల్ల కనులుగా గను'నట.`ఏను తూనీగనై విహరించునపుడు విశ్వమంతయు సౌందర్య విభ్రమంబు, తేనె టీగనై పూదోట తిరుగునపుడు ధరణి యంతయు కర్మబంధముగ దోచు'నన్నారు.`చిరము రుధిరాభిషేక ప్రసిద్ధి గన్న పెద్ద పులిగోళ్ళు పసివాని ముద్దు పదకమందు బంగారు కొనల పసందుకేడ్చు'నట. ఈ సీతారామస్వామిగారి రచనలో నంతా కొత్త అనుభవాలే.

మరి "ఆధునిక కవిత్వములో కొత్త ఏమిటీ" అన్న ప్రశ్నకు అర్థ మేమిటీ? కవిత్వములో ఉండవలసిన కొత్త ఆధునిక కవిత్వములో ఉంది. రాధాకృష్ణ పండితుల ప్రశ్నకు వత్తాము. "ఆధునిక కవిత్వ తత్త్వ మేమిటీ?" రచయిత పాండిత్య ప్రకటనానికి కాక చదువరి ఆనందానికి దారిచేసే టట్లు రచించడమూ, చదువరి మెప్పు కోసము కాక అతని అనుభవానికి దోహదము చేసేటట్టు రచించడమూ ఆధునిక కవిత్వాశయము. `తాళీదళ సంపుట ప్రకర కాంతారము నుంచి కాక విశ్వసౌందర్యము నుంచీ, మానవుల అనుభవము నుంచీ వస్తువు సేకరించడము ఆధునిక కవిత్వాశయము. ఇంకొక కవి కన్న ప్రౌఢంగా చెప్పవలెనని కాక, గుర్తించగల కొత్త అనుభవాన్ని నూతన సౌందర్యాన్ని చదువరి కందించడము ఆధునిక కవి ఆశయము. వర్ణనా సౌందర్యాన్ని కాక వస్తు సౌందర్యాన్ని వెలయించడము ఆధునిక కవి కోరిక. ఈ యత్నంలో అలవాటుగా వచ్చిన ఛందో-, భాషా-, నియమాలు అతిక్రమించవలసి వచ్చినా సరే. కవితా సామగ్రి, భాష ఛందస్సు, వర్ణనా పద్ధతి వేటిలోనూ పూర్వాచారము మాత్రమే ఆధునిక కవిని నడుపదు. మోచర్ల రామకృష్ణయ్యగారివలె వ్రాయబోయేది శతకాన్ని పోలినా, మకుటము వదిలేసి, ఒక వృత్తంలోనే రాయక పేరు కూడా మార్చేసుకుంటాడు ఆధునిక కవి. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రులుగారి లాగ పూర్వ పరిచయము నిండిపోయిన ఇంద్రధనుస్సునేనా "శ్రీయుత మీదే దేశము?.... వాన రాబోవుచున్నది దాన నీదు రంగుదుస్తులు తడిసి హోరంగు తగ్గునని కొత్తగా పలకరిస్తాడు. మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారి వలె గోదావరిని`దప్పిక'లేని వాన తరి దగ్గర జేరి... దప్పిక చంపే వేసవిలో దూరంగా పోతావేమమ్మా' అని అడుగుతాడు. గడియారము శేషశాస్త్రులుగారి వలె "నడచెడు తొంటిదారులు కనంబడ నట్టులు క్రొత్తదారు లేర్పడినవి, దారి చూపెడు దొరల్ తమ నీలపు కంటి యుద్ధముల్త్రొ డుగుచు చూచి చూపెదరు, తోయధి నేలను నేల తోయధిన్ పడినటులయ్యె నియ్యెడరు పట్టున గావలె క్రాంత దర్శనమ్" అని అధునాతన సమస్యలను గురించే కలత పడతాడు. రామిరెడ్డిలాగ పల్లెపట్టు చైతన్యాన్నీ, కవు కొండలవలె జానపద జీవితాన్నీ, విశ్వనాథ వలె ఆంధ్ర ప్రశస్తినీ, నండూరి వలె

దాంపత్యప్రేమనీ కవితా సామగ్రిగా గ్రహిస్తాడు. రాయప్రోలూ, కాశూరి నరసింగరావూలవలె సంస్కృతభాషా జటిల భాషా, నండూరీ కవుకొండలా, బాపిరాజులవలె జీవద్భాషా, వాడతాడు. గురజాడ వలె ముత్యాల సరములూ, పుట్టపర్తి నారాయణాచార్యులవలె జంపెలూ, శివశంకరులవలె గీత పద్యాలూ, అబ్బూరివలె ద్విపదలూ, బసవరాజువలె గేయాలూ, వేదులవలె వృత్తాలూ వాడతాడు. వర్ణనకు అలంకార కల్పనే తప్పనిసరిగా ఉపయోగించడు. కథమీదనే దృష్టి పెట్టుకుంటాడు గాని పక్కదాట్లు వేసి ఊహావర్ణనలు చెయ్యడు. వసంత జయంత కంతుల్ని దింపుకోడు. ప్రకృతి దృశ్యాల్ని అమరకోశపు వృక్ష జంతు సామగ్రితో నింపి నెక్కసము చెయ్యడు, తన వర్ణనల్ని. ఇదంతా ప్రబంధ కవిత్వముమీద తిరుగుబాటు కాదా? కాక ఇంకేమిటీ? ఇంత మాత్రము గ్రహించలేక బ్రతికిసాగిన ఈ పురోగామి ఉద్యమానికి తమ సొట్టకాళ్లడ్డుపెట్టిన కువిమర్శకుల నేమనాలీ?

**భారతి ఆగష్టు 1963**

# 10. దోషవిమర్శలూ, పురోగమనమూ

సభాముఖాన్న కవిత్వము వినబడినప్పుడు సమూహ మనస్తత్త్వము మాత్రమే మేలుకుని వింటుందీ, పక్కనున్న వారు మెచ్చుకుంటే ప్రతీవారిలోనూ మెచ్చుకునే సౌజన్యమే చప్పట్లు కొట్టుతుంది. నండూరి, త్రిపురారిభట్ల వారూ వంటి గాయకులూ, కృష్ణశాస్త్రిగారి వంటి ఉచ్చారణ దక్షులూ కళాశాల విద్యార్థులకూ, విద్యావంతుల సభలకూ ఆధునిక కవిత్వాలు - తమవీ ఇతరులవీ-వినిపించినప్పుడు అనేక సభలు వారిని అభినందించాయి. తెనాలిలో వేదాంతమువారూ, రాజమండ్రీలో దామెర్లవారూ, విజయవాడలో భాగవతుల వారూ అభిమానించి తమ ఇళ్లలో ఈ కావ్యపఠన సభలు పెట్టించేవారు. సాహితీ సమితి వార్షికోత్సవాలు వీటికి తోడై ఆధునిక కవిత్వానికి ప్రచారమిచ్చాయి. కావ్యపఠనము సభాకార్య క్రమాల్లో తప్పనిసరి అంశమైంది. నవకవులకు ధైర్యము వచ్చింది. గిరజాల జుట్లూ, నున్నని ముఖాలూ, వల్లెవాటు కండువాలతో పట్టణవీథుల్లో వీరు గుంపుగా కదులుతూండేవారు. తాగూరు కవి తన రచనల అర్థము చెప్పమని ఎవరో అడిగితే `కవితావేశములో వ్రాశాను. ఇప్పుడు - సామాన్య పరిస్థితుల్లో - వాటికి అర్థమేమిటో నాకుమాత్రము ఎలాగ తెలుస్తుందీ?' అన్నారట. ఆయన కవితారచనా పద్ధతులను వదిలేసినా, ఈ జవాబును దొరకబుచ్చుకుని ఆధునికులు తమ రచనలకు డాలుగా ఉపయోగించేవారు. వారి ఇంగ్లీషు అన్వయాలు, వింతభావాలూ, పాఠము విన్నట్లు అర్థమయ్యేవికావు. దానితో ఏ మహానుభావుడో పెట్టేసిన "భావ కవిత్వము" అన్నమాట వీరి రచనలకు గట్టిగా అతుక్కున్నది. వీరి జీవిత పద్ధతులు కూడా స్వేచ్ఛా ప్రేమ నాదాలతో, ప్రేయసీ కవిత్వాలతో అనుమానాస్పదంగా కనబడేవి. అవకాశం దొరికితేచాలు, తామేదో అమృత నిష్యంది రచనలు చేసేస్తూన్నట్టుగా సంప్రదాయ పద్ధతిలో పద్యాలు వ్రాసేవారిని అప్పుడప్పుడు సభలలోనూ, అన్నిచోట్లా, అన్నివేళలా భోజనానంతరము, నదీ సైకతాల్లోనూ, అపహాస్యము చేసేవారు. ఏదో అజ్ఞాత సౌందర్యమున్నదనే నమ్మకము విద్యార్థిలోకానికి వీరి రచనలను చుట్టిన ప్రాకార మయింది. కాలము గడిచినా ఆ వింత సౌందర్యాన్ని వెదికి చూపించగల విమర్శకులుగాని యత్నముగాని

కనపడకపోవడముతో ప్రతికూల శక్తులు గడ్డకట్టి ఒక్కమారు విరుచుకు పడ్డాయి `భావకవిత్వము' మీద. అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు `నేటి కాలపు కవిత్వము' అని ఒక పెద్ద గ్రంథము -సిద్ధాంతమూ పూర్వపక్షమూ అని వాదాలు వెలయించి -రచించారూ, కాశీ భట్ట సుబ్బయ్యశాస్త్రిగారు `సాహిత్యకల' అని విమర్శ గ్రంథము రచించారూ, అనంత పంతుల రామలింగస్వామిగారు `శుక్లపక్షమూ', కొల్లూరి ధర్మారాయకవిగారు `చాకిరేవు', ఆలపాటి కామేశ్వరరావు గారు `దూదేకుడు', తాపీ ధర్మారావు,జాషువాగార్లు ఖండ కావ్యములనూ, ఇంద్రకంటివారు `కళాభాయి' అన్నకథనూ రచించారు.

ఇంద్రకంటి వారికథ ఈ భావకవుల ప్రేమ కవిత్వపు వెర్రి తిరుగుళ్ళమీద. వ్రాసిన దెవరి మీదనైనా, ఏ జుగుప్సాకర పరిస్థితులలో నైనా ఈ స్వైర ప్రేయసుల ప్రేమాలాపాలు -బిడియమూ జంకులేని వ్రాతలైనా - కవిత్వంగా చలామణీ అవుతున్నాయని వారివిమర్శ. వాస్తవానికి చదువరికి కవి తన రచనను ఏ పరిస్థితులలో రచించాడొ తెలియదు. నటుడు ఏ అనుభవాన్ని తలుచుకుని - ఏ గ్లిసరీను రాసుకుని - కళ్ల వెంబడి నీళ్ళు తెచ్చుకున్నాడో ప్రేక్షకునికి తెలియదు. కవి రచనా, నటుని నటనా వాటంతట అవే కానవస్తాయి. వాటి విలువ వాటిని బట్టే ఉంటుంది గాని, వాటికి కారణములైన పరిస్థితులు తెలియని కారణముచేత, వాటి చరిత్రను బట్టి ఉండదు. పరిస్థితుల బలము వల్ల ఒక రచన బాగుండవచ్చును. కాని ఈ బాగు ఆ కవి రచనకి ఎల్లప్పుడూ ఉండదు ఒకటీ, ఈ బాగు చాలా పరిమితమై ఉంటుంది. రెండూ ప్రతికూలాలు. వాల్మీకి రామాయణము వంటి సుదీర్ఘమూ సర్వాంగ సుందరమూ అయిన కావ్యములో వర్ణనలూ రసఘట్టములూ భావములూ చక్కగా అమరి ఉంటాయి. దానిలో మంథర దుర్బోధ, రావణకృత రామనింద, త్రిజట సీతానునయమూ, సంపాతి కుమారుసి ఉబ్బూ, చాలా వైవిధ్యమూ గల ఘట్టాలు ఉంటాయి. వీటినన్నిటనీ తాపీగా పఠిస్తూ ఓపికగా చివరివరకూ చదివితే, జీవితంతో సమాన మయ్యేటంత అనుభవమూ, తత్ఫలమైన కల్మషక్షాళనమూ, సద్యః పరనిర్వృతీ కాంతా సమ్మితోపదేశమూ లభిస్తాయి. అంత రామాయణములోనూ, గభీమని తెరచి ఏదో ఘట్టము చదివినా, అప్పటికప్పుడు అంతకీ అంత అనుభవము కలుగుతుంది. సైజులో చిన్నవైన ఖండకావ్యాలు జీవితపు లోతుల్ని పెకలించి తలకెత్తడము అసాధ్యము కాదు కాని అసామాన్యము మాత్రమౌను. కనుకనే అవి తరచు కావ్యఖండాలే అయి వూరుకుంటాయి. పరిస్థితుల ప్రత్యేక బలమువల్ల కవి పలికిన రచనలు కావ్య ఖండములు కాగలవుగదా, ఖండకావ్యాలు కాకపోతే మానె?

జాషువాగారి `దాంభికుడు' `నా కవిత్వము నందు రత్నములు గలవు. వాని పెకలించి చూపెడు వాడులేడు' అన్న కవిగానిని గురించినది. వెకిలితనపు హేళన

నిసర్గ సుందరభాషతో చేసినంత మాత్రాన ఉదాత్తము కానేరదు. జాషువాగారే ఆ ఖండములోని అభిప్రాయాల్ని ఎంత మాత్రము వాదము వల్ల-నిలబెట్టుకోగలరో నాకు సందేహము. వెక్కిరింపులకు వాదమేమి ఉండగలదూ?...... తాపీ వారి `విచారణ దినము' సుదూర భవిష్యత్తులో ఆధునిక కవిత్వము సాధించినట్లుగా గుర్తించగలిగిన దెంతో ఉండదనే అభిప్రాయముతో సరస్వతీ రాజ్ఞి చేసిన విచారణను ఖండకావ్యముగా వ్రాసినట్టిది. ఖండ కావ్య రచన లాఘవ కార్యమనీ, సర్గ బంధ రచనే గొప్ప పని అనీ వీరి అభిప్రాయము కావచ్చును. అది సరికాదు. ఆధునిక కవుల ఖండకావ్యాల్లో ప్రపంచ వాఙ్మయాల్లో దేనిలోనైనా సరే వాటి కాళ్ళమీద నవి నిలబడగల రచనలు పెక్కులున్నాయి. అవే ఈ ఉద్యమానికి శ్రీరామరక్షలు. నాకూ నా రుచికీ అందినంతవరకూ జ్ఞాపకము వచ్చిన వాటిని ఇదివరకటి వ్యాసాల్లో వివరించే ఉన్నాను. ఆధునిక రచయితలు విశ్వసాహిత్యానికి నివేదించిన ఖండకావ్యాల్ని సేకరించిన సంకలనము రావలసే ఉన్నది. ఆలపాటి వారి పద్యాలు వేగవంతాలు. వారి భావాలు, తిట్లూ సవాళ్లూను, `దూదేకుడు' వారి రచనలను కూడా ఏకగలదు.

అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులే ఈ విమర్శకులలో ప్రముఖులు. తెలుగు కవులు - నన్నయగారి నుంచీ నేటి వరకూ గలవారు అందరూ చేసిన ఛందో వ్యతిక్రమాన్నీ, వ్యర్థపదప్రయోగాన్ని, సంస్కృత పదప్రయోగాన్నీ విమర్శించారు ఉమాకాన్తముగారు. నన్నయగారు పద్య చ్ఛందస్సు లుపయోగించి భారతాన్ని ఇప్పు డున్నట్టుగా తయారుచేయక మాత్రా చ్ఛందస్సులలో రచించియుంటే మన వాఙ్మయము రూపు మారిపోయి ఉండును. వారూ, వారి తర్వాతివారూ పద్యములకు గొప్పదన మారోపించారు. తెలుగుభాషకు పద్యఛందస్సు సంకెలయే అయి ఈనాటివరకూ రచనా వైవిధ్యాన్నికాక సంస్కృత వృత్తానుకరణాన్నే నేర్పింది. ఆధునికులు ఛందోనియమాన్ని పాటించక రచనను సులభమే చేశారు. ఉమా కాన్తముగారు ఆధునిక కవుల శబ్దవాచ్యతను -విశేషణాలతో వర్ణనను సాగించుటను - విమర్శించారు. ఈ శబ్దవాచ్యత అనేది వెంకట పార్వతీశ్వర కవులూ, శివశంకరశాస్త్రిగారూ ఎక్కువగా చేశారు. కృష్ణశాస్త్రిగారు కొంతా, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు బాగా ఎక్కువగానూ, వెంకట పార్వతీశ్వరుల ననుకరించిన రచన చేశారు. పద్య పూరణావసరము కొంత కారణము శబ్దవాచ్యతకి .... ఉమాకాన్తంగారే `హృదయ వనజాత సుమ మృదు మనోహర దళము లదయతను త్రుంచినారే, భయదాగ్ని, కీలలను వేల్చినారే' అన్న రచనలో పాదాలలో ఇమడని మాటలను రెండు పాదాల మధ్యన వేసి దరువు కొట్టుతున్నాడు.' అని విమర్శించారు. చేస్తే నేమి? కవి తనకు నచ్చిన ఛందస్సులో రాయకూడదా? రాయలేదా? పాటలోని అక్షరాలన్నీ నింపరు, నింపకూడదు కూడాను. వారికి ఇలా `దరువు' చేస్తే వచ్చిన కష్టము ఏమిటీ అని!

ఇవి వికారాలా? ఇవికాదు, వికారాలు. మీకు పట్టనివన్నీ తప్పనుకోడము వికారము. పద్యఛందస్సు పనికిరాదంటిరి. మరి మాత్రాచ్ఛందస్సులలో కొంచెము వైవిధ్యము చూపగానే వికారమై పోయింది!........ జడకుచ్చులు, తొలకరి' అని ఇంపైన పేర్లు పెట్టరాదట. పేరువల్ల సాధించేది పేరు ఒకటే. ఎ పేరు పెట్టితే నేమి? ఖండకావ్యకం, సిద్ధాంతకౌముది, అద్వైత రత్నరక్షణము ఇంపైన పేర్లుకావా? నలుగురి వ్యవహారానికి పనికిరావడానికి పెట్టిన పేర్లు! వీటిలోని మాధుర్యమును ఎవరు గొప్పగా చెప్పుకున్నారనీ అలాటి ఇంపైన పేర్లు పెట్టరాదంటారూ? పద్య మంజరులు కావ్యమాల అని ఎన్నిటికి పెట్టగలమూ? ఇది మాత్రము వికారము కాదా ఈ పేర్లమీద దండయాత్ర?

`భావకవిత్వ మనడమే అసంగతం', `భావంలేనికి కవిత్వమే లేదు' అన్నారు విద్యాశేఖరులు. ఒక వస్తువు, దృశ్యము, అనుభవమును గురించిన భావాల్ని నిశ్శ్రేణిగా కూర్చిన రచనలు కీట్సు, షెల్లీ, బైరను వంటి ఆంగ్ల కవుల రచనలలో కొల్లలుగా ఉన్నవి. కథాకావ్యమువల్ల కాని , భావకావ్యం వల్ల కాని, కవి చదువరులలో సద్యఃపరనిర్వృతి కలిగించగలడు. `నా కుగాదులులేవు నా కుషస్సులు లేవు, నేను హేమంత కృష్ణానంతశర్వరిని, నాకు కాలమొక్కటే కారురూపు, నా శోకమ్ము వలెనే నా బ్రదుకువలెనే, నావలెనే' భావకావ్యం. `నవ్వుచును పొంగిపోవుచు నాట్యమాడ తరగలను వెల్గు చుక్కల తళ్కుగాని, అబ్ధి గర్భోజ్వల ద్భడబాగ్ని శిఖల హృదయమున దూరి యెవరు చూచెదరు సఖుడ' అన్నది భావకావ్యము. "ఉపనిషత్తులలోన వూరేగు దేవా, ఉర్వి దౌర్జన్యాల కూరుకున్నావా?' అన్నది భావకావ్యం. ఎక్కడున్నావోయి వెర్రి శంకరుడ ఉంగాయి (కాత్యాయని) నీ కొరకు బెంగతో ఉంది' అన్నది భావకావ్యం. భావము ఒక్కటే అయితే భావమే. అది మనలో అనురణనము కలిగించి మన భావానికి పరిణతి కలిగిస్తే అది కావ్యమే. పరిమాణములో చిన్నదైతే అవునుగాక. ధూర్జటివి అంతా మిథ్య, ఏ వేదంబు, రాజ్యాల్మత్తులు వంటి పద్యాలు - వాటి కవి పూర్తి అయినట్టివి భావకావ్యాలే, ఆధునికులు ఆంగ్లేయుల పద్ధతిలో -లోకానుభవాల్ని భావాల విశ్శ్రేణిగా నమర్చి భావకావ్యాలుగా తీరుస్తున్నారు. తెలుగులో చాటు పద్యాలలోనూ శతకాలలోనూ ఈ కావ్యాల్ని పోలినవి - బహుచిన్నవి - ఉన్నాయి గాని, వాటిలో నిర్మాణముకన్నా పలికేయడమే ఎక్కువ. మన వాఙ్మయములో కావ్యత్వసిద్ధి కలిగిన భావకావ్యం అనే పృథక్శాఖ లేదు. భావాలున్న కావ్యాలున్నాయి, భావకావ్యాల శాఖలేదు. కావ్యత్వసిద్ధి కలిగిన భావనిశ్శ్రేణుల శాఖలేదు. భావాలున్న పద్యమంజరులు భావకావ్యాలు కావు. కావ్యత్వసిద్ధి అన్న పదమును అన్నిమార్లుపయోగించీ కూడా దానిని తాము చెప్పిన సూర్య శతకాదులకు అన్వయింపచెయ్యక దాటుకుపోవడము ఉమాకాన్తుల కార్పణ్యదోషానికి పెద్ద ఉదాహరణము.

ఆధునిక రచనలు అయోమయముగా ఉన్నవని "బుద్ధి అపరిణతమై..... నప్పుడు.... మాటలు అయోమయంగా ఉండడము సహజమ"ని వ్రాశారు అక్కిరాజువారు. ఈ మాటలు చదువరిపట్ల కూడా నిజమే. షేక్స్పియరు నాటకాలలో `Sermons in stones; books in running brooks' అన్న మాటల్ని ఇలాటి విమర్శకులే అయోమయ వ్రాతలని తీర్మానించి "Sermons in books, stones in running brooks" అని దిద్దినారట. ధ్వనించే రచన చెయ్యడానికి కావలసినట్లే, ధ్వనిని పట్టడానికి కూడా చెవులూ, చైతన్యమూ కావలెను. `పంజరంబున కట్లు ఉండవు. కట్లను ఎవ్వరూ పగులదన్నరు' అని విమర్శించేవారు కాబోలు. కృష్ణశాస్త్రి `కల విహంగమ పక్షముల దేలియాడి' అన్న రచనలోని స్వేచ్ఛ సూచించే ఉత్సాహమ్ము ఈ పండితులకు అందనేలేదు. `గంగాయాం ఘోషః' అంటే ఏమిటో వ్యాఖ్యానముకోరె పండితశాఖలోనివారు వీరు! వేమన్న పద్యం "బ్రహ్మ గుఱ్ఱమాయె భవుడు వల్లంబాయె, నాది విష్ణువెన్న నంకెనాయె నందు మీదివాడు ఆడదో మొగవాడొ. విశ్వదాభిరామ వినురవేమ" అన్నదీ వీరికి అయోమయమే!కర్మ! మళ్లీ వేదాంత శ్లోకాలు మొదలుపెట్టితే మరి విడవకుండా ఏకరువు పెట్టగలరు. కాలజ్ఞాన తత్వాలలో గోప్యతను కోరి వేదాంతులు తమ నిత్య వ్యవహారమూ కాలక్షేపమూ కొరకు కూర్చుకొన్న తత్వాల్ని అయోమయ రచన లన్నారు. ఊర్ధ్వమూల మధశ్శాఖం" అన్న అభిప్రాయము - మొనలు మీదుగ తలలు క్రిందుగ మొలచి యున్నది వృక్షమూ అని తెలుగైనట్టిది - కూడా వీరి కొరడాకు గురి అయింది. రవీంద్రుని కవిత్వము అర్థము కాలేదనేవారు చాలామంది ఉన్నారు. ఆయన రచనలు భారతీయ సంప్రదాయంతో సంశ్లిష్టముగానే ఉన్నప్పటికీ ఆ సంప్రదాయముతో పరిచయములేని పాశ్చాత్యులు వాటి నర్థము చేసుకుని ఆనందించి భూషించారు. ఆకాశవీథిలో కానవచ్చే స్వాతంత్ర్యాన్ని `కలవిహగములు, తారలు, మొయిళ్ళు, మెరపులూ' ఉపయోగించి కృష్ణశాస్త్రి వర్ణిస్తే, ఉమాకాన్తంగారి వంటి ఆలంకారికులు "ఈ కృష్ణపక్ష కర్త యిట్లా తుమ్మెద అయి, మేఘ మయి, గారడీ చేస్తుంటే చూడవలెనని నేను కుతూహల పడుతున్నాను." అంటున్నారు! `తాడివనమున ఆగి చంద్రుడు తాను చెవి యొగ్గెన్' అని విని చంద్రుడికి చెవులున్నాయా? చంద్రు డాగేడా? అంటే, భూమి తిరగడము మానేసిందా? అని ప్రశ్నలు వేయడ మారంభిస్తే అంతముంటుందా? ఒక అలంకారము చాలదా, పది యెందుకూ అంటే జవాబేమిటి? కవి రచనలో ఒకప్పుడు అలంకారాలు పెనవేసుకుంటాయి. వాటిని వేరేవేరే ఇస్తే వాటి సమ్మేళనమువల్ల చదువరిలో జరిగే భావమేళనము జరుగదు. కనుకనే`పంజరంబున నున్న కట్లను పగులదన్నగలేక స్రుక్కితి' నంటారు గురజాడవారు. `నీపశాఖికాగ్రపత్ర మార్గములలోని ఇరుల గుసగుసలు ఆమె కన్నులలో అపుడపుడు వినబడుచు

నుండు' నంటారు కృష్ణశాస్త్రిగారు. `పాండవేయుల పదును కత్తులు మండి మెరసిన మహితరణ్ణు కథ' అంటారు రాయప్రోలువారు. కత్తులు మండుతాయా? `మోహినీ సాట్టహాస కోలాహలములు పండువెన్నెల లలమె బ్రహ్మాండమెల్ల'నంటారు వేదులవారు. `ఖంగుమని మ్రోసె నీ కంఠస్వరమ్మహో, పొంగిపోయెను ఉదధి భంగమాలిక లోహో" అంటారు విశ్వేశ్వరరావుగారు. రూపకమంటూ ఒక అలంకార మున్నప్పుడు మిశ్ర రూపకముగా ఉంటుంది. ఈ మిశ్రమములోని అలంకారాలు పెనవేసుకుని జమిలిగా తాకుతాయా లేక తీర్థానికి తీర్థమూ ప్రసాదానికి ప్రసాదమూ అన్నట్టుగా విడిగానే నిలుస్తాయా అన్నది కవి అల్లికమీదనే కాదు, చదువరి చైతన్యము మీద కూడా ఆధారపడుతుంది.

ఆధునికులు ఒక దర్శనమిచ్చి తృప్తిపడక చాలా ఉదాహరణాలు గుప్పుతున్నారని నిందిస్తూ "భావం హృదయంగమంగా స్ఫుటపడ్డ తర్వాత దాన్ని ఇంకా చెప్పడం విసుగును రోతను పుట్టిస్తుంది. కాళిదాసులో నిదర్శన బాహుళ్యం అరుదు" అని వ్రాశారు విద్యాశేఖరులు. ఈయనది కావ్య రసాస్వాదన విషయంలో చాలా దళసరైన పుర్రె. సున్నితపు భావాలు ఒక పట్టాన ఎక్కవు లోపలికి. కాళిదాసు శాకుంతలములోని "అనాఘ్రాతం పుష్పం, కిసలయ మలూనం కరరుహై రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసం.... అఖండం పుణ్య తపః ఫలానాం" అన్న శ్లోకం ఈయన చదువలేదా? మరిచిపోయారా? దాటేశారా? అయిదు నిదర్శనాలిచ్చాడు కవిలోకగురువు శకుంతల సౌందర్యాన్ని దుష్యంతుడి చేత వర్ణింపజేస్తూ. "మురువుగ లోకముల్మనుప మూర్తిధరించిన అస్త్ర వేదమో, కరుణ నజాండ గుప్తమునకై మెయి దాల్చిన క్షాత్రవ ధర్మమో, స్థిరతరశక్తి సంచయమొ ధీర గుణ ప్రకరంబో, వ్యక్తతాకరమయి గోచరించెడి జగద్ఘన పుణ్య విధానరాశియో అని అయిదు ఉదాహరణలిచ్చాడు. వాల్మీకి అగ్నిహోత్రములో ప్రవేశించిన జానకిదేవికి "పవడపు రాశిలోని నవభర్మ శలాకయు బోలె, చారు పల్లవముల కుప్పలో నిడిన...." అంటూ ఉదాహరణ లిస్తాడు. ఆదిశంకరులవారు సంసారానికి ఎన్ని ఉదాహరణలిచ్చారూ `లక్ష్మీనరసింహస్తోత్రం' లో! "భావాన్ని వ్యక్తదశకు తెచ్చి వదిలితే అఖండబలంతో హృదయాన్ని అధిష్ఠిస్తుంది." అన్న ఉమాకాంతపండితుల భావావేశాన్ని చదువరి కందించడానికి పెక్కులు ఉదాహరణాలు అవసరమవుతాయని గ్రహించలేక పోవడము వారి అల్పరాసిక్యానికి గుర్తు. అయితే పుష్పదళాలకు పీఠంలాగా ఉదాహరణాన్ని బంధించే భావము కూడా ఉండాలి ఆ ఉదాహరణాలతో. నాటకంలో నటుని అభినయమూ అతని భావావేశమూ నిదర్శన పరంపరను బిగించి చేర్చుతాయి. కావ్యములో - బసవరాజు అప్పారావు కల్పించేటట్లుగా - నాలుగు చరణాల్నీ బంధించే భావ ముండాలి. కృష్ణశాస్త్రిగారు `ఆశ' లో ఉదాహరణాలు మాత్రము -పీఠములేని పుష్పదళాలుగా మిగిలిపోయాయి.

ఉమాకాన్తంగారు దుయ్యబట్టేరు. అయితే కృష్ణపక్షంలోని తొలి ఖండకావ్యము దట్టంగా ఉన్న అడవిని వర్ణించేది. దానిలో వృక్షాలూ, గాలీ, సెలయేరూ, వరిమడీ, నీలాకాశమూ వర్ణిస్తూ `ఈ కరణి దిరుగాడ.... ఆకలా దాహమా చింతలా వంతలా' అని చరణదళాల్ని బంధించే భావపీఠము అమర్చారు. ఆ ఖండము చదువరిని పట్టుకుంటుంది. ఉమాకాన్తంగారిని మాత్రం ముట్టుకోలేదు.!

వనకుమారి అన్న కావ్యంలో రామిరెడ్డిగారి తత్త్వాలు ఏవో రెండు చెప్తే అవి పూర్వ వేదాంతులు చెప్పేవాటికన్నా గొప్పవి కావని ఆక్షేపించారు ఉమాకాన్తంగారు. ఆ మాటల్లో నూతనానుభవం లేదట. అనుభవ మన్నది ఎప్పటికప్పుడే నూతనం. మీకు ఈ రోజున అనుభవ మైనది నాకు రేపు కావచ్చును. ప్రకృతిసౌందర్యము దీనికి గొప్ప ఉదాహరణం. ఎవరు అనుభవించిన సౌందర్యం వారి కప్పుడు కొత్త. ఎవరికి ఎప్పుడే సత్యం నాటితే వా రప్పుడా సత్యము చెప్తారు. అది `నూతనానుభవం కాదు, వీరి స్వదృష్టి లేదు అంటే అర్థమేమిటీ? "పగగొను త్రాచుపామువలె ప్రాణి జనించిన దాని వెంబడిన్ దగిలి చరించు మృత్యువు విధాతయు దాని వశంబె యన్నచో మిగిలిన భూతజాలము ప్రమేయము చెప్పగనేల నిత్యమై నెగడెడి దొంతులేదు, కననేరదు లోకము కన్ను లుండియున్" అన్నారు పింగళీ కాటూరీ కవులు సౌందరనందములో. ఇది అశ్వఘోషునిది కావచ్చునూ, కాకపోనూ వచ్చును. కొత్తదైతేనే చెప్పాలా? `నేటికాలపు కవిత్వం'లో చెప్పిన విషయాన్ని చెప్పకుండా, అక్కడ దిక్కడ పులమకుండా వ్రాయలేకపోయారే విద్యాశేఖరులూ, అనుభవాలు చెప్పకుండా ఎలాగుంటారూ కవులు ఆ సన్నివేశం వచ్చినప్పుడూ?

ఈనాటి కవుల దృష్టి సంకుచితమంటూ "కవి తన మనోవిభుత్వం ఎల్ల ఉన్నతాలు, ఉత్తమాలు అయిన ప్రకృతుల్లో ప్రవేశించి అంతర వీక్షణం చేసి ఈ ప్రకృతుల ప్రవృత్తులను లోకానికి ప్రసాదిస్తున్నాడు" అన్నారు ఉమాకాన్తంగారు. అలాటి కవులు తెలుగులో రాలేదు. మా తెలుగు కవుల దృష్టిలో ప్రకృతి పరిశీలించి అర్పించవలసిన పూజా పీఠమేమీ కాదు. దేవతలూ ఋషులున్నూ గొప్ప వ్యక్తులేమీ కారు. అన్నట్టు కాళిదాసుగారి భోజని కీర్తి జగతిని ధవళితము చేయగానే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కృపణులై బయల్దేరారు. ఆ దేవతల చైతన్యాన్నే తెలుగు కవులు ధారాళంగా దిగుమతి చేశారు. ఆధునికులు అలాంటి గారడీలు చేయించక తమ అనుభవాల్ని-పలకరించగలట్టుగా దిద్ది ఇస్తున్నారు. పలకరించినవి పలకరిస్తాయీ, లేనివి వాటి దారిని అవి పోతాయి. వీటిని `అనుభవ కవిత్వం, ఆత్మనాయక కవిత్వం' ఏదో కవిత్వం అని పేరుపెట్టి ఊరుకోక సంకుచితత్వమంటు వెక్కిరిస్తారేమీ? మీ హాయి మాయి గారడీలు ఏ తత్వమూ? "ఇదివరకెవరూ దీన్ని ఎరగరని. ఇది కొత్త

అని, ఇది స్వేచ్ఛ అని, స్వేచ్ఛాకుమారుడని ఇది మహా కవిత్వమనీ" వెక్కిరిస్తూ అక్కడి దిక్కడ పులుముతారేమి? "కన్నులరవిప్పి నే నిన్ను గాంచినపుడె, ఆర్ద్ర హృదయంబు చలియించి యవశమాయె" నన్నాడు పాపినేని వేంకటేశ్వరరావు. అది సంకుచిత దృష్టా? ఉష అనిరుద్ధుణ్ణి స్వప్నంలో చూచింది. "నడిరేయిని కలలోన నాకు నీవు కానిపింపగ మేల్కొంటి కలతజెంది" అని `భారతి'లో ఒక కవి రాస్తే మీకెందుకు వింత అయిందదీ? భవభూతి సీతాస్పర్శకు రామునిచే పలికించిన పలుకులకు మీ సంప్రదాయార్థాలు చెప్పరేమి? రాముడికి వెర్రెత్తిందా, భవభూతికా?

`నూతనత్వాధికరణం' అనేమొదటి అధ్యాయంలో ఉమాకాన్తంగారు ఆధునిక కవిత్వంలో నూతనత్వమే లేదన్నారు. అయితే ఎక్కడా `కవిత్వంలో నూతనత్వ మన్నది యేమిటీ?' అని వారు వివరించనూ లేదూ, ఆ నూతనత్వపు లక్షణాలు ఆధునిక కవిత్వములో లేవని ఖండించనూ లేదు. "కావ్యంలో రసభావాలు ప్రధానం" అన్న పలుకులు మాత్రం పలికేరూ, `వీటిలో నూతనత్వం ఉండడం సాధారణంగా కవిత్వ ధర్మమే గాని విశేషమేమీ లేదు' అనీ అన్నారు. అయితే"ఆధునికులు, పూర్వులవలె సంప్రదాయ రచనలనే అనుకరిస్తూ, చెప్పే చమత్కారం కోసమే శ్రద్ధ పెట్టుతూ కథలోని రస భావ సౌందర్యాల కోసము చూడక తామాశ్రయించిన ప్రభువుల సభ, వేట, శృంగారమూ గుదిగుచ్చి దివాణపు కవిత్వమే రచించి, అభూత కల్పనలతో తృప్తిపడలేదూ, సృష్టి సౌందర్యాన్ని తమ స్వంత గొంతుతో వర్ణించ యత్నించారూ, కొత్త అంతా ఉద్యమంలో ఉన్నదీ" అన్న అభిప్రాయాన్ని నేరుగా ప్రతిఘటించి కవుల యత్నమేమీ మారలేదు అని నిరూపించకుండా "మాటలు కొత్తకాదు, మధుర పదాలు కొత్తకాదూ, ఛందో స్వాతంత్ర్యము కొత్త కాదూ అంటూ ప్రబంధ కవులు అంగాంగ సౌష్ఠవాన్ని వర్ణించినట్లు - అంగాంగ విమర్శ చేశారు. పదవ పుటలో "ఈ నూతనత్వం ఇప్పటి కవిత్వానికి ఉంటే కవిత్వ ధర్మం సిద్ధించిం దనవచ్చును" అన్నది చక్కని మాట. అనేక కృతక ప్రక్రియలవల్ల తెలుగులో నిండుగా ఆవిర్భవించని కావ్యత్వసిద్ధి నేడు పొడచూపుతోంది. అసలు కవిత్వ కళ తత్త్వమే మారిందని ఆధునికు లన్నట్టుగా వాదించారు ఉమాకాంతంగారు. అది తప్పు.

కొల్లూరి ధర్మారాయ కవిగారు ఆంధ్రపత్రిక వ్యాసాల్లో ఆధునిక శబ్ద వాచ్యతనీ, మర్మ కవిత్వాన్నీ విమర్శించారు. శబ్దవాచత నెవరూ మంచిదనరు. చిరకాలంగా సంస్కృత సమాసాలు విన్న అలవాటువల్లా, సంస్కృత పదప్రయోగము చెవికి ఇంపుగా ఉండడమువల్లా సంస్కృత విశేషణాలు ధారాళంగా ఉపయోగించారు తెలుగు కవులు. వృత్తాలూ, పదచ్ఛందస్సులూ తగ్గిపోవడంతో ఈ రచనలు తగ్గిపోతున్నాయి. అతి నవీనుల వచన కావ్యాల్లో మాట చెప్పనక్కర్లేదు. మర్మ

కవిత్వమని పేరు పెట్టి నిందించడము మాత్ర మన్యాయము. నా యెరుకలో ఏ ఆధునిక కవీ తన కవిత్వంలో ఇతరులకందని అర్థా లున్నాయని అనలేదూ, వ్రాయలేదూ. `నీ కవిత్వానికి అర్థము చెప్పుమ'న్నప్పుడు, "నేను వ్రాయగలంత అందముగా వ్రాశాను. కవిత్వమును పాఠము చెప్పినట్లు చెప్పరాదు" అన్న వారిని నే నెరుగుదును. ఇంతమాత్రానికి కోపమేల? నన్నయాదులు మాత్రము తమ రచనలకు వ్యాఖ్యానము చేశారా? వీరి ఊహ లేమిటో తెలియవు. ఏదో ఉన్నదనుకునే వ్యాఖ్యాతలు తాము ఊహించని గొప్ప అర్థాలు చెప్పుదురనే ఆశే కావచ్చును. , మించిపోయేదేమి? అంత మాత్రానికి `కవికి గర్వమూ, ఏదో అంతరార్థము నిమిడ్చి రచించా ననుకుంటున్నాడు' అని వెక్కసపడడమెందుకూ? ఆ అర్థ మేదో ఆ కవి జీవితకాలమంతా ఆకాశంలో వేచిఉండి ఆ తరవాత ఆయన స్మృతితో ఎగిరిపోతుంది. ఠాగూరు కవివలె అజ్ఞాత సౌందర్యాన్ని పట్టి తిగిచి పద్యాల్లో బిగించగల కవి ఆధునికులలో లేడు, ఆయన లాగ రచించబోయి, సకలేశుని వేరుగాను, ఆరాధ్యదైవాన్ని వేరుగానూ వర్ణించేవారూ, ఆయన అభిప్రాయాల్నీ, ఊహల్నీ ఆయనవని చెప్పకుండా ప్రచురించుకునేవారే గాని ఆ ఎత్తునందుకునే దృష్టి నలవరచుకున్నవారు తెలుగు కవులలో లేరు. పూత మెరుగుల కోసము గోప్య రచన చేసేవారి రచనలు అలాగ మూసుకుని ఉండడమే శ్రేయము. రాలని పూలు వారికి అందవు.

అనంతపంతుల రామలింగస్వామిగారు నవకవుల వేషాన్నీ, సమితులనీ, అంకితాల్నీ, కవితా సామగ్రినీ, కొత్త పోలికల్నీ, కావ్యనామాల్నీ, అచ్చువేసే పద్ధతినీ, సంప్రదాయకవి దూషణాన్నీ, ఆంగ్ల కవిత్వ చౌర్యాన్నీ ఎత్తి యీసడించారు `శుక్లపక్షములో'.'తామే ఆకాశం మీద నుంచో వూడి పడ్డట్టు, నిన్న మొన్నటిదాకా "గడియకు నూరు పద్దెములు గంటములేక రచింతు' నంటూ టప్పాలు కొట్టిన కవులు ఏ నవకవి పక్కనో చేరి సంప్రదాయ కవిత్వాన్ని వెక్కిరిస్తే శుక్లపక్షములాంటి రచనలు రాకేం జేస్తాయీ? ఒక్కొక కవికి ఒక్కొక్క ప్రేయసి. `నీ పాదలాక్షకు నా హృదయ రక్త మిస్తానని ఒకడూ, ఆమె కుచ్చెళ్లు రేపే దుమ్ములో త్రసరేణు నౌతానని ఇంకొకడూ, తరుణి చీర కుచ్చెళ్ళ కాగితాలమీద భాగవతాలు రచియించి పాడుకొందునని మరి యొకడూను. కొందరి ప్రేయసిని గుర్తించి మధురవాణి రామప్ప నడిగిన ప్రశ్న అడగాలి కూడాను. `వలపుటావిరి స్రుక్కు నా బ్రదుకుమీద ఇనప పాదాల నిడి లోక మిపుడు నడచు' నని ఒకరంటే`వలపు తీపి యెరుంగని వట్టి రాతి గుండె లోకమ్ము నిప్పులు గురియనిమ్ము' అని వారి స్నేహితులూ, "చుర చుర కాలిపోవు బ్రతుకుటిసుక యెడారిలో బాహులెత్తి, దాహమని మ్రోగు నా మహత్తర పిపాస" అని వారి అనుయాయులూ `కనికరపు నీడ కరవైన కరకురాతి లోకమందున నీ వెవ్వరో కృపాబ్ధి'? అని వారి హితులూనూ. `తరులెక్కి అల

నీలగిరులెక్కి మెలమెల్ల చదలెక్కి జలదంపు నీలంపు నిగ్గులై' పోతాను అని ఒకరంటే `ఇల్లుదాటి సెలయేళ్లను దాటి నదులు దాటి కాననములు దాటి ఎగిరిపోదు నే నెచటికో" అని రెండు చింతలవారు.`ఎవ్వరని ఎంతురో నన్ను ఏననూనభావ విభవాభిరామ ప్రభాన్వితుండ.... ఏ నపూర్వ కల్పనానల్ప ప్రజ్ఞాన్వితుండ'నని గోవర్ధనరావుగారు ? "తరతరమ్ముల ప్రేమ స్వతంత్రు లరుగు దారి బోయెడు నూతనాధ్వగుల మనల బరిహసించెడు పాడు ప్రపంచమునకై పారవేయుము నీ యలంకార భరము" అని ఒకరూ,"ఇర్వరము పాపపంకిల మీ జగాన, నిముస ముండక .... నిర్మల పవిత్ర భరత మాతృ విశాల గర్భాంతరాళ నాళ జీవస్రవంతుల నోలలాడ గ్రుంకిపోవు మిప్పు డకుంఠితగతి, భువనమెల్ల విభ్రాంతి నీరవము గాగ' అని ఇంకొకరూను. ఇలాంటి రచనల్ని చూసే కుందుర్తి నరసింహారావుగారు "ఆడది మగవాడు చేరీ, అంటగట్టుకు దూకబోతే యేరు గొల్లుగొల్లుమంటూ ఇంకిపోయింది. ఇంకిపోయిన యేటి నీటిని, యేమి ఇదియని ప్రశ్నవేస్తే `చావబోతూ కౌగిలేలని జవాబిచ్చింది!" అన్నారు. దుఃఖము శేషనైపోయింది. పురిపండావారు "ఈ నిశివేళలందు, గగన పథమున దారకా గణము రాల్చు నశ్రుకణముల నానయనాశ్రుధార గలిపివైతును. గాఢాంధకార పటలి వెక్కి వెక్కి దుఃఖింతు" నంటారు `హృదయవేదన'లో; ఏమి అంటే, `నాదు ప్రణయ సామ్రాజ్యలక్ష్మి నన్ను నెడబాసిపోయిన నాట నుండి నా మనోబ్జము ముకుళించి నవసిపోయె"నట. గోవిందు వేంకట నరసింహశర్మగారు నిట్టూర్పులులో`కొంచెమైన పథము తోపదు పాడు ప్రపంచమందు, బోరుమని యేడ్వనీయవు' అన్నారు, రెంటచింతలవారు భగ్నమనోరథుడులో "ఎవరివాడవు నాయనా ఈ నిశీథివేళ నేడ్చుచున్నావు వెక్కి వెక్కి ఒంటరిగ గూరుచుండి?..... నన్ను దరియంగరాకుడు నా యవస్థ వినగుతూహల మైనచో విన్నవింతుగాని నన్ జేరరాకుడు, కలవు నా హృదంతరంబున గీతికాతతులు" అంటున్నారు.

దీపం క్రిందనే క్రీనీడ. అనుకరణ, అనువాదమూ తెలుగు వారి జాతీయ కళలు. శతాబ్దాలపాటు జీర్ణించిన అలవాట్లు. అనంత పంతులవారు `ఒక్కని యర్థ మింకొక్కరు దుర్వినిసంగ్రహణంబు సేయుటే నిక్కము' అని పరిహాసముగా కాక పరమార్థంగానే వ్రాశారు. బాణోచ్ఛిష్టం జగత్సర్వమట కొత్తదన్నది ఎక్కడనుంచి వస్తుందీ అన్నారు. వీరిది పూర్తిగా ప్రబంధ పాండిత్యమే. వీరి కావ్యములో `సామాన్య లోచన మీక్షించెడు లీలలే కవన కాచద్వారమున్ జొచ్చి'నవి. కాని "దర్శన భావాధిక విస్మయార్థములు' తోచలేదనే నా అభిప్రాయము. కథలు వారు నడిపినట్లున్నవే కాని జరిగినట్లు లేవు. శుక్లపక్షము అధిక్షేపకావ్య మాయిరి. అయితే సంవత్సరాలపాటు దీనిని తలచుకొని ఆధునిక కవిత్వ ప్రతిపక్షులు చాలా సంతోషించారు. రామలింగస్వామిగారి వృత్తాలు మహా జోరుగా నడుస్తాయి. వారి పుస్తకము విద్యార్థులకు పాఠ్యగ్రంథము రెండు విశ్వవిద్యాలయాలలో.

అక్కిరాజువారి విమర్శన కవులకు గట్టిగా తాకింది. ఆయనకు గట్టిగా ఆనా డెవరూ సమాధానము చెప్పలేదు. ఆయన విమర్శ అయితే వేంకట పార్వతీశ్వరులు, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, నండూరి, రామిరెడ్డి, కవులమీద నైనప్పటికీ నవ్యత్వానికి ప్రాతినిధ్యం వహించిన సాహితీ సమితికే దెబ్బ తగిలింది. పురోగామి ఉద్యమాలకు ఆటంకము కలగడము అభ్యుదయకాము లెవరూ సహించరు. గిడుగు రామమూర్తిగారూ, తెలికిచెర్ల వెంకటరత్నంగారూ, చిలుకూరి నారాయణరావుగారూ, సాహితీసమితి సభాపతులు శివశంకర శాస్త్రిగారూ వంటి పెద్దలంతా చేరి నవ్యసాహిత్య పరిషత్తును స్థాపించారు. వచన రచన, గేయరచన, కథానికలూ, విమర్శలూ కూర్చుకుని వర్ధమానుల ప్రతిభ "ప్రతిభ" పత్రికగా రూపొందింది. ఆధునిక కవిత్వములో నూతనత్వమే లేదని సులోచనలములు లేని పండితులకు అనిపించినా, సామగ్రిలో, ఛందస్సులో, వర్ణనా పద్ధతిలో ఆ సమయములో వికసించిన నూతనత్వమే ఆధునికత్వానికి పునాది అయినది. పెక్కురు కవులు సుందరములైన ఖండకావ్యాలు రచించారూ, ప్రచురించారు. అందమైన పరిణామముగల కథలూ, సుందర భావములోనికి చదువరిని మీటగల ఖండకావ్యములూ చాలా వచ్చాయి. వీటికి ప్రోత్సాహము నవ్యరచనోద్యమమూ, ఆధునికులు రచించిన ఖండకావ్యములున్నూ.

సహదేవ సూర్యప్రకాశరావుగారు వేదుల వల్ల ప్రాభావితులైనారు. `నిర్మలంబైన గౌతమీ నీరమందు తన సొగసు వన్నెలను చూచుకొనుచు సందె చెరగులను సర్దుకొను నభశ్రీ లతాంగిని చిత్రించినా. "మునిమాపు"లో గౌతమీ తీరములో ఉపవిష్టులై నిర్వేద సమాధిలో పరిసరములను మరచిన సమయములో సూర్యాస్తమయమూ సంధ్యా నిష్క్రమణమూ నక్షత్ర ప్రకాశమూ మేఘావసరమూ జరిగేవీ "చుక్కలు మాయమయ్యె గౌతమీనది నిద్రలో కలవరించె" ననుకొనేవారు వీరు. వీరి మునిమాపు, దివ్య తేజస్వి అనుభవాన్ని బట్టి నిలిపే రచనలు. పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు విశ్వనాథ ప్రభావము పొందినవారు. వీరి పద్య పఠనము కూడా విశ్వనాథ సత్యనారాయణగారి పఠన పద్ధతిలో ఉంటుంది. `శతపత్రము' కాబోలు వారికి అంకితముచేస్తూ వారిని వీరు తమకు గురువు లన్నారు. అయితే వీరి "ఆంధ్ర"లోని ఖండకావ్యములలో విశ్వనాథవారి కథా కావ్య రచనా రీతులు కానరావు. పద్యాలకు మధ్యన విరామాలూ, వచన సన్నిభములైన రచనలూ, క్రియలను ముందు చెపుతూ వీటి వెనుక వస్తుభారము నమర్చే సీసములూ, వీరి రచనలలో కానరావు. ఆర్తులూ ఆవేశపరులూ అనే వాక్యాల నడుమ (చదువరి మనసులో) వంతెనలు ఏర్పడిపోయే కాళీలు మాత్రమున్నాయి. "ఆంధ్ర" ఆధునిక కవిత ఆంధ్రవాఙ్మయానికి కూర్చిన అలంకారాల్లో ఒకటి. గండపెండేరము, డొక్కా దంపతులు, రామదాసు, త్యాగరాజు, మాధవశర్మ అనే అయిదు ఖండకావ్యా లున్నాయి అందులో. చక్కని ఊహలతో

పెద్దన గారి పసిడి పలుకుల జ్ఞాపకాలతో గండపెండేరము మెరుస్తోంది. ఈ కథ మన తెలుగువారి యెదలన్ మెదలున్. `డొక్కా దంపతులు', సీతమ్మగారు `పార్వతియు బోలె తన తాళి బలము నమ్మి" గట్టు లొరసికొని ప్రవహించిన గోదావరి కడ్డముగా నిజేశు నంపిన కథ. ప్రథిత ప్రబోధ ఘన మధుపథము. రామదాసులో `జారీ కాబడి హుకుము జరూరై యొక రెప్పపాటులో గోపన్నన్ కారాభీకర దృశ్యము ఫారాయిడె తూర్పు తెలవారిన తీర్పే.' గడువుతీరు రాత్రి తానీషా కోటలో "ధణధణామని కోట తలుపు లదిరి, చకచకల్ మరి నడక సాగిసాగి, తళతళ్లై చిరునవ్వు తాండవించి దివ్యరోచులు రూపుతేరి నిలచి, నందనారామ కుసుమ నిష్యంద మాధురులను మరపించు వనమాల తెలియరాక ఘుమఘుమై తానిషా యెద కొల్లగొనగ నయిరి - రామయ్య యొకడు". విశ్వనాథ వారు మిగిల్చిన `దయాదాన ధర్మవీరుల రసాస్పద కథనమును ఈయన చేసినారు. వారి ఉపోద్ఘాత వాక్యములవలె వీరి కథలలోని భాగములు కావు.

మద్దిపట్ల వెంకటరమణయ్యాగారు, వడ్డాది సుబ్బారాయుడుగారి శిష్యులట. వారు భక్తచింతామణిని పౌరాణిక గాథా కథనాలు వాడకుండా రచించినట్లుగా, వీరు`ఝరీతరణము' అను రాణా ప్రతాపసింహుని ఝరీ తరణమును ప్రబంధకాలపు ఏనుగ కాలి ఊహలు లేకుండా -కథవలె చెప్పినారు. ఏ కవితా సంకలనములోనికైనా చక్కగా ప్రవేశించగలిగిన ఖండకావ్య మిది. "ప్రథితమేవాడ రాజ్య సంభరణశౌలి వీరనిలయ శిసోదియా వారిధీందు డల్ల రాణాప్రతాప సింహాధిపుండు చనెడు నొక్కడు చైతకాశ్వంబుమీద" అని ప్రారంభించి చదువరిని"చైతకా చైతకాయంచు క్ష్మాతలేశుడునుగు మోమును దన యొడియందు జేర్చె. కనుల నీరొల్క పుల్కుపుల్కునను దొరనుగాంచి యాతేజి కడసారి కన్నుమూసె" వరకూ చక్కగా తీసుకుపోతా రీయన. ఎప్పటికేనా తన రచనలు భావుకుల కంటబడునను నాశతో తల వంచుకు తిరిగి అట్లే వెళ్లిపోయిన యువ కవు లీయన.... పెనుమర్తి వెంకటరత్నముగారిది కోయిల గొంతు. ప్రచురణ`రత్నాపణము' ఆయన వెళ్ళిపోయిన తర్వాత వచ్చింది. "ఈ సమున్నత తాళ భూమీరుహమ్ములే యుగాల నా వంటివో యిపుడనూన నిశ్చలాస్పంద ముకుళిత నేత్రములను తలచుచున్నవి యుగయుగమ్ముల చరిత్ర" అని ప్రారంభించి "ఈ యుగాంతర జీవు లెన్నెన్ని మార్లు ఆశలను బెంచుకొనిరో దిగంతములకు బ్రాకలేని యాశల తలపై ధరించి. ఇల నిలబడి శీతోష్ణములు సహించి" అని ముగిసిన వీరి "తాళవని" విశ్వ సాహిత్యానికి కానుక వెట్టదగిన రచన. తునుకలుగా నిల్చిపోయినవి వీరి రచనలు పెక్కులు.... బొడ్డు బాపిరాజుగారు ఏలూరు నగరము నవ్య సాహిత్యానికి కానుక వెట్టిన ముగ్గురు రత్నాలలో ఒకరు. (నండూరి, మొక్కపాటి

తక్కినవారు) వీరి వ్యాపారవాణి తీయదనమెంతో నాకు తెలియదుగాని వీరి కవితావాణి సజీవమూ లలిత మధురమూను. ఆధునిక కవిత్వంలోకి ఇట్టివారి రత్నాల రచనలు పెక్కులు లభించకుండినచో తెరచాపల బుగ్గలే మిగిలి వేగానికి తగిన సరుకు లేదనిపించేది. `ఈ తిమిరావ గుంఠనము లించుక యించుక దించుచున్, సుధాశీతల మందహాస పరిషిక్తవిలోల విలోచనోన్మిష జ్యోతులతో దిగంతముల నొక్క పరిన్ వెలిగించుచుండి, నిర్భితి జరింతు, వింత వివరింపుము నీ కథలో తటిన్నటీ!" అని వీరు మెరపును సంబోధించి చేసిన ఖండకావ్యము ఆధునిక కవి సౌందర్య చైతన్యానికి చక్కని ఉదాహరణము. వీరి కవితా కన్య రుచిరస్ఫారములైన ఉదయాచల సానువులను, మిన్ను వదలనట్టి రవికీ కొలకు గదలని నీరజ లతాంగికీ గల ప్రణయ బంధములనూ, మన్నున్ మిన్నులు గూడు చోట నివసించే సాగరుని ప్రారబ్ధాన్నీ, పరువెత్తు మున్నీటి తరగ గుర్రాల సవారీ యొనర్చు చందమామనీ, పడమటి కొండ నెత్తములపై చిలికించిన కుంకుమంబు లాగడపల బిల్లగాలి తరగల్ విరజిమ్మె అందాన్నీ "విపంచి"లో మీటింది. `చరిత్రలకు నందని కాలపు కంచుకోట ద్వారములను వ్రేల్ శతాబ్దపు తెరల్ తొలగించు కథా నిధానముల' గాంచిన అజంతా పరిసరాల వ్యాఘ్రనదిని వర్ణించినది. కోణార్కలో కింశుకచ్ఛాయ నిలిచి మనోహరునికై నిరీక్షించు నలరు బోణిని, విలాసినీ లాస్యవేళ మోగిన మృదంగ శ్రావ్య నినదమ్ములనూ, చిత్రించినది. బాపిరాజుగారి కవితావేశము శైల గర్భాంతరాళ నిర్ఝరము వలె నైసర్గికము.

రామచంద్ర అప్పారావుగారిది వింతయైన గొంతు. యౌవనము రేపు సాహసోత్సాహాలతో లోకములో అడుగు పెట్టే యువకుని తలపులు పట్టి చూపిస్తారీయన. `నీ కొరకు నేను పుట్టుట నాకై నీవు నిలుచుటింక నీ జగ మెట్లు తలచికొన్న నేమి కొరత?' అంటారు. `చీర విడిచి యొంటి పొరతో జెరువుకు దిగు నూత్న యౌవనకన్య మనోధినాథు నెంచుకోక హఠాత్తుగా గాంచి'న బెదురును వీరు కుంచెతో గాక మాటలతో పట్టబోవడము చిత్రము. వీరు చిత్రకారులే కావలసినవారు. కలము పట్టి రంగూ రేఖకి బదులు మాటలు పట్టేరు. వీరి రచన తదనంతర పరిణామాన్ని తెలుపుతుంది. `చటుల ఝుంఝూనిలా కంపితోర్మికా శిరశ్చలిత చంచలేందు శకలములూ, నగ్న సౌందర్యమూ, చివురుమంట కాని, దీర్ఘకుంతలమ్ములు కప్పుకొన్న నగ్నాంగన, జలకేళీలోలబాల, పూల మొగ్గల నగలతో మురిసే రసాలమూ, పొర్లు కెరటాల నురుగు కేశాలూ' వాలుజడ సౌందర్యమూ' వర్ణిస్తూ ఈ చిత్రకారులు కవియౌట చిత్రము. వీరిని చిత్రములు వ్రాయమని కోరుతున్నాను.

ఆధునిక కవిత్వము ఉమాకాన్తముగారు ఎదుర్కొనే సరికే దాని లక్షణములతో, పద్ధతులతో ఒక రాజ్యమైంది. దాని సత్తను గుర్తించలేనివారూ దాని రాజ్యములో - కారణాలేవి అయితే నేమి - ప్రవేశించలేనివారూ దూరముగా నిలబడి వీపుకి కళ్లు మొలిపించుకుని అవకాశ మున్నంతవరకూ దానిని తమ పరిసరాల్లో నిషేధించి తమ ఆధిక్యము నిలిచిం దనుకున్నారు. అన్ని పురోగామి ఉద్యమాల వలెనే ఈ ఉద్యమము కూడా ముందుకు సాగిందీ పాత మైలురాళ్లు వెనక నిల్చిపోయాయి తమ పురోమార్గగమన శక్తిని నిరూపించుకుంటూ.

***

# 11. సాహితీసమితి తరువాతి నవకవులు

`భారతి' తెలుగువారికి ఇచ్చిన ముగ్గురు నవకవులలో కొడాలి సుబ్బారావుగారు ఒకరు. (జాషువా, బెళ్ళూరీ తక్కినవారు.) వీరందరూ కొద్దికాలంలోనే చదువరుల నాకర్షించారు. విశ్వనాథవారి ఆవేశమూ, ఆంధ్రాభిమానమూ ఆంధ్రప్రశస్తిలో వర్షావసరమువలె ఉరుములతో మెరుపులతో తొక్కుకుపోయాయి. వారి అనుయాయులే కొడాలివారూ, ఆ రెండూ వీరి మనస్సులో హంపీ క్షేత్రపు పూర్వ స్మృతులలో ముగ్గి హంపీ క్షేత్రపు ఖండ కావ్యాలుగా వచ్చాయి. ఆ క్షేత్రాన్ని దర్శించి తమ అనుభవాన్ని రచించిన వారితరులు ఉన్నా, కొడాలివారి రచనలలో ఉన్న శక్తి, వేగమూ వారికెవరికీ అలవడలేదు. తెలుగువారి నైజములోని ఆవేశమూ, కవిత్వాభిమానమూ విశ్వనాథవారి సాహచర్యముతో కొడాలివారిలో పదునెక్కి వాడిగా వచ్చాయి.

కొడాలివారు విశ్వనాథవలె చారిత్రక క్షేత్రాన్ని కావ్యసామగ్రిగా స్వీకరించారూ, వారి సీసముల ఎత్తుబడిని - ఏ రాజు పంచెనో, ఈ పొలాలెంత చేవ, గణితశాస్త్రాంభోదిఘనుడు, ఛేదింపబడి వంటి వాటిని - స్వీకరించి కొత్త ఆవేశముతో విశ్వనాథవారు వేసిన ముడులు - చేవెక్కించుకున్నవి, శౌర్యపు పాయసమ్ములు, గాలి పౌరాతన్యమూ, వియ్యాలు బిగిసిన చోట్లూ, వంటివి - పట్టుకోకుండా సాఫీగా నడిపించారు కొడాలివారు. వారికి లేని ఒరవడి వీరికి ఉంది. ఈ ఒరవడి, పద్యాలు వచనంలాగా నడిచిన చోట్ల వివరంగా కనబడి పోతుంది. తెలుగులోనికి పద్యము ప్రవేశించిన ముహూర్తం చెడ్డది. తెలుగు భాషకి తగని తొడుగుని అమర్చి శతాబ్దాల పర్యంతం - జీవుడికి బొందిలాగ గుదిబండ అయింది. చంపకమాల యెందుకు ఎంచారో, శార్దూలము ఎందుకెంచారో, గీతము ఎందుకెంచారో, ఆటవెలది ఎందుకు ఎంచారో, తెలియకుండా పెద్దపెద్ద చంపూ కావ్యాల్ని పద్య పంజరాలతో రచించారు కవులు. చదివేవారైనా, చేతకాని సంగీతాన్నైనా సరే ఈ పంజరాలను ఎక్కించి పద్యగతిని నిటాగ్గా లాగేసి తమ సంగీతములోని ఆరోహణావరోహణాలకు వీలుగా పంచుకున్నారు. పద్యాల కుండవలసిన పాదాంత విరతిని తీసేసి - ఇంతలోనే

నాలుగు విరుపులా? అని - సూరన్నలను కూడా ఆక్షేపించారు పెద్దన్నలూ, ఉచ్చారణకు కూనిరాగము చేర్చి అక్షరగణాలు వైవిధ్యము స్ఫురించకుండా పాడి ఛందోభేదాన్ని నిరుపయోగము చేశారు సభాముఖాన్న `చదివేటివారు. నన్నయగారు సీసాన్ని ఇంచుమించు గద్యగా వాడుకున్నారు. విశ్వనాథవారు పద్యాన్ని దేన్నైనాసరే దాని సహజగతి స్ఫురించకుండా వ్రాయగలరూ, వ్రాశారు కూడాను. కొడాలివారు కూడా ఆ దారిలోనే చేశారు చాలా రచనలు. విశ్వనాథవారి వచనంలో వారి పద్యాలలో కంటె ఎక్కువ కవిత్వము కనబడుతుంది నాకు. కొడాలివారి వచన రచన ఎట్లు తేరి ఉండేదో?

అయితే వారి పద్య రచనలలో `శిలలు ద్రవించి యేడ్చినవి' (కృష్ణశాస్త్రిగారి యేడ్పునకు తరువాత ఇంత అందమైన యేడ్పు మనము వినలేదు.) బాకు పోటున చిమ్మబడిన నెత్తురు జల్లు వెల్లవేసింది రాజవీథికి, శిరము తెగి మొండెమై కోట బురుజు మీద పడక నిలిచింది, విఠ్ఠలాలయ శిలావేదులందు దేవి పాలమీగడ చిలికింది. తెనుగు రారాజు పండిన యశస్సూ, రాకాసిరేడంటరాని మంటా, వాల్మీకి యమృతంపు వాన చినుకూ జీర్ణించిన కుగ్రామము చూపించింది, కాళ్ళ పారాణి చిక్కన కిన్నరాంగనా నృత్యవేళల చెమటలో కరగి చారపోసినది, దాసియయ్యు పతివ్రతాత్వ భంగము కోడి నిట్టూర్పులో అగ్గి నిలిపినది, దీన చరిత కాస్పందంబయినది ఆంధ్రమాత. `కాలము మారిపోయి శునకంబులు బొబ్బటి లంగ చాలక నిల్చిపోయిన బెబ్బులులూ, రణము వాక్కులలో విజృంభణము పెరిగి గుక్క తిప్పుకో వీలులేని రాజసభా, వలయంబులున్నై, విరళీకృతంబులై కదలిన శబ్దములూ, సలసల వేడినెత్తురులు చారలు గట్టి బుగ్గలపై రాలు కన్నీటి బొట్లూ జల్లుజల్లుమనిపిస్తాయి. కొడాలివారి వాణిలో తెలుగు గొంతు ఆవేశంతో గణగణ మోగింది. విశ్వనాథవారు ప్రారంభించిన చారిత్రక కథనము, కొడాలివారి రచనలతో ఆంధ్రవాఙ్మయములో పీఠము వేసుకుంది.

రాయలవారి సభలోకి రసమయుడైన అజ్ఞాత కవి ప్రవేశించినట్లు భారతి పుటలలోనికి జాషువా అందపు పద్యములు సందడి చేయకుండా ప్రవేశించినవి."నాయకురాలి మాయ కదనంబున మా పలినాటి పౌరుషము యడుగంటె గడ్డి మొలిచెన్ పులిచారల గడ్డమీద" అంటూ రసమయ రచనలను వస్తుధ్వనిలో వినిపించింది వారివాణి. సంస్కృత పదకింకిణుల మ్రోతకు మొగము మొత్తిన చెవులకు తెలుగు పలుకుల తియ్యదనము రుచి చూపింది వారివాణి. బాల్యంలో ఒడిలో కూర్చో బెట్టుకుని గొల్లసుద్దులు వినిపించి తేనె తేటలూరు భాషనూ, వెచ్చని గుండెనూ తండ్రీ, ఇలుదాటి పోయినన్ మరలినదాక మూడు గాళ్లతో వెంట

తిరిగిన ప్రేమాభిమానాల రుచిని తల్లీ నేర్పారు ఈయనకు. అందాలు వర్ణములాగ కురిశాయి ఈయన రచనలలో. ఈయన భావన అంతా పరిచిత ప్రపంచ సామగ్రినే వాడుకుంటుంది. గిజిగాని తూగుటుయ్యేల గృహమూ, భారతమాత పచ్చిబాలెంతతనమూ, నాయకురాలి మాయ కదనమూ, గజ్జగదిలించి యాడు నిటాలేక్షణుడూ, సంతానము వెంట మూడు కాళ్లతో తిరిగే తల్లీ, పున్నమ నుండి అమావాస్య వరకే జీవించే చంద్రుని అల్పజీవనమూ, నెమలి మహేంద్రత్వమూ(కన్నుల సిరిని బట్టి), బంగారు పూవుటిండ్లూ, చిన్నాదేవి గులాబి తోటలూ, క్ష్మామండలంబెల్లముద్దు గొన్న బుద్ధదేవుని చరణాబ్జములూ, నెత్తురు చూడని కసాయి చిరుకత్తీ, ఉయ్యేల దిగని భాగ్యోన్నతుడూ (పసిబిడ్డ), మసీదు గుబ్బల విలాసమూ, కర్ణుని దిగదీసిన కులపరీక్షకులూ, ఇనజుని యెంగిలింగుడిచి పోల్చిన ధర్మరాజాదుల శరీరములూ, ఏనుగు పిల్లల వంటి పాండుపుత్రులూ, కృష్ణరాయల నెరుంగనట్లు నంగనాచినడకలు నడిచే తుంగభద్రా, పసిడికావ్య ద్రవ్యమును వెండితో జెల్లింపం దొరకొన్న గజనీ మహమ్మదూ, పరిచిత ప్రపంచ సామగ్రే వీరికవితా చంచల ప్రకాశముతో అందముగా గోచరిస్తుంది. ఊహ సాగి దూరపు టందాలందుకో యత్నించినప్పుడు కూడా `గగన గంగమ్మ కవ్వలి గట్టునందు, దేవతలు స్నానమాడు రేవు పొంత, రాజహంసల పాదముద్రలు రహించు నిసుకతిన్నెలూ; పార్థుడు గాండీవముతో నాలములో నటించు సమయంబున నింద్రుని వేయిగన్నులన్ రాలిన మోద బాష్పములూ; ఇనబాలకుని దినమ్మును గర్భమును బూను కాన్పులుడుగని పొడుపు దిక్సతీ; నెత్తుటి గాలివానా; అరమైలు సాగనంపి సెలవు గైకొను గోపురమూ; గాధినందనుని మేనకామిషతో ఆక్రమించుకున్న సంసార సాగరమూ, గుండెల్లో గుణాలు దాచుకున్న పరిచిత వస్తువే మెరుస్తుంది. అతను సదృశ భావాలకు కూడా సుందర తనువులు చేకూరుతాయి ఈయన లేఖినీ స్పర్శతో. ఈ రూపకల్పన మల్లెపూవుల్నీ, మధు బిందువుల్నీ రగిలే కుంపట్లనీ, బ్రద్దలయ్యే అగ్నిపర్వతాలనీ, గజ్జె గదలించి ఆడే నిటాలేక్షణుణ్ణీ కవితా వనానికి పట్టి తెస్తుంది. చదువరుల నూతనానుభవానికేమి చిక్కు?

ఈయన భాష తీయని తెనుగు. సంస్కృత సమాసపు అద్దాల అలంకారము లీయన కిష్టములేదు. తెలుగు సౌరభ్యంబుల్, నోరి చాపల్యము, పూర్వపుం బెద్దరికమ్ములూ, నేత్రయుగళిన్ సందీపితింబైన, అంటూ తెలుగు మాటల ప్రత్యేక సత్తను అడుగడుక్కీ దీపింపజేసే మక్కువతో సమాసాలు సాధించగల శ్రవణ సుఖానికీయన స్వస్తి చెప్పేరు. తెలుగు మాటల చేరికలు `కన్ను మిన్నెరుగని గర్వము, నినుముట్టరాదను నియమము, పరుల కొంపలు దినివేయు స్వార్థమూ, కొత్తజాతీయాల చైతన్యాన్నీ, సమాసాల సౌందర్యాన్నీ సేకరించుకుని కనబడతాయి. వీరి రచనలలో. పద్యాల అన్వయము అందపు పచ్చిక బయళ్ళలో విన్నాణపు

వంపులతో సాగిపోతూ కాలిబాటవలె వలపు పిలుపులందిస్తుంది. "పోయె నమాస రేలిపుడు పున్నమవెన్నెల వచ్చె యుల్లమున్ కోయిల పిట్టయై, తెలుగు కొమ్మలన్నివసించె, హాయిగా గూయకపోవునే, చిగురు కోకలతోడ వసంత లక్ష్మియున్ దాయగ వచ్చె, బుష్పవదనంబున బ్రేమమరంద మూరగన్" అనీ "వాసిని గన్నరెడ్ల పరిపాలన కొండల దండలన్ శిలాశాసన సంగతిన్నిలచి చచ్చియు చావదు, రెడ్డిరాణిమై బూసిన కుంకుమంపు పసపుంబసలంటిన కన్నెతోండ నేడూసరవెల్లమైనవయుచున్నది పందువెదుళ్ళ సందునన్" అనీ పరిచిత సౌందర్యాన్ని ఉదయ వాయువువలే అందిస్తాయి వీరి పద్యాలు.

పద్యమునందంతటా అనుభవాలు చెప్పి, ధ్వని పూర్వకంగా రసానుభవం కల్పించి, చివ్వర ఒక్క – వాచ్యత వెగటులేని – పద ప్రయోగంతో రచించే చిత్రాన్ని పూర్తి చేస్తారాయన. `నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి, రూపురేఖా కమనీయ వైఖరులు గాంచి "భళీ! భళి!" యన్నవారే "మీ దేకులమ"న్న ప్రశ్న వెలయించి, చివుక్కున లేచిపోవుచో బాకున గ్రుమ్మనట్లగును పార్థివ చంద్ర!" అని చదివితే సహృదయులు `సిగ్గు సిగ్గు' అంటారు. ఈయన కూడా పద్యాన్ని "వచింప సిగ్గగున్: అని పూర్తి చేశారు. అలాగే, "చిత్రములు మద్భూమి చరిత్రాంశముల్" "(మూలుగుచున్న దాంధ్రుల విభూతి) శతాబ్ద పరంపరాహతిన్". "మిథ్యా భారత గ్రంథముల్", "ఇక నేనియు రమ్ముదారికిన్" "(కాలము గమనింతము రమ్ము) కవుంగిలింతలన్" "(కులుక నేర్చిన కావ్య గుచ్ఛమిది) నాకుం గూర్చు నానందమున్" వంటి వెన్నైనా ఉదాహరణా లివ్వవచ్చును. ఈ పద్ధతి కవిగారి రచనను సంపూర్ణము చేసి నిండుదనము తెస్తుంది రచనకి.

"అయితే జాషువా కవిత్వము ప్రాచీన సంప్రదాయానికి చెందినది గదా, ఆధునిక కవిత్వముగా లెక్క వేసుకున్నారేమి?" అని చదువరులు అడుగవచ్చును. జాషువాగారు ఆధునిక కవుల ప్రేయసీ కవిత్వాన్ని తిట్టారూ, "చకోర బంధు బృందములకు సుధారస భుక్తినిచ్చు మృగాంకుడంటూ", చూచివచ్చినట్టు యుగయుగాలు దిగివచ్చిన అందాల మాటల్ని వేయిన్ని ఒకటోసారిగా తామూ వాడుకున్నారూ, రెడ్డిరాజు ఖడ్గ వారిదము నీడ బందు. పూచిన పంటచేను" అంటూ ఖడ్గాన్ని మబ్బుతో పోల్చి – దృక్సిద్ధమైన పోలికలను కాక కళ్లు మూసేసుకున్న మనస్సుతో సాధించిన పోలికల్ని వాడేరూ, చక "చకలీను తొమ్మిది రసంబుల చిప్పిలు మేలికావ్యసృష్టి అంటూ అనుభవసుందరమైన రసానికి వాచ్యపు అద్వరుటైజుమెంట్లు తగిల్చారూ, మధ్య పద్యాలు తీసేసినా, పద్యాల వరుస మార్చినా నష్టపడని పద్యాల బంతులు పంచ రత్నాలూ నవరత్నాలూ లాంటివే – ఎక్కువ రచించారూ, పెక్కు మూర్తుల పూర్వకవి సంప్రదాయాలో అవలంబించారు. కంటికి తోచే సౌందర్యము కాక – ప్రతీ వంటకంలోనూ వేసుకునే మసాలాపొడి పాత్ర

ధరించే - కవి సమయాల్నే తగ్గించారూ, వర్ణించే వస్తువు సౌందర్యాన్ని కాక `నుడికారపు సొంపు' నూ `రూపురేఖా విలాస వైఖరుల'నూ పొగిడేవారిలో చేరుకున్నారు. నిజమే వారు యాభైపాళ్ళు ప్రాచీనులే. అయితే తండ్రిగారు చిన్నప్పుడీయనకు వినిపించిన గొల్లసుద్దుల ధర్మమా అని వీరికి ప్రబంధపు వీథి అంగళ్ళ అతిలోకపు సింగారాలు కాక నిత్య జీవిత చైతన్యాన్ని ప్రకృతిలో చూడగల జానపద చైతన్యమలవడింది(దానినే నేను వివరించినాననుకుంటున్నాను దయచేసి మరియొకమారు వారి కవితా వివరణము చదవండి). ఈ స్వానుభవ చైతన్యాన్ని - స్వకపోల కల్పనలను కాదు - బింబించే రచన ఈయన చేసిన కారణం చేత ఈయనను ఆధునిక కవిగా ఎంచుకున్నాను. ఈయన రచనలు మాతృప్రేమ, శ్మశానవాటి, మాంపాహి, రాజ దర్శనము, క్రీస్తు, అయోమయము, వంటివి భావనిశ్శ్రేణులే అయి తలకట్ల పద్యాల మంజరులు కాక కందబలముకల పద్యాల వరుసతో ఖండ కావ్యములే ఆవడము వల్ల కూడా ఈయనను ఆధునిక కవిగా ఎంచుకున్నాను. అలంకార బాహుళ్యమువల్లకాక వస్తుశక్తి వల్ల చదువరులను పలకరించే రచన కనుక ఈయనది ఆధునిక కవిత్వ పద్ధతే అంటున్నాను. ఈయన ఆధునిక కవిత్వము చదవడము వల్ల ఈ పద్ధతిని అవలంబించినారా? అంటే, ఖండ కావ్యరచనలో సమకాలికులను చూడకుండానే రచించి యుండరంటాను. ఈయన పద్యాలు రావడము భారతిలో ప్రారంభము. ఆధునిక కవిత్వపు తీరు తీయముల నీయన చూచే ఉండవలెను గదా? వీరు"రచ్చగెలుపు"లో `మునుగున్నేశ్వర రావువారి చరణాంబుల్గొల్చుచుంటిననీ, ఆదిని రుక్మిణీ పరిణయంబును వ్రాయుచుంటిననీ చెప్పుకున్నారు. అది 1915 - 20 నడిమి కాలము - భారతి 1924 నా డారంభము. `ఇరువదవ శతాబ్దపు' "కబ్బపుందుపాలునబడి కలవరపడు నవయువకుల" వ్రాతలీయన యెరుగరనుటెట్లు పొసగును?

బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు రాయలసీమ కోయిల. తలమర్లగ్రామ జన్ములు. ఆ జన్మసిద్ధమైన ప్రకృతి సౌందర్య దిదృక్ష వీరి స్వభావానికి జీవనము.`మంజులంబయితోచు బ్రహ్మాండ మెల్ల కౌగిలింతు నొక్కొక్క మారు గాఢరక్తి' అంటారీయన. `లోచనోత్సవకరమైన ఈ ప్రకృతి తన్వి విలాసము గాంచి' నివ్వెరపోతారు. `పక్షిగా ప్రసూనముగా భావ వీచిగా మనోహర నిర్ఝరిగా' ఒక్కొక్క మారూ, మెరుపుగా గర్జితంబుగా మేఘమాలగా సురేంద్రచాప ప్రభగా ఇంకొక మారూ పరమేశ్వరుని సరణులు దర్శించుకుంటారు. శ్రీనివాసమూర్తిగారు జన్మతః సౌందర్య తపస్వి. విశ్వ విభుని సుందరోద్యానమే తపోవనముగా పెద్ద కాలము వీరు సౌందర్యాన్వేషణ చేశారు. మీలాగా నాలాగే `క్షితిని రాలిన తొలకరి చినుకు నమ్మి లేతపైరులు నాటి, ఎదిగి కేదారమెల్ల ఫలించినపుడు కనులగాంచెడు భాగ్యము కలదొ లేదొ' అని సంశయాకులు లౌతారు. అయితే మనకు

దూరమై ఆశా వీథుల తీవ్రమై విసరు ఝుంఝూకీర్ణమై వృక్షశాఖా శాఖీనిచయంబు లూగుటనూ, శిశిర మారుత హతులపడు జీర్ణపత్రములను గుర్తించి, ఒక కల్పమైన ప్రకృతి మాధుర్య తృష్ణతీర్చుకోగలనా, అని బాధపడతారూ, 'ప్రకృతి సంపదలు విడిచి యెట్లు మరణింప వలెనని' ఏడుస్తారు. ఏల వ్యథాభరమ్మున గృశింప జేయగ జీవితంబు? నారాలిన మొగ్గలున్ సురభిళమ్ములుగా! నని ఊరడిల్లుతారు. 'రాలిన పూలు కొన్ని పొదలన్ వికసించిన పూలు కొన్ని వాతూల హతింజలించి భువి దూలక కొమ్మల జిక్కికొన్న' పూలు కొన్ని యేరి సుమదామము కూర్చి స్వామి కంధరంబును మహదానందముతో నలంకరింప నువ్విళ్ళూరినారు. స్వామి నిరాభరణపు జేతులన్ కుసుమదామము అవ్వల బారద్రోసెను. ఎన్నడైన నా మొరకువనంపు గాంక్ష ఫలమొందక పోదని దాచి స్వామి ఆలయసీమ చెంగట విహారము చేసినారు. 'ఏ తరుణము నిర్ణయించితివో తావక సేవకు నన్ను బిల్వగన్' అని వేచినారు. తొలిరోజులలో శ్రీనివాసమూర్తిగారు మీలాంటి నాలాంటి మానవులే, 'కుటీర సీమలో విశీర్ణ భాగములు తీర్చుటకైనను చేవలేని జీవితమిచ్చి' మనస్సులో, 'సౌధవాస కాంక్షా విసరంబటు కూర్చితివేమి' మహా ప్రభూ' అని మొర బెట్టినవారే.

అయితే వారి తపోవన విహారము వారిని పునీతులను చేసినది. మధుర భావన రమ్యసీమలో, అమల ప్రేమారాధన మునగాక బ్రతికి సుఖియింపలేని' ప్రాణము వీరిది. 'పూరిగుడిసెలలోనైన బుత్తుగాని గీతమల్లక బ్రదుకు సాగింప లేన'నే తత్త్వము వారిది. భావనా పథముబట్టి పోయే వారిని చూచి 'శ్రీనివాసమూర్తి కాదు ఉన్మాదమూర్తి' అన్నది లోకము. వారు మాత్రము శాంతమతియై లలిత సౌందర్య పూజకై రక్తిబూని కదలిపోయినారు నవ్య మార్గాలలో. దుర్వారములై ప్రశాంతి సుఖభంగము గొల్పే లోకవృత్తాల్ని వాటి దారికి విడిచి, 'శంపాలతలయందు, శాద్వలస్థలులందు, పరిమళమ్ములు జిమ్ము విరులయందు, వననికుంజము లందు మరుగుపడిన మహిమను అర్చించారు ప్రకృతిలో వలెనే ఈయన రచనలో ఎన్నోమారులు వింటాము కోయిల కూతను. 'ఏయెడ వావకోయిల నదించు సుధామయ గాత్ర మెత్తి' అంటారూ, 'ఎలమావి మోక పయినింపుగ బాడెడి కోకిలంబులతో విడువని నేస్తమం'టారు, 'కోయిలలు లేప నిదురమేల్కొనుచు నుందు' నంటారు. 'పాలకయములపైన నూయాలలూగి కలకలారావ గద్గద గాత్రమెత్తి .... నన్ను బిల్చు'నంటారూ, మావి చిగుళ్ళమేసి రసమంజులగీతము లాలపించె.... కోకిలబాల' అంటారూ, 'కోయని నన్ను బిల్చుమిక కోకిల' అంటారూ, 'ఒక్కచినుకున కాశించి యుర్వి యెల్ల ప్రతినినదమిచ్చు సుకుమార రుతులు సల్పి'న దంటారు వానకోయిల. అన్నిమారులూ కూస్తుంది కోయిల! ఈయన కవితా తపోవనములోనే

కోకిల అయినారు! తమకు తోచనప్పుడల్లా కోయిలను కూయమన్న ఆధునిక కవులు పెక్కురు. కోయిల కూసినప్పుడల్లా వినేవారు కొద్దిమంది, వారిలో వీరు ప్రముఖులు. ప్రకృతి ఈయనకు ఉద్యానవనముకాదు, మరి తపోవనము. కోయిలలు లేవ నిదుర మేల్కొని, అడవి కోనల సెలయేటి పడుచుగాంచి, సొబగులీనెడు ననకారు శోభగాంచి, కొండ చరియలలో చెట్ల గుబురులో, మనోజ్ఞ సైకత భూమిలో, దివ్య శంపాలతలు తెరువు సూపగా నవ్య పథముల భూనభోంతరము దాటి సౌందర్య పూజకు తరలిపోతారు. బెళ్ళూరి శ్రీనివాసమూర్తిగారు నవ్యసాహిత్య తపోవనంలో వానకోయిల. కోయిల కూతను వలెనే వారి రచనలను చదివిన వారందరూ, చదివినప్పుడల్లా ఆనందించారు.

నిత్య నూతనత్వము ప్రకృతి స్వభావము. కవిగారి దృష్టి అపేక్షతో కూడి ఉంటే అతడు ప్రకృతిని చూచి పొందే ఆనందము కూడా నిత్యనూతనంగా ఉంటుంది. శ్రీనివాసమూర్తిగారి ప్రకృతి దర్శనము ప్రకృతి వలెనే చైతన్యవంతము. వారెంచుకున్న పథములో వారి సీమలో శ్రీనివాసమూర్తిగారేకాకి. రాయల కాలం నుంచీ వ్యుత్పత్తి బలంవల్ల సాధించిన ఉత్ప్రేక్షలూ అతిశయోక్తులతో దీర్ఘ సమాసాలూ వింత అలంకారాలూ ఇమిడ్చి పద్యాలల్లడము సంప్రదాయమైన సీమలో, వీర వైష్ణవమూ వీర శైవమూ అద్వైతమూ విచ్చు కత్తులతో విహారము చేసిన యోగసీమలో, పూర్వ కవులా యోగులా దృష్టితోకాక తన చర్మ చక్షువులతో చైతన్యమిచ్చిన తన తపనీయ సులోచనములతో చూచి సహజ సుందరమైన పరమేశ్వర సృష్టిని నవచైతన్యముతో వర్ణించడము తపఃఫలము కాక మరేమి? శ్రీనివాసమూర్తిగారు తానై దయతో సంతోషంతో నిర్వేదముతో పలుకుతారు. ఆయన ప్రకృతిని వర్ణించరూ సమాసాల వేగానికీ పదముల మువ్వల రవళికీ చొక్కి కళ్ళెములు వదిలిపెట్టరు, తన భావాన్ననుసరించే నడుపుతారు. కనుక ఈయన రచనలు మధురాతి మధురములు.

రవీంద్రుడు ప్రకృతి సౌందర్యయోగి, రాలిన ఆకులలో, నిశీధపు నిశ్శబ్దములో, యెడారి దాహములో, మారుతపు నిట్టూర్పులలో జగత్తంతా వ్యాపించి ఉన్న చైతన్యపు చలనాలు గుర్తించగల మహాతపస్వి. శ్రీనివాసమూర్తిగారు రవీంద్రుని గీత సౌందర్యానికి చొక్కి కొన్ని గీతాల్ని తెనిగించారు. రవీంద్రుని రచనా కౌశలముచే ప్రాభావితులై సౌందర్యపూజ, ఋతుపరిదేవనము, ఊరడింపు, అమృతసిద్ధి అన్న ఖండకావ్యములను రచించినారు. ఇంత మాత్రము రవీంద్రుని సమీపించి రచనలు సాగించిన వారీయనా కొంత మాత్రము కృష్ణశాస్త్రిగారూనూ. శ్రీనివాసమూర్తిగారి దృష్టి సుందరేశ్వరుని విశ్వవిభూతిని అచ్చెరువుతో దర్శించడమే - ఈ నేర్పుకు కారణము. వీరి `కళాజీవి' పూర్వఖండము నవ్య కవిత్వ సౌదామని.

ఆధునిక కవిత్వపు సత్త సాహితీ సమితివారి `సఖి' పత్రికా స్థాపనతో నిరూపితమయిందీ, ఉమాకాన్తంగారి విమర్శతో కొంత ఊగులాడింది. అయితే చెప్పవలసిన సౌందర్యాన్ని గుర్తించిన తరవాత చెప్పగల కవులు ఊరకుండలేరు. పైన చెప్పిన కవులు ముగ్గురూ అలాగ చెప్పినవారే. వీరు ఆధునిక కవిత్వ ప్రభావము వల్లనే ఇప్పుడున్నట్టుగా తీరినదీ ఆ ఉద్యమమే లేకపోతే ఇంకొక రీతిలో ఉండేదీ అంటాను. విశ్వనాథ కవి రచనా పద్ధతివల్ల కొడాలివారు ప్రాభావితులు కాలేదు. ఆ రీతిగానే నవ్య కవిత్వోద్యమము వల్ల ప్రాభావితులై రచనలు చేసిన కవులు పెక్కురున్నారు -సాహితీ సమితి యౌవనానంతర దశలో - నేటి వరకూ. నిన్నటి భట్టారం మల్లికార్జునకవి స్వర్గలోకాన్ని వర్ణిస్తూ ఈ లోక సౌందర్యాన్నే ఆ లోకంలో ప్రవేశపెట్టారు. ఆకిలి రామశర్మగారు చారిత్రక గాథను తమ `శర్వరి'కి వస్తువుగా స్వీకరించి - వర్ణనా భూయిష్ఠము చేసి ప్రబంధరూపము ఇవ్వకుండా - కథను వేగముగా నడిపేరు. ముదివర్తి కొండమాచార్యులుగారు తమ `వీరమనీడు'లో చక్కని సౌందర్యమును పట్టి ఇచ్చారు. `తొలకరి మబ్బులో మెరుపుతున్క విధమ్మున శత్రుసైనికావళి జొరబారుచున్' అన్నారుగాని `నాటి యభిమన్యు విధమ్మున' అనలేదు. అది విన్న సౌందర్యమైపోయేది, ఇది చూచిన సౌందర్యము. `తత్స్వాంతము మ్రగ్గుచుండెనొ నితాంతము నగ్నినగమ్మురీతి' విన్నదే అయినా కొత్తది. `జీవితము లూరక భగ్నములై యెడారిలో హ్రదమట్టు రూపుమాయుటకు' `చిన్న పాపని మోము వెన్నెల గుత్తిలో తలసూపు సుస్నిగ్ధతా విభూతి' `అక్కటికము కొల్వునందు గజ్జెలు కట్టి నటించె' నన్నవి నవస్ఫురణ గల్గిన వర్ణనలు. కృత్తివెంటి సుబ్బారావుగారు పింగళి కాటూరి కవుల `తొలకరి' ననుసరించి, కేవలము పూవులమ్మడముతో ప్రారంభించి అట్లతద్ది, దసరా పండుగ, కులమువారి పని, వరలక్ష్మీవ్రతమూ, వర్ణించారు. వర్ణన పురాతనపు దారులలోనే సాగినా, `గోడ గడియారముల కూర్కు గొనని మ్రోత, కరువనేరని కుక్కల మొరుగు గొడవ, సకృత్తుగా కలదు. మంగిపూడి పురుషోత్తమశర్మగారు శివశంకరుల హృదయేశ్వరి ధోరణిలో ప్రారంభించి"శ్రీశుడౌ.... వరము లీయంగ వచ్చెనేని .. అడుగ రంభాను భోగసంరంభ తతుల.. నీదు నంచలత్తనులతాపంగ.... రమ... కూర్పకున్నను పోనిమ్ము. చరణ కంజయుగ్మ సంసేవనైన" కోరుకుంటానన్నారు! ధవళసుందర నారాయణ శర్మగారు కవివశ పేరు బెట్టుకొని కాల మెరుంగక తొంటి వ్రాతలే శివశివ వ్రాయనేల' అని అడిగేరు. కాళూరి నరసింగరావుగారు సుమదళ మృదుల మైన శైలితో `సంధ్యారుణ భర్మ హర్మ్యములను, ఇంద్రచాపాచ్ఛ రేఖా సౌధాంతర కాంతి శయ్యలను, రాకా

చంద్రికారామసీమా సౌరభ్య నికుంజవాసములను, ద్యోమందారవనీ హృదంతర ప్రశాంతులనూ, కలల పొలాలనూ వెతికేరు. వానమామలై వరదాచార్యులుగారు పరిగెపిల్ల, తృణము' పాదరక్ష, పాకీవాడు, దుక్కిబక్క వంటి సామాన్య శీర్షికల మీద వ్రాశారు భక్తపోతన చరిత్రముతోపాటు. చిరుమామిళ్ల విజయసారథిగారు కొత్తపాలెపు `పల్లెపట్టు' నిసర్గ సౌందర్యాన్ని చైతన్యవంతమైన స్వభావోక్తితో వర్ణించారు. భమిడిపాటి రామసోమయాజులుగారు "మోడుటాసలు చివురించి వాడిపోవు వెగటు దివసంబు లొకదాని వెనుక ఒకటి' అని వేదులనూ `కలువ'లో కృష్ణశాస్త్రి తేటివలపునూ, ఘూకరావమును పట్టి ఇద్దరినీ, స్ఫురింపజేస్తూ ఒకప్పుడు ఏకాంతంగా`మహోన్నత పర్వతభూమిలోనూ, ఇంకొకప్పుడు ప్రేయసీ `సితవిలోకనానిల తరంగములోనూ గడుపుతూ ఆ నాటి నవకవికి ఉదాహరణాన్ని చూపించారు. అంబటిపూడి వెంకటరత్నంగారు చంద్రశాల, వత్సలుడు కావ్యాలలో చక్కని గమనముగల పద్యాలతో ఊహాకథనము చేశారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వంటి సంప్రదాయ పండితులు కూడా `ఆంధ్ర రంగస్థలమున నిప్డన్ని యెడల ప్రబల తరమైన చలన మారంభమయ్యె. నవ నవోద్భూతమైన ఈ నవ్యశక్తి ఎటు పరిణమించునో యెరి కెరుగరాదు' అని వ్రాసి నవ్యసాహిత్యానికి జండాలు ఎగురవేశారు. సాహిత్యాభివృద్ధి కాములందరికీ నవచైతన్యస్ఫురణ కలిగింది. బరువైన ఉదాహరణము దిగుమర్తి సీతారామస్వామిగారు.

దిగుమర్తి సీతారామస్వామిగారివలె గద్య వ్రాయగల పండితు లిప్పుడెందరో లేరు. వారి ప్రజ్ఞ బహుముఖము. శాలివాహన సప్తశతి, కాళిదాసు ఋతుసంహారమూ తెలుగు పద్యాలలో వ్రాశారూ, అనేక ఖండకావ్యాలు వ్రాశారు. సంగీత సాహిత్యాలలో `ఏకమాపాతతో రమ్యం, అన్యధాలోచనామృతం' అన్నారు ప్రాచీనులు. సీతారామస్వామిగారి రచనాలోచనా మృతానికి చక్కని ఉదాహరణాలు. రచనకు వెన్నెముకగా ఆయన తీవ్రాలోచనము సాగిస్తూనే వుంటుంది. `కళావీథి'లో నవ్యసాహిత్య కల్లోలమునే కాబోలు వర్ణిస్తూ, "ఒక్కటే మబ్బు పిహితాష్ట దిక్కరాళ కాళికా శ్యామలంబయి క్రమ్ముకొనియె, రేచు పెనుగాలి, ధూళి భరించుహోరు, చండతాండవ మంగళాచరణ ఘోష, మెరపు పూదండ లల్లన మరగి పడగ నురుములే మేఘతాండవోద్ధరణ గతులు, అప్పటికప్పటి పిడుగుల రొప్పు మెచ్చునట్టి భూతాల సుముఖాట్టహాసకలన, వెర్రిగాలితో పాటుగ విరిగి పడుచు పాదపంబులు నృత్య సంపద వెలార్చె, రేని తీవికి నమరిన బృందమనగ నంతయును నాట్యమదుగ్గు సాహసులు లేరు... రేడు మెచ్చుకొన్నదే కళ, మెచ్చి, ఇచ్చినట్టి దసదు కానుక కాదు

నా రసికుడెవడు?" అంటారు. వ్యంగ్యార్థము విమర్శ కనుక వాచ్యార్థము కవితా వస్త్రము కట్టుకొన్నది. లోకములో నెగ్గుతీరులు చూచిచూచి విధికెదిరి నిల్చిన రాక్షసుల యత్నాల్ని కూడా ఈయన మెచ్చుకున్నారు "నికుంభిల" లో: నికుంభిల ఇంద్రజిత్తు యజ్ఞము. నికుంభిలలో `పురుషకార విజయ పతాకలు మబ్బులతో వాడు నట.` ఆత్మజాతి విద్రోహుల కధికాదర మధికారము, అల విభీషణునకా పట్టాభిషేకము మహోత్సవము?' అని అడుగుతున్నారు ఈయన.

అర్హత ఒకచోటా అనుభవమింకొకచోటా అన్న ఊహయే, ఈయనచేత అహల్యతో "అతనికి (ఇంద్రునికి) నీకు నే తగినదన్ని విధంబుల నాతడన్న నిత్యతరుణుడున్ సుధాశను డనన్య విలాసి రసైకజీవి, చైత్ర తరుణ దక్షిణానిలుని తాకిడికేన్ నెరిరేకు విచ్చనట్టి తలిరుదీవనీవు. జ్ఞానుల యందెగాని రసిక శ్రయణీయ విలాస జీవితాహ్వానమునన్ సదస్యత కనర్హుడు గౌతమమాని. దీనిగూర్చి పాడవుగదే హృదయాళు రసార్త్రలోకముల్?" అనిపించింది. సావిత్రిని పట్టిన గుడిపాటి వారికీ సీతమ్మనే సమీపించిన సామినేని వారికీ అహల్య తట్టకపోవడము విచిత్రమే. అహల్య మీది జాలితో ఈయన "తలకొని వెర్రిగా బొగడతావివలెన్ వలపుం దలంపు మేల్కొలిపిన నాగలేని కథ కోడయి కూయగ శిల్పవీథిలో విలిచిన నీ శిలాప్రతిమ నిత్యము నందన పారిజాత పుందలిరులతో సహస్రనయన ప్రథమార్చన స్వీకరించుతన్" అన్నారు. సమకాల పరిస్థితులు గమనించినా, రాష్ట్రసాధనలో "అసలు దీనికై కష్టించినట్టి వారి మరచి పదవుల కెగబడు నరులగూర్చి పత్రికలు వాగిన' వన్నారు. అడుగుల సవ్వడింపని మహా విపినంబులు చూపులందుకో దడదడజేయు తారకల తావులు... మదికింపు నింప,' `మృత్యుదేవతాయతన పురాణ ఘంటికల యందు ధ్వనించెడు స్వాగతీ కృతులు' ఆలోచనకు తగిలిన వరకూ మౌన సాధనయందు మ్రగ్గినారు కాబోలు, "ప్రాణికోటిలో... మనుజుడె.... లోతులు ముట్టి ... వారక బాధ క్రుంగెడిన్" అనిపించి, "లోకపు లోతులంటి అతిలోక భయంకరమౌట సంతత వ్యాకులమైన జీవితమునం దనిశంబు కృశించుకంటె పైనే కనుగొంచు వెన్నెలలు నిండిన పువ్వులలోయ వెండివాగై కదలాడు నీటివలె హాయిగా బోయెద జీవయాత్రలో" అని నిశ్చయించుకొన్నట్టున్నారు. ఈ రీతిగా "తారలె దివ్వెలైన తొలి దారులలో బడి దివ్యదర్శనుండె రమించి యోగి యగునట్టి జనుండు, ప్రపంచ భావసంచారములో కవీంద్రుడయి జారెను తానొక మెట్టు!"

యుక్తమే కదా? "అలసిపోయిన కన్నుల ప్రతిఫలించి సురనదియేని వైతరణిగా దోచు, చిరమిందు విశ్రమించిన పయిజూడు ముళ్ల పుంతలును పువ్వుల

బాటలగును." దేవయాన పథమ్ములందిరుగులాడి నట్టిదీ యాత్మ యొక్క నాదనెడి భావమెన్ని నిరయధ్వములు చననీ శ్రమమ్ము నపహరించి మహాశక్తి' నిచ్చినదది కాబోలు, చుక్కలతో నిండి చక్కని రేయి తనువెల్ల కనులుగాగనె నన్నారు. `కలిపిపోసిరి వనదేవతలు నిజమ్ము శీతుగరళమ్ముతో నవజీవనమ్ము' `మధురతా పూర్ణ విశ్వదామమ్ము నుండి పెరిగి జీరాడు ఈ ముత్యాల పేట...' కు జీవితాలు విరిసి పుష్పించినవి. `పారిజాత సుమామోద భరిత సురవధూ తనుస్పర్శనుంబోలె ప్రీతిగాంచి,' `మలయ వాయువు పగిది భూతలమెగాక, దివ్యలోకాలు స్పృశియించు దీప్తి'తో "ఈ దరిద్రాణ నిద్రాణ హిమసమాప్తి విశ్వ శృంగార దేవతార్చాశ్వవృత్తి నొక్కలతయేని పుష్పింపకుండరాదు పూర్తిగావలె సౌందర్య పుష్పమాల" అన్న సంకల్పముతో తిరిగి వచ్చినారు. పచ్చని చేలలోన బడి పారే నదూలూ, తెల్లని జాబిల్లి తెరచిన కళ్ళు మల్లె పూవులూ,`మధ్యాహ్న నిద్రలో మాటాడని యుర్వీ, పాల్వావి హాయిగా పరుగిడులేగల కాంచు నావుల పెద్దకనుల తృప్తీ, పెండ్లింటి పగిదినలరు పల్లెటూళ్లూ, జాబిల్లి పుట్టికన్ దెచ్చికొనిన జిలుగు రేయెండ వరిపిండి నొలక బోసి గాలి కారగ నెరపు రాత్రీలతాంగీ, వర్షాశిరోజ మధుర సింధూర లిప్త సీమంతరేఖ, `మఘవు నేల్పడి జల్లని మబ్బుగొడుగునీడ' వేసగి పీడవదలిన పుడమీ, పచ్చ పిసాళి వన్నెల తివాసిని పరచిన ఈ పెనుమంటి గడ్డ, ఈయనకు స్వాగతము పలికేయి. అయితే ఆలోచనలేని పరిభ్రమణములో పడలేదీయన. ఆశ విడువనివేశ్యగా ననుసరించి వచ్చు - సుఖమింతలేదు నావలన తనకు, తాళిగట్టించుకొన్నట్లె తడయనీక తొందరించును మిత్తి - యేమందుదీని?" అంటారు! పాతబడిన కవితలు మంచివి కావన్న వారికీ నవకవితలు మంచివి కావన్నవారికీ వీరి జవాబు: " -వెన్కబడిన కథల్ గాని వేవి? గత మధూత్సవ మదినేడు కతయెగాక వినుచునో భృంగచారణ పలితగీతి?" మళ్ళీ పౌరాతన్యము పవిత్రమంటూ, పట్టిన బూజుకు భజనలు చేసే ఆత్మల సహితము దగ్ధముచేసే అనల ప్రళయము రావాలి"ట! తథాస్తు.

ఆలోచనయే వీరి రాసిక్యమునకు జీవనము, "ఆకు రాల్చిన మోడుల నాకసమ్ము జూపు హేమంతమే ముముక్షువుల ఋతువు"ట కాదా మరి? మళ్లీ, చూడండి`తిరువీథులు' సర్వదామ్రోయునీ ధ్వజస్తంభ ఘంటికలు -వ్యథార్త ప్రపంచ కాక్రందనమ్ము స్వామి వినిపోవునంచు! ఎన్ని వింతలు జరుగనీ ఇంతయేని బాహిరిల్లగనీని దుర్భరతమమ్ము చిందులాడెడి గుడిలో వసించు కోర్కి మనసు లేనట్టి రాతి బొమ్మలకె తగును.'ట! `విడువనేరని యర్భకవిటులముందు చిందులను ద్రొక్కు దేవదాసీ గణమ్ము ఆటలో చీలి రాలిన యట్టి విరుల స్వామి

# 14. ఈనాటి సంరంభము

నవ్యాధునికులు కవిత్వ రచన కుండిన సంకెళ్ళు నిశ్శేషంగా తెంచిపారేశారు. ఈ యత్నంలో వీరవలంబించిన రీతుల్ని పట్టుకుని పలువురు కవులు పలు ముఖాలుగా రచన సాగించారు. ఆరుద్ర అనే భాగవతుల శంకరశాస్త్రిగారు స్వేచ్ఛా రచనతో ప్రత్యేక తంత్రాన్ని జోడించి రచించారు. గణ ఛందస్సుని గాని, మాత్రాచ్ఛందస్సుని గాని స్వీకరింపలేదన్న కారణము వల్ల స్వేచ్ఛా రచన చేశారన్నాను. ఈ రచన మీద వారు నిర్మించిన తంత్రము (1) ఊహలకు బదులు వస్తువునీ, అనుభవాన్నీ వాడడము. తత్వాలు రచిస్తూ `గొర్రె లైదొక పెద్దపులిని కొట్టి నెత్తురు త్రావేరా ' అన్న రచనని `పంచేంద్రియాలూ మనస్సుని పట్టేశాయి' అన్న ఊహకి బదులు వాడుకున్నారు మన సాధువులు. అయితే ఆ పాట అంతా వింటే అర్థము సులువుగా బోధపడని పదాలు చాలా ఉంటాయి. ఆరుద్ర రచనలో ఊహాప్రవంతికీ, వారు పట్టి తెచ్చే వస్తువుల - లేదా అనుభవాల - వరసకీ సమాంతరమూ (Parallel) నిరంతరాయ గుణమూ కూడా వుంటాయి. "నీవు ఎక్కదలచుకున్న రైలు, ఎప్పుడూ ఒకే జీవితకాలం లేటు, ఏళ్ళూ ఊళ్ళూ నిరీక్షించలేక ఎక్కేస్తావేదో బండి, నీ ఆదర్శాల లగేజీ ఎక్సెసంటాడు టి.ఐ.సి. నీ ఈప్సితాల ట్రంకుపెట్లు కలల బ్రేకులో పారెయ్యాలి.... నువ్వు వెళ్లదలుచుకున్న ఊరు నువ్వు బ్రతికుండగా చేరజాలదా రైలు, దేవుడా! ఇంత చేశావా అని ఉన్న ఊళ్లోనే ఉండు" అధునాతన నాగరిక జీవితోపకరణాల వ్యాకరణం, గణితం, జామెట్రీ, `టూ వే స్విచ్‌లూ'. సీళ్లూ, టెంపరరీ డ్యూటీ, .... సర్వమూ ఆరుద్ర తంత్రానికి మహాభక్తుల ప్రపత్తితో లొంగి వస్తాయి. ఈ తంత్రంలో రెండో శాఖ: రచనను వస్తు సమితి ఉపయోగానికి సమాంతరంగా సర్దడము. గోడ గడియారానికి `కీ' ఇవ్వడాన్ని జ్ఞాపకం చేసుకొండి. ఏ త్రిప్పు అయినా దాని కది స్వతంత్రము, అన్నీ చేరి స్ప్రింగుని చుట్టి బిగిస్తాయి, గడియారము పనిచేస్తుంది. అన్ని తిప్పులూ సరిగ్గా ఒకే పొడవుండవు. చివ్వర కొంచెం డెక్కుతూ తిప్పుతాం స్ప్రింగు బిగవదేమో ననీ, తెగిపోతుందేమో ననీను. ఇదుగో ఆరుద్రగారు మనకి `కీ' యిస్తున్నారు.

"ఆపత్కాలం, చీకటి దుకూలం, ఆలస్యం నీ, ఓటమి రహస్యం, ఆరంభించిరి, నీచ మానవులు, అత్యాచార వ్యూహమ్ములన్, ఆరంభించర దేలకో, సుజను లాయా వ్యూహవిచ్ఛేదనం... విజ్ఞానం, వికసించిన మూర్ధన్యకన్ను వివేకం నీకున్న ఒకే ఒక్కదను". బంధ కవిత్వమనే దానిలో కత్తిరింపు తంత్రం తప్ప ఏ తునకకు దాని అర్థమూ, వీటికి ఎంతో కొంత వైచిత్రీ ఉండవు. గడియారం చిన్నముల్లుకి పండ్రెండే మజిలీలు. మజిలీ మజిలీ సమానము. దేనికి దానికి ప్రాధాన్యముంది. ఇరవైనాలుగైతే రోజు. ఇదిగో ఒక రోజుకు ఆరుద్ర ఊహాగంటలు (హోరలు అనండి వైరి సమాసం నచ్చకపోతే) "ఇది నాగలి, ఇది దాగలి, ఇదే పునాది సైతానుకు ఇదే సమాధి" ఇలాగే ఇరవైనాలుగు గంటలూ (పొరపాటు కాబోలు `ఇది స్వర్ణం' అనే ఇరవై అయిదో గంట చేర్చారు) సాగిపోయి రచనని పూర్తిచేస్తాయి. ఈ రీతిగానే అలారం: "లోహలో లోయలో ఓహో పటాలం, పటాలం...." అంటూ సాగుతుంది. పెద్దముల్లూ లోలకం, గడియారపు ప్రధాన భాగాల పనులతో రచనా తంత్రానికి పోలిక ఉంటుంది ఇక్కడే చెప్పకోకపోతే చదువరులు `ఆరుద్ర రచన ఇంత మాత్రమే' అనుకుంటారు. కనక చెపుతున్నా. `అలారం' లాగే ఆ రచన కూడా చదువరి మనస్సుకి అలారం, హెచ్చరిక గంటల ముల్లు, గంటల పరిమాణపు పాదములను మాత్రమే కాక జనత గంటలను ఉపయోగించవలసిన పద్ధతిని సూచిస్తుంది `ఇది నాగలి, ఇది దాగలి' అంటూ. ఇసుక గడియారం తరతరాల మానవులకు చెప్పవలసిన-పలుమంది చెప్పిన-, పరమసత్యాన్ని సన్నగా ధీమాగా చెపుతుంది. ఆరుద్రకు ప్రపంచము నిండా తెలివైన వస్తువులే కనబడతాయి: వాటి బ్రతుకును సొంతం మనకి చూపిస్తూ మనకి ఇంట్రావీనస్ ఇంజెక్షన్ ఇవ్వాలని ఆయన ప్రయత్నం. ఈ వస్తువులు - చిత్రం - మానవనిర్మితాలు. వాటి బ్రతుకే ఉపదేశము చేస్తుం దనడమూ, ఆ ఉపదేశాన్ని అన్వయించడము ఆరుద్ర ఆశయాల్లో ఒకటి. పురాతన ప్రపంచానికీ మానవ జీవితానికీ నడిమి జ్వాలాతోరణము ఆరుద్ర రచనలలోని ఈ శాఖ.

ఆధునిక జీవిత సంరంభాన్ని ఈ సాంకేతిక పద్ధతిలో వర్ణిస్తూ ఇప్పటి విలువలూ, సంస్థలూ, ఆశయాలూ నిలవవని ఆరుద్రగారు చెపుతున్నారు. సాంకేతిక పద్ధతులవల్ల ఒక్కొక్కప్పుడు వారు నిర్దేశించిన అభిప్రాయం మరుగుపడి పోతుంది. పురుషుల IIIక్లాస్ బోగీలో చెట్ల గురించి (ధనవంతులు) చిట్టెలు కల(రజాకార్ల) గురించి సంభాషణ రెయిల్లో జరుగుతూండగా, చెయిన్ను (సంయమం) లేని మగాళ్ల ముందు, చెదపురుగులు (ప్రరాన్నభుక్కులు) గాని మగాళ్ల ముందు, నిటారుగా నించొని, తన బట్టలు సింపాదిగా తాపీగా ఒలుచుకునే నిటారుగా నిస్సిగ్గుగా నించొనే నీతిమంతురాలు (తాను తప్పుచేయని స్త్రీ). ఇది బందరు నుంచి బెజవాడ పోయే రైలులో రజాకార్ల చేత మానభంగమూ, నగ్నప్రదర్శనమూ పొందిన స్త్రీ చేసిన చేత

అంటారు. ఇలాగ ఒక తెరమాటునుంచే తెలంగాణా తిరుగుబాటునీ ధనికుల భవిష్యత్పతనాన్నీ సూచిస్తారు ఈయన.

ఉద్ధతుని దారుణపు టూహల్నీ, వ్యథార్తజీవుల యదార్థ దృశ్యాల్నీ కూడా చిత్రించారీయన. `తోలించు తోలించు తెల్ల గుర్రాలని (White horse whisky) గళాసుల్లోకి, అప్రతిష్ఠతో, నిందలతో తడిసిన జీవితాన్ని విప్పి లోకం మీద ఆరవేస్తాను. "సభ్యత విడాకులిచ్చిన సత్యాలను నేసి ధరిస్తాను" అంటాడట రాక్షసుడు స్వగతంలో. ప్రజను పీడించి బలిసి బ్రదికిన సిరిమంతుడి మరణశాసనమట! `చనిపోతున్నా ఒకరూ ఏడవరేం. కాలం కాగితమై, దివాకరుడు స్టాంపైతే నా దస్తావేజు (జీవితానుభవం) మీద రేరాజే రాజముద్ర (అన్ని కాలాలికీ అన్ని దేశాలికీ చెందిన ధనికుడు వీడు!).... ఈ నక్షత్రాలతో నా మరణశాసనాన్ని లిఖిస్తున్నాను. .... అరగనట్టి తరగనట్టి అనుభవాల భూమిచ్చా ఏలుకొండి, గుండెల కుంపటిపై (మీ) శ్రమ నెసరు పెట్టి .... రాచ పీనుగను తోడులేనిదే కదలను, మీ కష్టాలను కక్కకట్టి నాతోటే కాటికి తెండి. ఇప్పుడు చెప్పను ఏమేమిటి రాశానో, స్మశానంలో సగం కాలి పైకి లేచు శవాన్ని కాటికాపు భవిష్యపు దుడ్డుకర్రతో పడగొడితే పగిలిన నా కపాలంలోంచే, వినబడుతోంది నా మరణశాసనం" జోలపాట వినండి: పులికోరల చలిగాలులు ఆపింది కవచంలా, నడివీథిని పడి బతికే నీ వొంటిని గుడ్డలేదు... రైలుదారి మదుము (తూము)లోని మంచుపొరల ముసుగు తన్ని పల్లక (మెదలక) తొంగో కొడకా. మీద వెళ్లు రెళ్లవేడి అదే నీకు చలిమంటా. నిద్రపో నిద్రపో మన ఖర్మం కాదులే, (ధనికుల జులుం) అర్థం నీ కవదులే, శాంతి పొద్దు పొడిస్తే సుఖం పలుకు మేలుకొలుపు, అందాకా భూలోకం పరుపుమీద, ఆకాశం కప్పుకొని, కడలి హోరు గుర్రుపెట్టి, నిద్రపో చిట్టిపాపా." శ్రీశ్రీ భిక్షువర్షీయసీ, ఈ జోలపాట వ్యథార్త జీవిత యథార్థ దృశ్యాలు. `ఆరుద్ర `చోపుదార్ గల్లీపిల్ల' (భోగంవీథి వ్యభిచారిణి) అలాంటిదే. `నిలబడి ఉన్నది, ముస్తాబై గుమ్మం ముందర, ముండా మోసిన విశాఖపట్నపు ముడుతలు దేరిన ముఖమండలంపై చెరగీ చెరగని కుంకంబొట్టు చోబుదార్ గల్లీపిల్ల' అని ప్రారంభిస్తుంది. వీరివే (రాజకీయ) పాలనము మీద ఉపాలంభ గీతాలున్నాయి. వట్టి తిట్లతో ప్రయోజనమేమిటీ? మనుష్యుల మనుస్సుల్ని మార్చే రచనలు చేయగలిగితే, యత్నిస్తే ఏమేనా ఉన్నది. లేకుంటే రాజకీయ పోరాటం ఉండనే ఉన్నది. అంతేకానీ అన్ని దేశాలకీ, అన్ని పరిస్థితులకీ పనికి వచ్చే "పాలితుల మెదళ్లకు దళ్లు కట్టి వాళ్ళచూపుదారిలో కాపలావాళ్లని పెట్టి, వాళ్ళ కళ్ల కిటికీలు మూసి మేకులుకొట్టి, పరిపాలించబోతోంది రేపటి రాజ్యం" అని ఎంత శక్తివంతంగా తిట్టినా అదే అస్త్రం మీమీదకీ తిరుగుతుంది! "ఆశయాలకు ఆనకట్టలు, ఆవేశాలకు చన్నీళ్లు, అభిప్రాయాలకు

సంకెళ్లు!, ఆలోచనలకు బేడీలు, ఆదర్శాలకు ఉరిత్రాడు, ఉత్సాహానికి కంట్రోలు, ఉద్రేకాలకు రేషను, ఇహంలో నోవేకెన్సీ, పరంలో నోఎడ్మిషన్, కళ్లకు కటకటాలు, కనికరానికి కారాగారం, కడుపులోకి కంకర" అనేది ఏ దేశంలో నైనా, ఏ పరిస్థితుల్లోనైనా ఊదగలిగిన తూతూబాకా.

ఆరుద్ర వస్తూపయోగ రచనాతంత్రాన్ని "రాంగేయ"యట "మిస్ డెమోక్రసి"లో పట్టేరు కొంత. అయితే అక్కడ వస్తువులు మారిపోయాయి అడుగడుక్కీ. `అందంగా మందంగా సెంట్రల్ పే కమిషన్ చందంగా, నడుస్తోంది ఓ తరుణి అందాల భరిణి, కమ్యూనిష్టు జండాలా ఓష్ఠం, ఇండియన్ కాన్స్టిట్యూషన్‌లా శరీర సౌష్టవం, గాంధీ టోపీలా కొనతేరిన ముక్కు, బ్రాందీ బాటిల్ లాగ పొడవైన నెక్కు, వాహ్ ఆమె కెంత టెక్కు? బుగ్గల్లో ఆవడి ఆదర్శాల నిగ్గులు, మొహంలో కొత్త మంత్రివరేణ్యునిలా నిగ్గులు, ప్రయివేటు రంగంలా విశాల ఫాలఫలకం, పబ్లిక్ సెక్టార్‌లా అందులో చిన్న తిలకం" ఈ వరసని పోతుంది. విమర్శించే వారే కాక, విమర్శకి గురియైనవారూ నవ్వుకోవచ్చు ఈ రచన చూసి, ఇలాటివి కోరతగ్గవి.

మొదటినుంచీ బ్రహ్మముడిగానే కూర్చున్నారు శ్రీరంగం నారాయణబాబు. సమావేశాల్లో అంతస్తులో కి ఉండే వ్యక్తి కలం పట్టగానే బ్రహ్మరాత ఎలాగు రాస్తాడు? ఆయన వేసే ముళ్లు విప్పడం ఇప్పటికీ ఎవరికీ చేతకాలేదు. `ముళ్లు ఎలాగ వేసి ఉంటారు' అన్న జిజ్ఞాస బ్రహ్మముడిని గురించి విన్నవాళ్లు చెయ్యగలిగిన పని. ఈయన రుధిరజ్యోతి' వ్రాతప్రతి ఆరుద్ర సౌజన్యం వల్ల నాకు చూడ లభించింది. మొదటి పుటలో "నీ పాటల కత్తులతోనే నా హృదయం నెత్తురుతీసి నే వెలిగించిన ఈ దీపపు కాంతిని నర్తింపుమురా " అన్నారు. పోలిక మాత్రము ఉపయోగిస్తారు తప్ప పోలికలో మంచీ వోఘాయిత్యమూ అన్న ద్వంద్వాలు లేవు ఈయనకు. "రేయి ముసుగు పుడమి కొసగి దివసావసానకాష్ట జ్వాలల్లో కాలం సహగమనం చేసింది. ఆరిన చితిలోని బూడిద, వెన్నెల (కాంత) మొక్క జారిన ముక్కుపుడక ఒకటే చుక్క. ఇక్కడ పోలిక (లేదా ఉత్ప్రేక్ష) క్షణంలో మారింది. (చితి ఉన్న ఆ) స్మశానవాటు (లో) వ్రాలిన రాబందువలె శరన్మేఘములు. (ఇంకొక) సమాధిలో మృతశిశు పట్టులు జలదాంతరశశి. (ఏదో శక్తి) వ్యోమ మార్గముల సంచరించినది. మూగ కేకలు వేసింది... విలయవేళల ప్రళయతాండవం చేసే శివునకు వెనుక పాట పాడే కవులుంటే కావాలంటూ, ఆ పిలుపు నారాయణ బాబుకి అందినది. మొగ్గే తొడుగని మొలక ప్రాయంలోనే పెండ్లి చేసేసి చిన్నపిల్లల్ని వధించే సంఘాన్ని దహించి రుధిర జ్యోతి వెలిగించమన్నారు. ఒకరాత్రి పేదవాని కడుపు మంటగా చుక్క. గాజుపెంకుగా నెలవంక, బాలిక చూలాలి ఆశపులే గాలి. బాలవితంతువు ఆశవలె పాలపుంత

గోచరించాయి. ఉపమానమూ ఉపమేయమూ సమాంతరంగా సాగిపోతున్నాయి. ఈ గమనమే పోలిక, పరస్పర సామాన్య గుణము ప్రత్యేకపు పోలికలలో ఉంటే ఏదో కొంచెము లీలగా, ప్రాణాలకు గాలితోనూ, మంటకు చుక్కతోనూ, రచనను నడిపేది కవి ఉత్ప్రేక్షము. రోడ్డు పక్క కుష్టురోగి, (తనకు ఠాణా వంటి) బండరాయిని `నా వలపులరాణి' అని పాట పాడతాడు. కాదా మరి మానవులెవరూ చేరువకు రారైరి. ఏమి చేసినా సహించే బండరాయే వాని వలపులరాశి `నిశాగీతిలో' `అంధుని కనురెప్పలపై కన్నీరు నా గీతం' అన్నారు. అందని సౌందర్యానికి అన్వేషణ అన్నమాట వీరి యత్నం.`పాతాళమ్మున పతితులు పలవించే మాటల జాలిపాట, పాడవలెనని వీరి ఆశయము. `కాలం నాగు (పాము) వినువీధుల్లో వెన్నెల పడగ విప్పింది'టా, గగనమ్మున చుక్కలు తెల్లని మసూచి కుండ (పొక్కు)లటా, (ఈ) బాధకు వెక్కివెక్కి రోదించిన'దట ఆకాశము, `కాలిన ప్రేయసి దేహం కమురు కంప'ట ఈ లోకం, గంగిరెద్దు బ్రతుకును ముక్కున తాడై విధి లాగుతుందట. బ్రతుకంటే చీకటిలో దీర్ఘమైన చావనీ ఈయన నమ్మకమూ, దక్షయజ్ఞము ఈయన బ్రతుకు. కనుకనే ప్రకృతి దృశ్యాలన్నీ విలయతాండవం చేసే శివుని కాలిగజ్జెల మోతలుగా అన్వయించారూ, రోడ్డుప్రక్క కుష్టురోగి ప్రేయసి బండనీ, చాలీ చాలని బిచ్చగత్తె చీరనీ, మగడూ పెళ్లాం జగడాలూ చూపే ఎండా వానల్నీ, ప్రేయసి చిరునామా తెలిసినా చేసేదేమీ లేక ఊహాగానం సేయగ ఊరవతల కెళ్లిన కవినీ, జీవన వైతరిణినీ, పాటగా పాడేరు. `స్వర్గం నరకం, చావు బ్రతుకు, గొప్ప బీద వ్యత్యాసం, తారతమ్యం చేయ'నని ప్రతిజ్ఞ చేసుకొన్నారు. మర ఫిరంగినె మహతిగ మీటి, (జీవిత) కదన కుతూహలరాగం వినిపించారు. `ఏదో కీచక భావం సైరంధ్రీ గీతాన్నే చెరబడితే చూస్తూ - ధర్మరాజులాగ - ఊరుకున్నారు. ప్రేయసి అయిన బండను నిమరడానికేనా లేని కుష్టురోగి వేళ్లూ, యమునెక్కడో దింపేసి తను మాత్రం ఎదురయ్యే `ఇనుపసరకు' యెనుబోతూ, కళ్లజోడు పెట్టుకున్న గరుడ పురాణ బ్రాహ్మడు ఘూకమూ, పాడలేని గులకరాళ్ల పాతపద్ద సెలయేరూ, ఊరేగే విరుల్లా ఏగ చేత గీత వడ్డ తాటివనం, నారాయణబాబు కళ్లజోడు చూపుకే దొరికిన విచిత్రప్ప సరుకు.

ఆరుద్రగారి విశేషణాలకు బదులు విశేష్యములు వాడే తంత్రమూ, నారాయణబాబు `నీచోపమ' అన్వేషణమూ, వారు వర్ణించే వస్తువులమీద రాతితెరల్ని పరుస్తాయి. ఈ తెరల్ని బ్రద్దలుకొట్టి, వర్ణ్యవస్తు స్వరూపాన్ని పాఠకులు గుర్తించుకోవలసి ఉంటుంది. పాఠకుల ఎదురుగా ఉండేది రచన మాత్రమే కదా? కవుల సంకేతాలు వారికి తెలియడానికి మార్గమేది? మాటలూ, వాటి చేరికవల్లా అవి ఉపయోగించబడ్డ

సందర్భమువల్లా స్ఫురించే విశేషార్థాలున్నూ. చదువరి వీటిని చదివి, ఆలోచించుకుని, ఎంత మట్టుకు అర్థమైతే అంత అర్థమూ చేసుకుంటాడూ, అర్థము కాకపోతే ఆ రచనను దాటుకుపోతాడు. "కలత"యట ఆరుద్ర రచన. దీనిని చదవండి: "కళ్లల్లో దూలం నుండి, వ్రేళ్లాడే రెండు రాజు మామిడి కోర్కెలు, తలలో తెగ రొదచేసే ఒక వెయ్యి రెక్కల చేతికవ్వం, ఆవ లింతంత ఎత్తయిన చెట్లక్రింద, పలవరింతంత ఇరుకు కాలంలో, ఒక పచ్చని మైదానం, రెండు వెచ్చని ప్రాణాలు, అయిదువేల వెలుతురు సంవత్సరాలు, కైవారంలో, యాభై చీకటి గజాల ఆవరణలో రెండు బుసకొట్టే క్షణాలు, ఒక పురివిప్పిన ఘోరం." `కవ్వం' దాకా తెలుస్తోంది ఆవ లింతంత ఎత్తయిన చెట్లూ పలవరింతంత ఇరుకైన కాలం, గొప్ప వర్ణనలు. అలాగే యత్నించిన `అయిదు' వెలుతురు సంవత్సరాల కైవారంలో యాభై చీకటి గజాల ఆవరణ' అన్నది ఆ శక్తిలేక `దానికంటే నేను చిన్న' అంటూన్నది. రెండు వెచ్చని ప్రాణాలు అంటే సంకేత స్థలం దగ్గర చేరిన ప్రియు లనిపిస్తోంది. రెండు బుసకొట్టే క్షణాలా? అంటే ఆ స్త్రీ పెండ్లాడిన భర్త కోపమా? పురి విప్పిన ఘోరం వా రిద్దరీ హత్యా? ఏమో! మైదానము సంకేత స్థలం కాజాలదు. రహస్యం కాదు గనక. అయిదు వెలుతురు సంవత్సరాలు కథలో ఇమడవు, రచయిత వర్ణనా శక్తికి ధూపాలే. మైదానంలో చీకటా? దాశరథి కాబోలు ఆరుద్ర రచనలను గురించి అనుమానాలు వెలిబుచ్చితే ఆరుద్ర తన రచన నొకదానిని వివరించినట్లు జ్ఞాపకము. `ఏముటో చెప్పుకో' అన్న ఆటకు అందరు చదువర్లూ కలసి రారు.... ఇలాటి తెరచాటు రచనలు చాలా వస్తున్నాయి వచన గీతాలుగా. రాజకీయాలు వ్యాఖ్యానం చెయ్యడంలో, బ్రిటిషుపాలనలో ఉండినంత అన్వేషణను తప్పుకో నక్కరలేదు, ప్రతీవాడూ ప్రభుత్వాన్ని విమర్శించేవాడే నాయెను.... మరి "మృత్యువు కోటలో చీకటి తోటలో చిగురించిన హాసంలా, మృత్యువు వేటలో చీకటిబాటలో సకిలించిన మోసంలో, మృత్యువు మూటలో చీకటిపేటలో సవరించిన మెరుపుల్లా..." అన్న రచన నేమనాలో నాకు స్ఫురించడమేలేదు. `అధిశ్రీ'గారి రచన: "పావురాయి పట్టబోవ కీచురాయి చేజిక్కెను, రోలు తయారీకి బూన సోలై అది కూర్చున్నది... చెరువది కాలిన పెనమై చేపలు గట్టెక్కినై... పిడచలు గట్టెను నాలిక, గుడగుడమనె గొంతేమో వెర్రికుదిరినది, రోకలి తలచుట్టర ధన్వంత్రీ"! `చంద్రమల్లిక' గారిది: దుర్దమ కర్దమ మర్దిత మార్దళ ధింధిం ఝుణతక, ధింధిం: ధింధింతక శిశిర శిథిల విచికిలదళ, వికిర లాస్యవతీ సత్యవతీ ధృతీ అనుపమ ఘోరాకృతి." ఏదో విసరాలని విసరిన రాయి ఇది వినండి. "సెగలతో పొగ చూరిన మొగాల నిండా సగం కాట్లు కన్నులలో లంకారాజ్యం, రోమకపట్నం కాల్పులు, పృథులమైన మైథిలీ స్తనాన్ని

చూచి లోభించిన కాకంచేసిన రావం. ఇదంతా ఏమిటి అర్థం కాదంటావు, మట్టిబుర్ర నీది." పన్యాలవా రన్నట్లు 'హక్కులూ, ఆశయాలూ దండలుగట్టి వీధి పోయే వారందరూ' వేసుకుంటున్నారు.

దీని వెనకాల తత్వం ఏమిటి? అని ఆలోచిస్తే నాకు తట్టిన జవాబు" "ఏదో ఒక వైచిత్రి". సుదీర్ఘమైన సర్గబంధాలు చదివి, వాటి ఉపదేశాల్ని గ్రహించేటంత తీరుబాటు లేక పత్రికా పఠనంతో సంతుష్టిపడే ఆధునికులు ఖండకావ్యం కథానికా, నాటికా, వ్యాసమూ చదివేరు. వారికన్నా ఓపిక తక్కువ అధునాతనులకు. ఒకసారి చూడగలరు పత్రిక. అట్టమీద ఆకర్షణ ఉండాలి. రేఖా చిత్రాలలో వంపులు బాగుండాలి. చూస్తే చాలు అంటి నడవాలి రచనలు. రమణీయార్థ ప్రతిపాదన కాదు రమణీ-, అర్థ-, వైచిత్రి, ప్రతిపాదకం కావాలి శబ్దాలు. రసోదయం వరకూ ఆగరు, ఆగలేరు. కనుక ప్రతిపద వైచిత్రి కావాలి అధునాతన పాఠకునికి. 'కెమెరాలు కన్నుగీటుతున్నాయి పాదరసంలాగ చిక్కగా, సెలయేళ్ల సన్నని చిరునవ్వులు, కాగడాల వెల్తురులో కత్తులు దూసే జనులూ, బాధ్యత చెరలో చిక్కిన చేదు బ్రతుకు, పట్టు పాన్పుజేరు పరగణాధికారి జలోదరం, మతితో చిల్లరతో క్షేమంగా ప్రవేశము, ఒక్కతెను ఎన్నాళ్లు ఓపగలుగుదురా, వక్షోజం ఒకటే ఉంది. ఏదో ఒకటి నువ్వే చెయ్యి, పిట్టలవలె ఎగిరిపోవు కాలం, యక్షగానంలోని రాక్షసునట్లు, బొగ్గుపులుసుగాలి పిడుగు, మడికట్టుకున్న దైన్యం... అన్నవి ఈ అధునాతన రచనలలో నాకు తగిలిన విచిత్రపు మాటలు. వినడానికి ఓపికలేని, కనడానికి తొందరపోని క్షణచిత్తపు జవ్వన పాఠకు, దృష్టిని లాగే గాలం, ఈ కాలం. సౌందర్య సామగ్రి పాతగిలిపోతే దొరికే సరుకు నంతా పట్టి కవిత్వానికి మసాలాగా వేసే నేటి పాశ్చాత్య రచయితల తత్వం, కైపు దిగని కామానికి పణ్యాంగన భూదేవి స్తనం అంటూ వ్యభిచారాన్ని ఆహారంగా కోరే ఆకలీ, మాటల్ని రచనా డబ్బాలలో వేసి గలగల లాడించే ఉత్సాహమూ, ఉడుక్కోని ప్రభుత్వానికి పేర్లుపెట్టి ప్రచారం చేసే చిలిపితనమూ, అశక్తరచనా చాపల్యమూ, షెడ్యూల్డు భావాల గుంపుల్నీ, వెనుకబడ్డ సమాసాల పురుల్నీ నిర్మించే కార్మిక కర్షక సంఘటనమూ, అర్థాల రిజర్వేషనూ, జంకూ శంకల(భూ) దానమూ, అన్నీ తరంగాలై ఈనాటి చదువరిని తాకుతున్నాయి.

తెలుగువారికి వెక్కిరించడమూ, బూతాడడమూ తప్ప హాయిగా నవ్వడము గురజాడవారి కన్యాశుల్కం వచ్చేవరకూ తెలియదు. ఏ నన్నెచోడుడో నాలుగు పదాలు రాసినా ఆ సంగతి మొన్న మొన్నటివరకూ మనకు తెలియలేదు. నవకవులలో వెటకారము చెయ్యడము జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు బాగా నేర్చారు. ఒక

వ్యక్తి కున్న విపరీత గుణాలు కనిపించేటట్లు వాటిని పెంచి, వేరే పరిస్థితుల్లో వాటి వైకల్యాన్ని పొదిగి చూపించి చేసేది అపహాస్యమూ, వెటకారమూను. ఆ గుణాల్ని మానవత్వపు లోపాల్నిగా అన్వయించి అందరూ ఆనందించటానికి వెండితెర మీద చూపడము హాస్యము. రుక్మిణీనాథ శాస్త్రిగారి పేరడీలు అపహాస కావ్యాలు -వికట కవిత్వమన్న వ్యాసంలో మాచిరాజు దేవీప్రసాద్‌గారు వివరించారు. ఒక కవి రచనలో పోలిక మార్చి, ఒక్క మాటను మార్చి, పద్యములోని పాదము మార్చీ, సందర్భాన్ని మార్చీ, చివ్వరదాకా తెలియని పోలికనీ (జగ్గ కవిలాగ ) ఆఖరి పాదంతో స్ఫురింపజేసి కొట్టి, తెలుగు కవులు - ఆధునికులూ, పూర్వులూ కూడాను- సాధించిన హాస్యమును సూచించారు.

మాచిరాజు వారికి, హాస్యము కులక్రమానుగత విద్య కాబోలు. బండరాముడు అనే రామచంద్రమూర్తిగారిని తెలుగువారు మరిచిపోలేదనే అనుకుంటాను. వారి సోదరి కూడా వనభోజనాల్లో నిండా భోజనం చేసినవారికి `చాలా బాధ' హాస్యపు మాటలవల్ల కలిగించేవారట. దేవీ ప్రసాద్‌కి ఆ ప్రసాదము లభించడము మన అదృష్టము. "ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం" అని ప్రారంభించి, ఒక గేయం వ్రాశారు. దానిలోని తొలిపాదాల జోరు శక్తివంతం. ఆ శక్తినే ఇంకొక ముఖంగా ఉపయోగించారు మాచిరాజువారు. "ఏ దారి చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం రహదారి చరిత్ర సమస్తం ధూళి ధూసర పరిన్యస్తం, రహదారి చరిత్ర సమస్తం పైజమ్మాలను పాడు చేయడం...." ఇలాగే ప్రతీదానికీని. అయితే దేవీ ప్రసాద్ గారి స్వంత ముక్తకాలూ, ఖండకావ్యాలూ ఉజ్జ్వలంగా ఉంటాయి. "నేను రెస్టారెంటు కేగి వస్తాను అంటె, ఆల్ రయిట్, మెక్కిరండి పొండనుచు పంపి, మధ్య సాంబారులోనె మైమరచి యుండ, పచ్చజెండాను పట్టి వూపాడు వెధవ గార్డుగాడు. వాడొట్టి బ్లాగర్డుగాడు". "సిజరు పీల్చుటందు సిద్ధహస్తుడతండు", నవ్య విధి విధాత, సవ్యసాచి, దినము కొక్క టిన్ను కొనగ కుబేరుండు, ముష్టి అగ్గిపుల్ల ముష్టిఎత్తు" కళారాధకుడు, సంక్రాంతి కాన్కలు, చిత్రంగాలలో తప్పక ఉండవలసినది. పదేళ్ల నుంచి భార్య సంగతి ప్రేయసికీ, ప్రేయసి సంగతీ భార్యకి తెలియకుండా గడిపి ఒకనాడు పట్నాన కేగుదెంచిన ఇద్దరికీ ప్రేమలేఖలు వ్రాసి పడేశాడు- దాని దిందులో దీన్ని దాన్లోను బెట్టి.

అభ్యుదయ కవిత్వము, ప్రజాకవిత్వము అంటూ ఉద్యమాలు బయలుదేరేయి. మొదటలో ఇవి కమ్యూనిష్టులు గురజాడ అప్పారావుగారు "నాది ప్రజల ఉద్యమము" అని అన్నట్టుగానే గుర్తించి ఆయన్ని తమలో Posthumous

మెంబరుగా చేర్చేసుకున్నారు. కారణాలు ఏవయితే నేమి, అంతవరకూ అభ్యుదయ రచయితలకు దూరంగా ఉన్నవారు వారితో చేరేరు. ఒక్కొక్కరు చొప్పున రచయిత లందరూ సుముఖంగానో విముఖంగానో అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధము పెట్టుకున్నారు. అయితే ఆ సంఘ కార్యకర్తలు తమ రచయితల దృష్టి వైశాల్యము నెంచో, రచనాశక్తి పెంచడానికో వేసవి పాఠశాల నడిపేరు పెదపూడిలో. తెలుగు నాటి రచయితలు -పిలచిన నాటికో నాలుగు రోజుల తర్వాతనో- వచ్చి వివిధ విషయాలను గురించి ఉపన్యసించారు.

వాఙ్మయ ప్రయోజనము శివేతర క్షతియే సద్యః పర నిర్వృతియే కాక ఉపదేశ(పూర్వకత్వ)మే అని అభ్యుదయ వాదుల నమ్మకము. కవి సంఘంలోనివాడూ, సంఘం ప్రాపు పొందేవాడూ కనుక, సంఘంలో ఉన్న దీనుల పక్షము వహించి తన రచనల వల్ల సాంఘికంగానూ వారి నుద్ధరించాలని వారి ఆశయము. పెదపూడిలో చేరిన యువ రచయిత లందరి దగ్గరా కూలివారి సమ్మెలను గూర్చిన రచనలే కానవచ్చాయి. "పరివర్తనము" అనే నాటకంలో కూడా కవి తన వైయక్తిక భావాల్ని కవిత్వంగా వెలువరిస్తూ సంతోషించుకో కూడదనీ, సంఘ సేవకే తన శక్తిని వినియోగించాలనీ సందేశించారు రచయితలు. కళయొక్క ప్రయోజనము సంఘ సేవట. రాగము కళ కాదు. లతాలంకారము కళ కాదు, బుర్రకథగా వ్రాస్తేనే కళ. సంఘ సేవక్ ప్రోద్బలిస్తేనే కళ.

కళావివాద మటుంచి, జాతీయోద్యమము ప్రారంభమైనప్పటి నుంచి ప్రజా ప్రబోధము జరుగుతూనే ఉంది. బలిజేపల్లి లక్ష్మీకాంతము, వడ్డాది సీతారామాంజనేయులు, దామోజీపురపు వెంకటనరసింహారావు, గరిమెళ్ల సత్యనారాయణ, మద్దూరి అన్నపూర్ణయ్య వంటి దేశభక్తు లందరూ ప్రజా ప్రబోధము చేసినవారే. అభ్యుదయ రచయితలు వీరి నెవరినీ లెక్క పెట్టరు. కారణం నాకు ఒక్కటే స్ఫురిస్తున్నది. వా రందరూ వీరివలె వర్గ కలహాన్నీ కార్మిక కర్షక అభ్యుదయాన్నీ జండాకట్టి ప్రచారం చేయలేదు. ప్రజా ప్రబోధమంటే శ్రామికవర్గానికి మకుటము పెట్టడము మాత్రమే అనటానికి వీలులేదు. మనిషిలో, జాతులలో, పల్లెలలో, సంస్థలలో మార్పు రావలసి ఉన్నది. జాతి అంతా పటిష్టమూ జాగరితమూ అయి ధనికవర్గ మొక్కటే పురోగతికి ఆటంకమై యుండిన దేశాలలో ఆచరణలోకి వచ్చిన బలవంత సంస్కారము, హీన సంస్కార దేశాలలో పదవీధారులను మారుస్తుంది తప్ప జాతి పురోభివృద్ధికి దారి వెయ్యదు. అందరూ తమకు కావలసిన మేలునే ముందు నిలబెట్టుతున్నారా అనిపిస్తోంది, ఈనాటి పరిస్థితుల్ని గమనిస్తే, నాదే నిజము, నీది కల్పితము అనడానికి వీలా? "వీటి నకళ్ళు" అన్న వచన పద్యాలలో రచయిత దీపంలాంటి గ్రామంలో, దేదీప్యమానంగా

వెలుగుతున్న కిరణాలు, వాళ్ల రైతులు... పిట్టకు గూడు చెట్టుకు నీరు, గూటినుండి పిట్టను తోలకు, పల్లె నుండి రైతులను పిలువకు, గూట పిట్ట పొదుగుతుంది, మేడకు అది బెదురుతుంది. నాగరికుడా! పత్తిని పిండి బండికెత్తావు, ప్రత్తిమొక్క నీవెంట రాదుసుమా, వద్దు వద్దు ఆ రాట్నం, ఆ కదురు, ఆ ముసలమ్మను కదిలించబోకు, ఆ పల్లె నేటిది కాదు. వాసుకి భూమిని మోస్తున్నది, జాతిని పల్లెలు మోస్తున్నవి. పల్లె దొసగు పల్లే తీర్చును, పిల్లని యేడ్పును తల్లే మాన్పును, అతని ఏడ్పు ఢిల్లీ తీర్పుకు, అయ్యో నడాన నవ్వైపోవును. పల్లెల్లో పెరిగిన మొక్కకు, నగరంలో పాదులు పెట్టకు. అదిగో వస్తున్నది సభ్యతముంపు, ఈ రైతు ఈ నాగలి ఏమైపోవును, నాగార్జున సాగరాన, కొండమీది మ్యూజియంలో, వీటికి నకళ్లు తీసి ఉంచుము" అన్నారు. పల్లెటూరి వెన్నెలలో వేణువులాగా లేదూ ఇది? కాళోజీ గొడవ వినండి: `మనసులో గల మాట యేదో పైకి పల్కుచు పల్కినట్టుల, చేసి చూపెడు శీలముం గల మాయ యెరుంగని మానవునికి, సాటిలేదిల చోటులేదిల, `అనుభవమంతా ఒకచోట, అధికారంబది యొకచోట' `తప్పు ' దిద్దగలేను దారి జూపగలేను, దప్పుచేసినవాని దండింపగాలేను, కష్టపడు వారలను కాపాడగాలేను, ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు?' `దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకుని దొరలై వెలిగే దెన్నాళ్లు? కలము పోటున కదపజాలని కావ్యగాన మింకెన్నాళ్లు?' `కుటిలమతులు దేబె మొగాలు జగతిలో రెండేరెండు రకాలు, చతురవర్గ విలాసం కొరకు దేబెల సర్వస్వం ముడిసరుకు'. ఇదంతా అభ్యుదయాకాంక్ష కాదా? గోపాలుర హృదయాల్ని తట్టి వెదురు గొట్టము వేణువైందీ, వారికి గొడుగైన గట్టు గోవర్ధన మైందీ, స్వార్థభావము వీడీ సకల మానవసేవ చేయమంటారు కాళోజీ. `కోటి రత్నాల వీణ తెలంగాణా' కోసము ప్రాణములొడ్డి నిలిచి జైళ్లలో కృశించిన దాశరథి గొంతు వినండి: `పీడిత ప్రజావాణికి `మైక్' అమర్చి అభవాతులకున్ వినిపింపజేసెదన్' అన్నారూ,`చిరభేదా గాథ మహాంబుధి విరిసిన బడబానల పద్మంలో వెలిసే విప్లవ బ్రహ్మ నవజగత్తు పుట్టిస్తాడో! భవ జగత్తు గిట్టిస్తాడో?' అని సందేహం వెలిబుచ్చారు.`అన్నార్తులు అనాథ లుండని, ఆ నవయుగ మదెంత దూరమో, కరువంటూ కాటకమంటూ కనుపించని కాలా లెప్పుడో? అని ఎదురు చూచారూ, `రానున్నది ఏది నిజం? అది ఒకటే సోషలిజం' అన్నారు.

అనంతంగా ఉన్న అధునాతన కవు లేమంటున్నారు? `తొలినాటి సంద్రాలు ఇంకిపోతున్నాయిలే' అని పురిపండావారు, `నిష్ప్రయోజక ప్రతిభావంతుల జీవితాలు నిష్ఠూరాలుగా నా దేశ జనులలో నిలిచిపోయినవి' అని శిష్ట్లా వారు.`అరాజకంబయి లౌకిక లోహపు హద్దులు మారగ ఘోష పెట్టినవి' అన్నారు దేశిరాజువారు, `మానవ మేధస్సుకు సంకెళ్లను తగిలించిన గత సాంఘిక శిలాశాసనం పడగొట్టను ... నా

నిప్పుల కంఠం విప్లవగీతం పలికిందని రామదాసుగారు, పసిఫిక్ రంగంలో, బర్మా అడవుల్లో... ప్రతి అణువూ ప్రసవించిన యుద్ధాగ్నులు మీకోసం' అని దీనుల్ని హెచ్చువేశారు. ఆయనే, 'సోమరులను, పామరులను నరనరము కదిలించే నరులందరి నడిపించే విప్లవకర మంగళకర మహాశక్తి ఒస్తున్నది.' అని ఏల్చూరివారు, 'ఈ జగతిలో నూత్న జగతి కల్పిస్తాను' అని అనిశెట్టివారు, మన్య విప్లవం మా చరిత్రలో వీచిన ఝుంఝానిల వీచిక' అని కుందుర్తివారు, మానవ స్వాతంత్ర్య మాగ్నాకార్టా' పైన రక్తాక్షరములలో వ్రాలుచేశాను' అని తెన్నేటివారు, కర్షకుడు లేచెరా, నావికుడు లేచెరా, రగిలిందిరా హైదరాబాదునన్, తిరువాన్కూరదే కాశ్మీర ప్రజలు తెచ్చిన ఉప్పిదే' నని సుంకరవారు, 'కోటి గొంతు లోక గొంతుగా శాంతికై ..... విప్పండిరా' అని ప్రయాగ. కుందనపు కుర్చీ'లో కూర్చున్న లోకమా కూర్చోని కూర్చోని కుళ్లిపోతావులే' అని రెంటాలవారు. ఇవన్నీ ప్రజావాఙ్మయ, అభ్యుదయ కవితా, వాహినులు! కార్మిక కర్షక-, పీడిత-, ప్రజలకు ఈ సందేశాలు అందునా? ఇవి వారిని ఉత్తేజపరుచునా? నా మట్టుకు నాకు, ఇవి కవులకు కవిత్వము లనిపిస్తోంది. వారిని విప్లవ కవిత్వం వ్రాయండని ప్రోత్సహించేవివి. "నీ విక్కడ పూరింట్లో వా డక్కడ నాలుగంతుస్తుల మేడమీద. లేరా గడ్డపార పట్టుకుని" అంటే చాలామందికి ఉత్సాహం. లేచిన గడ్డపారను ఆపడానికి చాలదు లేపిన అలుసు గొంతు! వినగా వినగా శేషశాస్త్రుల వారితో పాటు మనకు అనిపించేదిది: "నడచిన తొంటిదారులు కనంబడనట్టులు క్రొత్తదారులు లేర్పడినవి, దారిచూపెడి దొరల్తను నీలపు కంటి యుద్ధముల్తొడుగుచు చూచి చూపెదరు, తోయధి నేలను నేలతోయధిన్ బడినటు లయ్యె-"

కనుక, శ్రీ. శ్రీ తో 'ఇజాలను నమ్మకండి సోదరులారా, నిజము మాట చెపుతాను వినండి. ప్రిజమ్‌లో చిక్కు పడ్డ ధవళాలోకం ఋజుమార్గం చెడి వక్రగమన వర్ణ వ్యంజితమైనట్లే, అజరామరమౌ నిత్య సత్య తేజస్సిలపై ఇజ - ఇజాల పోటాపోటీ ఆరాటంలో విభజితమై పూర్ణత్వమేది చూర్ణమౌ తుంది' అనుకుందాం. లేకుంటే, భారతాన్ని స్వర్లోకపు పంచల్లో నిలపాలని పండిట్జీ పూరించే పాంచజన్య శంఖధ్వని అరణ్యమున రోదన మైనదనీ, తెలుగునాట భక్తిరసం తెప్పలుగా పారుతోంది, డ్రెయినేజీ స్కీము లేక డేంజరుగా మారుతోందనీ, అంతులేని చేంత్రాళ్లుగ అర్థభావ దుర్ద్యోతక డమడమాల సమాసాల మూసల్లో గణాచార్లు కవితను కొలుస్తున్నారనీ: కొట్టెదుట అర్ధాంగి కట్టవసనము లేక అతుకుబొంతల జుట్టి అల్లాడిపోతుండ కావ్యనాయిక మేని కనకాంబరపు చీరె కుచ్చెళ్లు సవరించి ప్రేమ

కవిరాయళ్లు కులుకుతున్నారనీ; పంచాయతీరాజ్య పర్వదినము. నీకూ నాకూ తెలిసిన వారి చేతుల్లోంచి వచ్చి ఎదుట మూతిముడిచి పొంచి కూర్చున్నదనీ చనువిచ్చిన అమ్మాయికి శనిలాగ దాపురించి పాఠ్యపుస్తకాల్లో ప్రణయలేఖ అందిస్తూ దారుల్లో కాపువేసి కారుల్లో వెంటనంటి అంగరక్షకోద్యోగం వెలిగించే నవయుగ వైతాళికు లెక్కువౌతున్నారనీ; సిఫారసుల సైంధవులూ స్త్రీ పక్షపాతి అధికారులూ స్వార్థపరులూ కమిషన్ ఇంజనీర్లూ, లక్ష్మీదాసులూ పెచ్చు పెరుగుతున్నారనీ గుర్తించి కపిత్వమనే యముని కొరడా పట్టిన మల్లారెడ్డి దానిని పార్టీలకు ఎరువివ్వడమేమిా?

ఎవరో చెపితే వినే రోజులు ఎపుడో పోయాయి. అయినా చెప్పేవారు చెపుతూనే ఉంటారు. చెప్పవలసిన అందం ఉంటే శక్తివంతంగా చెప్పండి.

*భారతి జనవరి* ***1964***

# 15. గురజాడ అప్పారావు గారు
## (సాంప్రదాయాలమీద ఆధునిక కవుల తిరుగుబాటు)

అప్పారావుగారు నేడు జగమెరిగిన బ్రాహ్మణుడు! ఆధునిక కవుల మూలపురుషుడు. కరడుగట్టి ఘనీభవించిపోయిన పాత సంప్రదాయాల నన్నిటినీ భగ్నంచేసి కవిత్వంలో కొత్తవ్యవసాయం - ప్రారంభించిన ఉపజ్ఞావసానుడు. తెలుగు పాఠకులకు ఆయనను గురించి కొత్త విషయాలు చెప్పడము కష్టము. అయినా తిరుగుబాట్ల ప్రశంసచేస్తూ మొదటి తిరుగుబాటుదారుని వదిలేయడం అసందర్భం కాబట్టి పాత మాటల్నే కొత్త రకంగా చెప్పయత్నిస్తాను.

ఆధునిక కవులలో అసలైన తిరుగుబాటుదారు అప్పారావుగారు ఒక్కరే, తక్కినవారి తిరుగుబాటుకి బీజాలు వారికి ముందుగానే ఏ కొద్దో ఏర్పడే వుండినవి, లేదా తొలిరోజుల్లో సంప్రదాయాల్ని మన్నించి ఆ నియమాల్తో రచిస్తూనే క్రమంగా మారి తిరుగుబాటు చేశారు, శ్రీశ్రీ వంటివారు, కాని అప్పారావుగారు మాత్రము మొదటినుంచీ పదహారణాల తిరుగుబాటుదారు, వారికి పూర్వము కవిత్వానికి సుదీర్ఘ రచనే వాహనము. పేచీకోరులకు వినోదము కల్పించే కజ్జా రచనలకి కావ్యత్వసిద్ధి లేదని ఒప్పుకుంటే గురజాడవారి `బాల్య' యుగములో మిగిలేవి బుద్ధ చరిత్రమూ, శ్రవణానందమూ వంటి ప్రబంధాలే. బ్రతికున్న లోకోక్తులూ, జాతీయాలూ వీటిలో అక్కడక్కడ మెరిసినప్పటికీ వీటి రచన మాత్రం మొత్తానికి `లాక్షణికపు రాస్తా' మీదే నడిచింది. పూర్వకవులు వాడిన వృత్తాల్నే తిరుపతి కవులు కూడా ఉపయోగించారు. కాసైతే పూర్వకవులు తమ ప్రబంధాలలో సరోవరాలూ, మలయమారుతాలూ, ఇందిందిర బృందాలూ, పూలపాన్పులూ, పూర్ణచంద్రికలూ, రమ్య హర్మ్యాలూ వుండే ఊహా ప్రపంచాన్ని సృష్టిస్తే తిరుపతి కవులు యమ్మారార్వైలతో, టింగురంగా యని వాస్తవిక ప్రపంచాన్నే సృష్టించారు తమ కావ్యాల్లో. వీరి కవిత్వంలో సౌందర్యానికంటె వైచిత్రిదే పైచేయి: వర్ణించిన వస్తువుకంటె వర్ణించిన ఫక్కీయే సుందరమైనది. కాగా వీరి రచనలు పఠిస్తే ఆనందము కంటె మెప్పే స్థాయిగా నిలుస్తుంది మన మనస్సులలో. కాబట్టి తిరుపతి కవుల రచన ప్రాచీన కవిత్వమ్మీద తిరుగుబాటు అనడం కంటే ప్రాచీన కవిత్వానికి `తిరుగ మూత' అనడము ఎక్కువ నిజమేమో అనిపిస్తుంది నాకు.

అప్పారావుగారిది మాత్రం అణువణునా కొత్త పుంతే. వారు చేపట్టినది ముత్యాల సరము' అనే మాత్రాఛందము. తెలుగు పదాలన్నీ అజంతము కావడమువల్ల సంస్కృత పదాలలాగా గుత్తులుగా అతకడానికి వీలులేదు. శార్దూల మత్తేభాది వృత్తాలు సమాస భూయిష్టమైన సంస్కృత భాషకే గాని ఎక్కడి కక్కడ తెగిపోయే తెలుగు భాషకి (అందులోనూ వ్యావహారికానికి) అనువైనవి కావు. అందువల్లనే తెలుగులోని జానపద కవిత్వము మాత్రా ఛందస్సులనే వాడుకుంది. తెలుగుభాష జీవము మాత్రా ఛందస్సులోనే బయల్పడ గలదు అనే సత్యమును మొదట గ్రహించి, ఆచరణలో పెట్టిన కవి గురజాడ అప్పారావుగారే. ముత్యాల సరాల్లోనే తన రచనల నెక్కువగా చేస్తూ, తక్కిన కూర్పులేవైనా అందముగా ఉండునేమో అని, "నీలగిరి పాటల"లోనూ, "పూర్ణమ్మా", "కోరుకొండ" మొదలైన పాటలలోనూ ఇతర ప్రయోగాలు కూడా చేశారీయన. ప్రయోగాల ఫలితము మాట అటుంచి, అంతవరకూ పద్యాల పంజరాల లోనే నర్తించిన కవితా సరస్వతి వీరి ప్రయత్నం వల్ల పాటలలో కూడా అడుగుబెట్టి పాటలకు కావ్యత్వసిద్ధి చేకూర్చింది. గురజాడకి పూర్వము పాటలన్నీ సంగీత కళలోవే. వాటిలో కవితా వాసన గుప్పు మంటున్నా పాటల్ని కవిత్వ మని ప్రజలనుకోలేదు. ఈయన నీలగిరి పాటలలో సంగీతము మాట నాకు తెలియదు గాని సాహిత్య వాసన జోరుగా ఉన్నది. "లేవొకో మంత్రములు లేమగా జేయ నిను లావపుడు బయటపడు నొక్కొ, కావనుచు నీ లాటి కాంతునకు జిక్కి నీ భావమున నలయికను బడుదొ" వంటి భావాలు చాలా ఉన్నాయి నీలగిరి పాటలలో. ముత్యాల సరాలు కూడా పాటలే "గుమ్మ డేడే గోపి దేవీ" పాటది ఆ వరసే. అయితే ఈ పాటలలోని గతి పద్యపు నడకని పోలి వుంటుంది. కాబట్టి చరచరా నడిచిపోతాయి. గురజాడ వారు వాడిన "పూర్ణమ్మ". "కాసులూ" వంటి ఖండముల వరసలూ పద్య వరుసల వలె వేగ గతి గలిగినవే. వీరి తరవాత ఎంకి పాటలూ, బసవరాజు గేయాలూ, తురగా వెంకట్రామయ్య పాటలూ, కవి కొండల గీతికలూ సాహిత్యానికి చేరే పుట్టినవి. ఛందస్సుని మలచుకోడము గురజాడతోనే మొదలు.

భాషాభేషజాలు చెయ్యకుండా తేలైన మాటలతో కావ్యరచన చెయ్యడం అప్పారావుగారి తిరుగుబాటులో రెండో ఎత్తు, తేలైన మాటలతోపాటు వ్యవహారంలో వున్న మాటల్ని కూడా వారు ధారాళంగా ఉపయోగించారు. ఈ మార్పువల్ల వర్ణిత వస్తు సౌందర్యానికీ వర్ణన సౌందర్యానికీ చక్కని సమ్మేళనము సాధించారు వారు.

అంతకుముందు కవులు ధారాళంగా సంస్కృతపు బొంతలు కప్పి తమ కవిత్వపు నిస్సత్తువను దాచేవారు. తేటమాట లుపయోగించి నట్లయితే, బాజాభజంత్రీలు

లోపించిపోయి, కవులు తమ రచనల్లో ప్రౌఢసంస్కృతాని కంటకట్టే కవితాశిశువు మొర్ర వినబడిపోతుంది. అప్పారావుగారి రచనల్లో మాత్రము చెప్పే విషయమూ, చెప్పే పద్ధతీ, వేర్వేరుగా కనబడవు. రెండూ ఒకటైపోతాయి. వారు సృష్టించే ప్రపంచం మనకి పరిచితమైన ప్రపంచమే. ఆ ప్రపంచంలో తూర్పు బల బల తెల్లవారు తుంది. కోళ్ళు మేలుకొలుపులు కూస్తాయి. ఎక్కడనో వొక చెట్టు మాటునించి వొక్క కోకిల పలకడం మొదలుపెడుతుంది. సీతు వల్లికైనాఇ నుని వేడికి వాడి ఉండదు. నారింజ, ఆలివ్ వృక్ష షండములూ, ద్రాక్ష పందిరులూ, ఇంటి వంటలూ కోళ్ళకి విందు చేస్తాయి. కొండల నడుమ నున్న కోనలలో కిలకిలమని పలుకుతాయి కీరములు, తాడి వనములు తూర్పు కొండను గొడుగు లెత్తుతాయి. చల్లగాలులు అలలుగా సాగిజల్లు జల్లున పూలు రాలుస్తాయి. ఈ ప్రపంచములోని వ్యక్తులో? మాలెతని చూడండి. తెలివి యొలికెడి తేటకన్నులూ, మురువు గులికెడి ముద్దుమోమూ, వేల్పు చేడియలైన నేరని గానమాధురీ, చిత్తరువులందైన గనని పవిత్ర రూపపు సౌష్ఠవమూ ఉన్నవట ఆమెకి, ఆమె తండ్రిని చూడండి. పండు గెడ్డము; నిండు కన్నుల నిండ శాంత రసంబు; పలుకుల కడలి గాంభీర్యమూ, ఒడలిని దివ్యతేజమూను. ఇతర వ్యక్తులో.

ఎల్ల లోకము వొక్క యిల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ
వలెనని ఒక సాంఘికుడు.
మరులు ప్రేమని మది దలంచకు;
మరులు మరలును వయసు తోడనె;
మాయ మర్మము లేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటే
బ్రతుకు సుకముకు రాజమార్గము" ---

--- అని ఒక ప్రేయసుడు!

మంచి చెడ్డలు మనుజు లందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాల నే అగుదున్

--- అని ఒక మూర్ధాభిషిక్తుడు!

నాటునను గల యట్టి యిడుములు
కాటి యందును కలవు; ఓరిమి
యేటికైనను మందు; కలిగిన
కలుగు సౌఖ్యంబుల్

--- అని రావి కిందను రచ్చ శిలపై కూర్చునే పల్లెపెద్ద!

పట్ణ మేలే రాజు అయితే
రాజు నేలే దైవ ముండడొ
పరువు నిలపను పౌరుషము మీ
కేల కలగదొకొ!

--- అని రెచ్చగొట్టే కన్యక!

గురజాడవారు సృష్టించినది చిదానంద ప్రపంచము! తేటమాటల రచన ఈ ప్రపంచాన్ని చైతన్యవంతము చేసిన పూర్ణ జ్యోత్స్న.

పుస్తకాల్లో విన్న సౌందర్యాన్ని కాక స్వంతంగా గుర్తించిన సౌందర్యాన్నే రచనల్లో పొదిగి ఇవ్వడం గురజాడవారి తిరుగుబాటులో మూడవ ఎత్తు. అంతవరకూ కవులు పూర్వ కావ్యాల్లో చదివిన సౌందర్యాన్నీ, పూర్వకవుల పద్ధతినే సాగిపోయి కనిపెట్టుకున్న అలంకార సంపదనీ మాత్రమే యెక్కువగా ఇచ్చారు. ప్రబంధరత్నావళిని చదివినట్లయితే, ఒక పేక దస్తాతోనే గారడీవాడు ఎన్నో తమాషాలు చూపించినట్లు సంస్కృత కావ్య వస్తువునే రకరకాలుగా మడతపెడుతూ ఏదో కొత్త కోసము దేవుళ్ళాడిన ప్రబంధ కవుల గారడీ మొగ్గలు గోచరిస్తాయి. గురజాడ వారి రచనలలో ప్రబంధ కవుల సౌందర్య సామగ్రి-సరిద్రాజ హంసములూ, శుక కేళి పంజరాలూ, కలాపినీ ప్రావృడంబుదాలూ, అవనీ చైత్రాగమాలూ, (మిగతా సామగ్రికోసము పారిజాతాపహరణంలోని చివరి పద్యాలు చూడండి) ముఖ, కర, పాద పద్మాలూ - ఏవీ గోచరించవు. తన చైతన్యమే కన్నుగా, ప్రతిభే దారి చూపే జ్యోతిగా సాగిపోయి గురజాడ కవి నిరాడంబర కవిత్వము రచించినారు. విరులు కన్నులు విచ్చి చూశాయట. చెట్లు చామలు కోటి చెవులను గ్రోలి యలరగ పాటపాడే పల్లవాధరికి తాటివనమున నాగి చంద్రుడు తాను చెవి యొగ్గెనట. కరముబట్టి యురంబు యురమున జేర్చి, ముద్దిడి కురులు దువ్వితే తాళవనమును వెడలి చంద్రుడు ఫక్కున నవ్వేడట. ముసలి మగని ఇంటికిపోయే పూర్ణమ్మకి బలబల కన్నుల కన్నీ రొలికిందట. కన్నులు తుడుచుకు కలకల నవ్విందట పుత్తడిబొమ్మ పూర్ణమ్మ. మునివేష ధారుడై అర్జునుడు ద్వారకకి పోయినప్పుడు.

కపటమౌని జూచి కన్నియ జూచుచు
గన్నె జూచి కపట మౌని జూచి
చిత్త మలర దలచె (నట) చిత్తజ జనకుడు
`నేడు గంటి నలువ నేర్ప'టంచు,

అప్పారావుగారి `సుభద్ర' చెరుకు తునక! వారు ఆ కావ్యాన్ని పూర్తిచేయకపోవడము మన దురదృష్టము.

పాండిత్య ప్రకటనము కోసమూ, ఉక్తి వైచిత్రి ప్రాగల్భ్యము కోసమూ కాక, చదువరులకు ఒక సందేశమో, ప్రబోధమో ఇవ్వడము కోసము కావ్యరచన చెయ్యడము గురజాడవారి తిరుగుబాటులో నాలుగో ఎత్తు. ముత్యాల సరములూ, కాసులూ, లవణరాజు కలా, కన్యకా, డామన్ పితియసూ, పూర్ణమ్మా, దేశభక్తి - అన్నీ ప్రబోధ కావ్యములే. చదువరులకు చెప్పడానికి అప్పారావుగారికి కావలసినంత బుద్ధీ వివేకమూ ఉన్నాయి. ఆయన ఆస్తి కోసమూ కీర్తికోసమూ కవిత్వము చెప్పలేదు. తెలుగు పాఠకులకి సౌందర్యమూ వెలుగూ చూపించడానికి జాబిల్లి వలె జ్యోత్స్నా ప్రకాశమును వెదజల్లినాడు. ఆ చంద్రుడి కిదొక నూలుపోగు.

*కిన్నెర - 1944 జూలై*

# 16. కృష్ణశాస్త్రి - 2
## (సంప్రదాయాలమీద ఆధునిక కవుల తిరుగుబాటు)

కవిత్వము యొక్క జీవితంలో సంప్రదాయాలూ, తిరుగుబాట్లూ దివారాత్రాలు. తిరుగుబాటు తరవాత సంప్రదాయాలూ, ఆ వెనువెంటనే తిరుగుబాట్లూ వస్తూంటేనే కవిత్వం చైతన్యవంతంగా సాగిపోతుంది. సహృదయుల దృష్టిలో సమకాలిక కవిత్వానికి విశేషంగా చైతన్యం వచ్చినట్లుగాని కనబడిందంటే, కొత్త సంప్రదాయ మేదేనా వచ్చేనావుండాలి; లేదా పాత సంప్రదాయము భగ్నమయ్యేనా వుండాలి. కృష్ణశాస్త్రి తన ఖండకావ్యాల్ని సభలలో వినిపించే రోజుల్లో ఏదో కొత్తదనము కవిత్వంలో ప్రవేశించినట్లు కనిపించింది. పరిశీలించగా ఆ కొత్తదనము తిరుగుబాటు యొక్క ఫలితమే అని తేలింది. అయితే ఇది కవిత్వ పద్ధతులపైన తిరుగుబాటు కాదు. కవియొక్క తిరుగుబాటూ కాదు. కృష్ణశాస్త్రిగారి తిరుగుబాటు; అంతవరకూ కవి వ్యక్తులు అనుసరించిన పద్ధతులపై తిరుగుబాటు. కృష్ణశాస్త్రిగారు గురజాడవలె కావ్య సామగ్రీ, - భాషా, - ఛందస్సూ, - ఆదర్శమూ మార్పు చేసిన వారూ కాదు; పఠాభివలె అద్వైతము అవలంబించిన వారూ కాదు. వారివరకూ మన మెరిగిన కవులు సమకాలిక సంఘ పరిస్థితులను విమర్శించీ, నిరసించీ, బోధించీ మార్చయత్నించారు. కృష్ణశాస్త్రిగారు సంఘపద్ధతుల్ని ఇదీ అదీ అని చెప్పకుండా ఛీ కొట్టేరు. ఈలాంటి సంఘానికి అతీతులైపోయి 'ఆకాశ పథ విహారస్వేచ్ఛ' ని కోరుకున్నారు. బాలికల్ని వృద్ధుల కీయకుండా చేదామని గురజాడవారు పూర్ణమ్మ పాట రాశారు. వరకట్నాల వల్ల జరిగే ఘోరాల్ని చూపించి మందలిద్దామని రాయప్రోలువారు 'స్నేహలతాదేవి' రాశారు. కృష్ణశాస్త్రిగారిలో చదువరులమీద దృష్టీ, అభిమానమూ గోచరించవు. కాంతాసమ్మితంగా చెప్పే ఖర్మమేమీ అని ప్రభుసమ్మితంగానే సాగించారు. ఆదికవి అన్నాడట ఎక్కడో - "చేతులెత్తుకుని ఘోషిస్తున్నాను. ఎవ్వరూ పట్టించుకోవడములే" దని. కృష్ణశాస్త్రిగారు అంటున్నారుగదా - "ప్రళయజంఝూ ప్రభంజన స్వామి నేను ఏటి పని ఇది లోకమూ హృదయదళన దారుణ మహోగ్రకార్యంబు దలచినావు?" అని. ఈ మాటలు వింతగా కొత్తగా వినపడతాయి. "ఇదేమి టీవ్యక్తి ఇలా గంటున్నాడు?" అనుకుంటాము అదే ఆయన తిరుగుబాటులో విశేషము.

కృష్ణశాస్త్రిగారికి ఆత్మవిశ్వాసము `లావు' అంటే చాలదు; `మరీ లావు' అనాలి. పూర్వకవులు కూడా ఆత్మవిశ్వాసము ప్రకటించినవారే. అయితే వారు `వచియింతు వేములవాడ భీమన భంగి' దగ్గిర నుంచి `గడియకు నూరుపద్దెములు గంటములేక రచింతు' దాకా తమశక్తి ఫలానా అని చెప్పుకున్నారు. శాస్త్రిగారి సవాలే వేరు. "నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు? నా యిచ్ఛయే గాక నాకేటి వెరపు?" అంటారు ఆయన. అలాగని తమ స్వేచ్ఛతోనే ఆనందిస్తూ నడుచుకుపోరు.

"వలపుటాకలి స్రుక్కు నాబ్రతుకు మీద
ఇనుపపాదాల నిడి లోక మిపుడు నడచు"

నంటూ మనవులు చేస్తారు. మొత్తానికి వీరి పోకడలు పరిశీలిస్తే "వక్రగతి బోదు జక్కని పథమునందె" అన్నదే నిజమా అనిపిస్తుంది.

లోకానికి అతీతమైన - కాబట్టే విడ్డూరమైన- స్వేచ్ఛాభిలాషే కృష్ణశాస్త్రిగారిలో వింత. ఈ రకపు స్వేచ్ఛను నే నెరిగినంతవరకూ తెలుగుకవులు ఎవరూ ప్రకటించలేదు. ఆ స్వేచ్ఛకి ఎవరు నవ్విపోయినా సిగ్గులేదు, వెరపూ లేదు (?), `మొయిలు దోనెలలోన బయనం బొనర్చి, మిన్నెల్ల విహరించి మెరపులై మెరసి, పాడుచు చిన్కు' లై పడిపోయే స్వేచ్ఛ అది. తెలిమబ్బు తెరచాటు చెలి చందమామతో సరసాలూ, శీకరంబులతోడ చిరుమీలతోడ నాట్యమ్ములూ ఈ స్వేచ్ఛకి తృప్తి కలిగించలేదు.

"అలరు పడంతి జక్కిలిగింత వెట్టి
విరిచేడె పులకింప సరసను బండి
మఱియొక్క ననతోడ మంతనం బాడి
వేరొక్క సుమకాంత వ్రీడ బోగొట్టి"

పూవుపూవునకూ పోవడమూ చాల లేదు. `ఏలకో యెప్పుడో యెటులనోగాని మాయమై మారిపోతా' ననేవరకూ ఆ స్వేచ్ఛకి దాహము తీరలేదు.

"యుగయుగంబుల నీశ్వరయోధు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించువారి
యమలజీవితఫలము ధన్యతను గాంచ
జగమునింద స్వేచ్ఛాగాన ఝురుల నింప"
నుపక్రమించిన ఉత్సాహము,

"పక్షినయ్యెద జిన్ని ఋక్షమయ్యెదను
అలరునయ్యెద జిగురాకు నయ్యెదను"

అని జడిపించి జడిపించి, యెట్టకేలకు మాయమై మారిపోడము వింతకాదా? ఇంతకన్నా వింత ఏమిటంటే వీరన్నంతపనీ చేసి చూపించారు! చిత్తగించండి మనవిచేస్తాను.

మహాత్ముడు ప్రారంభించిన సహాయ నిరాకరణంతో రకరకాల స్వేచ్ఛలు తాండవమాడేయి. స్వేచ్ఛాప్రణయ మందులో ఒకటి.

"సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదజల్లు జందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?"

అనే పలుకులు ఈ మతప్రచారకుల వశీకరణమంత్రాలు.

"ఏటిపని ఇది లోకమా! హృదయదళన
దారుణమహోగ్రకార్యంబు దలచినావు
ప్రణయమధురిమ మెరుగవు పాపమనవు
పక్షములదూల్చి బంధింతు పంజరాన."

అన్న నిందలు సమాజ పరిస్థితుల వ్యతిరేకత్వానికి వీరి ఎత్తిపొడుపులు!

"హృదయవనజాతసుమ
మృదుమనోహరదళము
లదయతను ద్రుంచినారే
పెంధూళి
జిదిమి వెదజల్లినారే"

అన్న మనవులు తమ్మెరుగని వారి సానుభూతికోసము వీరు చేసే ప్రచారము!

"తేనెలం గూర్చి వలపుల తేటపరచి
ధన్యురా లయ్యె మాచెలి తల్లిరుబోణి
కాని నిరతంబు మల్లిక కడనె యుండి
ముదము గూర్పగ మాకొక్క పూవె చెపుమ"

అన్నవి మోసపోయిన శకుంతలలకు వీరి సమాధానము. కృష్ణశాస్త్రిగారి వింత స్వేచ్ఛలో ఈ స్వేచ్ఛా ప్రణయము ప్రధానభాగము. కృష్ణపక్షములోని 'తేటి వలపు', 'అన్వేషణము', 'ఏల ప్రేమింతును', 'దివ్య భాగ్యము', 'అయ్యో', 'లోకము', 'శాపము', 'అబ్బ!' కొద్దీ గొప్పో స్వేచ్ఛా ప్రణయఘుమఘుమలే కొట్టుతున్నాయి.

శాస్త్రిగారికి ఆత్మవిశ్వాసము లావన్నాను. గుడిపాటి వెంకటచలం గారిలాగ ధైర్యంగా నమ్మిన భావాల్ని ప్రచారము చెయ్యకపోయినా, కావ్యాల్లో అన్యాపదేశంగా కృష్ణశాస్త్రిగారిలాగ చెప్పడానికేనా లోకాన్ని లెక్కపెట్టని ఆత్మాభిమానముండాలి. కృష్ణశాస్త్రిగారిలో ఇలాంటి ఘట్టాల్లోనే కాక ఇతర సన్నివేశాల్లో కూడా లోకమంటే నిర్లక్ష్యమూ, నిరసనా కనపడతాయి.

"వెర్రిలోకమహృదయంపు పంజరంబున బంధింతె? పాదపమున, స్వేచ్ఛ నెటులు గూడియుందు మెల్లప్పుడు" అనీ,

"పక్షినని పాడగలనని ప్రణయవీధి
నిత్యలీలావిహారముల్ నెరపుదునని
పక్షముల దూల్చి బంధించి పంజరాన
గానమును బ్రాణముహరింపబూనినారు."

అనీ ఆలంకారికభాషలో లోకాన్ని కొంచెపరచీ,

"పొడుపు మలపయి బంగరుముగ్గు లుంచి
సంజమబ్బుల కుంగరాల్ సంతరించి
పోవుచున్నావు నీ వేమి పొందితోయి?
వెర్రిమిత్రుడ లోకంపు విధము గనవొ?

అని వెక్కిరించీ ఊరుకోక, యెడద వెలికి దొలగి పారని దుఃఖాశ్రుజలమువలన బరువైన యెడదతో కృశిస్తూ, 'ఓయి సంధ్యాసమీరణా, నీదు నునులేత రెక్కల మీద వడిగ నెత్తికొనిపోవరాదె న న్నెచటి కేని' అని వేడుకొంటూ కూడా లోకము మాట తలపుకొచ్చేసరికి-

"నన్ను గని యేరు జాలి జెందంగవలదు
ఎవ్వరని యెంతురో నన్ను"

అని నిటాగ్గా నిలబడి అదలిస్తున్నారు. లోకం నుంచి సానుభూతి పొందే నామర్దా ఈయన కక్కరలేదు! కాని ఎదలోపలి యెదలో నెమ్మదిలో మాత్రము లోకము తనవైపు పరుగుపరుగున రావాలని ఉన్నది! చూడండి.

"కరుణపట్టున కీలిచ్చుగాని చేయి
చాచికొనినాడ మృత్యు ఘోషమ్మె మరచి
వట్టి బయలున నొక మోడు చెట్టువోలె
ఎత్తినది కర మెత్తినట్లే కృశించె!"

ఇంతకన్నా చక్కగా చూపిస్తుంది వీరి స్వాభిమానాన్ని ఈ ఊహామరణఘట్టము. చూడండి.

"ఏను మరణించుచున్నాను; ఇటు నశించు
నాకొరకు చెమ్మగిల నయనమ్ము లేదు.
..........................
నా మరణశయ్య పరచుకొన్నాను నేనె
వడకని కరాలు రగులుచు దుడుకుచిచ్చు
లాలనల నింత నుసిగాగ కాలు త్రుటినె.
..........................
పడదులే ఆర్పగా నొక బాష్పమేని!"

ఎందుకు పడాలో బాష్పము? అందుకే అన్నాను కృష్ణశాస్త్రిగారు చివరికి మారిపోయారని. తొలిఘట్టాలలోని "లోకులంతా నేలమీద నడుస్తే నేను నింగిమీద నడుస్తా"ననే తత్వము చివరకు లోకపు ఇనుప పాదాల బరువుకి మూలగడము మారిపోవడము కాదా? "నాయిచ్ఛయే కాక నా కేటి వెరపు" ప్రతిజ్ఞ చివరిదాకా నిలిచింది కాదు.

(ఇది కృష్ణశాస్త్రి తిరుగుబాటుచరిత్ర. కృష్ణశాస్త్రి తిరుగుబాటుదారు మాత్రమే కాదు. `సౌందర్య రసైకజీవి' కూడాను. ఆ చరిత్ర సావకాశంగా ఇంకొకమారు.)

*భారతి, జూన్ - 1950*

# 17. 'పఠాభి'

## (సంప్రదాయాలమీద ఆధునిక కవుల తిరుగుబాటు)

గ్రాంథిక భాషా శిష్టవ్యవహారికమూ మాత్రమేకాక వాడుకలో వున్న ఏ జాతీయమైనా సరే కావ్యరచనకి పనికివస్తుందని నిరూపించడానికి నండూరి సుబ్బారావుగారు యెంకిపాటలు రాస్తే, పద్యాలూ పాటలూ మాత్రమే కాక ఏ వరస అయినా సరే కవిత్వానికి వాహకము కాగలదని నిరూపించడానికి `పఠాభిగారు"ఫిడేలు రాగాల డజన్" రచించారు. ఇందులో పన్నెండు ఖండాలున్నవి. మొట్టమొదటి ఖండము `ఆత్మకథ' లో తమ ఆదర్శాల్ని చెప్పుకొచ్చారు. `నా ఈ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాల నడుముల్ విరగదంతాను' అనే ప్రతిజ్ఞని గమనించినప్పుడు విచిత్రమైన ఆ ఆశయానికి రిచ్చపడతాము.`చిన్నయసూరి బాల వ్యాకరణాన్ని చాల దండిస్తాను' అని చదివి `ఈయన లేఖిని సాధనం మాత్రమే కాదు; ఆయుధం కూడా కాబోలు' అనుకుంటాము. `నా యిష్టం వచ్చినట్టు జేస్తాను'తో వీరి యత్నం పూర్తిగా తిరుగుబాటే ననిపిస్తుంది.`అనుసరిస్తాను నవీనపంథా' అనగానే వీరి తిరుగుబాటు విరగబాటు కాదనీ, అందులో కొత్తరకపు కట్టుబాటుకూడా ఉన్నది కాబోలు అనీ ఆశపుడుతుంది.

అవును `ఫిడేలు రాగాలడజన్' పఠిస్తే తిరుగుబాటూ కొత్తరకపు కట్టుబాటూ కూడా కనిపిస్తాయి. తిరుగుబాటులోని ప్రధానపుటెత్తుని `ఆత్మకథ'లో కవిగారే చెప్పుకున్నారు `ఈ నా వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాల నడుముల్ విరగదంతాను' అని. ఈ పుస్తకములోని పన్నెండు ఖండాల్లోనూ మొత్తపునడక ఫక్తు వచనపు నడకే, పంక్తులన్నీ గాలిస్తే, అన్ని ఖండాల్లోనూ చేరి `కడగంటి చూపయిన పరపరోసీ శశీ', `మిలియను జనములు మిణుగురు బువ్వల',`గాంధీటోపీ జవ్హారు జాకట్' వంటి పంక్తులు పది కన్నా ఎక్కువలేవు. ప్రత్యేకంగా యత్నించి పూర్తిగా విరగదన్నేరు పద్యగతిని కవిగారు. ఎక్కడైనా ఒకచోట తమ రచన `నీగుంభ్రని మోమందపు తరహా సయితము, అనీ, `వినూతన పద ప్రేమికులు మహాకాముకులు' అనీ గతి నలవర్చుకుంటున్నట్లుగాని కనబడితే, వెంటనే `మాకేమి నచ్చనే నచ్చదు',

అన్యోన్యమగు దంపతులు కూడ' లాంటి వచనపు దుడ్డుకర్రల్తో ఆగతిని విరగగొట్టి పారేశారు. పద్యానికి జీవము గతి మాత్రమే అని నమ్మి గతిని పూర్తిగా విరిచి పారేశి, వీరు తమ ప్రతిజ్ఞని నిలబెట్టుకున్నారు. కాని యతిప్రాసలు మాత్రము ఆకాశంలో చుక్కల్లాగ వీరి ఫిడేలు రాగా లన్నింటిలోనూ మెరుస్తున్నాయి. పద్యత్వము యతిప్రాసలోనే నిలిచి వుంటుందని నమ్మడము చేతనే కాబోలు తమ రచనలకి `వచనపద్యా'లని పేరు పెట్టుకున్నారు.

చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను' అన్నది వీరి తిరుగుబాటులో రెండో ప్రతిజ్ఞ. వ్యాకరణసమ్మతమైన `పలురంగు వలువలు గట్టుకొని లలనలు ప్రదర్శించుకొనుచున్నారు', `తొమ్మిదణాల సినిమాటిక్కటునకు తమ బహిర్దేహము మీద యాత్ర చేయుటకు హక్కు నిచ్చే(?) కొంద రాంగ్లో ఇండియన్ అభాగినులు', `చిటపట చిటపట చినుకులు పడుచున్నవి `కడు నిలచినది మనుష్యుల నడక' వంటి పంక్తులు చాలా చాలా వాడినప్పటికీ, `ఎవర్నని', `అతగాడు', `దోస్తాను', `వొత్తుకుంటూ', `నాగరీకులు' లాంటి వాడుక మాటలు చివర వరకూ వాడుతూ గ్రాంథిక సూత్రాల్ని పాటించక పోవడముతో ఊరుకోక, `ఉపజ్ఞ నాకున్ లేదని', `ప్రదర్శనము చేతన్ స్తంభీభూతంబయిన', `పోసినట్లుంగురిసేటి', `లోనన్ మాట్లాడుటకు' అని కశితో నకారపు పొల్లును పదేపదే ప్రయోగించి వ్యాకరణాన్ని ఉడికించి, `తలవ్రాల్చే పరుగిస్తూన్న, పరిమార్చుట, వినుబడలేదే, `అధికమగుచుంది' అనే కృతక ప్రయోగాల్తో వెనక్కి తిరిగి వెళ్లిపోయే వ్యాకరణాన్ని వెక్కిరించి మరీ వదిలారు. మొత్తంగా రచన లన్నించినీ పరికిస్తే, `నా యిష్టం వచ్చినట్లు జేస్తాను' అని ఈయన ప్రథమఖండములో చెప్పినది కూడా జ్ఞాపకము వస్తుంది. `భావకవిని మాత్రము కాన్నే', `పొగా', `వయిటవేనులోకి', `తిరుగుచుంది', `హంగ్రీ కనులు', `మేమాసము', `మూత్తొ', `క్యాజ్జేయు' మొదలైన కుదిరీ కుదరని స్వతంత్రపు ప్రయోగాలూ; `బ్లడీ, హయిహీలుయాన, రుమాన్‌టిక్‌గా,' వంటి ఇంగ్లీషుమాటలూ; `గరం, గమ్మత్, కులాసా, నాజూకు' వంటి హిందూస్థానీ పదాలూ, `పరిష్వంగగ్రస్తము, చంద్రాగమనము, సత్యనారాయణ కృత రామాయణము, వంటి సంస్కృత సమాసాలు మాత్రమే కాక, విశాఖా, గోదావరీ, గుంటూరూ, నెల్లూరూ మాండలికాలు కూడా ధారాళంగా వాడడం ఇష్టం వచ్చినట్లు చెయ్యడము కాకపోతే మరేమిటి? జర్మనీ యుద్ధానంతరము యూరపులో బయల్దేరిన నియమ భంగ చాపల్యము కూడా వీరి రచనలలో,`20అయిటమ్ముల చి', `ఇన్ గ్లీష్టానిని నన్ను స్లేపట్ ట వద్దని గదద్దిన్చినా కూడ' వంటి ప్రయోగాల్లో కనబడుతోంది. ఉచ్చారణని బట్టిన వర్ణక్రమము మారాలని సూచించడానికి కాబోలు `చైనా, షైన, సౌందర్యము మౌనము' వంటి ఐత్వ, ఔత్వ పదాల్ని `చయినా, పయిన, సవుందర్యము' అని విరిచేశారు. త్రుప్తి, హ్రుదయమూ' అని ఎందుకు రాయలేదా

అని అనిపించింది నాకు. `ఫిడేలు రాగాల డజన్' అనే పేరులో అట్టమీద `ఫిడేలు'కి బదులు ఫిడేలు బొమ్మ వేయడమూ, అంకితములో `మృణాళినికి; కాదు కళ్యాణికి; కాదు ఇరువురికి' అని ఆలోచన చూపించడమూ కూడా వీరి స్వంత పద్ధతికి ఉదాహరణాలే. ఈ పద్ధతిని బి.వి. సింగరాచార్యులుగారిలాగ

`ఆ మాసిన నల్ల మసిష్టం
లో..... వచ్చి మెల్లిగా
గదిలో Light ను తగ్గిస్తే
ఎల్లాగుంటుందో బోలో

ఈ Beauty Worshipper కి

అని ఏ భాషలోని పదాలు ఆ భాషలోనే వేసి శ్రీశ్రీ చెప్పినట్లు

`న -న - న -నత్తిమాటలు కూడా

మ -మ - మ -మన కవిత్వం ఉండొచ్చు' గనక కొన్ని నత్తి మాటలు కూడా చేర్చియుంటే, ఇంత చిన్నపుస్తకంలో అన్ని మార్పులు చెయ్యగలిగిన పఠాభిగారి జాగ్రత్త ఇంకా నిండుగా ఉండియుండును.

మనకి సాధారణంగా తెలిసిన కవితా సామగ్రిని వాడక అంతా సరికొత్త సరుకు వాడడము `పఠాభి'గారి తిరుగుబాటులో మూడోయెత్తు. బందరు వీధుల్లో బేహారి అమ్మిన కవితా సామగ్రి `కపురంపుంబలుకుల్ తుషార జలముల్ కల్వాల్ పికధ్వాన మచ్చపు బంగారము జ్యోత్స్నల్ చల్ల గాలుల్, కూడా ఈయన నాగరిక దృష్టికి నచ్చునే నచ్చవు. బాదంఖీరూ, డీలక్సు కుషన్ సోఫాసనమూ, అమృతాంజనపు పూతా, కనిమారాలో టీపార్టీ __ఇవీ కవి కోరే సుఖానుభవాలు. కామాక్షి స్పర్శవల్ల `పఠాభి'కి కలిగేది గగుర్పాటుకాదు,`అపూర్వంబగు మజా'; మైమరపు కలగదు; `నో రూరుతుంది.' లీల్ అధరాలలో సుధారసము కాదు ఆయనకు గోచరించేది; జహంగీరు తీపు. బ్రహ్మానందము కాదు ఆయనకు కలిగేది; బలే సరదా, బలే గమ్మత్తు! నయనోత్సవమూ, పులకరింతలూ ప్రాణులకు కా దాయన ఆరోపించేది ప్రాణంలేని కామాక్షి కోకకి! కర్ణ పేయత్వమూ, కీరవాణులూ, హిమాలయమూ, మినుమినుకు మనే దీపికలూ, ముఖచంద్రుడూ వీరి కావ్యప్రపంచంలో తొంగి చూస్తున్నాయే అంటే అది యతిప్రాసల్ని సర్దుబాటు చెయ్యడానికి మాత్రమే కాని అంతకు మించిన పనికి కాదు. వీరు సృష్టించే పాత్రలకు కూడ `విచిత్రంబగు భావాలు కలవు.'

`యెలక్ట్రికు దీపాలకు మల్లే ఈ మూన్లయిటుక్కూడా స్విచ్చుండిన ఏం బాగుండును' అని `పఠాభి' అంటే `జిలేబీ లాగా ఈ చంద్రచక్రాన్ని మ్రింగివేయాలనిపిస్తున్నది' అంటుంది కామాక్షి. నాయర్రోడ్డున పోయే నవ్యస్త్రీయందం శాఖాహారుడగు పఠాభికి మాంసాహారం మీదికి బుద్ధిపోనిచ్చిందిట. భువి కార్చిన కన్నీటి చుక్కల్లాగ తారకలు గగనములో రగులుచున్నవట. మిలియను జనములు మిణుగురు బువ్వల కొరుకుచున్నటు లున్నదట మేఘధ్వని! లీల నాతో సమానమయిన లావుం గల్గి దిట్టంగా జంతువట్లుంటుంది'ట. అమెరికన్ కార్లు ఉబ్బుకొని వచ్చే సెక్సు అపీలు'తో `అమెరికన్ స్త్రీల రకం వున్నవట! ఇవన్నీ చూస్తే ఇంట్రో'లో శ్రీశ్రీ ఉద్ఘాటించిన `విచిత్రమే సౌందర్యం! సౌందర్యమే విచిత్రం!' అన్న సూత్రాన్నే గాఢంగా నమ్మి, `పఠాభి' గారు ప్రతీ అడుగులోనూ కశితో ఈ విచిత్రాన్నే సాధించారా అనిపిస్తుంది. అంతమాత్రమే అయితే ఈయన ప్రయత్నమంతా సంప్రదాయాల విరగబాటుకోసమే అని నిశ్చయించవచ్చును.

కాని, వీరి విచిత్రంబగు భావాల నన్నిటినీ పేర్చుకొని విజ్ఞాన శాస్త్రజ్ఞుడి లాగ వాటిని పరిశీలిస్తే చిత్రమైన ఒక కట్టుబాటు గోచరిస్తుంది. ఈ కట్టుబాటే వీరిని ఆధునిక కవికుమారులలో చేరుస్తుందని కూడా అంటాను నేను. ఏమి టీ కట్టుబాటూ అంటారా? మనవి చేస్తున్నా. వీరి కవితాదృష్టి అంతా నగరీక(Urban) దృష్టి. మద్రాసు నగరంలో మందయానలూ, మలయానిలమూ, కోకిలగానమూ ఎక్కడనించి వస్తాయి - బాటా హయిహీలు యానలూ, బంగాళాఖాతం మీదినుండి వచ్చేగాలీ, విధీవిరామం లేని బస్సు ట్రాముల గోలా తప్ప? మరి అనుభవాన్ని బట్టి రచించే మద్రాసు కవికి ఏది కవితా సామగ్రి కాగలదు? రోజల్లా ఏ ఆఫీసులోనో అకవుంట్లతో అనంతమగు యుద్ధం సాగించే నగరీకుడికి, డ్రాయింగు రూములో గోడకి తగిలించే చిత్రాలూ, నాగరిక కన్యల పవుడర్ పూయబడిన ముఖాలూ, సోయగము కల అమెరికన్ కార్లూ, రవికందున గుచ్చబడిన లేడీస్ పార్కర్కలంబులూ, కమాన్లతో దోములతో నున్న ముఘల్ ష్టయిలు దేహంపు కట్టూ కాక, ఆకర్షించి పట్టగల సౌందర్య మే ముంటుంది? అందుకే పఠాభిగారు `తగిలింపబడియున్నది జాబిల్లి చయినా బజారు గగనములోన' పయిన అనీ, `క్వీన్మేరీసులో కిరవాణుల పొడి ప్యాముకొనబడిన ముఖాలు చూస్తూవుంటే నో రూరుతుం'దనీ, `యమెరికన్ కార్లు ..... ఉబ్బుకొని వచ్చే సెక్సు అపీలుతో ..... అమెరికన్ స్త్రీల రకం వున్నవి' అనీ, `రవికందున గ్రుచ్చబడి' స్వర్గద్వయం మధ్య నూగాడుచున్న, ఆ స్త్రీ వక్షము మీది, లేడీస్ పార్కర్కలంబుగానున్న నేను నా రక్తాన్నే సిరాగా పోస్తాను' అనీ, `ముఘల్ ష్టయిలు దేహంపు కట్టుజూచుట నాకు అమృతాంజనం పూసినట్లుంది' అనీ రాశారు. నగరములో రంగులన్నీ ఉన్నప్పటికీ, పల్లెపట్టులో వలె పచ్చని వృక్షరాజములూ,

నక్షత్ర ఖచిత నీలాకాశ సౌందర్యమూ, వర్ణ కుసుమావృత లతానికుంజములూ, శాద్వలస్థలుల నడుమ మెల్లగా సాగిపోవు నదీ నదములూ, సంధ్యారుణాంశులూ నిర్మలస్థితిలో గుర్తించుటకు వీలుండదు. కనుక నగరీక కవికి రంగులతో కంటె చలనముతోనే ఎక్కువ పరిచయము. కాబట్టి అతని`కావ్యాలంకార సామగ్రిలో భ్రాంతిమంతమూ, ఉత్ప్రేక్షా, రూపకమూ కంటె స్వభావోక్తే ఎక్కువగా కనపడుతుంది, `పిచ్చి ఉబలాటంతో .... మనుష్యులు, మోటార్లు, ప్రాణాలు, యంత్రాలు, భుజాల రాసుకొంటా, ఉన్మాదంతో త్రోసుకొంటూ, వొత్తుకుంటూ పోతున్న'వట. `పలురంగు వలువల గట్టుకొని లలనలు ప్రదర్శించు' కుంటున్నారట `మరీనా'లో. `మర్యాదస్తులు గూడ అంగళ్లందున కళ్లకు అగపడిన వరండాలందున తమ దుస్తులు తడుస్తాయని వొదుక్కొనుచున్నా'రట! నీళ్లు పారుచుండే వీధుల్లో జలాంచలమును ఇరువంకల విరజిమ్ముచు బస్సులు మాత్రము బుస్సని పోతున్నవట! చల్లారామ్సు షాపుముందు `వసంతకాలంపు టఖండ అమ్మకాలని అడ్వర్టయిజు చేయబడి' యుండడాన్ని బట్టి (చెట్లు చిగిర్చడమును బట్టి కాదు!) మద్రాస్సిటీలోకి వసంతర్తువు వచ్చియుండాలట. స్వభావోక్తిని పట్టి యిచ్చేస్తుంది. ఈ ఉదాహరణ చూడండి. `ఉడతలు ఎలుకలు మిడతలు చచ్చిపడియున్న చవిటి కాల్వల నీరు పొంగి, మురుగు గబ్బుగల గాలివడితోడ చిటపట చినుకులు పడుచున్న'వట. `పఠాభి'గారి వర్ణనలు చాలా మట్టుకు యథార్థమాత్ర వర్ణనలే.

అయితే ఈ ఫొటోగ్రాఫుల మధ్యన అక్కడక్కడ కవిగారి కల్పనని చూపించగల పెన్సిలు స్కెచెస్ కూడా కనబడకపోలేదు. `సగం కాంతి సగం చీకటిగల యిండ్లలోపల భోగం చానలు ఫ్యాన్సీ మార్కట్లోని జపాన్ సరకుల్లా మవునంగా కూర్చొన్నార'ట. మద్రాసు పట్టణపుటశాంతంలో నవ్యస్త్రీమీద కళ్లు నిల్పుట డీలక్సు కుషన్ సోఫాలమీద కూలబడినట్లుంటుందట. నవ్యస్త్రీ కన్నులు క్రాస్వర్డు పజిల్సు లాగున్నవట. ఆమె చేతులు బిగ్ బ్రాకెట్లట. వీటిలో కవి మానసమే కాని హృదయమంతగా బింబించడము లేదు. ఎట్లు బింబించును? వెండిరూపాయి ఘలంఘలా శ్రావ్యసంగీతము కర్ణపేయముగా ముఖరించు చున్నదాయెను. మరి వేరు సౌందర్య మెట్లు ప్రవేశించగల దీ నగరీకుని గుండెలోనికి?

రోడ్డు దాటడానికని వేచి యుండే రెండు మూడు నిమిషాల్లోనూ మద్రాసువాసునికి గోచరించే అపూర్వదృశ్యం ఇది చూడండి.

నటరాట్టులాగా నతండు కూడ
మృత్యుంజయ నృత్యంబును
సల్పుచుంటాడు సతతము
బల్బు హారన్ల తాళాం తోడి
యిలక్ట్రికు హారన్ల రాగానికిన్ని
మోటారు సయికిళ్ళ మృదంగానికినీ
అనుగుణ్యంగా నర్తిస్తుంటాడు
తటాల్మని ఇటూ అటూ తిరుగుచు
హస్తాల నందమ్ముగ ద్రిప్పుచు.
ఇందులోనూ వైచిత్రియే!

అయితే, మద్రాసువాసుడయేది, న్యూయార్కులో స్కైస్క్రేపరువాసుడయ్యేది, మానవుడన్నవాణ్ణి ఆకర్షించి లాగేది ఒక టున్నది. వెండి రూపాయ ఘలంఘలలూ, అమెరికన్ కార్ల సోయగమూ, అమృతాంజనపు పూతా దాని దగ్గర తీసికట్టు!

దాని బంగారు గంటల చిరు సంగీతము మద్రాసు వాసుని గుండెలో కూడా మార్మ్రోగుతుంది. దానికి నగరీక కవి జవాబేమిటి? అందులో అతని అంతరాంతరాలు పెల్లగిలి తీరాలి. పెల్లగిల్లాయి కూడాను. చూడండి. అంకితములోనే మృణాళినికి, కాదు కళ్యాణికి; కాదు ఇరువురికి, అని తటపటాయించినాడు. 'ఆ స్త్రీ హస్తములోని హ్యాండు బ్యాగయ్యున్న నేను ఏం బాగుండును' అంటున్నాడు. తడిసిన ఏ నార్దాని పయ్యంటా, జాతికన్నియ రొమ్మూ, చూస్తూ చూస్తూ తన్మయుడైనాడు. సహాధ్యాయిని సీతా, లీలా, కామాక్షీ, మృణాళినీ, కళ్యాణీ (మిసెస్ మాథ్యూసో)?; -----ఇందరూ చాలక, మింటుస్ట్రీటు ప్రవేశించి, అక్కడికి వచ్చే అన్నివిధాల మనుష్యుల మూకని చూచి వేదాంతి అయి కవిత్వం చెపుతున్నాడు చూడండి. ఇంత వరకూ పెట్టుకున్న నియమాలు పటాపంచలైపోయి, వచనపద్యం నదీప్రవాహమైపోయింది.

'అంతా బూటకం అంతా నాటకం గొప్ప అబద్ధం పూజారి యబద్ధం
పరపురుషుని జూచి తలవాల్చే పతివ్రత సతీత్వ మబద్ధం
యోగు లబద్ధం, అందరూ అబద్ధం సర్వ మబద్ధం.
కానీ నీవు మటుకు ఓ బోగందానా! ముసుగులేని నిష్ఠురమగు నిజానివి'

కాదామరి! నగరీక అహంభావ కవిచేత గేయ కవిత్వం కూడా చెప్పించింది!...... పఠాభిగారి ఉపజ్ఞకి గొప్ప ఉదాహరణం 'కామాక్షికోక'! ప్రాణం లేని కోకకి కామాక్షి నగ్నాంగమ్మును చూపి ప్రాణం తెప్పించారు. శ్రోణీ వక్షోపీఠభూముల్ను డయిరక్టుగానే

ఆక్రమించి పులకరించి పోయిందట కోక. ఇక విద్యార్థుల్, దొంగలు, త్రాగుబోతులు, లీడర్లు, ప్లీడర్లు, పూజారులు, జారులు మాట చెప్పే దేమిటి?

నగరీక కవి సందేశము వినండి:

'నీవు మటుకు ఓ బోగందానా
నీడ పడనటువంటి నిర్మలమగు నిజానివి.'

*కిన్నెర నవంబరు -1948*

# 18. కొడాలివారి కవిత్వం

కొద్ది కాలంలోనే రసజ్ఞ హృదయాన్ని మెప్పించి పేరుపొందినవారిలో కొడాలి సుబ్బారావుగా రొకరు. "హంపీ క్షేత్రము" భారతిలో దర్శనమిచ్చే వరకూ, కవిత్వాభిమానులెవరూ ఆయన్నెరుగరన వచ్చును. ఆ పత్రిక ఆంధ్ర ప్రపంచానికి చూపిన జాషువా కవిలాగే ఈయన కూడా కొద్ది కాలంలోనే పేరు పొందారు. కావ్యప్రచురణ ప్రారంభించిన చాలా నాళ్ళకిగాని జాషువా కవిని తెలుగువారు గుర్తించుకోలేదు. ఎక్కడో మంచుకొండల్లో పారే సెలయేట్లో తప్ప మరొకచోట సాధారణంగా కనపడని నిర్మలత్వమే జాషువాకవి రచనల జీవము. వింతైన ఈ నిర్మలత్వాన్ని గుర్తించడానికి కొంత జాప్యమే ఐంది. కొడాలివారి కవిత్వంలో ఆవేశమూ, ఉత్సాహమూ, జడగా అల్లుకుపోయి కనపడతాయి. ఈ మూడు తెలుగువారి నైజములోవి, కనక కొడాలివారి రచనలు చదవగానే -కలలోని సుందరిని పగలు చూచినట్టుగా -ఎముకల్లోని మూలుగులో అణిగియున్న పౌరుషము నవనాడుల్లోనూ పరుగులెత్తింది తెలుగువారికి. కొడాలివారు హంపిని దర్శించి నప్పుడు తమలో కలిగిన కలవరాన్ని వర్ణిస్తూ మనకి హంపిని చూపించేస్తారు. ఆ క్షేత్రాన్ని దర్శించి కవనమల్లినవారు చాలామంది ఉన్నారు. కాని తెలుగువారి నైజానికి అనుకూలంగా ఉండడము వల్ల `హంపీ క్షేత్రాని'కి ఉన్నశక్తి వాటికి అలవడలేదు.

చిన్నతనంలో - తన మేనమామ కామరాజుగడ్డ శివయోగానంద రావుగారితో కలిసే- సుబ్బారావుగారు కవిత్వం అల్లడం నేర్చుకున్నారు. కాని ఆ రచనల్లో సుబ్బారావుగారి ప్రత్యేకత ఏదీ గోచరించదు. ఆయన వర్ణ్యవస్తువుని దూరంనించి చూసి వర్ణిస్తున్నట్లుంటుంది. పద్యంకూడా ఆయన ఎక్కి సవారిచేసే గుర్రంలాగ కాక, ఆయన పదిలంగా కాపలాకాసే లేడిపిల్ల లాగు కనబడుతుంది. కాబట్టి ఆ కాలపు రచన సుబ్బారావు గారిలో అణిగివున్న భాషాభిమానాన్ని చూపించడానికి తప్ప మరెందుకూ అక్కరకు రాదు. మొదటి పుస్తకం అచ్చువేసిన తర్వాత సుబ్బారావుగారు చాలాకాలం మౌనం దాల్చారు. ఈ ఘట్టంలో, పద్యాల్ని ఇంజన్లలాగు నడిపించగల

శక్తి ఆయనలో నెమ్మదిగా చేరుకుంది కాబోలు. అదృష్టవశాత్తు విశ్వనాథ సత్యనారాయణ గారి పరిచయ స్నేహాలు కూడా ఈయనకు లభించాయి. విశ్వనాథ వారంటే మూర్తీభవించిన ఆవేశమే. అందులో పద్య పఠనాకాలంలో మరీని. సంతత సాహచర్యమూ సమానతత్వమూ - రెండూ చేరి వారి ఆవేశాన్ని వీరికి ఆవహించేటట్లు చేశాయి. సత్యనారాయణగారు అప్పటికి ముఖలింగమూ, వేగీ, వంటి చారిత్రిక క్షేత్రాలు దర్శించి ఆంధ్రప్రశస్తిని కీర్తించి ఉన్నారు. హంపిని గూర్చి ఆయన కావ్యమల్లలేదు. అది సుబ్బారావుగారి వంతుకు వచ్చింది. సరిగా ఈ వేళకి వారణాసి శ్రీనివాసరావుగారు తోడ్కొనిపోయిన విద్యార్థి బృందముతో సుబ్బారావుగారు హంపి వెళ్ళడం కూడా తటస్థించింది. హంపిలోని ప్రతిశిలయొక్క చరిత్రా వెంకటరంగయ్యగారు చెప్పినట్లు చెప్పగలరట వారణాసి శ్రీనివాసరావుగారు. వారు చెప్పిన కథలన్నీ మనస్సుకి పట్టించుకుని, ఏకాకిగా తిరిగి కవితాసమాధి నలవరుచుకొన్నారు. కొడాలి సుబ్బారావుగారు. దాని ఫలమే హంపీక్షేత్రము.

విశ్వనాథ సత్యనారాయణగారు కొడాలి సుబ్బారావుగారికి కవితా గురువంటున్నాను. వాస్తవముగా కాకపోవచ్చును. కాని విశ్వనాథవారి కవితారీతులు ఈయన రచనలలో బాగా కనబడతాయి. హంపీ క్షేత్రాన్ని కావ్యసామగ్రిగా తీసుకోవడంలోనే సత్యనారాయణగారి ప్రభావం చాలావుంది. చారిత్రక క్షేత్రాల కథనమువారే ప్రారంభించారు. వారి రచనలే `హంపీక్షేత్ర' రచనకి కొడాలి వారిని పురికొల్పాయి. విశ్వనాథవారి విఖ్యాతికి ప్రథమకారణమైన ఆంధ్ర క్షేత్రాభిమానమే వీరిని కూడా పలికించింది. విశ్వనాథవారి సీసములవలెనే వీరి సీసములు కూడా శక్తివంతాలు. పద్యాల కట్టుబడిలో వీరిద్దరి రచనలకీ పోలికలు కనబడతాయి చూడండి.

"ఏ రాజు పంచెనో యిచట శౌర్యవుపాయ
సమ్ములు నాగులచవితినాళ్ళ (విశ్వనాథ)
ఏదేవి చిలికెనో ఈపాలమీగడ
విఠ్ఠలాలయ శిలావేదులందు (కొడాలి)
ఈ పాలాలెంత చేవెక్కించుకొన్నవో
గుండెవ్రయ్య సముద్రగుప్తుడడలె (విశ్వనాథ)
ఈ జీర్ణ కుగ్రామ మేమి చూపించును
తెలుగురారాజు పండిన యశస్సు (కొడాలి)
గణితశాస్త్రాంభోధి ఘనుడాతడే పావు
లూరి మల్లన కవిలోకగురువు (విశ్వనాథ)

అతడె తిమ్మరుసయ్య అప్పాజి బాబంట
తెలుగువారలు కొల్చు దేవగురుడు (కొడాలి)

ఇలాటివి చాలా కనపడతాయి. వాక్యంలోని క్రియముందు వస్తుంది ఇవి చూడండి!

ఛేదింపబడి మహాశైల సవిధ భూ
స్థలములదాక కాంతార సమితి (విశ్వనాథ)
కురిసిన దెచట వాక్కుల జృంభణములోన
కవిరాజుపైన బంగారువాన (కొడాలి)

కానైతే ఈ పోలికల్లో ఒక కొత్తసంగతి తెలుస్తుంది. దేశీయకవనం రచించే కుతూహలంలో కొత్త ఫక్కీలవలంబించే విశ్వనాథవారి పద్యాలలోని తొలికసటు కొడాలి వారిలో కనిపించదు. శౌర్యవు పాయనములూ, చేజిక్కించుకున్న పొలాలూ, ఛేధింపబడిన కాంతార సమితీ కంటె, దేవి చిలికిన పాలమీగడా, తెలుగురాజు యశస్సు చూపించే కుగ్రామమూ, కవిరాజుపైన కురిసిన బంగారు వానా, కొంచెము పెంపుడు జాతివి. విశ్వనాథవారికి లేని ఒరవడి కొడాలి వారికి ఉంది. అందువల్లనే వారి రచన సాపుదేరింది.

విశ్వనాథ వారి కావ్యపఠనము విన్నవారందరికీ దానిలోని వైలక్షణ్యము స్పష్టము. కొడాలివారి పద్యాలలోని విరామాలూ పూర్ణబిందువులూ విశ్వనాథవారి పద్యగానానికి స్థిరరూపం ఇస్తున్నాయి. సుబ్బారావుగారి సోదరులు చంద్రమౌళీశ్వరావుగారి కావ్యపఠనము రాగవరసని సాగుతూ వచన ధోరణిలోకి మారి ఆగుతూంటుంది. విశ్వనాథవారి పద్ధతే యిది. పద్యాల్లో పూర్ణబిందువులు ప్రవేశపెట్టి కొడాలి వారు విశ్వనాథవారు పద్యాన్ని పాడే పద్ధతికి రూపం ఇచ్చి నిలిపారంటాను

విశ్వనాథవారివలనే కొడాలివారు కూడా ఆవేశపరులు. ఉదాహరణలు హంపీక్షేత్రంనిండా కనబడతాయి. వాటినన్నిటినీ వివరంగా పరిశీలించుకోడాని కిక్కడ అవకాశము చాలదు. కాబట్టి కొడాలివారి ఆవేశం కనపర్చే రూపభేదాలు పరిశీలించుకోడము మెరుగు: నన్నయ్యగారి ప్రార్థనల వలెనే వీరి ప్రార్థనలు కూడా శక్తివంతాలు. ఏ ఘట్టంలోనైనా సరే భగవత్ప్రశంస రా భయం. చేతులు జోడించుకుని సాష్టాంగ పడిపోతారీయన.

"పన్నగస్వామి శయ్యా సపాండురారు
ణచ్ఛ విప్రసన్న ప్రశాంత ప్రమోద
పద్మనాభ మహాదేవు ప్రతిమగాంచి"

న వీరి ప్రభుభక్తి ఏ చదువరినీ దాటిపోదు. "ఇన వంశోద్భవుడు', `మహా దేవదేవుడు!' `దేవుడు' ఈయన శబ్దరత్నాకరంలో లేదు. `మహా దేవుడే' వుంది. ఎక్కడేనా తప్పిజారి దేవుడని పడింది, దానిపక్కనే `మహా' తాండవిస్తుంది. ప్రార్థనపట్ల నన్నయగారి వృత్తాల వలెనే వీరివృత్తాలు పూర్ణసరస్వతి లాగ ప్రవహిస్తాయి చూడండి:

ఓంకారస్వరలీనమై నిగమనాదోపాసనాధీనమై
కైంకర్య ప్రతిపాద్యమై భువనరక్షాదక్షమై తాండవా
హంకారస్థిరచంద్రమశ్శకల శైత్య ప్రాప్తశాంతత్వమై
శంకాసంకులమైన నీయునికి ఆశాసిద్ధి కల్పించుతన్

విశ్వనాథవారి ఆంధ్ర ప్రశస్తి దాటిపోయిన ఆంధ్రుల ఐశ్వర్యాన్ని కీర్తిస్తుందెంతసేపూ. "వేంగిరాజుల పాద పవిత్రచిహ్నాగర్భితమ్మగు భూమి ఖండమందు" అశ్రువులు జారే జీవచ్ఛవాంధ్రజనులూ, "అస్వతంత్రతా నియతమైన బ్రదుకు భరించలేని తెలుగువారూ, కనపడతారు వారి ఆంధ్రప్రశస్తిలో. అధునాతనాంధ్రులకు వారు వేయిపడగల్లో ఇచ్చిన సందేశము వేరే ఏమీలేదు" `పోయింది పోయింది స్వామిపడగలు వెలిసిన సుబ్బన్నపేట సుభాన్‌పేట అయిపోయింది. మనకి కనపడేవి నశించే జాతి చివరిమెరుగులు' అని.

కొడాలివారుకూడా నిరాశాభావాన్నే వెలిబుచ్చారు. హంపిని చూచి వారుపొందిన ఆవేశానికి చివర వారి భావాలివి:

"గురుపూజలో తృప్తికుదరని సన్యాసి
చిరునవ్వు మొలకవంచించెనే మొ
కవిరాజు పద్యసంకల్ప హర్షంబున
విషమాక్షరంబు కన్పింపదేమొ
సిరిగర్వమున దృష్టి చెదరిన సిద్ధాంతి
గుణ కారలబ్ధి సంకుచితమేమొ
దాసియయ్యు పతివ్రతాత్వభంగముకోడి
నిట్టూర్పులో నగ్గి నిలిపెనేమొ
తెలుగురాజుకు పుట్టిన తెగులుపురువు
తొలిచెనో ఏమొ ఆంధ్రుల తొలకరి సిరి
కానిచో ఎన్నడనుకోని దీనచరిత
కాస్పదంబయిపోవునే ఆంధ్రమాత!"

`హంపీక్షేత్రము'పాడుగునా `మా తెల్గు వీర్యమేల యచేతనంబు' అనీ. `తుదకు పౌరాణికము లట్లు తూలిపోయె'నని `ఆంధ్రసామ్రాజ్య నాట కాభ్యంతరమున చివరి తెర జారిపోయిందనీ, ఎంతసేపూ గతించిన ఆంధ్రసామ్రాజ్యపు సమాధిపక్కన కూర్చుని అశ్రువులు రాల్చారు. శబ్దాలవ్యంజకశక్తీ, పదాల కూర్పులోని సౌందర్యమూ చక్కగా గ్రహించగలిగి, గడ్డిపూనవ్వు, సెలయేటి కడుపులోని కడలిమ్రోత, వసుమతీగర్భతల సరస్వతీ గుర్తించగలిగిన చైతన్యమూర్తి కావ్యాలలో పల్లించవలసింది నిరాశా నిస్పృహాయత్వమూ, వెనుక చూపూ కాదు.

"మంచిగతమున కొంచెమేనోయి
మందగించక ముందుకడుగేయి
వెనకచూస్తే వెనకేనోయి"

అన్నాడు అమరకవి గురజాడ. విధి ఆకర్షించకుంటే, "వేయికి చాలుపో తెలుగువీరుడొకండనీ, ఆంధ్రఖడ్గచలనంబులలో లయ రుద్రతాండవ స్ఫురణము గల్గునోయి" అనీ గతించిన రాజు నుద్దేశించి పల్కిన కొడాలివారి వాణి బ్రతికున్న ఆంధ్రుల్ని చెయ్యూపి జయకొట్టించి ఉండేది.

ఆంధ్రశిల్పి – 1948

***

# 19. నవ్యసాహిత్య సింహావలోకనము

ఆంధ్రసాహిత్య నవోదయం ఒక్క వ్యక్తియత్నం వల్లగానీ, ఒక్కరోజులోగానీ వచ్చినది కాదు. రెండుమూడు దశాబ్దాలపాటు ఉపజ్ఞావసానులైన సాహితీపరులు ఒకవైపునా, బలీయములైన ఉద్యమాలు మరొకవైపునా ప్రోత్సహించడమువల్ల బయలుదేరిం దీ కొత్తచైతన్యం. నేడు వెనక్కిచూసుకుంటే ఒక్కొక్కప్పుడు వ్యక్తులే ఉద్యమాన్ని నడిపినట్టూ, మరొకప్పుడు ఉద్యమాలే వ్యక్తుల్ని నడిపినట్టూ కనబడుతుంది. అవును, అలాగే వుండాలి మరి. వ్యక్తి సంఘాన్నీ, సంఘం వ్యక్తినీ పలకరించుకుంటూ పురోగమించడమే బ్రతికివున్న జాతికి జీవం.

రాజుల జీవితఘట్టాలే వస్తువుగాను, పాండిత్యప్రకర్షే ముఖ్యాదర్శంగానూ ప్రవర్తిల్లిన క్షీణయుగకవిత్వానికి తిరుపతి వెంకటేశ్వరులు భరతవాక్యము పలికేరు. తాళపత్రగ్రంథాల్లోనూ, రాజసభల్లోనూ మాత్రమే అంతకుముందు నివసిస్తూండిన పద్యాన్ని పట్టుకొచ్చి ప్రజాబాహుళ్యానికి అందించింది వారే. వారితో విరోధించీ, వారిని సమర్థించీ రచనలు చేసినవారు వారిలాగే పద్యప్రచారానికి బాగా తోడ్పడ్డారు. ఆరోజుల్లో అక్షరాస్యుడన్నవాడి కల్లా వారి పద్యాలు తప్పకుండా కంఠస్థమై యుండేవి. అదివరకు పద్యరచన చెయ్యని వారెంతమందో వారిని చూచి పద్యరచన కుపక్రమించారు. వీరేశలింగము పంతులుగారికీ, క్షీణయుగానికీ నడమ తిరుపతికవులు రాకపోయుంటే నవీనవాఙ్మయంలో కావ్యానికి ఇప్పుడున్నంత హోదా వచ్చి ఉండేదే కాదు.

పద్యానికి తిరుపతికవులు చేసిన సేవనే వీరేశలింగము పంతులు గారు గద్యానికి చేశారు. ఏకాక్షర రచనలతోనూ, ద్వ్యక్షర రచనలతోనూ (రసికజనమనోభిరామము వంటి రచనల్లో) కష్టతరమైపోతూండిన పద్యాన్ని సులభసాధ్యము చేసి తిరుపతికవులు ప్రజలకందించినట్లే, మారుమూల పదాలతోనూ, దుస్సాధ్యదండాన్వయంతోనూ కష్టతరమైపోయిన చిన్నయసూరివచనానికి శాలువా ఊడదీసి ప్రజాసేవ నేర్పారు పంతులుగారు. ఆంధ్రసాహిత్య నవోదయం ఆయనతోనే ప్రారంభమైందని నమ్మేవారు

చాలామంది ఉన్నారు. కాని పంతులుగారు ముఖ్యంగా దేశికులెకాని, కపులుకారేమో నంటాను. వారి గురి ఎంతసేపూ తెలుగువారి మనస్సుమీదనే; హృదయమ్మీద కాదు. వెలుగుచూపించాలనే వారి ప్రయత్నము; సౌందర్యం చూపించాలని కాదు. సంస్కృతిని అపారంగా ఇచ్చారాయన తెలుగువారికి; ఆనందాన్ని కాదు. ఆంధ్రవాఙ్మయాన్ని అనేకరీతుల్లో పెంచా రాయన; ఆంధ్రసాహిత్యాన్ని కాదు. వారి నవలలు నవలలు కావు: సంస్కారప్రబోధంకోసం ఆయన తన ఇష్టమువచ్చినట్లు వంచిన కథలు. వారి కవిత్వము వారి సర్వతోముఖశక్తికి ఉదాహరణమే గాని హృదయాహ్లాదకారి మాత్రం కాదు. వారి స్వంతరచనల కంటె భాషాంతరీకరణాల్లో మనకి ఆనందము ఎక్కువ కనపడుతుంది. పంతులుగారు తెలుగువారికి విజ్ఞాన సూర్యుడు; కళ్ళు చల్లబరచే చంద్రుడు కాదు. పంతులుగారి పంథాలలో రచన సాగించిన చిలకమర్తివారు ప్రహసనాల్లోనూ, నవలల్లోనూ కూడా ఆయనను శతధా మించిపోయారు. కాబట్టి ఆంధ్రసాహిత్య నవోదయం ఆయనే తీసుకొచ్చారనడము సత్యానికి దూరం.

ఈ శతాబ్ద ప్రారంభంలో తెలుగుదేశంలో పర్యటనము చేసిన పార్సీసాంగ్లీ కంపెనీవారి ప్రదర్శనాలు తెలుగులో స్టేజినాటకాల్ని లేవదీశాయి. అటు ధర్మవరం కృష్ణమాచార్యులుగారూ, ఇటు మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారూ నాటకాలు రచించి ఆడించారు. చిలకమర్తివారి ప్రసన్న యాదవాది నాటకాలు చాలా వెలిశాయిగాని పద్యాలూ పాటలూ ప్రవేశించి వీటిని కొంతవరకూ పాడుచేశాయి. ౧౮౮౭ (1887) నాటికే కన్యాశుల్కంకూడా తయారైపోయి రంగం ఎక్కింది. ఆనందగజపతి మహారాజు ఆజ్ఞానుసారం తీసిన బాల్యవివాహపు లెక్కలే కన్యాశుల్క నాటకానికి కారణాలయినవి. గురజాడ అప్పారావుగారు సమకాలిక పరిస్థితుల్ని దాటిపోయిన మేధావి. ఆయన కన్యాశుల్కం మూడు మహోద్యమాల కూడలి.

వందేమాతరోద్యమము దేశమంతటా వ్యాపించి ప్రతివారికీ మెరుపుకొట్టింది. మనదేశపు దీనదశా, మన అసహాయత్వమూ, దాస్యమూ చీకటి తెరల్లాగ మనవారి కళ్లముందు కట్టేయి. దానితో మనల్ని బంధించిన సంకెళ్లన్నీ ఒకమారు గలగలలాడేయి. తెలుగు కవులు సంస్కృతాంధ్ర ప్రబంధాలలోని అలంకారాల్ని తెగగొట్టడము కట్టిపెట్టి తమ భావాల్నీ, ఆంగ్ల కవుల భావాల్నీ ఖండకావ్యాలుగా రచించడము మొదలుపెట్టారు. అశుకవిత్వపు వరదల్లో అడ్డమైన గడ్డినీ, మట్టినీ కలుపుకున్న తెలుగుకావ్యాలు ఆ కలక తేరిపోయి తెలుగుబాప రుచిని ప్రతిఫలించాయి. ఈ కాలపు రచయితల్లో గురజాడ అప్పారావుగారు అగ్రగణ్యులు. వారి ఉత్తమరచన కన్యాశుల్కం క్రిందటి శతాబ్దంలోనే వెలువడడం నించి, పై ఉద్యమాలేవీ వారిని ప్రోద్బలించలేదని

స్పష్టం. వారి సృష్టికి బ్రహ్మకి లాగే ఐదు ముఖాలు; సమకాలిక సాంఘిక సమస్యని తీసుకొని నాటకంగా రచించడమూ; హాస్యరచనా; జీవద్భాషారచనా; తేటమాటలతో, జాతీయఛందస్సుతో కోమలమైన కవిత్వమూ; కథానికానూ. గురజాడవారు సాంఘిక పరిస్థితుల్ని నాటకంలో బింబించిన కాలానికి పాశ్చాత్య దేశాల్లో కూడా ఇబ్సెన్, షా, గాల్స్‌వర్దీ వంటి కవులు సాంఘికనాటకాల్ని రచించనేలేదట. నార్ల వెంకటేశ్వరరావు గారిదైన ఈ సాక్ష్యము కన్యాశుల్కాన్ని విశ్వసాహిత్యంలోకి లాగుతున్నది. ముఖ్యమైన ఇతివృత్తము కన్యాశుల్కగాథయే అయినప్పటికీ, వేశ్యాలోలుపత్వమూ, పిచ్చినమ్మకాలూ, స్వార్థపరత్వమూ వంటి పిశాచాలు కూడా కన్యాశుల్కానికి తోడై నాటకాన్ని ఒక ప్రపంచం చేసేశాయి. చూడండి, ఈ ప్రపంచంలో - ఒక ఛాందస వైదికుడూ, న్యాయవాది అయిన న్యాయవాదీ, ఒక ప్లీడరుటౌటూ పరమలౌక్యుడయిన విదూషకుడూ, ఒక ఇంగ్లీషువిద్యార్థీ సంస్కృతవిద్యార్థీ, ఒక దాంభికుడూ, ఒక లుబ్ధుడూ, ఒక సానిలంజా, ఒక పూటకూటి విధవలంజా, ఒక పల్లెటూరి బాలవితంతువూ, ఒక పట్నవాసపు విడో, ఒక పోలీసూ, ఒక హవల్దారూ, ఒక సిద్ధాంతీ, ఒక పూజారీ, ఒక పిరికిశెట్టీ, మేదకుడైన నౌకరూ, ఒక బైరాగీ, ఒక సారాయిదుకాణుదారూ, ఒక శైవజంగమూ, ఒక సాతాని వైష్ణవుడూ, ఒక మునసబూ, ఒక యోగినీ, ఒక తెలుగు ప్లీడరూ, ఒక ఇంగ్లీషు ప్లీడరూ - సర్వమానవులూ ఉన్నారు. గురజాడ అప్పారావుగారి పరదా తీరడానికి ఇంతమంది వ్యక్తులు ఆడవలసివచ్చింది. ఎక్కడ ఏపాత్రని నిర్వహించడంలోనూ పట్టుజారిపోదు. ప్రపంచంలో ఆడినట్టే కన్యాశుల్క నాటకంలోనూ ఆడతారు వీరంతా. కన్యాశుల్కం తరవాత మళ్లీ అంతటి నాటకం నేటికీ రాలేదు.

గురజాడవారి హాస్యం ఆంధ్రభాషలాగే అందమైనది. అందులోని స్వారథ్యం ఎలాగ పుట్టుతోంది అన్న జిజ్ఞాసకి వారే జవాబిస్తున్నారు ఆకాశరామన్న'లో: "స్నేహమూ, ప్రేమా అనే, అనాది ... వుండిన్నీ ఎప్పుడూ కొత్తగావుండే రెండువెలుగులను నరుని తిప్పికాంచితే వింతవింతసొగసులు బయలుదేరుతవి. సొగసు లేకపోతే మనిషే వుండడు" అని. మొక్కపాటివారు బారిష్టరుపార్వతీశం మీదా, మునిమాణిక్యమువారు కాంతంపతి మీదా, విశ్వనాథ వారు రకరకాల వ్యక్తులమీదా ఈ వెలుగుల్నే ప్రసరించారు. భమిడిపాటివారు ఈ వెలుగుల్ని వ్యక్తులమీదకంటే మాటలమీద ఎక్కువగా ప్రసరిస్తారు.

గ్రంథస్థభాషనే నవరచనలకి ఉపయోగించినట్లైతే అలాంటి రచనలకి క్రమంగా జీవశక్తి నశిస్తుందని గ్రహించి జీవద్భాషాచైతన్యం తెలుగుకి కలిగించడానికి తొలియత్నం చేసినవారు అప్పారావుగారే - బ్రతికిఉన్న అనుభవము బ్రతికివున్న భాషలోనేగాని, పుస్తకాలలో బిగించబడి వెనక్కి వెళ్ళిపోయిన, లేక అలమారులోని

కెక్కి కూర్చున్న భాషలో చైతన్యవంతంగా రాలేదని గుర్తించి తెలుగుభాషకి కూడా సంస్కృతానికి పట్టిన (కావ్యభాషమాత్రమే అయ్యే) దీనదశ పట్టకుండా తప్పించడానికి కార్యరూపేణా మొదటియత్నం చేసినవారు గురజాడ అప్పారావుగారు. వారు కన్యాశుల్కంలో ఎలాగ మాట్లాడుకునే భాషని అలాగే, వర్ణక్రమమేనా తప్పకుండా వాడినా, కవిత్వానికీ వ్యాసరచనకీ అలాంటి భాషకాక సంస్కరించుకున్న భాషనే వాడేరు. చిన్నకథలో సంభాషణలూ, స్వగతాలూ మాత్రమే వాడుకభాషలోనూ, మిగతా కథనమంతా తొంభయిపాళ్ల గ్రాంథికంలోనూ రచించారు. సమర్థులైన సాహితీపరులు పదిమండలాల భాషా పరిశీలించి సంస్కరించుకుని కొత్త సాహిత్య భాషని నిర్మించుకోవాలని వారి ఆశయము. నేటి రచయితలలో గోదావరీ మాండలికాన్ని వాడే శ్రీపాదా, మొక్కపాటీ, కృష్ణా, గుంటూరు మాండలికాన్ని ఉపయోగించే మునిమాణిక్యమూ, ఉన్నవారు మాత్రమే భాషావిషయంలో శ్రద్ధాళువులు. తక్కినవారు అన్ని రకాలుగానూ భాషని తిప్పుతున్నారు. ఇటీవల రాళ్ళపల్లివారు కూడా వ్యావహారికం గ్రహించడంతో అనంతపురమాండలికము సాపుదేరి అందుతుందనే ఆశ కలుగుతోంది. నెల్లూరు, కడప మాండలికాలు మనకి అందడమే లేదు.

చదువర్లను హడలెత్తించే సంస్కృతసమాసాలతో నిండిన రచనే గొప్పరకపు కవిత్వంగా చెల్లుబాటయి పోయే రోజుల్లో తేటైన మాటలతో తాను స్వయంగా గుర్తించిన సౌందర్యాన్ని రచించిన కవి గురజాడ అప్పారావుగారు. సంస్కృతసమాసాల రచనలను ఈయన కొయ్యబొమ్మ లన్నారు. కాదా మరి? అవి కావ్యాలలో తప్ప వినబడడము లేదాయన. మరి వాటికి జీవభాషయొక్క కోమలత్వం ఎలా వస్తుంది?

"పాటపాడెను చెట్టుచామలు కోటి చెవులను గ్రోలియలరగ తాటివనమున నాగిచంద్రుడు తాను చెవి యొగ్గన్"

అని నిశ్శబ్దాన్ని వినిపించి -

'అనగ కన్నియ, తిరిగి మెల్లన
నన్ను కన్నులు విచ్చి చూసెను."

అని కన్నియ చూపులు మనకి చూపించి-

"దేశమంటే మట్టి కాదోయి- దేశమంటే మనుషులోయి"

-అని ఉపదేశించిన కవి తెలుగులో మరి యెవరున్నారు?

"ఆమనిరాగా దుర్గకొలనులో - కలకల నవ్వేను తామరలు
ఆమని రాగా దుర్గవనములో కిలకిల పలికెను కీరములు"

అని తేటైన మాటలతో తామరల్నీ, చిలకల్నీ ఇంత చక్కగా కాన్పించిన కవి ఎవరున్నారు? తెలుగుభాష సంస్కృతంలాగ సమాస జటిలమూ ప్రవాహశీలీ కాదనీ, అజంతాలతో గజగామిని అయిపోయిన ఈ భాషకి వృత్తాలు కాక మాత్రాఛందస్సులే అనుకూలాలనీ మొట్టమొదట గ్రహించి రచించినది గురజాడ అప్పారావుగారే. కాని వీరి ఆచరణని ఇతరకవులు వెంటనే అనుకరించలేదు సరిగదా, ఎంతమందో, విరుద్ధరించిన ముత్యాలసరాల్ని (రాయప్రోలు వారివలె) మళ్ళీ పాతపద్ధతికి మళ్లించేశారు. అందువల్ల మాత్రాఛందస్సులే తెలుగుకి అనుకూలాలన్న వీరి సందేశం మొన్న మొన్నటివరకూ మరుగుపడిపోయింది.తిరిగి నేడు శ్రీశ్రీ, మల్లవరపూ, పాపా, తిలక్, ఆరుద్రలు మాత్రాఛందస్సులో వింతనడకలు చూపిస్తున్నారు. శ్రీశ్రీ అనేక ప్రయోగాలు చేసి ----

"ఏ దేశచరిత్ర చూచినా - ఏ మున్నది గర్వకారణం
నరజాతిచరిత్ర సమస్తం - పరపీడన పరాయణత్వం."
అనీ, "ఆనందం అంబరమైతే - అనురాగం అర్ణవమైతే
ఆనందపు టంచులు చూస్తాం - అనురాగపు లోతులు తీస్తాం"
అనీ, "మరో ప్రపంచం మరో ప్రపంచం - మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు పదండి తోసుకు - పదండి పోదాం పైపైకి"

అనీ చక్కని కొత్తవరుసలు కనిపెట్టారు. పఠాభిగారు వచన పద్యా లనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదన్నేరు. `టులాన్'లో తిలక్కూ, `దగ్గు'లో విశ్వేశ్వర్రావూ, `పురిటిపాప'లో పాపా, వచనంలోనే చిత్రగతులు చూపించారు. సీసపద్యం చాలా కాలమయి కవిత్వంలోంచి మాయమైంది. వేదులవంటి సంప్రదాయకవి రచనలోంచి శార్దూలమూ, మత్తేభమూ తప్పుకున్నాయి. వృత్తాలు కవిత్వంలోంచి తప్పుకుంటాయి. తథాస్తు. అది కోరదగినదే.

చక్కని కథకశిల్పంతో, కొసమెరుపుతో మొదటి కథానిక- `దిద్దుబాటు' అప్పారావుగారే రచించారు. ఆ కథలోని ప్రతీ అల్పఅంశమూ కథాపరిణామానికే తోడ్పడుతుంది గాని కాలక్షేపానికి కాదు. ఆఖరున `మంచము క్రింద నుండి అమృతనిష్యందిని యగు కలకలనగవును కరకంకణముల హృద్యారావమును' మనకి కూడ వినబడతాయి. కేవలం కథనశిల్పాన్నే ప్రదర్శించే చిన్నకథలూ, పెద్ద కథలూ కంటె ఈ రకపు కథలు శక్తివంతమైనవి. ప్రఖ్యాత కథానికా రచయిత లందరూ చివ్వర మన గుండెమీద మోది నాదం పుట్టించే ఈ రకం కథల్ని రచించారు. దీక్షితులుగారి చెంచుదంపతులూ', శివరామశాస్త్రిగారి `వెలి', గుడిపాటివారి హత్యావిచారణా', పాప తీర్థపుట్రేకాలూ' ఈ రకం కథలు.

గురజాడవారి సృష్టి విశాలమైనదే. అయినా, "ఈనాటి వ్యావహారిక రచనా, గేయాలూ, కథానికలూ వారి ఒరవడి ననుసరించే బయలుదేరాయంటే, ఆమాట సత్యం కాదు. దేశమ్మొత్తమ్మీద పుట్టిన చైతన్యానికి వారు కారణం అనడం కంటె వారు ప్రథమసంతానము అనడము ఎక్కువ నిజము. వందేమాతరోద్యమమూ, రవీంద్రుని కవితాజ్యోతీ ఆంధ్రరాష్ట్రోద్యమమూ దేనికది బలీయమై వ్యక్తుల్నెంతమందినో ప్రోత్సహించాయి. రాయప్రోలు వారి జడకుచ్చులూ, తెలుగుతోటా ఆంధ్రోద్యమంవల్లా, వారి కష్టకమలా తృణకంకణమూ స్నేహలతాదేవీ రవీంద్రుని కవితావాణివల్లా ప్రోత్సహించబడినట్లు కనబడతాయి. అబ్బూరివారికి కూడా రవీంద్రుని మెరుపే తగిలినట్టు కనిపిస్తుంది,`ఊహాగానము' వింటే. పింగళి కాటూరికవుల `తొలకరీ', బాపిరాజు `తొలకరీ' ఆంధ్రోద్యమాన్ని ప్రతిఫలిస్తాయి తొంభయిపాళ్లు. శక్తివంతాలైన పై ఉద్యమాలేకాక చిన్న చిన్న శక్తులు కూడా చాలా పని చేశాయి. ఈ దశలోని సారస్వతాభివృద్ధికి. గున్నేశ్వరరావు, నాగేశ్వరరావు ప్రభృతుల నాటక కంపెనీలూ, నాటక ప్రయోగపరీక్షలూ, నాటకవిమర్శనీ, నాటకప్రదర్శనవిమర్శనీ బయల్దేరతీశాయి. ప్రవాసము విడిచి స్వదేశానికి వచ్చిన ఆంధ్రపత్రికా, దేశంలో వున్న త్రిలింగా, ఆంధ్రభారతీ, చింతామణీ, మనోరమాది పత్రికలూ నవరచనలకి దోహదం చేశాయి. కళావేత్త కూల్డ్రేదొర కవికొండలా, బాపిరాజూ వంటి వర్ధమానులను గుర్తించి ప్రోత్సహించాడు. రామలింగారెడ్డిగారు మొదటి విమర్శ గ్రంథము - కవిత్వతత్వవిచారము వెలువరించారు. ఇన్ని శక్తుల కూడలి వల్ల ఆంధ్ర సారస్వత స్రవంతికి వరదలు వచ్చాయి. అప్పారావుగారు ఈ వరదల తొలిపొర. వారు ఉపజ్ఞావసానులు. వారి నే ఉద్యమమూ ప్రోత్సహించినట్లు కనబడదు. వారే ఒక ఉద్యమము.

౧౯౧౮ (1918)లో యుద్ధం ఆగిపోవడంతో అన్ని దేశాలకీ కొత్త మెళుకువ వచ్చింది. సంపూర్ణస్వాతంత్ర్యోద్యమం మొట్టమొదటిసారి కారుచిచ్చులాగ వ్యాపించింది. ఈ ఊపుతో తన్ను బంధించిన సంకెళ్లని, మొగమాటాల్నీ తెంచిపారేసి కవి రెక్కలు కట్టుకుని ఎగిరేడు కవుకొండల. రక రకాల స్వతంత్రరచనలు బయల్దేరాయి. శివశంకరశాస్త్రిగారి ఆధ్వర్యాన్న సాహితీసమితి స్థాపించబడింది. సంస్కృతాంధ్రకావ్యాలు వల్లించిన జ్ఞాపకంతో కాక, సొంతఅనుభూతిని పురస్కరించుకుని రచించండని శివశంకరుల ఆదేశము. ఇతఃపూర్వపు రచనల్లో ఊహలూ, ఆలోచనలూ కూడా భావాలుగా మారిపోయి ప్రత్యక్షమౌతాయి. అతి సామాన్యంగా వుండే భావాలు --

"కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మారె, వ్యర్థపుం
జాతురి హెచ్చె నల్పమగు సాహితిలో పెదిపెద్దపొత్తముల్
జూతురు తప్పుదిద్దుదురు శూరత సచ్చె కవీంద్రులందు, సీ!
మూతులు గట్టివైచికొనబోలదె సత్కవులైనవారికిన్"

వంటివి---

"ఇపుడు ప్రళయమ్ము క్రమ్మినదేమొ కాక
దొరకదో నిల్వ నీడ నా చిరుతపాట
కింత ఇరుకొనె యిమ్మహానంత విశ్వ
మలమికొను చీకటుల కలకలమువలన!
స్థాణువయ్యెనొ, పాషాణ జడభరమ్ము
గనెనొ, కదలదు మెదలదు కంఠరవము
నే డిదేమో క్షమాజననీపురాణ
గర్భకుహరమ్ము విదిలించి కారుచిచ్చు
టెరుపుమంట మూలుంగేదొ యేదొ ప్రాకె.........."

అని శక్తివంతంగా వస్తాయి. అంతకుపూర్వము ఇంద్రియాల్లో దేన్నో ఒకదాన్నే స్పృశించి గిలిగింత పెట్టేవర్ణనలు ఈయన రచనలో జడపాయల్లాగ పెనవేసుకుని రెండు_మూడింద్రియాల్ని స్పృశిస్తాయి. చూడండి: "ఈ నిశాంతమ్ము శూన్య. మిందెన్నడో రహశ్శిథిలసుప్తి గలవరమంది లేచి గుబులుకొను లేతనెత్తావి గుసగుసలేవొ"; "తేనె తేటచినుకేని లేని యీ పాట"; "నీ వెలుగు చూపొక రేయి వికసించి వాసించి ఘిలమిలా తళతళా మెరసినది కురిసినది"; "హాలాహలాంధకారానలజ్వాల"; "కరుణార్ద్ర వీక్షణ పరిమళములు" వంటివి వారి రచనలన్నిటిలోనూ కనబడతాయి. వారి భాషకి వింత శక్తి నివ్వడానికి పగడాలు, బంగారు రజతము, వలపు, కాటుక, కరటకము - వంటి పదాలు విశేషణా లవుతాయి. ప్రకృతి అంతా సిగ్గు, నిద్దుర, పాట పులకరింపు, వలపు, దృక్కులు, యెల్గు మొదలైన మానవధర్మాలు అలవర్చుకుని మానవచైతన్యంతో తిరుగులాడుతుంది. వీరు గుర్తించే పోలికలు నన్నయగారి కవిత్వంలోని పోలిక ల్లాగ అంతటా కలవవు. మెరుపులాగ క్షణకాలమే పోలిక నిలుస్తుంది.

"సంజవేళల బవడంపుం జాయలటుల
జిరుతప్రాయంపు గోరికల్ చెదిరిపోయె
పర్వతశ్రేణి నిర్ఝరపంక్తులట్లు
ఆశయములెల్ల నడుగంటి యంతరించె."

అనే పంక్తులు చాలు ఈ మాట నిరూపించడానికి. పైన చెప్పిన వాటినన్నిటినీ మించి వస్తుధ్వనీ, అది నిరూపించే రసధ్వనీ వీరి రచనల్లో తరుచు మెరుపుకొడతాయి. చూడండి:

"కరుణపట్టున కీ బిచ్చగాని చేయి
చూచికొనినాడ మృత్యుఘోషమ్మె మరచి
వట్టిబయలున నొక మోదుచెట్టువోలె
ఎత్తినది కరమెత్తినట్లే కృశించె.
వలపుటాకలి స్రుక్కు నాబదుకుమీద
ఇనుపపాదాల నిడి లోక మిపుడు నడచు"

కృష్ణశాస్త్రి దృష్టి ఎంతసేపూ మేఘాలమీదే. "తరులెక్కి యల నీలగిరు లెక్కి మెలమెల్ల చదలెక్కి ...... దిగిరాను దిగిరాను దివి నుండి భువికి" అనడం ఈయనకి సరదా. ఈయనకి హేమమణి రత్నగణము అక్కర్లేదు; `లోకంపు విధము' ఈయనకి చిత్రంగా కనపడుతుంది. `అమలమోహనసంగీతమందు హృదయదళనదారుణ రోదన ధ్వనులు' వినబడతాయి ఈయనకి. కాని వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు మాత్రము భూపుత్రుడే ఆయన ఖండకావ్యాల్ని బట్టి చూస్తే. `తొలకరిసొరె యిడిన యార్ద్రపురుగు పూవుల శాద్వలాంబరము ధరించిన ధారుణి', `పండి వ్రాలిన వరిపైరుపైని బ్రాకవచ్చు చిరుగాలితరగల వరుసా', మావితోపులపై దొలిమబ్బునీడలూ, శైల హృదయములోని నిర్ఝరమూ, గగనదుర్గపు తూర్పుబంగారు తలుపులూ, పశ్చిమాకాశ నికష వర్ణరేఖలూ చూసి, ఆ మృదుచంద్రికా యవనికావృత నీల నభోనిశాంత శోభామయ సీమలకి వెళ్లగోరినా, ఒక్క యామిని మాత్రమే. తిరుగులాడడమే ఈయన కోరిక. కృష్ణశాస్త్రిగారి భావావేగము రెక్కలుకట్టుకు ఎగురుతుంది. ఆయన రచనా చిత్రంలో కుంచెపని ఎక్కువ. సత్యనారాయణ శాస్త్రిగారి రచన తళతళలాడుతూ నదిలాగ మెల్లిగా సాగుతుంది. ఈయన రచనా చిత్రములో రేఖాప్రాబల్యము ఎక్కువ. మేళసంగీతంలోని శక్తి కృష్ణశాస్త్రిరచనలోనూ, రాగసంగీతంలోని సౌందర్యం వేదుల రచనలోనూ ఉన్నాయి. వేదులలో కృష్ణశాస్త్రి రచనల్లో అన్వయం తెలీదు ఒక్కొక్కప్పుడు. ఆంగ్లకవుల ప్రభావం ఎక్కువ ఆయనలో. `కన్నీటి కెరటాల వెన్నెలేలా చదివి `దీనిభావ మేమి తిరుమలేశ' అన్న వా రెంత మందో? ("ఈ మునిమాపులో నేమో విషాదమో సందేహమో నన్ను జ్వాలయై దహియించు") "వెలుగులో చీకట్లో వీని కౌగిళ్ళలో కవలునే నల్లనల్లని వేడి రక్తాలు" అన్న పాదాలలో అర్థంకాని మాట లేదూ, అర్థం అయ్యే భావం లేదూ నాకు. కృష్ణశాస్త్రిగారు ఇంగ్లీషుకవిత్వపు అన్వయాలు తెలుగులోకి దిగుమతి చేస్తారు. అందువల్ల ఒక్కొక్క చోట ఆయనరచనలలో (ఊర్వశిలో మరీని) ముసుగేగాని మోము కనబడదు. కాగా ఆ రోజుల్లో అర్థముకాని రచనకల్లా భావకవిత్వం అన్న పేరు రూఢిఅయిపోయింది. ఎలాగు వచ్చిందోకాని యతిప్రాసలు లేని రచనకి కూడా భావకవిత్వమన్న పేరు వచ్చేసింది."భావకవులకి నియమాలేవీ అక్కరలేదు. వారి కిష్టమువచ్చినట్టుగా ఏదో భాషలో రాస్తారు. అర్థమైతే సరే. లేకపోతే

వారి నడిగి లాభం లేదు. "పరుల కర్థమ్ముకాని భావగీతమ్ములవి." అనే ప్రతికూలభావం చదువర్లలో వ్యాపించింది. యెంకిపాటలు రావడంతో ఈ ప్రతికూలత కోటకట్టి వారిమీద విరుచుకుపడ్డది.`భావకవులు' అనబడేవారు `గ్రాంథిక" భాషలోనే రాశారు. అయినా యెంకిపాటల`దోషం' వారి నెత్తినే పడింది. యెంకి నాయుడికి పరకీయయేమో అన్న అనుమానం పుట్టించే రచనలు యెంకిపాటల్లో వున్నాయి. వీటినీ, ఆ పాటల్లోని గ్రామ్యమూ కాక నాగరికమూ కాక కలగాపులగమయ్యే భాషనీ పట్టుకుని చాలా విమర్శ సాగింది. ఆదినారాయణ శాస్త్రులు గారంతటివారు సమర్థించుకువచ్చినా ఈ విమర్శ ఆగలేదు.

భావకవులు సమకాలిక ఆ `భావకవుల్ని' హేళన చేసేవారు. తా మేదో మబ్బుల్లోంచి ఊడిపడ్డట్టు నడుచుకునేవారు. వీరి జీవిత పద్ధతులు కూడా అనుమానాస్పదంగా కనబడేవి. దానితో ప్రతికూల శక్తులు బలం కూర్చుకుని`నేటి కాలపు కవిత్వం, శుక్లపక్షము', `కవివిచారణదినమూ, `దాంభికుడు', `కళాభాయి' మొదలైన రచనలుగా వచ్చాయి. సాహితీసమితివారి `సఖి' ఆగిపోయింది. ఏ కారణంచేతో `భారతి' వంటిపత్రికల్లో వారి రచనలు మరి రాలేదు.

## చిన్న కథలు

భావ కవిత్వంతో పాటు చిన్నకథా, ఏకాంకికా కూడా పొడచూపి పెరిగేయి. చిన్నకథని దీక్షితులుగారు చిత్రచిత్ర గతులతో నడిపించారు. నేడు కొడవటిగంటి, బుర్రా, పాపా, బుచ్చిబాబుల చేతుల్లో కొత్తనడకలు నేర్చిందిగాని ఆ రోజుల్లో చిన్న కథని నడిపించినవారు దీక్షితులుగారే. వీరి కథలు ఆలోచనకి బాగా పని చేస్తాయి. దేశభక్తి, చెంచుదంపతులూ, దాసరిపాటా మన కథానికా వాఙ్మయానికే కాదు, విశ్వసాహిత్యానికి కూడా చక్కని అలంకారాలు. దీక్షితులు గారి భాష వ్యావహారికమే గాని అక్కడక్కడ డెక్కుతుంది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భాషకి లోటులేదు. నిర్మలమైన గోదావరీ మాండలికాన్ని వారి కథల్లో చూడవచ్చు మనము. వారి ఇతివృత్తాలు మటుక్కు కేవలం కాలక్షేపానికే గాని ఆలోచన రేపడానికి శక్తి చాలనివేమోనని నా అభిప్రాయము. వారు కథలకి పెట్టే పేర్లలో ఎక్కువ శక్తి కనపడుతుంది నాకు కథలలో కంటే. `కచ్చితమైన జవాబు',`పెళ్లాడతగిన మొగాడేడీ' మొదలైన శీర్షికలు శక్తివంతంగా వినపడతాయి; కథలు చదివితే `కచ్చితమైన జవాబు ఇదీ' అనీ, `ఇలాటిదాన్ని పెళ్ళాడతగిన మొగాడేడీ' అనీ అనిపించలేదు నాకు. కథలు మాత్రం గుడిపాటి వారి రచనల లాగ చివరిదాకా లాగుతాయి. అయిపోయిన తర్వాత మనస్సులో నిల్చివుండేది ఏమీ కనబడలేదు.... గుడిపాటివారి కథల్ని ఎరగనివారు

అక్షరాస్యులు ఆ రోజుల్లో ఎవరూ లేరు. వారి భాష చాలా శక్తివంతమైనది. ముక్కుకి తాడు వేసి లాక్కుపోయినట్టు లాక్కుపోతాయి వారి రచనలు. తెలుగులో ఆయన వ్రాసినంత శక్తివంతంగా వచనం వ్రాసినవారు కనపడలేదు నాకు. మాటలు వింతచాకిరీ చేస్తాయి ఆయనకి. గురజాడవారి హాస్యరచనకి ఉదాహరణలిచ్చినట్టే గుడిపాటివారి భాషాశక్తికి ఉదాహరణ లివ్వడమంటేనూ. వారి కథావస్తువు స్త్రీలకి స్వేచ్ఛవుండాలి అనీ, గర్భవిచ్ఛిత్తికి హక్కు ఉండాలనీ, సామాజిక నియమాలకి ఎదురుతిరిగి విశృంఖలావృత్తిలో అడుగుపెడితేగాని స్త్రీజీవితం అసంపూర్ణమనీని. జీవితంతో ప్రయోగాలు చేస్తూ ఫలితాన్ని బట్టి మారిపోగల వ్యక్తులపట్ల వారి ఊహలు ఫలించవచ్చును గాని, జీవిత ప్రవంతిలో ఒడుదుడుకులు లేకుండా ప్రయాణించవలసిన మొత్తపు సమాజానికి ఆరోగ్యమైనవి కావేమో అని నా నమ్మకం. మొదటి పద్ధతిలో వ్యక్తే ప్రధానుడు. సమాజము అన్నది కేవలము కట్టుతాడే గాని ప్రయోజనకారి కాదు. ఒక మానవుడు తన సుఖజీవనానికి మరొక మానవునిపైన ఆధారపడే నేటి రోజుల్లో ప్రతిమానవుడికీ స్వతంత్రవర్తనమే ఉంటే ఎవరి జీవితమూ సుఖప్రదంగా ఉండదు. స్వార్థసాధనే ప్రతివాడికీ పరమ కర్తవ్యమైపోతుంది. జగడాలు పుట్టుకొస్తాయి. "సొంతలాభం కొంత మానుకో పొరుగువాడికి తోడుపడవోయి" అన్నదే నడవడికని దిద్దాలిగాని, `అలరుపడంతి చక్కిలిగింత వెట్టి, విరిచేడె పులకింప సరసను బాడి, మరియొక్క ననతోడ మంత నంబాడి, వేరొక్క సుమకాంత వ్రీడ బోగొట్టి' పూవుపూవుకీ పోయే కళాభాయితత్వం అందరికీ ఎక్కిందంటే చెప్పేదేమిటీ అలాటి సమాజపు పరిస్థితులూ?.....వేలూరి శివరామశాస్త్రిగారి కథానికా భాష వ్యావహారికం కాదు. వారి రచనలు వెలీ, పెంపుడు చిలుకా, ప్రౌఢాపరివ్రాజక వివాహమూ చదివేను నేను. వారి భాషకి మంచి జిగి వుంది. కథలో ప్రవాహగతి లేకున్నా భాష లాగుతుంది. చదివే వారిని చివరిదాకా, చివ్వర మాత్రం ఆశ్చర్యసంఘటనంతో పూర్తి చేస్తారీయన. అందువల్ల వీరి కథలు జ్ఞాపకముండిపోతాయి.

## ఏకాంకికలు

తెలుగు ఏకాంకికని ఎంతమందో పెంచారు. రావడము మొట్టమొదట సఖిలోనే వచ్చింది ఏకాంకిక. కాని తరవాతి వృద్ధిమాత్రము సాహితీ సమితివారి చేతుల్లో జరగలేదు. నోరి నరసింహశాస్త్రిగారు చాలా ఏకాంకికలు రాశారు. కాని `ఖేమాభిక్కుని' లాగ ఒకటీ లేదు. శిరోమణిగారు `సఖి'లో వచ్చిన రెండు ఏకాంకికలతోనే ఆరకపు రచన కట్టి పెట్టేశారు. కృష్ణశాస్త్రిగారు రసఘట్టాల్ని సంభాషణారూపంగా రచించారు వారి `రేడియో నాటిక'ల్లో. అవి శ్రవ్య కావ్యాల్లాగానే కనబడుతున్నాయి నాదృష్టికి.

శివశంకరశాస్త్రిగారు మట్టుకు రాజదర్శనమూ, వేణీసంహారమూ, స్త్రీవిరోధీ అని మూడు ఏకాంకికలు రచించారు. మొదటిది రేడియో నాటిక. రెండోదానిలో సంభాషణ చక్కగా వుంటుంది, కాని అన్నీ వాదోపవాదాలే. కథ ఏమీ లేనూలేదూ, నడవనూనడవదూ. `స్త్రీవిరోధి' బాగుంటుంది. విశ్వనాధకవిరాజూ, జస్టిస్ రాజమన్నారూ, నార్లా ఏకాంకికా రచనలో చాలా అనుభవం గడించారు. విశ్వనాధ కవిరాజువి అన్నీ పరిహాసనాటికలు. హయ్యరుగ్రేడ్ ట్రెయినంగు టీచరూ, కిరాయినటుడూ, ఆంగ్లవిద్యార్థీ, ఆంధ్రాపెర్లక్‌హోమ్స్, ఆయుర్వేదవైద్యుడూ, దురాశాపరులూ - వారేమిటి వీరేమిటి, ఆల్రౌండు యాక్టరూ, కంట్రాక్టునాటిక నేపథ్యమూ, కంట్రాక్టు నాటక ప్రదర్శనమూ, కోర్టుపక్షులూ, వీరు ప్రసరించే జ్యోతిలో చిత్రంగా ఆడతారు. ఆదిలోనే గట్టిచిక్కు పెట్టేసి కథని లాక్కుపోతూ, చివ్వర ఏమీలేదు, ఇదిగో' అని పిడికిలి విప్పి చూపించేస్తారు. కథలోని గోప్యతవల్ల ప్రేక్షకుల ఆపేక్ష చివరిదాకా నిలుస్తుంది. కథని నడుపుతూనే కొండ అంచుదగ్గిరకి తీసుకుపోతా రీయన. `మరి ఒక్క అడుగుపడిందా, ఇక అగాథంలోకే' అన్న పరిస్థితిని తయారుచేసి, ఆ అడుగువల్లనే తేల్చేస్తారు కథనంతటినీ. ఈ శిల్పం మెచ్చుకోతగ్గది. కథలోని చిక్కైనా, క్లిష్టంగా వుండదు. పెళ్లాన్ని ఇంట్లో వుంచి బుద్ధిగా వుండమని చెప్పి నిక్షేపంలాగు తలుపుతాళం వేసుకుని వీథిలోకి వెళ్ళిన సన్యాసిరాజుపంతులు తిరిగి వచ్చేసరికి తాళం అక్కర్లేకుండా తలుపు వచ్చేస్తుంది; కిరాయి వేషం వేసి పాతికరూపాయలు మిగిల్చి ఇదివరకు తానిచ్చిన పాతికా ఉన్నాయా లేదా అని వీధిలోంచే అడిగేడు భార్యని రంగారావు. ఆవిడ ఏదో కొనేశానంది; దొంగని పట్టుకోవడానికి పూనుకున్న ట్రూపుకి నాయకుడుగా పనిచేసే ప్రకాశరావు ఇంటికే దొంగ వచ్చాడు; వారసులు లేని చలమయ్యశాస్త్రి లాంచీతో మునిగిపోయాడని వార్త చదివి, తయారయిన వారసుల్ని పరిశీలించడానికి కలెక్టరు చేసే కచేరీకి ఆ చలమయ్యశాస్త్రిగారే వచ్చి సాయపడతారు. ఇలాంటివే ఆయన ఇతివృత్తాలు చాలానూ. ప్రదర్శనానికీ, హాస్యానికీ, ఏకాంకికా శిల్పానికీ కూడా విశ్వనాధకవిరాజు నాటికలు ఎంచుకోతగ్గవే. రాజమన్నారు ఏకాంకికలకి ప్రత్యేకమైన వైలక్షణ్యత వుంది. ఆదర్శయువకుని ప్రేమా, తల్లి అభిమానమూ, వేశ్యపాతివ్రత్యమూ, పురుషుల వేశ్యాలోలుపత్వమూ, దొంగాచార్యుల తెలివితేటలూ ఎంతవరకూ వెళ్ళగలవని మన మనుకుంటామో అంతవరకూ తీసుకువెళ్ళి, అక్కడ మరో అడుగు వేయిస్తారీయన. ఆ అడుగే పతాక (climax) `అయి మనకి ఆశ్చర్యం కలిగిస్తుంది. వీరి దృష్టి ఘటనలమీదకంటె పాత్రల శీలముమీదే ఎక్కువగా మొగ్గుతుంది. `దెయ్యాల్లంక' వీరి రచనల్లో మిన్న. `సుధ' పాత్రపోషణ గొప్పగా వుంది. వీరి ఏకాంకికలు చాలా చిన్నవిగానూ, చిక్కగానూ వుంటాయి. ప్రదర్శనము జరగవలసినంతసేపు వుండదని ఒక అభిప్రాయము ఉంది. అది నిజమైతే కావచ్చుగాని అసలు ఏకాంకికలే చిన్నవి.

అందులో ప్రేక్షకులకు బోధపడాలని వివరణ ప్రారంభిస్తే రచన పల్చనైపోతుంది. ఏకాంకికని ప్రదర్శించాలంటే ప్రతీవాక్యమూ, ప్రతీమాటా చక్కగా బలంగా పలికి నటించగల నటులూ, ప్రదర్శనం వాస్తవంగా నడిచిపోతోందా అనిపించడానికి సాయం చేసే రంగభూమీ, నిశ్శబ్దంగా ఉండి వినగల ప్రేక్షకులూ లభ్యపడాలి. బజారు ప్రేక్షకుల్ని పట్టుకోడానికి ఏకాంకికలకి పొడుగు చాలదు. పట్టుకోవాలని ప్రయత్నం చేస్తే చిక్కదనం తక్కువౌతుంది. నార్లవారి నాటికలు చూడండి. కొత్తగడ్డ, ద్రోహమూ, సంసారీ, ప్రారబ్ధమూ, శకునపక్షీ - చాలా రాశారు. ఇవ్వన్నీ జీవితఖండాలు. "మరే; అవును మరీ; మంచిపని అయింది"అనే మాటలు అప్రయత్నంగా వస్తాయి మననోటినించి ఇవి చూస్తే కాని ఈ నాయికలు చెప్పే సత్యాలకి లోతు తక్కువ. ఒకరకంగా పరమార్థ ప్రహసనాలనవచ్చునేమో వీటిని (serious farces). హాస్యరచన అట్టే వుండదు గాని వ్యక్తుల లోట్లనే ముక్తాయించి కనపరిచే ప్రయత్నమే ఎక్కువగా కనపడుతుంది. సమకాలికవ్యక్తుల జీవితమ్మీద కంటె సమకాలిక సంఘజీవనమ్మీద విమర్శ అయితేగాని నాటిక పట్టుకోదు. రాజమన్నారుగారి ప్రయత్నం చాలామట్టుకువ్యక్తుల గుణాల్ని సాంఘికంగా మార్చిచూపిద్దామని. నార్లవారిది వ్యక్తిమీదే కేంద్రీకరించిపోతోంది.

## సర్గబంధాలు

౧౯౩౦ (1930) మొదలు ౧౯౪౨ (1942) దాకా నవ్య సాహిత్యానికి ప్రవాహదశ. గిడుగువారి వాదానికి ప్రజాబాహుళ్యం స్వాగతం చెప్పింది. పెద్దలంతా నవ్యసాహిత్యపరిషత్తు స్థాపించారు. జ్వాలపత్రికలాగ `ఏదైనా సరే ఏదో ఒక అయోమయం, ఒక తిరుగుబాటు, ఒక బాకుపోటు' రాయమనకుండా ఒక ఉద్దేశంతో రచించినవారందరికీ ప్రతిభ తావిచ్చింది. పరిషత్తులో లేనివారు కూడా జగ్గూ నిగ్గూ వుండే రచనలు చెయ్యడానికి యత్నించారు. సెట్టి లక్ష్మీనరసింహముగారి ప్రభాసశాపవిమోచనమూ, పింగళీ కాటూరీ కవుల సౌందరనందమూ, కొమరవోలు సుబ్బారావు ప్రత్యూషమూ, వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారి మునిత్రయచరిత్రమూ - సర్గబంధాలు - వచ్చాయి. సెట్టివారి కలము అతిసాహసి. పద్యాన్ని ఎక్కడో అక్కడ ప్రారంభించేసి నడుచుకుపోతుంది. పింగళీ కాటూరీ కవుల పద్యం ఉద్యానవనసరోవరంలాగ చక్కని కత్తిరింపూ, అలంకారమూ, రేఖల తీర్పుతో ముచ్చటగా నడిచింది సౌందరనందనంలో, కొమరవోలురచనకి ధారావేగం కనబడుతుంది. దయ్యాపుకథని కాక ఐతిహాసిక గాథని తీసుకుని పెంచి రచించివుంటే ఎలా వుండునో. వెంపరాలవారు అష్టదిగ్గజాలలోని వారు, ఆలస్యంగా వచ్చారు తెలుగుదేశానికి.

మునిత్రయచరిత్రము మంచి ప్రబంధ రచనతో నిండివుంది. "కథాసౌందర్యము కూడా దీనికి తోడైవుంటే?" అన్న ఆశకి వీరి `శంకరవిజయం' జవాబు చెప్తుందనుకుంటాను: ఈ కుటుంబంలోనివే మొన్న మొన్నటి శివాజీ ప్రబంధమూ, రాజా ప్రతాపసింహ చరిత్రమున్నూ, గడియారం వారి రచన అగ్నిహిత అన్నివైపు చూచుచు, భాస్కర రామాయణం జ్ఞాపకాని కొచ్చింది రెండోది పఠిస్తే, విశ్వనాథవారి `రామాయణ కల్పవృక్షము' ఈ సర్గబంధాల్లో ఆఖరిదీ, నేటిదీను. "చాలా శ్రమించి మెరుగుపెట్టారు సత్యనారాయణగారు" అని వింటున్నాము. కావలసినదే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వచనంలో రామాయణం రాస్తున్నారని విన్నాను. అయితే అది పారాయణ గ్రంథమైపోతుంది తెలుగువారికి. వాల్మీకికథకి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వచనం! `బంగారం ఘుమఘుమలాడిపోతుంది.'

## నవలలు

సుదీర్ఘమైన నవలలు - చెన్న పట్టణములో, మాలపల్లి, వేయిపడగలు, నారాయణరావు, పరిణామమూ వచ్చాయి. తేకుమళ్ళ రామచంద్రరావుగారు చక్కగా పాత్రపోషణ చేసుకుంటూ నడిపారు మొదటిదాన్ని. కాని కథ కొంత అడ్డం తిరిగిందేమో అని అనుమానం తట్టిందినాకు. వేయిపడగల్లో రసమయఘట్టాలు చాలా వున్నాయి. సత్యనారాయణగారి కల్పనాశక్తికి ఈ నవల మంచి విహారభూమి అయింది. కాని అబ్బూరి రామకృష్ణారావుగారు అన్నట్టు పడగలేగాని పా మెక్కడా కనబడదు. `నారాయణరావు' రంకుపురాణం. రామరామ, ఒక్కమారైతే పరవాలేదంటా రీయన. `పరిణామం' చదవవలసిన నవల. తొలిరోజుల్లో జాషువా కవిత్వంలాగే శ్రీమతి కావేరీబాయి హిందూయువతిలో చూపించిన పరిణామము మరుగుపడిపోయింది. `తమసో మా జ్యోతి ర్గమయ' - ప్రతిభని సకాలంలో గుర్తించుకోకపోవడము తెలుగువారి నెత్తురులోని గుణమే.

## నాటకాలు

నాటకాలు నిన్న మొన్నటివే కొత్తరకాలు. అయినా, నవ్యసాహిత్యానికి ఉచ్చదశలో వెలువడినవి కాబట్టి వాటిని పరిశీలించుకోవడం అవసరం. విశ్వనాథవారు `నర్తనశాల'లో భారతం కంటె ఎక్కువగా, యుధిష్ఠిరుడికి తంత్రశక్తీ, కీచకునికి రసికతా, ఉత్తరకి హృదయమూ ఇచ్చారు. పద్యాలు బంగారు పిచ్చిక గూడుకట్టినట్టు జాగ్రత్తగా సంతరించారు. ఈ నాటకాన్ని జాగ్రత్తగా తయారుచేసి ప్రదర్శిస్తే చూడాలి. ఉన్నవవారి `నాయకురాలు'ఇతిహాసంలాగే నడిచిందనిపిస్తోంది.

సుబ్రహ్మణ్యశాస్త్రిగారి `రాజరాజు' నన్నయభట్టునీ, చిత్రాంగినీ ప్రత్యేకంగా చెక్కి మెరుగు పెట్టి చూపించింది. రాజరాజూ, రత్నాంగీ కూడా ఫరవాలేదు. రత్నాంగి మాటల్లో బాకులు దూసిందట రాజుమీద! సారంగధరుడిలో మాత్రము నాటకమంతటా మానవత్వం కంటె మానసత్వం పొడుచుకు వస్తుంది. మాటకి మాట తపీమని జవాబు తెప్పించే శాస్త్రిగారి పట్టుదలలో సారంగధరుడు మానవత్వం కోల్పోయి శాస్త్రార్థపండితుడుగా తయారవుడు. స్వగతాలు చూస్తే రసోత్పన్నం అవుతుందని ఆశ పుట్టింది. కాని ఎదటికి మరో మనిషి వచ్చేసరికి బాకుదూసి తయారయిపోతారు వీరి పాత్రలు. రాఘవాచార్యులుగారు `సరిపడని సంగతుల్లో' స్వాములారినీ, ప్లీడరుగారినీ, భార్యనీ చక్కగా తయారుచేశారు. నాటకం నిండా హృదయాల్ని దూసుకుపోయే లోకోక్తులు లాంటి వాక్యాల్ని విరజిమ్మేరు. ప్రతిపాత్రనీ సజీవంగా లోటుపాట్లతోనూ ఆదర్శగాంభీర్యంతోనూ (పోలీసు!) చూపించారు. సాంఘికనాటకం సృష్టించడానికి `సరిపడని సంగతులు' చక్కని ప్రయత్నం. ఆంధ్రజ్యోతి' , విడాకులు' ఆకలి' ఇవి -గుళ్ళపల్లి నారాయణమూర్తిగారు జాత్యభ్యుదయాకాంక్షతో రచించారు. మూడింటిలోనూ బ్రతికున్న మూడుసమస్యల్ని మాటలకి తల ఒగ్గక, బ్రతికున్న సమకాలిక జీవితాన్ని చూపించారు. వాదోపవాదాల్లో చాలాసేపు విసిగించా రనే అభిప్రాయం పడుతుంది గాని, వారు తాము కల్పించుకున్న సమస్యలకి చక్కగా పరిష్కారం చేశారని కూడా అనిపిస్తుంది. `ముందడుగూ', `పరివర్తనా' ఈ రకానికే చెందుతాయి గాని, దారం తీసినట్లు తిన్నగా (అడ్డులేకుండా) సాగిపోవడం నుంచీ, మానవుల తగవులకే గాని హృదయానికి చెందిన రచన వీటిలో అంతగా లేకపోవడం నించీ "ఎన్నాళ్ళు రంజిస్తాయి ఈ నాటకాలూ?" అనిపిస్తోంది. నాటకంలో అందరూ యోధులే. స్త్రీలున్నప్పటికీ, స్త్రీ హృదయం అంతగా కనపడని (మల్లమ్మ వినా) వీర బొబ్బిలీ, గయోపాఖ్యానాల్లాగ కనపడతాయి. వీటి ఘనత ఏమిటంటే, ఎదురుగా కనబడే సమస్యని పట్టుకుని, తమకి నచ్చిన విధంగా రచించారు కవు లీ నాటకాల్ని. విమర్శ కవి కొత్తదారి తొక్కి రథాన్ని నడిపించుకుపోగలిగితే అంతకన్నా కావలసిందేమిటి? ఈ నాటకాలు ఆదారి చూపిస్తున్నాయి.

## శ్రీమంతుల సారస్వతం

శ్రీమంతులు రచించిన సారస్వతం ఈ స్వర్ణయుగంలో ఒక ప్రత్యేకఘట్టం. వాలుజడ' శ్రీమంతుల కలల్లోని కలకలాన్ని వినిపిస్తుంది. `స్వార్థత్యాగమూ', `ఆ లోకము నుండి ఆహ్వానమూ' శ్రీమంతుల జీవితాల్లోని విషాదఘట్టాల్ని పెంచి రచించిన నాటకాలు. రామచంద్ర అప్పారావుగారి ఖండకావ్యాలు"బీభత్సరసాన్ని" మొదటిసారి నవకవిత్వంలో ప్రవేశపెట్టాయి. వారి రక్తహారతి మనగుండెల్లోంచి

పొమ్మన్నాపోదు. చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాదు వారి `ఆధునికాంధ్ర వాఙ్మయమూ -స్త్రీ లూ' అన్న వ్యాసాలు విమర్శశాఖకి అందం తెచ్చే పూలు. విజయసారధిగారి `పల్లెపట్టు' లక్ష్మీపుత్రుని అందపుకల.

`కల్పవృక్షపు పూలజల్లులు
    కామధేనువు పాలధారలు
భాగ్యదేవత తెల్లగొడుగులు
    పల్లె కర్షకులు'
`గువ్వపిట్టలు చేరుచున్నవి
    గూటికని తము వరుసలాడగ(?)
సీత సిగ్గిలి మగని చాటున
    చేరి చిరునవ్వున్.'
అనేవి ఆ కలలోని రెండు నవ్వులు.'

## అధివాస్తవికత

అధివాస్తవికత (స్వాజేళజం) ఈ స్వర్ణయుగంలోని మెరుగు. ప్రబంధరత్నావళి చదవగా చదవగా అన్నీ ఒక అచ్చుదిగినట్టుండి విసుగుపుట్టిస్తాయి. వెంకట పార్వతీశ్వరుల `మధుర కవిత్వమూ' ఆధునిక కవుల ప్రేమగీతాలూ పాడిందే పాటయిపోయాయి. .. వ్యుత్పన్నుడు. మేధావి. పాతపద్ధతుల్ని బద్దలు కొట్టాలని--

"తురాయి కంటె ఆ - కురాయి కంటె?
    కీచురాయి కంటె -హిమాంసురాయి గొప్పవా"
డన్నాడు.
"కుక్క పిల్లా - సబ్బు బిళ్లా - అగ్గి పుల్లా
హీనంగా చూడకు దేన్నీ -కవితామయమేనోయి అన్నీ!"
అని చతురంలో ఇమిడే పాదాలు రచించాడు.
"ఇదేమిటీ వింతభయాలు?
    ఇంట్లో చీకటి
ఇవేమి టీ అపస్వరాలు?
    తెగింది తీగ
అవేమిటా రంగుల నీడలు?
    చావూ బ్రదుకూ!

ఎక్కడి కెళ్తా వీరాత్రి?
అవతలి గట్టుకు".

అని తక్కువ పదాలతో ఎక్కువ భయం పుట్టించాడు. అన్నీ ఎంతో కొంత అర్థమౌతాయి. కాని,

"ఎర్రశాలువ కప్పుకొని మా
యింటి కొచ్చిం దొక రివాల్వర్
బాధలో బెంజైను సీసా
ప్రేమలో డైమానురాణీ"

అంటే ఏమిటో తెలీదు. శబ్దాలను బద్దలు కొట్టి, చీరచింపి కాలు బుజాలకి తగిలించీ, వీపువైపు తలకాయ మొలిపించీ ప్రయోగాలు చేసినవారిని మనం నిరసించరాదు. హాలాహలం, తర్వాతే అమృతం

పఠాభిది ప్రత్యేకదృష్టి. అతనికి పట్నమే సత్యము. పట్నానికి పల్లెటూరూ, కోయిలకూతా, జాబిల్లి ఇవన్నీ కలలోని సామగ్రి. కాబట్టి పఠాభి రచనల్లో ప్రకృతిలోని (పూర్వకవుల అందం) "సుందర సామగ్రి"కి పట్నవాసపు డ్రాయింగురూమూ, ట్రాముకోడ్డుల సామగ్రితో పోలిక పుట్టుతుంది.

"తగిలింప బడియున్న జాబిల్లి
చయినా బజారు గగనములోన పయిన"
"పాతబడినటువంచి
బస్సులలాగ బడబడయనుచున్నవి నల్లమబ్బుల గుంపు"
"మద్రాసు నగరము! నీ మీద బ్లూ బ్లాక్
సిరాలాగ పడింది రాత్రి.'
"నీమీద కళ్లు నిల్పుట
బలేహాయి, డీలక్స్ కుషన్‌సోఫాలమీద
కూలబడినట్లుండును ఓ నవ్యస్త్రీ"

గోరాశాస్త్రి గారు అందమైన కలల్ని అచ్చులోకి తెద్దామనే యత్నం చేస్తారు. చార్యులు 'సారీస్' యతిప్రాసల దండలోని సూత్రాన్ని ఊహించమంటారు. స్వగతాల్లోని సూత్రం తెంచేసి అక్కడో ముక్కా ఇక్కడో ముక్కా అంటూ, విరహోత్కంఠిత భావాల్నీ, ప్రేయసుల జగడాన్నీ మూతపెట్టిన మద్దెలగా వాయిస్తారు. 'ఆరుద్ర' గుండెకాయని పైకితీసి పిండిచూపిస్తాడు అగ్నిహోత్రంలాగు వ్యాపించే ఆలోచనలతో రేపి.

"అప్రతిష్ఠతో నిందలతో -తడిసిన జీవితాన్ని విప్పి
లోకంమీద ఆరవేస్తాను."
"సభ్యత విడాకు లిచ్చిన - సత్యాలను నేసి ధరిస్తాను."

అన్న వాక్యాలు ఇదివరకు నవకవుల వాచ్య గాంభీర్యతలో బయటపడ్డ

"మోహనవినీల జలధరమూర్తి నేను
ప్రళయ ఝంఝా ప్రభంజనస్వామి నేను"

అన్న ప్రాణాల్ని శక్తివంతంగా ధ్వనించడము లేదూ? కానయితే, ఒక్క హెచ్చరిక. ఇది తెలుగు తెలుగు. అది పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు.

## అభ్యుదయోద్యమం

అభ్యుదయోద్యమం నవ్యసాహిత్య స్వర్ణయుగానికి కిరీటము. పాతబడ్డ ప్రబంధభావాల్ని వదిలి సమకాలికభావాల్నే తిరుపతి కవులూ, పుస్తకాల్లోని భావాలు కాక సొంత అనుభూతిని పురస్కరించుకుని పుట్టిన భావాల్ని కృష్ణశాస్త్రీ, ప్రాచీనాంధ్ర హృదయేశ్వరి నుద్దేశించిన భావాలు శివశంకరులూ ప్రదర్శించారు. కాని `ఇవి ఎవరి కోసము?' అన్న ప్రశ్న నాడు పుట్టలేదు. వెనక్కి వెళ్ళిపోయిన ప్రపంచపు సమాధిదగ్గర కార్చిన అశ్రువులూ, పక్షినయ్యేద నేను ఋక్షమయ్యేదను అంటూ చదలెక్కి దిగిరాను దిగిరాననే జపం చేసుకునే తత్వమూ ప్రజాభ్యుదయానికి దోహదం చెయ్యావు. దినశ్రమ ముగించుకుని సాయంకాలం హాయిగా పడకకుర్చీలోనో, సముద్ర సైకతాలమీదో మేను వాల్చి కావ్యం విప్పితే,

"నాకు గాదులు లేవు నా
కుషస్సులు లేవు నేను
హేమంత కృష్ణానంత శర్వరిని
నాకు కాల మ్మొక్కటే కారు
రూపు నా శోకమ్ము వలెనే నా
బ్రతుకువలెనే నా వలెనె"

అని ఒక కవి!

`ఈ వాగావళీ వంశధారా జలములు తెల్గు, నదులెల్ల పొంగెత్తి ప్రళయవారినీ తెల్గునేల ముంచవిమ్ము' అని మరో కవి!

"ప్రళయకాలంపు తొలి ముహూర్తమ్ము నందు
నిదుర మేల్కొను రుద్రుని నిష్ఠురంపు
టావులింతల పొగల సయ్యాట లాడు
ప్రేయసీ ఒకమారు విచ్చేయు మిటకు"
అని ఇంకో ప్రేయసుడు!

పొరుగింటి ఇల్లాలు `మీ ఆవిడ ఎప్పుడు వస్తా'రని అడిగితే అది తనతో ప్రసంగించడానికి ఆవిడ ఎత్తిన ఎత్తని అపోహపడి చెయ్యీ చెయ్యీ కలిపేయడానికి యత్నించే నీలకంఠం! ఇదీ కవుల కలాల్లోంచి బయటకు చిందుతున్న హాలాహలం!

ఇది కాదు, మీ కర్తవ్యం! "ఆకులందున అణగిమణగీ కవిత కోకిల పలుకవలెనోయి, పలుకులను విని దేశమం దభిమానములు మొలకెత్తవలెనోయి!" అని చెప్పాలి అభ్యుదయ రచయితల సంఘం. కాని "తాజమహల్ నిర్మాణంలో రాళ్లెత్తిన కూలీ లెవ్వరు" అని కావ్యాల్లోనూ సమ్మెకట్టడమే నిత్యకర్తవ్యమని నాటకాల్లోనూ ఘోషిస్తున్నా రీ అభ్యుదయ రచయితలు. ఎంతసేపూ ఏదో ప్రచారమూ, పూర్వకవులు చేసింది ప్రచారమే అని సమాధానమూను. ఏ రచనేనా ముందు కళ కావాలి. అంటే చదువర్లని పట్టుకోవాలి. తరవాతే అది అభ్యుదయానికా, అనభ్యుదయానికా దారితీస్తోంది? అనే ప్రశ్న. కళలేని శుష్కప్రచారము కంటె ప్రబోధము లేని కళ ఉత్తమము. అయితే కళారీతుల్ని అభ్యుదయా కాంక్ష తెరచాపలాగ కాక చుక్కానిలాగ నడిపితే నవ్యసాహిత్య స్వర్ణయుగానికి వసంతం ఆవేశిస్తుంది.

*ఆంధ్రపత్రిక ఉగాది సంచిక–1947*

***